శ్రీరస్తు.

# శ్రీ ద త్త చ రి త్ర.



## ప్రథమాశ్వాసము.

శా॥ శ్రీరమ్యాకృతిఁబొల్చునీశునకుఁ గెంజేదోయిసంధించి వి।
స్ఫారజ్యోత్స్నచ్ఛవిలాసబంధురతనూప్రఖ్యాతభాషావధూ।
టీరత్నంబునుమన్మనఃకమలపీఠిన్నిల్పెదన్ సద్వచః।
ప్రారజ్యప్రతిభాకవిత్వపటిమన్ బ్రార్థించియశ్రాంతమున్॥ ౧.

తే,గీ॥ అతులితకవిత్వవైభవాన్వితమహాత్మ । పూర్వకవివర్యులమదీయబుద్ధిఁ గొల్చి।
వాక్చమత్కృతి కాంక్షించివ్రాయనిష్టఁ । దెంచినట్టికథాక్రమం బెట్టిదనిన॥ ౨.

క॥ వటువులుసోదరులిరువురు । చటులరుతవిహంగసాంద్రసంచితశాఖో।
త్కటభీకరమృగమయమహా । నటవింబడిపోవుచుండిరతివేగమునన్॥ ౩.

మ॥ అపుడానాఁటిప్రయాణధాటి ముగియఘర్మాంశుహారముల్ వోఁపనా।
తపభారంబునఁగోమలాంగములువిస్తారంబునిస్సత్త్వమం।
దపియింపంజనువారుడెప్పిగొని దైన్యత్వంబు దెల్పంగఁద।
ద్విపినాంతక్షితిఁదారసిల్లనను జూన్ వీక్షించిజ్యేష్ఠుండనున్॥ ౪.

ఉ॥ తమ్ముఁడ! యింతదూరముపదంబులనొవ్వఁగ నేగు దెంచితా।
హా మ్మున నెంతసోలితిమి,హా! జలముండుస్థలంబుఁజేరినా।
నమ్మునదేహశుద్ధిగనినన్ శ్రమ మేదునొకింతనంతశీ।
ఘ్రమ్ముగఁబట్టణంబునకుఁగానఁగవచ్చుముదంబు హెచ్చఁగన్॥ ౫.

మ॥ అరయన్ భాస్కరుఁడస్తమించుసమయంబౌనంతకుంబోయియా।
పురముంజేరిన మేలుగల్గుననియాభూమీసురద్వందమా।
తురతంబోవుచునుండనవ్వలఁదగందోఁచెన్ నభస్సంగమున్।
ద్వరితోత్తుంగతరంగముంబ్రథితగంగావాహినీసంగమున్।

క॥ సురనదిఁగన్గొనిధరణీ । సురపుత్రులు,దీర్ఘవృష్టిసుఖములీయాపై।
నరుణునిబొడగనుప్రజవలెఁ । బరమామోదంబుసెలఁగఁబ్రథమమునన్॥ ౬.

క॥ జలకంబాడిసుకర్మం । బులుదీరిచిజలముగ్రోలిముదముననంగం।
బులుసత్తువబూరయఁగశై । వలినీతటమందుఁగొంతవడియుండిదగన్॥ ౭.

తే.గీ॥ పార్శ్వసలిలోపయాతప్రభంజనాప్త । తాత్మలైగట్టుపైనసౌఖ్యముదలిర్ప।
నల్లనల్లనఁజనిరిదినావసాన । సూర్యరశ్మిప్రసారంబుసొంపునింప॥ ౯.

తే.గీ॥ ఇట్టులేగుమనంబొక్కఁడింపుదనరఁ । బల్కునల్లడఁబరికించిభ్రాతృవర్య!।
సృష్టిసౌందర్యగరిమావిశేషమెంత । కనులపండువసేయువిఖ్యాతమహిమ॥ ౧౦.

సీ॥ తరఁగలరేచుశీకరకణావళిమోచివీఁచుచల్లనిగాలివేడ్కలెంత।
జలశయంతవిచిత్రలలితనైకచ్ఛాయవిలసిల్లువాలుకావేదులెంత।
శ్రేణులుగట్టిపక్షివ్రాతములుపాఱరహిఁబొల్చురోదసీకుహరమెంత।
అపరాద్రిశిఖరాగ్రతపనారుణరుగాళిప్రసరించుప్రాణిప్రపంచమెంత।
నికటభూరుహవిటపాంతనీడసమితిఁ । గొరలికిచకిచలాడుచుమురువుగొల్పు।
పిట్టలెంతవిలాసంబుఁబెంచుఁజువ్వె । సృష్టియంతయుఁగేరుసజీవఘణితి॥ ౧౧.

మ॥ నవసాంధ్యాగమవేళబాణరుచులంగంగాప్రవాహాపరిన్।
రవిబింబాగ్నులువజ్రరత్నశకలభ్రాంతింబ్రసాదించునో।
స్తవనీయాగ్రజ! మాచితేతళతళోద్యత్కాంతిపుంజంబులెం।
తవినోదంబొనగూర్చిమెచ్చుపడఁజేతఃప్రీతిగావించెడిన్॥ ౧౨.

ఉ॥ ఇంచుకతెక్కలంముడిచియిమ్ముగఁగుత్తుకలింతవీఁపుపై।
కుంచియొయారమొప్పసారుగుంగనియాచెడునీరుకోర్గ్లువీ।
క్షించితె! చిన్ననాఁడుమనచేనులక్రాల్వలఁజేసివైపఁగా।
న్పించువెలందికాగితపువేడుకనావలబోలెఁగ్రాలెడిన్॥ ౧౩.

ఉ॥ అచ్చటనీళ్లయోరఁగనుమావరసోదర! యోగివోలెతేఁ।
బచ్చికనొంటికాలిపయిఁబక్షమొకండిలఁవ్రాలనిల్చుచున్।
మచ్చపు మేఁతకై నెమకుమవ్వపుఁగొంగమొగంబుచూడుము।
న్నచ్చతురాస్యుఁడిచ్చెనొకొవ్యాకులమంతయుఁదీనికేభువిన్॥ ౧౪.

క॥ అవివర్ణించుచునిరువురు । చనిచనిపురిదారసిల్లుసమయంబునకున్।
ఘనముగఁజీకటిగ్రమ్మెను । వినువీధినలంకరించెవెలిచుక్కలాగిన్॥ ౧౫.

ఉ॥ అప్పుడుపెద్దవాఁడనుఁబ్రియానుజ! కోరినపాటలీపురం।
బిప్పుడడగ్గరించితిమియింక సుఖంబొనగూడునల్లదో।
యొప్పుగగోపురంబుతెలియుందిలకింపుమునాట్యరంగిమె।
ల్లప్పుడుపట్టణంబుపాలుపార్ఁజెలంగుశుభాంగలక్ష్మికిన్॥ ౧౬.

చ॥ అనవుడుఁదమ్ముఁడుల్లసిలియున్నసుజూచివచించుఁగోపురం।
బునవెలుగొంచుదీపములుపొల్పగునెట్టనిరిక్కలట్లుః ప।

త్తనమిదెపాంథులార! యనిదారినిబిల్చుచురాత్రులంతమే।
ల్కొనుకనులోయనంగఁదగిగోపురరాజభటుండుపాల్చెడిన్॥ ౧౭.

క॥ ఇటులాపురిఁజొరఁబడివి । స్ఫుటదీపస్తంభహర్మ్యభూతివిరాజ।
త్పటురాజమార్గముంగని । వటువులుముదితాత్ములగుచువాకొనిరిదగన్॥ ౧౮.

సీ॥ చలువరాలబెడంగుతులకించుతెలిమెట్లుగాఁగిల్లకణఁగనికంబములును।
లలిదోరమిరుకెలంకులనుబచ్చలనీనుతలిరాకుటనఁటిచిత్తరువుమెఱయ।
వరుసతీర్చినయిండ్లవాకిళ్లముంగలముగ్గులుముత్తెంపునిగ్గులొలయ।
మిన్నంటుననిబోలెమేడలపైఁగ్రాలువిరియాడుసిడములుసిరులుగులుక।
కాచమణిపరివేష్టితకాచపాత్ర । దీవ్యదురుదీపకళికాతతిప్రకీర్ణ।
చిత్రవర్ణీకృతప్రభాస్నిగ్ధకుడ్య । భాసురములహా! గృహపురోభాగములిట॥ ౧౯.

క॥ అనుచున్వారుశివాలయ । మును జేరిప్రదక్షిణములుపొనరుచునుండన్।
జనుదెంచెవృద్ధభూసురుఁ । డనయముశివపూజసేయునతఁడచ్చటికిన్॥ ౨౦.

తే,గీ॥ వచ్చివారినిజూచితద్ద్విప్రకళయు । ముఖవికాసముఁబరికించిముదితచిత్తుఁ।
డగుచుభూమీసురశ్రేష్ఠుఁడాదరమున । నడుగువడుగులహృదయముల్ హర్షమొంద॥

ఉ॥ బాలకులార! మిమ్ముఁగనిపాయనిస్నేహముఁబూనిమన్మనం।
బేలొకొమీశుభస్థితులనెంచఁదొడంగెను, దల్లిదండ్రులే।
ప్రోలుననున్నవారుమిముఁబొందుపథశ్రమమేలగల్గెనా।
మూలముఁదెల్పుడన్నవినిమ్రోలకువచ్చితదగ్రజుండనున్॥ ౨౨.

తే.గీ॥ భూసురవరేణ్యమావృత్తమునువినుండు । తల్లిదండ్రులుజీవింపఁదనరుసట్టి।
భాగ్యమబ్బునెయెందునిర్భాగ్యులకును; । దెలియుఁగామీకుమాళవదేశమనఁగ॥

మ॥ అతిథివ్రాతనిషేవనావనసపర్యాదక్షుఁడధ్యాపకో।
ర్జితచిత్తుండసమానమానధనుఁడుర్వీదేవతావర్గసం।
చితచూడామణిశాంతిమంతుఁడటమించెన్ యజ్ఞసేనాఖ్యుఁడీ।
క్షితుఁడెల్లప్డుస్వజాతినీతిపరుఁడైశ్రేయంబమేయంబుగాన్॥ ౨౪.

తే,గీ॥ అతనిసుతులముమేమునెయ్యముదలిర్ప । నతనికడనించుకభ్యసించితిమివిద్య।
యిపుడయనఘుఁడుమాదురదృష్టవశత । మాసమాయెనుగాలధర్మంబునొంది॥ ౨౫.

తే,గీ॥ కరుణవినవయ్యనాపేరుకాలనేమి । వీఁడునాయనుజన్ముఁడువిగతభయుఁడు।
శాస్త్రములుమేముచదువంగసరగనిచటి । కేగుదెంచితిమిదియుమావృత్తమంత॥ ౨౬.

చ॥ అనవినిభూసురప్రముఖుఁడర్మిలిఁబల్కుఁగుమారులార! ప।
ట్టణమునయందురేనిప్రకటంబుగమీకుసమస్తశాస్త్రచిం।

తన మొనగూర్చెదండగువిధంబునవిచ్చుట నేను తేనిప్రా।
పునమనుపండితప్రకరముఖ్యుఁడశాస్త్రవిచారశీలుఁడన్॥ ౨౭.

క॥ భూపుఁడువల్లభశక్తియుఁ । గాపురుషులనణఁగఁద్రొక్కఁగాదక్షుండై।
కాపులఁబ్రోచుచురామమ । హీపతిగతిఁబ్రాజ్యరాజ్య మేలుచునుండున్॥ ౨౮.

క॥ అనియిట్లువృద్ధువడుగుల । మనములనాహ్లాదమడరమన్ననలమరం।
గనువెంటఁబెట్టుకొనిచని । తనయింటఁబ్రవేశపెట్టెధార్మికబుద్ధిన్॥ ౨౯.

మ॥ ధరణీదేవతనూజతల్లజులుప్రోత్సాహంబునన్ విద్యకో।
సరమైయిచ్చుటికేగుదెంచియొకయొజ్జంజేరియన్నింటనే।
ర్పరులై మించఁగవారికిర్వురికిసంప్రాప్తానుకూలుండుభూ।
సురుఁడిచ్చెన్ సువివాహవేళఁదనయాచూడామణీయుగ్మమున్॥ ౩౦.

తే,గీ॥ అంతసోదరులిరువురాయబ్జముఖులఁ । గూడియుండిరిభావజుగోడెలుఁగక;।
చాలనీష్వ్యాపరుండైనకాలనేమి । పసులసంపదకోర్వకపరభసమున॥ ౩౧.

క॥ శ్రీదేవినిగూర్చితపం । బాదరణీయముగఁజేసియావిర్భూతా।
మోదంబునదదుచితహేలా । మాదిసకలనియతనిష్ఠలన్నియుసలుపన్॥ ౩౨.

సీ॥ తొలకరిమెఱుపులఁదులకించునెమ్మేను వెన్నెలతెలిచీరవిందుసేయ।
జేపట్టువిరిసినచెందమ్మితేకులుమున్ జేతికాంతికిమురువుగొల్ప।
వెలియేనుఁగులజంటవింజామరలువేయఁబసిఁడితామరగద్దెమిసిమిదేరఁ।
దొలుతమవ్వపుఁబాల్కడలిపుట్టువెటీగించియులరఁగఁజిఱునవ్వులంకురింప।
స్ఫారదమృతంబుఁగురియుప్రసన్నదృష్టి । మిగులఁబ్రోత్సాహమొసగునెమ్మొగముదనర।
గాలనేమికిఁగన్పడికరుణతోడఁ । బలుకుశ్రీదేవియతనికిఁబ్రమదమెసఁగ॥ 33.

చ॥ కలుగునభీష్టసంపదలఖండమహీతలరాజ్యభారమున్।
వెలయువహింపనర్హుఁడుప్రవీణుఁడుపుత్రుఁడుపుట్టుఁగానియూ।
వలనగునంతమందుపరివారలునవ్వఁగఁజోరమృత్యువే।
కలుషమతిందపంబునతిగర్వమటంచుఁదలంపకుండుటన్॥ 3౪.

ఆ॥ ఆమెయిట్లుచెప్పియంతర్హితంబైన; । ఘనతకెక్కితనదుకలిమియందు।
దినదినాభివృద్ధిననుభవించుచునుండు । కాలనేమిసతియుగర్భమూనె॥ 3౫.

శా॥ రాజీవాక్షికిగర్భచిహ్నములుపూర్ణంబైవిభాసిల్లఁదే।
జోజాలంబుపితామహాండరజనీజ్యోత్స్నానురూపంబునన్।
రాజిల్లన్ సుముహూర్తమందునుమవర్షంబొప్పచుండంగసాం।
పైజన్మించెనుఁబుత్రుఁడత్యధికసౌభాగ్యాంకరేఖోన్నతిన్॥ 3౬.

మ॥ తనయుండుద్భవమైనబంధుయుతమిత్రశ్రేణిమోదించెఁద।
జ్జనకుండాఢ్యుఁడుకాలనేమికడునుత్సాహంబుమైఁబొంగిమిం।
చినలక్ష్మీవరసంభవుండగుటచేశ్రీదత్తుఁడంచాహ్వయం।
బొనరించెన్మఱిపెంచెడింభకునిమోహోత్కర్షతన్జాగ్రతన్॥ ౩౭.

చ॥ వసుసగనర్భకుండుపసువంబునదానుపనీతుఁడౌచుని।
ష్ఠురతరశస్త్రశాస్త్రములుకడున్వడినేరిచిముష్టియుద్ధమం।
దసుదుగఁదేటిమల్లరణమందుజగంబుననద్వితీయుఁడై।
పరగెనుతక్షాత్రధర్మములబ్రాహ్మణుఁడయ్యువరంబుపెంపునన్॥ ౩౮.

తే-గీ॥ కొంతకాలముకొడుకుతోసంతసంబుఁ । జెందిపజలుచునుండనాశీవిషంబు।
కఱవస్వర్గముఁజేరెనుగాలనేమి । సోదరునసుంగుపెండ్లముసుగుణవతియు॥ ౩౯.

ఆ॥ అంతవిగతభయుఁడుచింతచేవైరాగ్య । రసమునానియితరరాష్ట్రములకు।
యాత్రసేసెఁదీర్థయాత్రాభిలాషుఁడై । వసటనింటనుండవశముగాక॥ ౪౦.

ఉ॥ పల్లభశక్తిపుత్రునకవారణబాహుబలోన్నతుండుసం।
ఫుల్లయశస్సరోజుఁడగుభూమిసురాత్మజుచెల్మిగూర్చెఁబే।
రల్లినరీతివిప్రుఁడునహర్నిశముంజెలికానితోడభా।
సిల్లుమనోవికాసమునశేషమనీషయువృద్ధిచెందఁగన్॥ ౪౧.

తే-గీ॥ వానికిసువుసుక్షత్రియబాహుశాలి । వజ్రముష్టులవంతికావాసజనులు।
నీతిమంతులుముదముతోనెయ్యులైరి । బుద్ధిశాలులగైమెలఁగిరిమువ్వురెలమి॥ ౪౨.

తే-గీ॥ బలవిశారదులగువ్యాఘ్రభటుఁడుపేంద్ర । బలుఁడునిష్ఠురకుఁడుమహాబలుఁడునసఁగ।
మంత్రిపుత్రులుతాముగామచ్చికలరఁ । జేరవచ్చిరిశ్రీదత్తుచెలిమిఁగోరి॥ ౪౩.

క॥ అంపఱువిక్రమశక్తిని । దండడిగొనితిరుగువారిడయితముహెచ్చన్।
బందువులమించియుండిరి । కందళితామోదమొప్పఘనతదలిర్పన్॥ ౪౪.

మ॥ ఒకనాఁడందఱువర్షకాలమునవాతోద్ధూతజీమూతబృం।
దకకించిజ్జరతాతపాకలితసంధ్యాకాలగంగానదీ।
నికటోర్వీజకులాయనిర్గతఖగానీకాంకకోలాహలాం।
తికఫుల్లోత్పలవాసనాలహరికానేత్రోత్సవాసక్తులై॥ ౪౫.

తే-గీ॥ అరిగియొడ్డుననిసుకయందాడుచుండి; । రపుడువిక్రమశక్తివయస్యులతనిఁ।
గేళికానృపునిగనిల్పలీలఁగాంచి । యధిపుఁజేసిరిశ్రీదత్తునతనిహితులు॥ ౪౬.

క॥ అంతకవిక్రమశక్తిప్రా । దంతరసంజాతలుఠదహంకారేర్ష్యా।
క్రాంతుఁడయిభూసురుంగని । పంతంబునఁబల్కెనిట్లుబాహుజుఁడౌటన్॥ ౪౭.

ఉ॥ దాపుననీడులేఁడయిమదంబుననెంతయువిఱ్ఱవీఁగునా।
బాపనకుఱ్ఱవానిఁబృథుబాహుబలోన్నతిఁజూపియేపునన్।
గ్రోపడమల్లయుద్ధమునఁద్రొక్కుదురమ్మనుమీసలున్నచో।
బాపురె! బిచ్చమెత్తుకొనుపాఱునకింతటిభాగ్యమబ్బునో॥ ౪౮.

తే-గీ॥ అనుచుఁగర్వించిపదరుచునతనిసంగ । రంబునకుఁబురికొల్పుచురమ్మటంచు।
నీళ్వశ్రీదత్తుఁడాత్మసహింపలేక । సమ్మతించెనుబోరికిసత్తుమెఱయ॥ ౪౯.

సీ॥ తొడలుతట్టుచుబొమల్ముడివడమూఁపులుకుప్పించిబాహువులప్పళించి।
వలకేలువలకేలుమలయించిసాగించిడాచేతులొయ్యొయ్యనాచికొనుచుఁ।
గాళ్లఁజిక్కులుగొల్పికాసెలుమొండిపట్టులఁగ్రుచ్చితాళించివలనుపడఁగఁ।
గ్రిందుమీఁదులుపొర్లిరేకెత్తుచుచ్చరంబుసికొల్పనొండొరుల్ముసలిముసలి।
కడఁగిమల్లాడిమల్లాడిగడలుకొనెడు । పంతమాడుచుఁబట్టినపట్టువిడక।
చుట్టుఁజెలికాండ్రుకేకిసల్గొట్టుచుండ । బిట్టుదిట్టులిద్వరుపెనఁగిరపుడు॥ ౫౦.

మ॥ బలిమిన్గహ్వరసామ్యకక్షగతభూబద్ధాగ్రముఖక్షేప్తదో।
ర్వలభిద్గ్రస్తసుకచ్ఛజాంఘికపరిష్వంగాచలాచూర్ణమ్ము।
త్కాలితాడంబగగాత్రకుండయిమహోద్ధ్వాంతంబునిండంగని।
ర్జ్వలుఁడైవిక్రమశక్తియోఁడువడిస్వస్థానంబుఁజేరెన్వడిన్॥ ౫౧.

ఉ॥ అప్పటినుండిబాహుగణమందుజయోన్నతిఁబొందిమేటియై।
యొప్పెడుమేదినీసురునకోర్వకశత్రుజిగీషనిచ్చలున్।
ముప్పిరిచెందడెందమునమూర్ఖుఁడువిక్రమశక్తివైరముం।
దప్పకపూనిక్రూరశపథంబుసెలంగమెలంగునీచుఁడై॥ ౫౨.

ఉ॥ విక్రమశక్తికిన్వెఱచివిప్రశిఖామణియప్పుడేసుహృ।
చ్చక్రముగొల్వవెల్వడివిషాదముచిత్తమునిండిపొర్లనా।
యక్రమవంతుఁడొంధరణిపాత్మజుక్రూరతనెంచియెంచియా।
చక్రిసతిన్నుతించుచుప్రశాంతినిబొందుచునేగనొక్కెడన్॥ ౫౩.

సీ॥ ఘనఘనాఘనరాజిగలమింటఁదళుకొత్తులలితసౌదామినీలతయనంగఁ।
బ్రకటతమస్వినీపర్వతశిఖరంబుఁబ్రాకుజ్యోతిర్లతాప్రభయనంగఁ।
దమిమధ్యమధ్యమేఘములబొఱులడాఁగినిక్కుపూర్ణిమసుధానిధియనంగఁ।
కైటభారాతివక్షమునందుఁగలశాబ్ధిరమియించుకేళికౌరమయనంగ।
నూహగొల్పుమగంగాప్రవాహమందుఁ । దరుణియొక్కర్తుకేశబంధమువదలఁగఁ।
గొట్టుకొనిపోవుచుండెడుతట్టుచనుచుఁ । జూచెశ్రీదత్తుఁడప్పుడాసుదతిఁగలని॥ ౫౪.

మ॥ అసితాబ్జేక్షణపాటుఁజూచికరుణాయత్తైకచిత్తుండుభూ।
మిసురగ్రామణివేడితత్తటమునన్మిత్రౌఘముల్ నిల్పితా।
వెసనాగొప్పప్రవాహమందుడిగితద్వేణీభరంబీడ్వనా।
బిసజాక్షీమణితోడఁదానుమునిఁగెన్ వేగన్ఝురీసంతతిన్॥ ౫౫.

తే-గీ॥వనితవెంటనెచెలికాఁడువఱదయందు। మగ్నుఁడైపోవదుఃఖాబ్ధిమగ్నులగుచు।
నితరమిత్రులువోదించియొచటనైనఁ। దేలునేమోయంచువెదకుచుఁదివిరిచనిరి॥ ౫౬.

శా॥ శ్రీదత్తుండటుచొచ్చిలోనజలముల్ సీమంతినీరత్నముల్।
ప్రాదుర్భావవిహీనతంబొరయుఁదాఁబ్రాగల్భ్యసంధానుఁడై।
మోదోత్పత్తిసెలంగఁజూచెగిరిరాట్పుత్రీశ్వరాగారముల్।
వేదబ్రహ్మవిచారముల్ సురవధూవిఖ్యాతశృంగారముల్॥ ౫౭.

ఉ॥ పారనితంబినీరచితభద్రసుధాయణమ్మత్తికాంక్రపా।
కారతటాకనవ్యసహకారపలాశసుకాంశ్యకింకిణీ।
భారకవాటశైలవృషభస్థవిరాజితచంద్రశేఖరా।
గారముసొచ్చిశంకరునిగౌరినిగొల్చెనుసంభ్రమంబునన్॥ ౫౮.

మ॥ కలకంఠీశుకశారికాక్రమితశాఖాసంఘనాదార్భటీ।
చలితోర్వీరుహగోస్తనీఫలగుళుచ్ఛస్పష్టవల్లీలస।
ల్లలితాగారముఖాంగణాంబుకణముక్తావృష్టిలీలన్ మహా।
సలిలోద్ఘాటనయంత్రసంతతులతోఁజంద్రోపలాకీర్ణతన్॥ ౫౯.

ఉ॥ రాజిలుపూవుఁదోఁటనలరాత్రిపయిండెను దెల్లవాఱుసం।
ధ్యాజపనిష్ఠలంజలిపెఁ,దామరసాక్షియుపచ్చెశంకరీ।
పూజకుఁజందనాక్షతలుపుష్పాడితేనెపసిండిగిన్నెలన్।
బాజులనింపిపెంపెసఁగసాంద్రవినిశ్చలభక్తిపెంపునన్॥ ౬౦.

సీ॥ పసపాడిపన్నీటమినిమిపిసాలించుమేనబంగరుచాయమెఱుఁగుదోఁప।
జిగిబిందుచెంగావిచీరక్రొమ్ముడిగట్టినవకంపువెలిపట్టురవికతొడిగి।
వ్రేలుకీల్గంటుపైజాలువాగేదంగిలోఁకేకుఁగొనలింతజాఱుముడిచి।
లక్ష్మీకళల్ గుల్కులావణ్యమునకెక్కుసమయసౌకర్యభూషలుధరించి।
దిద్దిదిద్దనికస్తూరితిలకమమర। జిలుగుఁబయ్యెటకొంగుఁబసిండిగిండి।
యలకుఁగప్పినపల్లెరమందిసరగ। వచ్చిభక్తిమైగౌరినిబ్రస్తుతించె॥ ౬౧.

చ॥ నళినదళాయతాక్షితొలినాఁటివెలందియుటంచెఱింగితా।
మెలఁగకయూరకుండెకటుమీఁదఁదలోదరిపార్వతీపతిం।

బాలుపుగఁబూజసేసిగిరిపుత్రిభజించిగృహంబుఁజేరఁగా।
వెలువడె,వెంటనంతనలవిప్రశిఖామణియుక్రయంబునన్॥ ౬౨.

చ॥ సదనముఁజేరిబ్రాహ్మణునిసారసలోచనగాంచిసిగ్గుమై।
వదనమువాంచిచేడియలువావిరిగొల్వఁగమంచమెక్కెనే।
త్రిదళములందుబిందువులుదట్టముతై నిలువంగనేడ్వభూ।
త్రిదశుఁడుజాలినొందిమదిఁదిన్నఁగనామెనుజూచియిట్లనున్॥ ౬౩.

చ॥ చెలువ! యిదేమియిత్తెఱఁగుచెప్పుమయేడువనేలసోనలై।
యొలికెడునశ్రువుల్తుడువవొప్పదెయక్కటమోమువిన్ననై।
చెలువువొలంగఁజొచ్చెసరసీజముఖుల్మదిఁగుందఁజన్నెనా।
వలనఘుటిల్లుకార్యమెఁదవంగలదేనినెఱుంగఁదెల్పుమా॥ ౬౪.

తే-గీ॥ఎవ్వతెవునీవు! పేరేమి! యిందువదన! । యనుచువిప్రుఁడుమధురోక్తులనువుపడఁగ।
బూర్వవృత్తాంతమడుగనాపువ్వుబోణి । కరుణచిగురొత్తఁగాఁబల్కెగద్గదమున॥

చ॥ వితికులసార్వభౌముఁడతిధీరుఁడుమాకుఁబితామహుండుభూ।
నుతబలిచక్రవర్తికృపఁబుండగువెన్నునిచేతమున్నశా।
శ్వతముగబందిపెట్టఁబడెఁ,జచ్చెనుమాజనకుండుభక్తిచే।
వెతలుమనంబుఁజొచ్చిపలవింపఁగఁజేసెడుభూసురోత్తమా॥ ౬౬.

చ॥ నలువురుతోడబుట్టువులునాకు,మురారిప్రతాపవంతుఁడై।
నెలఁతలమ్ముఁబోఁడతిమినీచతసింగమునొక్కదానిఁగా।
వలిపురిమోలనుంచె;నరవాహనుశాపముచేతసింగమై।
యలమటనొందుయక్షుఁడొకఁడామృగరాజముకంటెనింతఁగన్॥ ౬౭.

తే-గీ॥ నాదుపేరువిద్యుత్ప్రభనాఁజెలంగుఁ । బట్టణముఁజేరనెద్దియుపాయమంచు।
వేడవెన్నుఁడుదయగల్గివీనులలరఁ । బల్కెనాతోడనిట్టులుభవ్యమతిని॥ ౬౮.

తే-గీ॥నరునిచేబాహురణమందునలిగియోడి । పోవసింగంబుశాపవిముక్తిపొందు।
ననినమాటలుమదినెన్నివనటమాని । దానికైతెచ్చితినిముమ్మమానవేంద్ర॥ ౬౯.

క॥ మృగరాజునుగెల్చినయెడ । మృగాంకమనుకత్తియొకటిమీకులభించున్।
దగదానిసహాయంబున । జగములుపాలింపుఁడెన్నసంతుష్టుండై॥ ౭౦.

మ॥ ప్రమదారత్నపురస్కృతుండగుమహార్యత్నావతంసంబుయు।
ద్ధమునన్శాపముతీఱునట్లుదగశ్రీదత్తుండుగెల్వఁగృపా।
ణముయక్షుండుకృతజ్ఞుఁడైయతనికానందంబుతోనిచ్చెమా।
యమునొందంబురిఁజేరిరప్పుడువిదళ్హర్షామృతంబానుచున్॥ ౭౧.

క॥ తరుణీమణివిద్యుత్ప్రభ । పురముప్రవేశించిపిదపఁబ్రోత్సాహమునన్ ।
ధరణీసురునకునొకవిప । హరమగునుంగరమునిచ్చియందున్నతఱిన్ ॥ ౭౨.

ఉ॥ ఇంతినిగన్నులారఁగనియేకటఁబూవిలుకానికూళిచే।
నెంతయుఁగుందుమందనివియేదినవిప్రకుమారుజాడఁదా।
నంతయుఁజూచికన్నియనయంబునదగ్గరనున్నడిగ్గియన్ ।
సంతసిలంగఁగ్రుంకులిడిచయ్యనరమ్మనియానతిచ్చినన్ ॥ ౭౩.

తే,గీ॥ మజ్జనముసేయునప్పుడుమకరభయము । గలుగకుండుటకై చేతఖడ్గమంది।
జలకమాడినమేలనిచంద్రవదన । చెప్పిపుచ్చుటయునతండుచేసెనట్లు॥ ౭౪.

ఉ॥ స్నానముసేయుచున్ గగనశైవలినీతటమందుమిత్రులం।
బూనికతోడడించి వెసబోటినిగట్టునఁజేర్పనీడ్చుచో।
దానునుమున్గినట్టియులతావునఁదేలుటఁజూచియోసిదు।
ర్మానిని ! మోసపోతిఁగదమాయముసేసితిగా దెరకన్ ॥ ౭౫.

తే,గీ॥ అనుచుపగచుచుసహచరులాఱుగురిని । నెదకిదిశలెల్లనింటికివెడలునతఁడు।
నిష్ఠురకుఁడనుస్నేహితునెయ్యమలరఁ । గాంచియితరులనడిగెనుగాంక్షఁజేసి॥ ౭౬.

క॥ కొనిచనిసంకేతస్థల । మునకున్ నిష్ఠురకుఁడచటఁబూర్వపువృత్తాం।
తనికరమతనికిఁదెల్పఁగ । వినయముతో నిట్లుపల్కెవినుతహితుండై॥ ౭౭.

ఉ॥ నీవటుగంగలోమునిఁగినెయ్యురమమ్ములఁబొసిచన్నమే।
మావలఁజుట్టియెయ్యెడలనారసిమాచినఁగానలేకయెం।
తోవెతలంగృశించిబహుదూరముపోయివయస్యులందఱున్ ।
జావఁబ్రయత్నమొందిరియొరజార్చినకత్తులుచేతఁబూనినన్ ॥ ౭౮.

శా॥ "ఓహోబాలకులార ! సాహసపుటుద్యోగంబులన్ మానుఁడీ।
స్నేహాధిక్యుఁడుభూసురోత్తముఁడుమీశ్రీదత్తుఁడత్యంతమున్ ।
దేహారోగ్యతనున్నవాఁడగుటనేతెంచున్ సదేశంబసం।
దేహంబేటికి" నంచదృశ్యవచనానీకంబువీనుల్ చొరన్ ॥ ౭౯.

ఉ॥ అచ్చెరువొందియందఱుగృహంబులకేగెడుమార్గమందువే।
వచ్చుచునుండుబ్రాహ్మణుఁడువారిగమాదిశదారసించియో।
నెచ్చెలులారమీపురికినేఁడరుగంగసుఖంబుగాదుమీ।
వచ్చినత్రోవనేగుఁడుధ్రువంబుగమీకొకవార్తదెల్పెదన్ ॥ ౮౦.

చ॥ పరబుధబృందవందితుఁడువల్లభశక్తిగలించెఁ,బాటలీ।
పురికభిషిక్తుఁడయ్యెవిభుపుత్రుఁడువిక్రమశక్తిబాఁడనం।

తరమధికారియైకినుకతద్దయుఁజూపఁగఁగాలనేమియం।
దిరమునకేగినిన్నకడునీచమతింబలికెన్ధరామరున్॥ ౨౧.

శా॥ ఓరీబాఁపఁడ! పుత్రుఁడేడయనిదర్పోద్రేకతంబల్కినా।
ధీయుండద్భుతమొందిలేఁడనఁగనెంతేక్రోధచిత్తంబుతో।
నోరీవానినివాఁచిపెట్టెదవటంచుక్కుఁడుకంపించెదు।
ర్వారాసూయసెలంగబ్రాహ్మణునిజంపంబంచెఁబాపాత్ముఁడై॥ ౨౨.

తే.గీ॥ అట్లుకోపముతోవిభుఁడడుగఁగాల। నేమిసుతుదాఁచినాఁడను నేరమునకుఁ।
గొంటితవేయుటఁదెలియంగఁగుండెలవిసి। తరలెనాతనిభార్యయుఁదక్షణంబ॥ ౨౩.

చ॥ అదిమొదలాధరాధిపుఁడహంకృతిఁజూపలదేశమంతటన్।
వెదుకఁగఁబంచెఁజంపుటకువిప్రకుమారునివానిమిత్రులన్।
ముదిమదిలేకయచ్చటికిఁబోఁదగదన్నవయస్యులెల్లరుం।
గదిసివిచారమొందిఖలుఁడార్యముఁజింతనసేసిపెద్దయున్॥ ౨౪.

ఆ.వె॥ నీకుఁదెలుపవన్ను నియమించియిచ్చట। నుండుమనుచువారలుజ్జయినికి।
నేగిరటకుమనయువేగమెచనుపము। రమ్మనంగనతఁడుసమ్మతించె॥ ౨౫.

క॥ జననీజనకులమరణము। వినిదుఃఖమునొందితానువేఁబగదీర్పం।
జనువానివలెనతఁడుపి। క్షణములుఖడ్గంబుమీఁదసారెకుఁజూచున్॥ ౨౬.

సీ॥ పసిబిడ్డగానుండిపాలకేడ్చినవచ్చితజేఁజూఁచిచన్నిచ్చుఁదల్లిగాదె।
తలనొచ్చినను బాదతలమునొచ్చినఁబ్రోచుఁదమివెజ్జురాలౌచుఁదల్లిగాదె।
తప్పుత్రోవలుద్రొక్కదండించిబుద్ధులుదగఁజెప్పిమన్నించుఁదల్లిగాదె।
పనిమీఁదఁబోయివచ్చినవానికడుపారఁదగినయన్నముఁబెట్టుఁదల్లిగాదె।
తల్లిలేనట్టినిర్భాగ్యదశఁజరింప। నెండలోనున్ననీడకునేగుమంచు।
బిలుచువారెవ్వరున్నారుతలఁచిమూడ। నక్కటాపోయెనాయనియడలునతఁడు॥ ౨౭.

శా॥ హాతండ్రీ! యిటులౌనెకాలగతియాహాయేమిపాపంబొనీ।
వాతీవ్రంబగుమృత్యువుంబొరయ నేమంచద్దుఃఖించితో।
ప్రాఁతల్ మాన్పఁగ నేరికిన్ వశము నీవాఁడంచు నేనుంటకే।
దీతాల్కాణముతండ్రిదుర్మరణమీక్షింపంగఁగల్గెంగటా॥ ౨౮.

మ॥ తనయుల్ గల్గుటకున్ ఫలంబుయదిమిందండ్రుల్ పటుత్వంబలన్।
వనటంజెందకజీవనంబెనయఁగాపర్షిల్లుటేగాదెమ।
జ్జనకుంబ్రోవఁగనూచనైతినకటాదైవంబపాపిన్ సుమీ।
యనిశ్రీవత్సుఁడుపొక్కుచుండునొసటన్ హస్తంబుగీలించుచున్॥ ౨౯.

ఉ॥ ఆలలనామణీసహితుఁడై సురశైవలినిన్ మునింగి పా।
తాళమునందుఁ జొచ్చుట మొదల్ గల సంగతి సెప్పి మంచికై।
కాలము వేచియుండి నిజఖడ్గముఁ బూని వసుస్యులుండు నా।
ప్రోలును జేరఁగా నతఁడు పోయెను మిత్రునితోడ ధీరుఁడై॥ ౯౦.

చ॥ వెడలిన వారలిర్వురును విక్రమశక్తి దురాత్ము నెన్నుచున్।
నడవఁగ మార్గమందుఁ "గరుణన్ననుఁ గావరె" యంచు దైన్యతన్।
బడఁతి యొకర్తె యేడ్వఁగని బాడబుఁ డంత దయార్ద్రచిత్తుఁడై।
జడియకుమంచు వృత్తము విచారణ సేయఁగ నా మెయిట్లనున్॥ ౯౧.

ఉ॥ బాడబవంశరత్నమ! కృపానిధి! పోవుచు మాళవంబుకై।
నేఁడు పథంబు దప్పితిని నెమ్మది సుంతయు లేదు నన్నుఁ గా।
పాడితి వేని నీకగు శుభంబని పల్కుచు విన్నఁబోవు నా।
చేడియ నాదరించుచు సుశీలుఁడు బ్రాహ్మణు లధ్వనీనులై॥ ౯౨.

చ॥ పొలఁతిని వెంటఁ బెట్టుకొని పోవుచు వేఁడి వెలుంగు తాపమం।
దలసి లతాంగి దూరము ప్రయాణము సేయన శక్త కాఁగ వా।
రలు బస చేసి యప్పుడొక గ్రామమునం బరితృప్తి సుప్తులై।
నిలిచిరి రాత్రి యచ్చట నెనిట్టులమైన శ్రమంబు వీడఁగన్॥ ౯౩.

ఆ,వె॥ అర్ధరాత్రమందు నాకస్మికంబుగ, । నిష్ఠురమునిఁ జంపి నీరజాక్షి।
పలలభక్షణమునఁ జెలఁగ, శ్రీదత్తుండు । జూచి ఖడ్గమందిలేచి నిలువ॥ ౯౪.

మ॥ కఱకుంగోఱలు బుట్టె నాసికయుఁ జిక్కెం బొలుసు నుర్వుల్ పారెన్,।
వెఱపుం గొల్పెడు మాంసఖండము బలెన్ వ్రేలాడు పెన్మోవి, క
ట్టఱుతం దూలెడు వెండ్రుకల్ భ్రమరకీటన్యాయమౌనట్లు మా।
పఱమాఱ్పెచ్చెడు ఘోరరూపమునఁ గన్పట్టెన్ వధూరత్నమున్॥ ౯౫.

చ॥ నెలఁత వికారరూపమున నిల్చిన సాహసధైర్యమంత్రస।
ద్బలమున భూసురుండు ననపాయతశౌర్యవిజృంభణక్రియా।
కలన నిశాటిపై గదిరి గాఢము గాన పసవ్యహస్తమం।
దలవడునట్లు భీకరమ్ము గాంకముఁ ద్రిప్ప చెదిర్చె రంహుఁడై॥ ౯౬.

చ॥ కహకహనవ్వి నిప్పులొలుకంగను క్రేవలఁ గోల్మసంగి పెన్।
గుహఁ దమకించు నోరెడసి ఘోరపుఁ జేతుల నెత్తి పైకొనం।
దహతహపాటు నాటుకొనఁ దార్కొని మార్కొని ధిక్కరించి వీ।
కహత మొనర్ప రక్కసి శిఖుందల వ్రమ్యఁగఁ బట్టెఁ బట్టినన్॥ ౯౭.

సీ॥ కార్మొగుల్ వలపించుకటికచీఁకటినిచ్చుజంబీరఫలకాంతిచఱచుమేన।
నిప్పులీనెడురక్తనేత్రయుగ్మముపంచబాణునారాచంబుభాతిఁదనరెఁ।
గర్కశాననముచల్కఁబఱఁగిపార్వణచంద్రచంద్రికాస్ఫురణంబుసరగఁదాల్చె।
శర్కరాస్థలిఁబోలుచరణంబులామ్రపల్లవరాజిఁబురణించుచవివహించె।
నిట్లుకోమలవిగ్రహంబిరవుగొనఁగ । రామచంద్రపదాహతవామనయన।
పగిదిరాక్షసితనదుశాపంబుతీఱఁ । బలికెఁగరములుముకుళించిభయముగొంచు॥ ౯౮.

శా॥ అన్నా! శాంతివహింపునేనసురకన్యంగానురక్షించియీ।
నన్నొక్కింతవినంగఁదేటపడువైనంబెల్ల, మున్గోరిసం।
పన్నుండైనకుబేరుసత్పదవివిశ్వామిత్రుఁడుగ్రప్రభల్।
విన్నల్ముట్టఁదపంబుసేయుతతిఁదద్విఘ్నార్థమైశ్రీదుఁడున్॥ ౯౯.

చ॥ ననుఁబురికొల్పఁగామునిసనాధునిమ్రోలఁజరించిభాసురాం।
గనవవిలాసచేష్టలకుఁగైవసమొందకనాదుటక్కులె।
ల్లనుమొగిఁబొల్లులౌటనుదలంచికలంగుచునెట్టకేలకా।
తనిభయపెట్టిమాతమనిదాల్చినభీకరరూపమంతటన్॥ ౧౦౦.

ఉ॥ దానినిజూచిక్రుద్ధుఁడయితాపసవర్యుఁడునప్డు "డోసి! దు।
ర్మానినియెంతచేసెనరమాంసముఁదించునిశాటివైకడుం।
బూనివసింపుమంచునిటమున్ శపియించిపెఱుందనీవునా।
దైవసిగన్ గ్రహించినరయంబునశాపవిముక్తియౌ"ననెన్॥ ౧౦౧.

ఆ,వె॥ గనుకనిట్లునాకుఁగల్గెరక్కసిరూపు । పట్టణంబునకట! పొట్టలోనఁ।
బెట్టుకొంటి,నిపుడగట్టుసేరితినీదు । కరుణనెద్దియైనవరమువేడు॥ ౧౦౨.

మ॥ అనశ్రీదత్తుఁడుసాదరంబుమెఱయి "భామా! వేఱునాకేలచ।
చ్చినయీనాచెలికాఁడువేగమగుడన్ జీవించినంజాలుఁబో"।
యననట్లేయగుఁగాకయంచువెసమాయంబైన, నెయ్యుండులే।
చెనుబ్రాణాకృతినిద్రమేల్కొనినవాసిన్ సౌఖ్యమేపారఁగన్॥ ౧౦౩.

ఉ॥ అత్తఱిసఖ్యులిర్వురుసమంచితరాగవిలాసులైరి; శ్రీ।
దత్తుఁడునబ్బురంబెసఁగధర్మపరీతమనోవిచిత్రసం।
పత్తిసెలంగనిష్ఠురకుఁబాయకయానుఱునాఁడువేఁకున్।
సత్తుబైలుదేఱెనడసాగఁగవేగమహృష్టచిత్తుఁడై॥ ౧౦౪.

మ॥ తనరాకన్ మదిఁగోరియుజ్జయినినిత్యంబాదటన్ మిత్రులె।
ల్లనుజూపెట్టుకొనంగమేఘుఁడునెమళ్లంబోలెవేవేగడ।

ర్ణవమాత్రంబునసంత సంతోసఁగి మర్యాదల్ దగంజెందిగా।
తా నెనాతిథ్యము బాహుశాలికడఁ గైకొమ్మంచుఁ బ్రార్థించినన్॥ ౧౦౫.

మ॥ చెలికాండ్రొక్కెడఁ గూడియాతురత నా శ్రీదత్తువృత్తాంతముం।
దెలియం జెప్పుమటంచు వేఁడఁగ డువిస్తీర్ణంబుగా సద్వచో।
లలితాడంబరచాతురీగరిమ నెల్లం జెప్పి స్వస్థంబుమైఁ।
బొలిచెన్ మిత్రుని తల్లిదండ్రులు మనఃపూర్ణంబుగాఁ జూడఁగన్॥ ౧౦౬.

గద్యము॥ ఇది శ్రీ కుప్పుస్వామిప్రణీతమైన శ్రీదత్తచరిత్ర ప్రథమాశ్వాసము.



మ॥ స్ఫురదిందిందిరగీతికారవమయశ్శోభాలతామంటపా।
విరళవ్యాపృతచక్రశాడ్వలములన్ వేమాఱుహాస్నీకా।
చరణానందముగ్రోలిజవ్వనులుప్రచ్ఛన్నప్రదేశంబులన్।
సరసాలాపములన్ రమింతురతివిశ్వాసంబుసంధిల్లగన్॥ ౬.

మ॥ నవలావణ్యవిరాజితాంగశుభచిహ్నంబుల్ సెలంగన్ వనో।
భవకాంతామహిమంబునన్ బులినసీమాప్రాంత్యమంటాడిన।
త్స్ఫవమొప్పన్ వనులైవిటీవిటులురాసక్రీడక్రీడాచ్యుతిన్।
రవళిన్ నూపురకింకిణీక్వణనముల్ రంజిల్లశ్రావ్యంబుగన్॥ ౭.

సీ॥ ఒకమూలభ్రమయుండునికటధారాయంత్రగళితవార్బిందుసంకులరవంబు।
ఒకచోటఁబస్ఫురియించుఁబ్రకటవేశ్యాగంధభరతనాట్యనియుక్తమురజరవము।
ఒకవంకఁబ్రసరించుసకలయోషాహస్తనిర్గతాంబుశ్రేణినిస్వనంబు।
ఒకచెంతవినవచ్చుసుకరవాద్యవిశేషబహుతరతూర్యసంభావ్యగరిమ।
లలితశుకపికానేకకోలాహలంబు । ముదితజనచర్చరీకసమూహమునదరఁ।
బ్రజలబుక్కాముసింమారరజమురంగు । లమరవిలసిల్లెనగరికల్యాణవనము॥ ౮.

అంతటఁబ్రీదత్తుఁడుసుహృ । దంతికమునఁగాంచెనొక్కహరినీలవిత।
ర్ద్యంతరవిష్టసఖీజన । సంతతవాచావినోదసరసప్రోషన్॥ ౯.

సీ॥ చిగురాకుజొంపంబుచెన్నుకేలనమర్చివిరిసోయగముగోళ్లఁబెరయఁజేసి।
కొదమతుమ్మెదచాలుగొనలుగ్రొవ్వెదవెట్టిచెంబమ్మిఁగన్దోయిపొందొనర్చి।
ననయలేఁదీఁగెవిన్నాణంబుమైఁగూర్చిగుత్తులుపాలిండ్లఁగుదుగుపఱచి
తొగరుదానిమ్మవిత్తులుపల్వరుసనిల్పిచిలుకపల్కులఁబల్కుకలిమిఁబ్రోఁచి।
చారులావణ్యనూత్నవసంతలక్ష్మి । రూపుగైకొనెననఁదనూనుచిగిజించు।
సుదతిబింబకియనుభూపసుతమృగాంక । వతినిగన్గొనెశ్రీదత్తుఁడతిముదమున॥ ౧౦

చ॥ కనుఁగొనినంతమన్మథవికారముదోఁపఁగనెవ్వతెన్నుఁజూ।
మనోయనుభ్రాంతిమైకలఁగిచూడ్కులుత్రిప్పకమాచుచుండెన।
వ్వనితయుదైవికంబుగనివాళిమొనర్చెడునిగ్గుజూపులన్।
దనియకచూచెనిట్లువిదితంబుగనిర్వురొకళ్లొకళ్లపై॥ ౧౧.

చ॥ పఱపెసుమాపుఁదూపులప్రభావముచేతనొకింతయాఁగుమన్।
మఱిమఱినొంచునంమనను మానమునన్ గడకంటిమాపురే।
డ్తెఱనను రాగమున్ దెలుపుతీరునమెల్లఁగనప్పుడప్పుత।
త్తఱమునరాఁగనిల్పిరిపదంబులుడెందములందుగట్టిగన్॥ ౧౨.

చ॥ ఇటులు క్షణక్షణంబు జనియించుప్రిపాసంబెసఁగంగనంగనా।
చటులవిలోకనావిధుతసంచితధైర్యముతోడఁ,బీడిత।
స్ఫుటతనువల్లికోమలతఁబోడిమితప్పుచునుండఁజూచియ।
యచ్చటనవబోణిపెందరులచాటునకేగినవిభ్రమాత్ముఁడై॥ ౧౩.

క॥ ఉబ్బుకొనుపలపుపెంపున । నబ్బాలికతోననసువులరిగినమాడ్కిన్।
దబ్బిబ్బుదోఁపనెడఁదను । నిబ్బరమునభూమిసురుఁడునిలఁబడియున్నన్॥ ౧౪.

చ॥ కనుఁగొనియింగితజ్ఞుఁడగుకార్యవిచారుఁడుబాహుశాలియి।
ట్లనుఁజెలికాఁడనీదుతెఱఁగంతయుఁజూచితిదాఁపనేలభా।
మినిచనినట్టితావునకె మేలుగఁబోదమురమ్ముకుందవ।
చ్చునెయిటుధీనికైయొడలిసొంపునుబాసికృశింపనేలకో॥ ౧౫.

ఉ॥ ఊఱటబాహుశాలియిటులూరకపల్కుచునాతిచెంతకే।
పాఱునిగొంచుఁబోవనొకప్రక్కఁగ "నయ్యయొ! రాజపుత్రికన్।
గాటియవెట్టెఁబామొకటికాటునుమాన్పరెకావగేవెసన్।
మాటికఁజూడరే"యనెడుమాటలుఁగూఁతలువీనులందఁగన్॥ ౧౬.

క॥ అత్తఱిముఖమంచునస్త్రీ । దత్తునిరీతివివరింపఁదరమెయొరులకున్।
బొత్తునుగనుఁగొననేరక । తత్తఱమునబాహుశాలితగఁగంచుకితోన్॥ ౧౭.

తే,గీ॥ నాదుచెలికానియొద్దమంత్రమునువిషహ । రమగుప్రఖ్యాతమానుంగరమునుగలవ।
టనినఁగంచుకిశ్రీదత్తునభినుతించి ।, పాదములమీఁదఁబడివేడసాదరమున॥ ౧౮.

తే,గీ॥ సరగఁజనిరాజసుతకునుంగరముప్రేలఁ । బెట్టిపరమమంత్రమునుజపించినపుడ।
విషముదిగిమోహనాంగిజీవించెమఱల । నచటిజనములుకొనియాడిరతనినంత॥ ౧౯.

క॥ ఈసంగతివినిబింబకి । గాసింబఱుగెత్తివచ్చికడుపునఁబాలుం।
బోసినవరునింగనిసం । తోసమునన్బాగడఁజొచ్చెఁదోడ్తోనతనిన్॥ ౨౦.

శా॥ ఈమధ్యన్ధరణీసురుండుమదినెంతేపొంగియోచించియే।
మేమోయుంగరమున్గ్రహింపకయపోయెన్,స్వర్ణభూపాదులన్।
శ్రీమద్బింబకియప్పనంబనుపవానిన్హెచ్చుగాఁదానుస।
త్ప్రేమన్మిత్రునితల్లిదండ్రులమనిప్పించెన్మహాగణ్యతన్॥ ౨౧.

ఉ॥ ఇంటవసింపనొల్లఁడు,రహిన్బొరలాడునుశయ్యమీఁద,నే।
వెంటవధూలలామతలఁపేస్మరియించును,రేలనింతయున్।
గంటనుఱెప్పవ్రాల్పఁడు,సుఖంబఱియువ్విళులూరుచుండ,నీ।
మంటనదృష్టవృష్టివలెమాన్పఁగవచ్చెనొకర్తయత్తఱిన్॥ ౨౨.

క॥ భావజకృతబహుబాధా । దావానలతప్తయైనధాత్రీశుసుతన్।
బ్రోవుమని వేడుపొంటెన్ । భావనికయను చెలికత్తె ప్రమదంబొప్పన్॥ ౨౩.

చ॥ ఇతనికినంగుళీయకమునిచ్చిమిషన్ జను దెంచి పల్కె “ భూ।
నుతచరితా ! మదీయసఖినూల్కొను ప్రేమభరంబుచేత సం।
తతభవదీయదర్శనమెతద్దయుఁగోరుమఱొక్క నింతనీ।
కతమునఁగొన్న ప్రాణములఁగావఁగ నేరదిఁకేమి చెప్పుదున్॥ ౨౪.

తే॥ నీవువిషబాధతోలఁగించినిలిపినట్టి । ప్రాణములువిషమాంబకుబాధచేత।
గంఠగతమైనయవిగానఁగొగలించి । ప్రోవనీకగుఁగాదెయోబుధవరేణ్య॥ ౨౫.

క॥ అనబాహుశాలియాధా । వనికయుఁజెలికాండ్రుఁగూడివంచనమైఁగ।
న్యనుమధురనుఁగొనిచనియుం । డనుదీర్ఘనించిరంతనాతియునరిగెన్॥ ౨౬.

ఉ॥ ఆమఱునాఁడుమువ్వురువయస్యులతోడఁ దక్కయవర్తకం।
బేమిషగా వడిన్ మధురకేగుమమార్గమునందు నెల్లెడన్ ।
వేమఱురాజకన్యసరవిన్ గొనిపోవుటకై తురంగముల్।
ప్రేమనుబాహుశాలినిలిపెన్ దగుగూఢపుటంచెలొప్పఁగన్॥ ౨౭.

మ॥ బలిమిన్ గొండొకతల్లికూతులసురాపానంబుఁజేయించికై।
పలరన్ జొక్కఁగనామ్ర గాంకవతిశయ్యాగేహముంజేర్చి నె।
ల్పలశ్రీదత్తుఁడునిల్చె,భావనికదీపవ్యాజమొప్పన్ దృఢా।
నలమంటించిపరారియౌ మనోరకన్యన్ దెచ్చిశ్రీదత్తునిన్॥ ౨౮.

క॥ కలసికొనెఁబిదపనిద్దరు । చెలికాండ్రనుభావనికనుఁజేర్చివిభుసుతన్।
దోలిబాహుశాలికడకి । మ్ములఁజంపెనుసరభసమునభూసురుఁడంతన్॥ ౨౯.

ఆ॥ పడకటింటితోడఁబడిమండిపోయిన । తనయతోడనున్న తల్లిబుగ్గిఁ।
జూచిజనులురాజసుతభావనికతోడ । దగ్ధయయ్యెననుచుఁదలఁచిరపుడు॥ 30.

మ॥ మఱునాఁడెప్పటియట్లపట్టణపుగుమ్మంబందిశ్రీదత్తుఁడం।
దటికిన్ గన్పడిపెన్మ్రగాంకమునుజేతన్ గొన్నవాఁడొచుగ్ర।
చ్చునా రెండవరాత్రిపైనమయియాశాబద్ధుఁడైపోయెముం।
దఱవేఁజన్న ప్రియాంగనన్ గలియనుత్సాహంబువాటిల్లఁగన్॥ 3౧.

క॥ ఆరాత్రియెచనిచనిబహు । దూరముమఱునాటిపగలతోఁచుకడకువిం।
ధ్యారణ్యముఁజొరఁబడెదు । ర్వారంబుగదివినిజండభాస్కరుఁడెరియన్॥ 3౨.

క॥ అప్పటికపశకునంబులు । నుప్పరమునదోఁపఁగాంచియుడుగకమతియే।
డెప్పరముగలుగునోయని । ముప్పిరిగొనవగపుతోడముందుగనడువన్॥ 33.

సీ॥ దుష్టుకట్టాల్రవేటుత్రొక్కుడుపడలేక పాటమరిం చెడు మేనిపోటులడరఁ।
దెరువాటుకొట్టమైఁబొరుగుపైతోలుచ్చితొడితొడి నేలనేత్తురులుచొరఁగ।
గాలుసేతులువాచి కదలక యొడలంతనలుగుడుపడుటచేనడువలేక।
యల్లనల్లనఁ గుంటుచును దెంచుమిత్రులిర్వురినిభావనికనుదరియఁ జూచి।
ప్రాణనాయకిఁ గానమిభ్రమదలిర్ప। నేమితోఁచక నిలుచున్న యితనికడకు।
వారు చను దెంచి పెదవులువడఁకుచుండ। విన్నవించిరివిషయంబువిశదముగను॥ ౩౪.

ఉ॥ అంగొకడిట్లుపల్కెనకటా తెరువెయ్యెడొత్రోవనిందఱున్।
గుండఁగడిందిమైఁజెనకిగుఱ్ఱపుదండుడికించిదోఁచుకో।
న్నందుఱపిల్లి దెబ్బలుతినన్ బసతప్పిభరింపకున్న మే।
మందఱు,కొంతొకండుసురయమ్మునఁగోమలినీడ్చిప్రమారతన్॥ ౩౫.

క॥ తనగుఱ్ఱమున్పైనిడికొని। చనియెనుగడువేగనకట చండాలుఁడువా।
నిని వెన్నాడి నెలంతను। గొను మేమికనడవలేముకుంఠితశక్తిన్॥ ౩౬.

మ॥ అని చెప్పన్ వినికోపముప్పతిలవీరావేశమెత్తంగవీఁ।
కనిసీ! యొక్కఁడుమత్ప్రియన్ గొనిచనెంగా" యంచుమాటాడునం।
తనశ్రీదత్తుఁడుచాపముక్తపటుబాణప్రౌఢిఠీంద్రింపఁగా।
సనిమారంబునకున్ నడింబడిచెఁగన్యారక్షణోద్యుక్తుఁడై॥ ౩౭.

మ॥ త్వరలోగుఱ్ఱపుదండుఁజేరికొనిమాధ్యన్ క్షత్రియుండొక్కఁడా।
తరుణింగైకొనిపోవుచుంటగనిశ్రీదత్తుండుఁదోర్దండస్నే।
హరసంబొల్కెడుమంచిమాటలనకన్యన్ వేడనాతండును।
త్తరముస్ సైతమునియ్యనందునమహాతాపంబుదీపింపఁగన్॥ ౩౮.

తే॥ కాలితోఁదన్ని వానినీఁకనుసవారి। నుండిక్రిందికిలాగిపఱుండునట్లు।
రాతిపైమోదిపిడిచిమూర్ఛంబుచేసి। తక్కుగౌతులనుఱుమాడెఁదఱిమితఱిమి॥ ౩౯.

క॥ హతశేషులుభూసురశూ। రతకున్ వెఱగందిసంగరంబునవీనిన్।
జతగొన నెవఁడెంమనుజీ। వితకాలముచేయవైనవీతెఁడిదక్కన్॥ ౪౦.

తే॥ అను మనతనికిభయపడి వెనుకతిరిగి। పఱచిరంతశ్రీదత్తుఁడు తెఱవతోడ।
గుఱ్ఱమెక్కివయస్యులఁగూడుకొనఁగఁ। గొంతదూరముచనినిల్చెఁగోరియపుడు॥ ౪౧.

క॥ ఇరువురుదిగనచ్చుటఁబై। దురమునగాయములచేతదురటిల్లుటనా।
తురగముపుడమినిబడిన। త్వరముగఁదన్నుకొనికాలధర్మమునొందెన్॥ ౪౨.

ఉ॥ ఆలసుఁడుమ్మరింబునభయాకులయౌటను, నీరసంబునన్।
సోలినతీఁగవ్రాలెదగ్రుసుక్కుచుఁ గాంకవతిన్ ధరాముఖం।
డోలివసింపదించియటనొక్కఁడుదిక్కులనీటికందునన్।
దాలిమినెల్లెపన్ వెనుకఁదప్పయుఁగ్రుమ్మఁబు ముందునత్తటిన్॥ ౪౩.

ఆ॥ సూర్యుఁడస్తమించె జొత్తుతద్దిశమించె । వెనుకఁదిమిరసమితివిస్తరిల్లెఁ।
బాపలమిణుఁగురులును జపలరిక్కలుఁబోల్చి । సున్ను మిన్ను సొక్కు తెన్ను సేసె॥ ౪౪.

ఆ॥ త్రోవడొంకిగనకతొలఁగిడిదత్తుండు । కనులగలఘలంబుఁ గానఁడయ్యెఁ।
దింగితిరగిజలము తెచ్చియు సతిచప్పి । దీర్ప లేదుతొంటి తెలివుతప్పి॥ ౪౫.

తే॥ కోరపిల్లలకెలదెచ్చి గూటియుండుఁ । బిల్లలను గానకల్లాడుపిచ్చికవలె।
జలముగొనివచ్చివనమందు సంచరించు । సాంద్రతమసంపదక్రుతతమిస్రాపశమున॥ ౪౬.

తే॥ కొసరి చిఱుతిండితినుచుండుగోడ్డుబాలి । ప్రోలనిలఁబడియే కాపుబుడుతవోలె।
నిష్ఫలంబైనకాంక్షతో నెమకుచుండెఁ । గాఢవిపినమందు సతినిజక్కనతెఱఁగున॥ ౪౭.

క॥ ఇటులేకాకిగనొక్కఁడు । నటవిన్ దిరియించి రాత్రియంతయుఁ దవసటన్।
జటిచిటివెలుతుర్యపొడసూ । ప్రుటయుదయమునగుటుతువట్టియునుపటి నెలవున్॥ ౪౮.

శా॥ చేరంబోయినవంబువ్యాకులసమాశ్లిష్టంబుగా స్వీయభా।
మారత్నంబటలేకయుండుఁగని, క్షేమంబేదిసుక్రేయసం।
భారవ్యాప్తితఘుమనాకకపిలిన్ మగ్నంబుగాఁ దత్సమా।
చారంబున్ వినుజేరగానివలెఁ జేష్టారక్తుఁగుండొండొకన్॥ ౪౯.

సీ॥ కలికృతమాయావిఘాతకైతవమానుషీమానసలసారస్వైకమువమఁడు।
విగాని రాష్ట్రుఁసమాధాన మొందునుగోప వంశ్రపమహిహారశ్చంద్రమూళి।
రావణాసురవిమ్రాణఘంటనుమునంజిల్లుజానకీరామమూర్తి।
అజ్ఞాతవాసనవ్యాస్యపారమునునిల్చునీయుతికృష్ణాయుధిష్ఠురుండు।
పీరలెవబాటులనిపల్కువినయుగినుఁడు । కాలశాంతరమునువియోగంబునకిఁ।
నట్టిపవియందుఁ బ్రియురాలిపట్టువిడువఁ । గలిగెనెవ్వానికిట్టిదుఃఖంబుభువిని॥ ౫౦.

ఉ॥ ఆవలఁదెల్వితెచ్చికొని యంతటనుంగలయుంగఁజూచిన।
త్యావిలచిత్తుఁడయ్యు హృదయంబునఁగొంతతిరంబుఁబూనిబల్।
చేవఁదనర్చునొక్కపను చెట్టుఁగనుంగొని చేతికత్తినా।
క్రేవలఁబెట్టి చెట్టుపయికింజని వేపరికించెనల్లడన్॥ ౫౧.

సీ॥ గరిమీసములకీవిగదురసైల్యభరంబు మెఱుగారు బలితంపు మేనివాఁడు।
రక్తవర్ణముబోలురవులుకన్నులయందునధికారసౌందర్యమలమువాఁడు।

జాతికిఁదగినన స్త్రీయులమోటుతనంబుతలపొగఁగైసేయఁదనరువాఁడు।
కలిపయపరివారవితతి వెంబడిఁగొల్వఁదిముపదలిర్వ నేతెంచువాఁడు।
చెంతమార్గమునందేగుచెంచు తేఁడు । చెట్టుకడనుండుఖడ్గముఁజేతఁగొనుచు।
మఱి వెడలునంతదిగివచ్చి లెఱవజాడ । నరయనాతురపడుహృదయంబుతోడ॥ ౫౨.

తే॥ బాలికాన్వేషణాలీనభావభరత । ఖడ్గసంగతిమఱచిప్రకాశముగ "మృ।
గాంకవతిఁజూచితే" యనియతిరయముగ । నడుగఁ బ్రీదత్తుఁడాతఁడునాత్మయందు॥ ౫౩.

ఉ॥ పీనిమతిభ్రమంబెఱిగి వెంట నెపల్కను "వాతియల్లదో।
జానగుపల్లెనున్నయది పయ్యన నేని దవచ్చినీపు నా।
యానఁగృపాణమిచ్చెదనుహాయిగ నేగుము" టంచు బంటులన్।
వానికిసాయమిచ్చిపనుపన్ జని చేడియఁజూచు వేడుకన్॥ ౫౪.

తే॥ త్రిప్పటలఁగన్నయలసటతీరనిద్ర । చెందుమని చెప్పఁబరిజనుల్చెందుదొరగృ।
హంబునందునిద్రింపిరవఁ సేఁపు । సొలసి మేల్కనితన్నుఁదాఁజూచుకొనఁగ॥ ౫౫.

తే॥ పడఁతి వెదుకంగయత్నించికడపునామె । యున్నచోటికిఁబోనేరకున్ననేర।
మునకొయన్నట్టులిరుపాదములకునినుప । గట్టిసంకెళ్లుపడియుంటగాంచియతఁడు॥

క॥ ప్రియురాలి జ్ఞాపకంబె । మ్మెయిఁజిత్తమునాక్రమించిమించుటనిజబా।
ధయు నేమి తెలియకున్నన్ । ప్రియురాలి నెతలఁచితలఁచి నెపఁగయియుండన్॥ ౫౬.

తే॥ అబలఁగోల్పోయిపెఱవారయాధిపత్య । ముందువసియింప నెవఁడోర్చునకట! మాన।
వంతుఁడుండఁగనొకనాఁడువచ్చిసరగ । తామోచనికయనునొకచేటిప్రోలనిలిచి॥ ౫౭.

తే॥ అయ్యో! రానేలయిటకుమహానుభావ । యుండఁగాఁడవెకటకటా! యగునెయింత।
గాలమునఁజిక్కుపడినట్టిమీలకెందుఁ । జావుతప్పనెయిఁకఁగ్రైవిచారమేల॥ ౫౮.

తే॥ ఏదొపనిమీఁదదృష్టిగనేగెశబర । విభుఁడు,వచ్చినవెంటనె వేగనిన్ను।
నమ్మవారికబలిపేయునదియకార । ణముగనిన్ని ఘ్డవింధ్యవనంబునుండి॥ ౬౦.

తే॥ తెచ్చిచెఱఁబెట్టెనిటఁదదుద్దేశముననె । మంచివస్త్రములునుమఱిమంచిభోజ।
నములుపెట్టించుచున్నాఁడుమమత మెఱయ । యజ్ఞపశువునుగ్రొవ్వించునట్లెసుమ్ము॥

మ॥ అయినంజెప్పెదవింపుపేనిసదుపాయంబొండుతప్పించునిం।
తయునిక్కంబగుఁజెంచుతేనికొకకాంతారత్నముద్యద్వయో।
నయశీలాదులమించిసుందరియనన్ సల్పొందుచున్ బుత్రియై।
తయునొప్పారెడుదానినూహపమిలనేతన్వంగియుంబోలు నే? ౬౨.

తే॥ నవకతీపునుమాటలననువుతనము । విమలకోమలశుభతనూవిలసనంబుఁ।
జూడఁజూడమనోరథశుద్ధికలిమి । శబరకాంతలయందువిశాలశీల॥ ౬౩.

ఆ॥ అయినదాసనగుటనన్న వనిజరూప । వైభవంబునిక్కువమును దెలుప।
నతిశయోక్తియనుచుననుమానపడకుము । చూచితీరుగాక సుదతిచెల్వ॥ ౬౪.

క॥ మాచిన్నదానిసంగతి । దాఁచినఫలమేమివినుముదయచేసివృథా।
యోచనలుమానుమిఁకనీ । కాచెయ్వులుమోదజనకమౌననితలఁతున్॥ ౬౫.

సీ॥ అయిదారుదివసంబులాదిగనిన్నాళ్లవలెఁగాకకనుపట్టువనితతీరు।
అదియేమొగానిపయ్యెదచెర్వ్రేలుముంగురులుదిద్దఁగనైనఁగోరదిపుడు।
పనిమీఁదనున్నఁజప్పననేమితోఁచునోకళవళంపుఁబ్రసారకలనఁజూచుఁ।
బొంచియెవ్వతెపల్కరించినఁదన్నుగాదనుభావమునఁబల్కకట్టెయుండుఁ।
కలలతోనిద్రచెడిలేచిగాసిపడును । జెలులుఁనిదియేమొ?యనినఁదాసిగ్గుచెందు।
నిట్టిచిన్నెలుమున్నెప్పుడెఱుఁగదనుము । మాకునైతముతెలియవీమాయలన్ని॥ ౬౬.

ఆ॥ ప్రాణసఖులమెంతొబలవంతపఱచిన । హృదయమిచ్చికొంతయెఱుఁగఁజెప్పె।
దానికొదువఁదీర్పఁదరమె-పో-చల్లకై । తరలివచ్చిముంతదాఁపనేల!॥ ౬౭.

ఉ॥ నీవిటకేగుదెంచుటయునిన్నుఁగనుంగొనునాటినుండియా।
భావభవుండుక్రూరుఁడయిపట్టినబాణముక్రిందఁబెట్టకెం।
తేవడినొంపఁబూనుటయుహెచ్చినకాఁకఁగ్రహించుకన్యకన్।
గావుమువానసీకగుసుఖంబునుదప్పనుమీఁదిమృత్యువున్॥ ౬౮.

తే॥ ఇంతికూటమినంగీకరింతువేని । నుభయులకుక్షేమకరమౌనువిభవమొసఁగు।
ననుచువేఁడినశ్రీదత్తుఁడాలకించి । యెంచితీఱమిఁదగసమ్మతించియంత॥ ౬౯.

సీ॥ గాంధర్వవిధిచేతఁగన్యకాత్వముఁబాపిసుందరికానందశోభగూర్చె।
వ్రీడజాడ్యముఁజోపిక్రీడాగతినిడెంపిశృంగారపతినివశీకరించె।
హృదయేశ్వరీమనోభీష్టముల్దైవాఱమానితభోగసంపదలఁబొదలెఁ।
బద్మాక్షిప్రతిరాత్రిఁబ్రాణభర్తకుశృంఖలామోచనముచేసిప్రేమనెఱపె।
నిట్టులిరువురికనుకూలమెసఁగుచుండఁ । జిత్తములురెండునేకమైచెలఁగుచుండ।
దోడిచెలికత్తెలకునుసంతుష్టినిండఁ । బల్లవాధరప్రథమగర్భంబునిలిచె॥ ౭౦.

తే॥ మూలమట్టుగనిదియంతమోచనికయె । తనకుఁదెలుపంగసుందరితల్లివచ్చి।
యల్లుఁడనుప్రేమపురికొల్పనతనిఁజూచి । 'నాయనా'యనితనస్వతంత్రంబునెఱపె॥ ౭౧.

క॥ నీమామగారుసార్థక । నాముఁడుశ్రీచంద్రుఁడనుసనాతనకోపా।
గ్దామకరాళవిలోచనుఁ । డేమరుపాటునుటలేకహెచ్చినచొరవన్॥ ౭౨.

ఆ॥ అగ్గిలేకరవులు నాత్రఁగాఁడాతఁడీ । నేరమునకు నిన్ను దారుణముగ।
శిక్షసేయుఁగానఁ జేరి యెచ్చటనైన । మనుము గనుము సుఖము తనివితోడ॥ ౭౩.

తే॥ మఱియు సుందరి నెప్పుడు మఱువఁబోకు । ప్రాణముండిన నువ్వమ్మి బ్రతుకవచ్చుఁ।
గాలగతి యెన్నఁడిట్టులె కాలిపోదు । పోయిగా నాయనా యని ప్రొద్దుఁజూచి॥ ౭౪.

తే॥ బంధనము నూడ్చి వైచి శుభంబుగోరె । నంతశబరాధిపుని చేత నమరు కత్తి।
తనవిముని పుచ్చుకొనుచు సుందరిని గాఁగ । లించుకొని కొంత శ్రీదత్తుఁ డేగెఁబిదప॥ ౭౫.

మ॥ చని వింధ్యాటవికన్ మృగాంకవతి వాస్తవ్యంబెఱుంగన్ జని।
చినమోహాతిశయంబునన్ దిరిగి కాంచెన్ ఘోటకాంకంబునన్ ।
మును పెన్ఫ్రేటులతాంగి నట్టడవిఁ గోల్పోవన్ వ్యథం జెందిచే।
వుని ధ్యానించెన దేయెడన్ సుశకునంబుల్ దోఁపమార్గంబునన్॥ ౭౬.

క॥ అక్కడ సెలకట్టెల పొదె । చిక్కముదవిలించి చంక చేసువఁగడున।
లెక్కించపక్కయురులుగొని । గ్రక్కున నరుదెంచు బోయఁ గనుఁగొని వేగన్॥ ౭౭.

మ॥ అటవిం ద్రిమ్మరుచుండు వాఁడవ్వగ దయ్యా నీవు కాంతారవి।
స్ఫుటవాటిం జరియించు దానినబలం బూబోణి నేకాకినిన్।
జటులాక్షింగనుఁగొంగుపేయ చట నాసందర్భముం దెల్పవె।
చ్చటనైనం గని యున్నఁ బుణ్యమగు వేచండంబులన్ లుబ్ధకా॥ ౭౮.

క॥ అని ఘూసురుఁడడుగుచుదా । రినఁగ నిలుబ్ధకుఁడు "నీవు శ్రీదత్తుఁడవా"।
యని ప్రశ్న చేసెనతఁడౌ । నను మన్నిట్టూర్పువిడువ హాత్తినవేడ్కన్॥ ౭౯.

శా॥ ఔరా దేవర! యట్టిభాగ్యక్షతి సెయ్యంబూనదుఃఖింపనే।
లారష్మన్ననువచ్చు నేగొడవ మేలౌ గాక సర్వంబు, నా।
నారీరత్నము నిందుఁ జూచితిని గాంతారంబు నంప్రశువుల్
గార్చన్ గోరము లందు చుండనిటవిజ్ఞా! జాలియయ్యెంగనన్॥ ౮౦.

క॥ తొలినాటి సంజనొడ్డిన । వలలం బేసురుల వేఁకువం గైకొసనే।
నిబువెడలి వచ్చియుడవిం । గలపనితీర్పుకొని మఱల గాఁబ్రొద్దెక్కన్॥ ౮౧.

తే॥ మట్టమధ్యాహ్నమున నిమింటమండుచున్న । వేఁడి సెగ్గున కొంతయు వెక్కసపడి।
చెట్టునీడను గూర్చుండి సేదదీర్చు । కొంచునుండఁగ నొకసన్నగొంతు వింటి॥ ౮౨.

తే॥ మొదట నేర్పాటు కాకుండ మోసబోయి । యొదియొ కోయిల కూఁతఁగా నెన్ని కొనుచు।
జుట్టు ప్రక్కల వెదకి చేఁబట్టి విల్లు । పోవుచుండఁగ నొకచోటఁ బొలఁతిఁ గంటి॥ ౮౩.

మ॥ అకటా దేవర! యేమిచెప్పవినశక్యంబౌ నెయాయేడ్పు నెం।
తకునూరారదు చెప్పినన్ వినదువంతంజిక్కు దున్ భీతి చెం।
దకనన్నెత్తినిజేతులుంచుకొని నాధ్యాయంచువాపోవునే।
మిఁకజేయంజనునాఁడుబిడ్డలుగలాఁడెట్లోర్చునీఘోరమున్॥ ౭౪.

తే॥ ఏమియడిగినబదులాడకేడ్చియేడ్చి । చివరకాయాసమునమూర్ఛ చెందెనంతఁ।
గాలుసేయాడకప్పుడుదుఃఖమునమునిఁగి । కెలని సెలయేటినుండి నేజలము దెచ్చి॥ ౭౫.

తే॥ గొంతులోనింతపోసి పైఁగొంతచిలికి । విసరునంతకుఁగొంత తెప్పిఱిలికనులుఁ।
తెఱచితిన్నఁగఁగడఁగి నాదిక్కుఁజూచి । పలుకయత్నించితిన్న నియొలుగుతోడ॥ ౭౬.

తే॥ లుబ్ధకశ్రేష్ఠ! యీ కానలోఁదిరుగుచు । నాకు గానుమ్మలించుమన్నాధునిటకు।
నరసికొనిరమ్ము నిన్న సాయంతనమున । నాదుదగఁదీర్పనిదిగొక్షణంబులోన॥ ౭౭.

ఉ॥ పచ్చెదనంచు నీళ్లుగొనివచ్చుటకుంజనియింతవేళకున్।
వచ్చినవాఁడు గాఁడుతనవచ్చుపథంబు నెఱుంగకేవనిం।
జొచ్చెనొ, నొచ్చె నోమనము, స్రుక్కెనొ, యేమయినాఁడొ, నేఁడు నే।
నెచ్చటికేగుదాననిఁక నీశ్వరుచిత్తము నెట్టులున్నదో॥ ౭౮.

మ॥ అనుచుంగన్నులనీరుచిప్పిలఁబతిన్ ధ్యానించుచుండన్ మనం।
బున నేనిట్లనుకొంటినీపడఁతిసొంపుం బెంపుభాగించుకొ।
న్న నరుండెంతయుభాగ్యవంతుఁడనియంతంగొంతకోదార్చియా।
మెనుమాపల్లెకు వెంటబెట్టుకొని పేర్మింబోవఁగా నెంచుచున్॥ ౭౯.

తే॥ తరుణిరోయిట్టిఘోరకాంతారమందు । నొంటినుండఁగఁదగదు నేనున్నయింట।
నీవునొకకొన్ని నాళులునిలిచియున్న । వెదకినీమగవానిఁ దెచ్చెదనురమ్ము॥ ౮౦.

తే॥ అనియొడంబడ నాచేతనైనవఱకుఁ । జెప్పనావలసమ్మతించివఁజెలంగి।
పిలుచుకొనిపోతి నాపల్లె వెలయుచున్న । కోడెకాంద్రకు వెఱవనాకోమలాంగి॥ ౮౧.

తే॥ కడఁగిమధురాపురంబునాగస్థలమను । గ్రామమునవిశ్వదత్తుఁడన్ బ్రాహ్మణుండు।
వృద్ధుగలఁడొక్కఁడాతనియింటగౌర । వముగనిల్లడయుంచి నేవచ్చినాఁడ॥ ౮౨.

తే॥ ముదితనీపేరు దెల్పినన్ వెసకుమనఁగఁ । దిరిగివచ్చితి నిటకేనుధీరవర్య!।
వేగనాగస్థలంబునకేగుమీవు । నచటఁగనవచ్చునా మెనంచరిగెబోయ॥ ౮౩.

చ॥ పడఁతుకపోబడిం దెలిసి బ్రాహ్మణముఖ్యుఁడొకింత ప్రాణముల్।
దడబడకుండ నిల్పియును దామరపాకుననీటివోలెని

ల్క_డనువహింప లేకతనకాంతఁగనుంగొను వేగిరంబునన్।
వెడలి ఏ సెంబులిందకుని వెంట నెదానుఁబ్రయాణసిద్ధుఁడై॥ ౯౪.

తే॥ చేరినాగస్థలంబునుజిత్తమలర । విశ్వదత్తునిజూచి ''యోవిప్రవర్య।
హో!కునీయొద్దనుంచినపాలఁతినాదు । భార్యనిమ్మం''చు వేడుఁడుబ్రాహ్మణుఁడును॥ ౯౫.

తే॥ మధురలోనాకుహితుఁడును మానఘనుఁడు । శూరసేనమహారాజుహారిగుఁడు।
మంత్రివరుఁడగువిప్రు సమక్షమందుఁ । బడఁతినీభార్యనుంచితిభద్రముగను॥ ౯౬.

క॥ ఇదియొకనిర్జనపదమా । సుదతిని గాఁపాడుటిచిట సులువవు నోనేఁ।
టిదినంబియ్యోడనుంచుము । పదపడిచనుమయ్య రేపుభార్యనుజూడన్॥ ౯౭.

ఆ॥ అనుచు నాతిథేయుమమురంగనొనఁగిన । సమ్మతింపకుంటయిమ్ము గాద।
టంచు నెంచిచిత్తమంతయుఁజనని చ్చి । బొందిమాత్రముండుపొలువుపోఁప॥ ౯౮.

శా॥శ్రీదత్తుండఁటవిశ్రమించిబలు గాసిం దెల్ల వాఱంగఁదా।
నాదిత్యున్ భజియించి నెమ్మదిఁబ్రయాణారంభుఁడై మేనఁబై।
పైదుమ్ముల్ పచరించు చుండ మధురాప్రాంతంబుఁబ్రాపించియం।
దేదేనొక్క_డదీర్ఘికంగనుడుఁబోయెన్ వేగస్నానార్థమై॥ ౯౯.

సీ॥ ధౌతశుద్ధాంగుఁడైదరిఁజేరనవ్వేటహారు లెవ్వరొరత్నహారమొకటి।
తనదువస్త్రాంచలంబునఁగట్టిచనినమో సము నెఱుంగకయువస్త్రిముధరించి।
మానినీమణిఁజూడమధురాపురంబుఁబ్రవేశించియలరాజవీథియందుఁ।
బోవుచుండఁగహారమునువలావలుగుస్తువట్టిచోరునిగఁగొత్వాలుకడకు।
బట్టికొనిపోవఁగొత్వాలుఁబార్థివునకుఁ । దెలుపనొరవానినురిదీయఁదీర్పుచేసె।
నంతఁబాపముశ్రీదత్తునగలఁగట్టి । పథ్యభూమికిఁగొంపోవువారునైరి॥ ౧౦౦.

తే॥ తప్పితాఁకినపాదంబెతాఁకుమతియుఁ । జెడినవంశంబెపలుమాఱుఁజెడునటన్న।
యరవసామెతచొప్పుననకట! తనకు । ముప్పువాటిల్లజింతిల్లుఁబుడమివేల్పు॥ ౧౦౧.

క॥ తలవరులాఁపలెఱుఁగకమతి । మలదంబుగఁద్రాగిడిండిమధ్వానంబుల్।
చెలఁగఁగనుగ్రకృపాణుఁ । దలకడవఁగఁజేత్రఁబూనితలకొనినడువన్॥ ౧౦౨.

సీ॥ బ్రహ్మతేజమరయారె! ప్రస్ఫుటంబగువానికీలాటివిధిగల్గె నెట్టులమ్మ।
మన్మథాకృతియుఁగోమలగాత్రమగువానికెట్లుబీ లెండ సహించునమ్మ।
ఏతల్లిగర్భమిరీతిఁగీడ్పడివాడికత్తిపాలౌ టెల్లగల్గెనమ్మ।
క్రూరుఁడెవ్వఁడొయిట్టినేరంబుఁబైమోఁపెఁగానితస్కరుఁడీతఁడౌనటమ్మ।

యనుచు నబ్బురపడువారు నడలువారు । నట్టెమెదలక చూచువారగుచు రాజ।
వీథినివసించుభామలు వివిధగతుల । ననఘు శ్రీదత్తుఁ గనుఁగొని యరిగిరపుడు॥ ౧౦౩.

మ॥ తరుణీరత్నమొకర్తు తన్నికటసౌధప్రాప్తయైయుండి భీ।
కరవాద్యంబగు డిండిమధ్వనులు మ్రోఁగన్ జూడనేతెంచి భూ।
సురవంశోత్తము మేడనుండి కనుఁగొన్ శోకాగ్ని పాలౌచు స।
త్వరతన్ మంత్రివరేణ్యు, గణ్యు, నిజసద్యస్కాల సంరక్షకున్॥ ౧౦౪.

మ॥ కనియో మంత్రివరేణ్య! ఘాతుకులు మత్కాంతున్ శరీరంబునీ।
డ్చినబంధంబులఁగాసి బెట్టుచు శిరచ్ఛేదంబు గావింపనె।
క్కానుమోదంబున వధ్యభూమికరుగోకొంపోవుచున్నారు భ।
ర్తను బ్రాణేశ్వరు మన్మనోహరు నిశీఘ్రంబీవు రక్షింపుమా॥ ౧౦౫

క॥ అని మొఱ్ఱలెత్తి పొరింబొరి । వనరుచు మొగమెల్లఁ దెల్లపాఱఁగ నేడ్వన్।
గనుఁగొని మంత్రియు రభసం । బునఁ జనివారించి భటుల భూపతిదోడన్॥ ౧౦౬.

తే॥ విన్నవించి శ్రీదత్తుఁ దప్పించి నిజగృ । హంబునకుఁ గొనివచ్చి మృగాంకవతికిఁ।
జూప నామెకు ననురాగసూచకముగఁ । జెక్కిళులయందు రాగము పిక్కటిల్లె॥ ౧౦౭

ఆ॥ అపుడు మంత్రి ముఖ్యు నానవాలుఁ గ్రహించి । మోదమబ్బురంబు బొదుకొనఁగ।
"విగతభయుని నాదు పినతండ్రి నిదియేమి । యిచట మఱలఁ గంటి నింపుమీఱ॥ ౧౦౮.

ఆ॥ "దైవయోగమున నితండు దేశాంతర । యాత్రనుండి మంత్రియయ్యె నిచట"
ననితలంచి యెఱుఁగనడిగి శ్రీదత్తుండు । తండ్రిపాదములకుఁ దరిసి మ్రొక్కె॥ ౧౦౯.

క॥ ఇటు లెఱిఁగినఁ గని మంత్రియు । స్ఫుటమగు శ్రీదత్తుచిహ్నములుసూచి తనం।
తటవిస్మయంబు గదురఁగ । బటుతరహృష్టుఁడయి మొఱిఁగె భ్రాతృసుతునిగన్॥ ౧౧౦.

మ॥ పరమానందపరత్వముం బొరసి శుంభద్గాత్రులై యొండొరుల్।
పరిరంభంబులఁ గొంత ప్రొద్దుచన స్వస్వాంతంబులుప్పొంగన।
ప్డారిమన్ మంత్రియునుం "కుమారక! కడున్ యుక్తంబునైనించునో।
క్కరహస్యంబిఁక విన్నవించెద ననీకార్యానుకూలంబుగన్॥ ౧౧౧.

చ॥ అలవడ నేనొకప్పుడొక యక్షిణి వశ్యము చేసికొంటిఁ ద।
త్ఫలముగ నా మెనాకు ననపత్యువకుం బదివేల ఘోటకం।
బులుఁ బదికోట్లు సంఖ్యగల పూలవరాల నొసంగె నీవు నా।
కులతిలకుండవౌటఁ గయికొమ్ము మదీయధనంబు నంతయున్॥ ౧౧౨.

క॥ అనుచమ్మృగాంకపతింబు । త్రునకుందగునొప్పగించితూర్యాతిశయో।
ల్బణకల్యాణమహోత్సవ । కనదాశీర్వాదనాదఘనతఁదనర్చెన్॥ ౧౧౩.

శా॥ తారుణ్యోజ్జ్వలరూపసత్తముఁడు శ్రీదత్తుండజస్రంబుస।
ద్దారాకేళివిలాసభాసురుఁడు నిత్యశ్రీవిరాజద్వరో।
దారోత్కృష్టగుణాదిశీలుఁడగుచున్ ధాత్రీశమంత్రీశ్వరుల్।
స్ఫారత్స్నేహృదభావమూనఁబరగెన్ భవ్యోన్నతిన్ సన్మతిన్॥ ౧౧౪.

గద్యము॥ ఇది శ్రీకృష్ణస్వామిప్రణీతమైన శ్రీదత్తచరిత్ర ద్వితీయాశ్వాసము.

---

శ్రీరస్తు.

# శ్రీ ద త్త చ రి త్ర.

## తృతీయాశ్వాసము.

---

క॥ ఒకనాఁడుమంతనంబున । నికటమునకుఁబిల్చిపుత్రునిన్మంత్రియనున్।
బ్రకటోద్యద్రాజ్యతంత్రా । ధికతన్యౌగంధరాయణధీయుతఫణితిన్॥ ౧.

క॥ వినుశూరసేననృపునకుఁ । దనయామణియొండుగలదుతగనామెనుద।
జ్జనకుఁడవంతికిఁబెండ్లికిఁ । గొనిపొమ్మనెవచటివిభునకున్సతిగాఁగన్॥ ౨

క॥ ఈసాకునరాజసుతన్ । మోసమునహరించినీకుముడిపెట్టెదనీ।
వాసుదలితోడిసైన్యము । నాసైన్యముఁగూర్చుకొనినవమ్మికపుట్టన్॥ ౩

తే॥ తొల్లిశ్రీదేవివరముచేదొరకుననెడు । రాజ్యలక్ష్మియునీకుశీఘ్రములభించు।
నెమ్మిదొరవగుమనిచెప్పినిశ్చయించి । మంత్రివరుఁడుప్రయాణసంభ్రమమెలర్ప॥ ౪.

సీ॥ దారిపొడ్వవనంపటారగింపఁగఁజాలుమంచిబోనసపుసామగ్రితోడఁ।
గడతేరిమీఱులెంకలుబోనగత్తెలులెక్కకెక్కువగబండ్లెక్కిరాఁగఁ।
బయనంబునకుఁగాలుబలుగుడారములుబెత్తలుపిఱుందనవెక్కసముగమోయ।
నూఱుగుఱ్ఱములుమున్నూఱురౌతులురెండువేలకాల్బలములువెనుకముందు।
వడిగఁబొజులుతీఱిచినడచుమండ । ఫేరిభాంకృతులెసగంగబిరుదుమగలు।
రాజకన్యావిమానసంరక్షకులుగఁ । జేరిచనుదేరఁదెర్వరులూరువెడలి॥ ౫

సీ॥ ఇల్లాండ్రతోఁగూడియుల్లాసమునమంత్రివరుఁడుశ్రీదత్తుఁడవ్వారుసనరుగ।
గండభేరుండఖడ్గవ్యాఘ్రవేదండకంఠీరవాకీర్ణకందరంబు।
లుత్కటంబుగనుశాఖోపశాఖలుగాఁగమండపంబులభంగిమల్లుకొనిన।
వృక్షపఙ్క్తులనొప్పువింధ్యాటవినిజొచ్చిమార్తాండరుక్సహ్యమాసినట్టి।
ధ్వాంతనీరంధ్రగహనగహ్వరకరాళ । మార్గములయందునడచుచుమధ్యమధ్య।
నడవిమృగములగుండియలవియునట్లు । పటహరవములుమొరయంగఁబరగిరపుడు॥ ౬

చ॥ పడమరజేగుఱించుటయుభాస్కరుఁడంబుధిఁగ్రుంకెనెల్లెడన్।
వడివడిఁగ్రమ్మెఁజీఁకటులువల్లికనిర్గతసర్పసంతతుల్।

గోడరేఁడు సంచరించుటకుదుష్టమృగావళిఁగూయఁజొచ్చెన।
ల్గడలయధేచ్ఛఁగ్రుమ్మఱుచుఁగాననసీమభయంకరార్భటిన్॥ ౭.

ఉ॥ అత్తఱిమంత్రిముఖ్యుఁడు, ప్రయాణముసాఁగుటకష్టమంచుశ్రీ।
దత్తుఁడుసెప్ప, సైన్యమొకతావునఁజుట్టునుగాపువెట్టిపే।
రెత్తుగుడారముల్ నడుమనేర్పడఁగొట్టవిధించె, సర్వమా।
యత్తముసేయఁగావిడిసిరందఱునర్హములైనచోటులన్॥ ౮.

క॥ ఇచ్చునపయిఁట్లువిడియుఁడు । హెచ్చరికనొకింతభటులునెసఁగనిశీథిన్।
హెచ్చింపఁగడుసుతనంబునఁ । జెచ్చెరనొకదొంగదండుచెనకఁదొడంగెన్॥ ౯.

సీ॥ అధికారులపుడుమార్గాయాసమునగాఢనిద్రాపరత్వసముద్రములగుటఁ।
దెక్కలికాండ్రుజల్ మొక్కలంబునఁజేయుకొల్లలకోడిమాఱ్కొనకభటులు।
పాషాణవర్షంబుపాయకకురియంగనంపజొక్కుమ్మడిడిందుపడుచు।
సేనాపరస్పరాహ్వానముల్ వర్జించిస్థైర్యధైర్యములేదితత్తరమునఁ।
గలకఁబడఁజొచ్చికర్జంబుఁదెలియలేక । కళవళంబుననుంటఁదస్కరులెఱింగి।
కోవరంబున్నతమవారికూయివినుడు । నురదిసమయంబటంచుఁదాముత్సహించి॥ ౧౦.

క॥ పటమంటపంబులొక్కొక్కటికినిరువదేసిమందికరణిఁజెలంగం।
గుటిలాత్ములుచొఱఁబడియు । క్కటికింబింత్తైనలేకకడువేగమునన్॥ ౧౧.

క॥ స్త్రీపురుషభేధమెంచక । చేపడువఱకునుగడంగిశీఘ్రంబుగని।
ద్రాపరులఁగట్టికొనిచని । రేపునమఱిమచ్చుచల్లియెంతయుధృతితోన్॥ ౧౨.

క॥ ఇప్పగిదిమంత్రివర్యునిఁ । జొప్పడశ్రీదత్తురాజసుతవేర్వేఱన్।
నొప్పించిబంధనంబులఁ । జప్పునఁదమయూరుసేర్పసాఁగిరిహరుల్॥ ౧౩.

ఉ॥ అంతనఁదెల్లవాఱుసమయంబునువచ్చెనుదిక్కులందునం।
తంతకువెల్తురంబొదివెనయ్యెడదొంగలలోఁగృపీవలుల్।
గంతలుఁగప్పికొంచుఁదమకట్టలగొడ్లనుదోలిరంతఁజే।
లెంతయువన్నెహెచ్చనుదయించెనుబ్రాగ్దిశసూర్యబింబమున్॥ ౧౪.

సీ॥ ఎఱుపుఁదూపులరూపునెక్కసక్కముసేయుబాలార్కకిరణముల్ పవ్వళింపఁ।
గంచుగంటలచాలుగణగణార్భటినించుఘనకవాటభరంబుగ్రాలుచుండ।
మ్రొక్కులుచెల్లించుముద్దుటుయ్యెలలూఁగువలభీకపాలముల్ జళుకుగొల్పఁ।
గిపురంపుఁబొగగుగ్గిలఁపుఁబొగల్ గిఱికొనద్విగుణీకృతాఖిలతిమిరమూన।

భయదఘంటానినాదంబు ప్రబలుచుండి । కార్యగృహంబునదొంగలంగట్టివిగత।
భయునిశ్రీదత్తముఖ్యులఁబట్టి తెచ్చి । బలియొసంగను నిల్పిరిక్రమదమెసఁగ॥ ౧౫.

తే॥ పట్టెకుంకుమబొట్టునుపసపుకోక । పెండికోఁలు బెత్తెడువిరివిపూసన్న।
తాలిబొట్టునుముమ్మొనవాలుగదురఁ । జండికాదేవికన్పట్టెసరసనెదుట॥ ౧౬.

శా॥ హాలాపానవికారవర్తనము పెల్లాడింపఁగావచ్చిక।
స్థాలంబైనదుకుక్షులంబదుచుఁ మత్తిల్లిజొత్తిల్లు నే।
త్రాలోకంబులఁగండరించిపటుచోరానీకమందందునా।
భీలాసిఁ ఝళిపించుచుఁ బలియిడం బ్రేరేచు ముండందఁగ॥ ౧౭.

సీ॥ మల్లియల్ వికసించు చుల్లాసమును దెల్పు నెలనవ్వు లెంతేనినింపునింప।
ముద్దులుగుల్కు-కెమ్మోవిచిన్నెలె సంగనపుడుపుఁబూఁచుగులాబినపహసింను।
పాలబుగ్గలనిగ్గు తేలియాడుచునుండఁ లలివచ్చిరానిపల్కులు చెలంగఁ।
గాళ్లనందెలుఁజిన్ని వ్రేళ్లనుంగరములు నొత్తులు మొలగజ్జెలొలుపుఁజూపఁ।
జూడనల్లారుముద్దుగసొబగునాల్చు । చంటిబిడ్డనుమగవానిఁజంకఁజేర్చి।
తరళలోచనసుందరి తరలివచ్చెఁ । జండికాదేవిదర్శనోత్సాహమడర॥ ౧౮.

ఆ॥ వచ్చిభక్తినమ్మవారికినిదర్శించి । సంభ్రమమునవనుండుసాధ్వితనదు।
జీవితేశ్వరుఁడగుశ్రీదత్తుఁగనుఁగొని । ఖేదమోదభరముగీలుకొనఁగ॥ ౧౯.

ఆ॥ పుచ్చడీకతనముపోఁబెట్టియొక్కింత । గార్యసరణి నెంచికాంతయంత।
వడిగముందువచ్చిభర్తను విడిపించి । యింటికితనితోడ నేగునపుడు॥ ౨౦.

ఆ॥ కడమవారు భర్తకార్యార్థమైవచ్చి । తగులువడినబంధుతతియటంచు।
మగనిపలనవినిసమంచితకరుణమై । వారి నెల్ల విడువఁబంపు వెట్టె॥ ౨౧.

తే॥ ఇపుడు శ్రీచంద్రుఁడునుబుత్రహీనుఁడగుచుఁ । బుత్రికకునున్నపల్లీప్రభుత్వమిచ్చి।
సరగ స్వర్గస్థుఁడగుటసుందరియెవిభుత । మెఱయఁబాలించుచుండెనుమిన్నయగుచు॥

ఉ॥ కావునసుందరీవిభుఁడు గ్రామవిభుండయిసర్వసంపదల్।
వావిరిఁగొల్వఁదండ్రిపరివారముఁబ్రోచుచుశూరసేనప।
మ్మాభవునాత్మజఁదనదుబోటులసమ్మతిఁబెండ్లియాడెసం।
భావితదివ్యవాద్యములుపౌరులదీవెనలుల్లసిల్లఁగ॥ ౨౨.

క॥ మనపతులను మువ్వురికిఁ । ముదముఁ దాక్షిణ్యభావముంగొల్పుచుసు।
మ్మదమునశ్రీదత్తుఁడునె । మ్మదినిబిత్రుప్రుఁడుపసింపమనుచుండెఁదగఁ॥ ౨౪.

చ॥ గరిమగడల్కొనంగనొడికంబుగబింబకిశోరసేనభూ।
వరులగుమామగారలకువాంఛితమొప్పనుదంతమంతయున్।
సరగనుజెప్పిపుచ్చుటయుసద్గుణగణ్యులురాజశేఖరుల్।
తరలికుతూహలంబమరఁవద్దయుఁగూఁతులమీఁదికూరిమిన్॥ ౨౫.

సీ॥ సముచితైశ్వర్యవిశారదుఁడల్లుఁడుతగినవాఁడంచుసంతసమునెడమఁ।
బడఁతులభాగ్యంబభాగ్యంబనివచించుపరిజనంబులవేడ్కపాలుగొనుచుఁ।
దమగౌరవాధిక్యతకుయుక్తమైనభూషాంబరాదులతోడియరణమమర।
రథగజతురగసంరంభమేపారంగనేతేరవడిధరణీశులపుడు।
విగతభయముఖ్యహితపరివేష్టితుండు। కనకపీఠినిచేరోలగముననుండు।
ఘనుఁడుశ్రీదత్తుఁడుచితసత్కారమొనరి। మామగార్లనుకుశలసంప్రశ్నచేసె॥ ౨౬.

చ॥ పిదపమహీపతుల్పుడమివేలుపువృత్తమునాకలించిస।
మ్మదముజనింపఁబుత్రికలమందసుఖాంబుధినోలలాడుసం।
పదలబెసంగుఁజూచియులపట్టునఁగొండొకవాసరంబులే।
కొదువయులేనిసత్కృతులకుందగియుండిరినిండువేడుకన్॥ ౨౭.

క॥ ఈలోపలశ్రీదత్తుని। మేలుకొలుకుగాసిపడినమిత్రాళిదగన్।
గాలక్రమమునగాయము। లోలిన్మాయంగసత్వయుక్తాంగకులై ౨౮,

ఉ॥ సాదరభావమూనుసరసప్రపవసుండగుభూసురేంద్రునిన్।
గాదిలిస్నేహితుంగనుటకైచనుదెంచిరివెన్కవెన్కవ।
ష్ఠాదటసుందరీప్రియుఁడునందటికిందగుపాటిపేర్మిమ।
ర్యాదలుసల్పిడగ్గఱవయస్యులఁజేరిచేఁజెల్మిహెచ్చఁగన్. ౨౯.

మ॥ ఒకనాఁడందఱునన్నపానములసౌఖ్యోల్లాసముంగ్రోలి,య।
త్సుకతన్మేల్మిహజారమందునిజమిత్రుల్గొల్వశ్రీదత్తుఁడం।
తకసంకాశమృగాంకసంఘరణహస్తభ్రాజితుండైమనో।
వికచత్వంబునఁబల్కెనిట్లుశ్వశురోద్వేగంబుసంధిల్లఁగన్॥ ౩౦.

మ॥ కడునెయ్యంబున, మిత్రులార! మొగినాకైమీరలెంతోశ్రమం।
పడినారిప్పుడుదాననాబ్రతుకుప్రాప్తంబయ్యెఁబోమత్సరం।
బడరన్విక్రమశక్తితొంటిపస,బాల్యస్నేహమైనందలం।
వడినావైరంబునెపూనునోయిపుడుఁదద్భావ్యపారముందెల్పుఁడీ॥ ౩౧.

చ॥ అనినమహాబలుండువిషయంబులెఱుంగుటలేచినిల్చియి।
ట్లనుహితవర్య ! పేరువెలయంగమహింబ్రదుకంగఁగోరువాఁ।
డనుకొనుమాటగానిదురహంకృతిదుర్మరణంబుఁజెందునా।
తనికినినీతికెందువసుధన్బహుదూరముగాదెచూడఁగన్॥ ౩౨

మ॥ తొలుదొల్తన్నినుఁజూచియోర్వకకడున్దుష్టాత్ముఁడై పోరిలోఁ।
గెలువన్శక్యముగాదటంచువడినుక్కేలన్ధనంబిచ్చినన్।
గొలసేయంబురిగొల్పుసంగతియుమాకున్నీకుఁదెల్లంబయా।
వలనిర్భాగ్యుఁడువాఁడుపౌరజనులన్బాధించుఁగ్రౌర్యంబునన్॥ 33.

సీ॥ వారుణీపానవివర్ధమాద్యమెసంగఁదగనిశిక్షవిధించుఁదప్పుపట్టి।
స్వైరిణీకేళికాసక్తినున్మాదుఁడైపేటిబొక్కసమెల్లవెచ్చపెట్టు।
ద్యూతసమానీతదురభిమానముచేతఁబరుషవాక్యములసేవకులదిట్టు।
మృగయాపరత్వమూకీకృతకారుణ్యహృదయుఁడైచుట్టాలఁబదరినెట్టు।
గడఁగికాఁతింపఁగాపులఁగతినుఁడగుచుఁ । పౌరనారీమణులగుట్టుపాడుసేయు।
సజ్జనులనుల్లములునొవ్వఁజంపఁదివురు । రాజ్యమేలెడువానిగౌరవముఁగంటె॥ ౩౪.

చ॥ నెలకొనుమూర్ఖమన్తమమునించినచిత్తముదుర్గుణావళుల్।
గలుగుటవాఁడుచెట్టుచెడుకాలమురానొగిఁగుక్కమూఁతిపిం।
దెలుపొడసూపునన్నఫణితిందగిసత్యపురాజనీతికిం।
దొలఁగిమనారతంబుఁగడుద్రోహమతింజరియించునీచుఁడై॥ ౩౫.

క॥ అక్కుటిలాత్మకునెమ్మెయి । నుక్కఱసంగ్రామమందునోడించిధృతిన్।
జక్కఁడచుటకర్తవ్యము । వెక్కురుఁడగునరునకీభువిన్మనఁదగునే॥ ౩౬.

చ॥ అనివివరించిసర్వముమహాబలుఁడంతటఁగూరుచుండెవెం।
టనెపెరఁచేఁచురోషముదృఢత్వమునూల్కొనవజ్రముష్టివా।
కొనునిటు "మిత్రమా ! చనువుకూడదునెయిత్తఱిదాననెన్నివ।
చ్చిననుమఱిన్నిపోయిననుజెప్పకురెండవమాటదీనికిన్॥ ౩౭.

మ॥ అనిలోనేనొకచేయిచూచుటకునత్యాసక్తితోనున్నవాఁ।
డనుదుర్మార్గుఁడులొట్టిముచ్చునగువాఁడానాకునీడౌబలా।
ఘనమైనట్టికడిందిబీరమునఢాకంబాఁకితూఁటాడకుం।
డినవాపేరునువజ్రముష్టియొకొకానీగర్వముంజూచెదన్॥ ౩౮.

మ॥ అయినం బెద్దలుమామగారలుతదీయస్తోత్రపాత్రంబుగా।
నయమానష్టమొకార్యముల్ సలుపనన్యత్వంబుప్రాప్తించువా।
రియభిప్రాయము వేఁడుమన్నఁదగుభూరిప్రేమశ్రీదత్తుఁడా।
శయముంగోరెడుచూడ్కులన్నృపులపార్శ్వంబల్లనంగన్గొనెన్॥ ౩౯.

ఉ॥ బింబకిశోరసేనపృథివీపతిపుంగవులుత్తరంబుగన్।
బంబినవేడ్కతోఁబరిపంథినిగూల్చుట యందుఁగొంత సై।
స్యంబు సహాయమిచ్చెదమటంచునిజానుమతిక్రమంబుఁదె।
ల్పంబగవానినోర్చుటకుపాయమునాత్మదలంచిమంత్రియున్॥ ౪౦.

చ॥ అడవు నెఱింగి నెవ్వడిసహాయపు సేనలజోక చేసితా।
ముదిమదియుక్తియుక్తముగ ముందుఁబిఱుందఁగడిందివీరులం।
బదపడినిర్ణయించిసులభంబుగశత్రుజయంబుచేకుఱం।
గదనముసేయఁగా వెడలుకర్జమునుందలపోయుచుండఁగన్॥ ౪౧.

చ॥ కరముప్రియంబునన్ శ్వశురగణ్యులునల్లునిజూచియింకఁబై।
దురమునఁదోడవశ్యమనితోఁచినమాత్రననొక్కమాట స।
త్వరముగఁజెప్పిపుచ్చినఁబదంపడిసేనలతోడ మేము వే।
గిరముగ నేగుదెంచెదముకీసయుజాగునులేకవ్రేల్మిడిన్॥ ౪౨.

క॥ అని చెప్పఁదమతమప । ట్టణములకేగుటయునిచ్చటన్ శ్రీదత్తుం।
డనికిందగుయత్నమునన్ । మొనగాండ్రనుగూర్చుకొనుచు మోదముతోడన్ ॥ ౪౩.

మ॥ రథముల్ ఘోటకముల్ గజప్రకరముల్ ప్రాంచత్పదాతివ్రజ।
ప్రథితానీకముసందడింపననివార్యంబైనభేరీరవప్రా।
స్మథితాశాకరికర్ణసంపుటవితానంబాప్రయాణోద్ధతిన్।
ప్రథనోత్సాహము వేగిరింపఁజనియెన్ వైరంబుతోరంబుగాన్॥ ౪౪.

చ॥ చనిచనిపాటలీపురవిశంకటగోపురపార్శ్వవాటికా।
వనములయందునిండుతెగువన్ విడియించిబలంబులన్ రయం।
బునఁదెగుదాయనిష్ఠురకుఁబుచ్చెనువిక్రమశక్తిపాలికిం।
గొనకొనిభూసురుండనికిఁగూడినమాటలుచెప్పశొప్పఁగన్॥ ౪౫.

క॥ ఇత్తఱివిక్రమశక్తియు । మత్తునసభఁదీరియుండుమందిరమునరే।
కెత్తెడుమత్సరమొలుకఁగ । నెత్తగుసింహాసనంబునెక్కిబడాయిన్॥ ౪౬.

మ॥ కొలువై యుండి కెలంకులన్ సచివులుక్కున్ గర్వమున్ దుర్నయో।
క్తులు నేపారఁగఁ గొల్వవారిఁగని పల్కున్ ॥ మంత్రులారా! వ్యథా।
కలితస్వాంతుఁడనైతిఁ గారణముషః కాలంబునన్ నేఁడు నేఁ।
గలకంటిన్ వ్యతిరిక్తమయ్యెనదియుంగర్తంబు సెట్లున్నదో॥ ౪౭.

శా॥ నా చేఁజచ్చినకాల నేమియును దన్నారీశిరోరత్నముం।
బ్రాచుర్యోగ్రతనన్నుఁ జూచియులుకంబాపాత్మ కాదుగ్మతీ।
నీచా! మమ్ము వధించినట్టిఫలమున్ నీవింకగ్రైకొమ్మురే।
పేచంపున్నినుమత్కుమారకుఁడనిన్ బ్రేరేచుశౌర్యంబునన్॥ ౪౮.

క॥ అనిపల్కుమల్కఁపడిగ్ర । క్కునమేల్కనిపడకవిడచికుందితినాకీ।
వనటుకుపశాంతులనుమీ । రొనరుపుఁడీశాస్త్రవిదులయూహలుగొనుమన్॥ ౪౯.

చ॥ అనివచియించు చుండు సమయంబునఁ గంచుకివచ్చిస్వామిద।
ర్శనమునకెవ్వఁడో యొకఁడు చాలఁగ వేడుచునున్న వాఁడుమీ।
యనుమతిఁ గోరవచ్చితినటన్న మహీపతియాజ్ఞ మీఁదఁజ।
య్యనఁజను దెంచెలోపలికినప్పుడనిష్ఠురకుండు గండఁడై॥ ౫౦.

క॥ చను దెంచిమహీ కాంతుని । గనుఁగొనిమగటిమియునిండు గౌరవమెసఁగన్।
దనమిత్రునివచనంబుగ । వినిపించెను సభ్యులెల్ల వెఱగుపడంగన్॥ ౫౧.

శా॥ఓరీవిక్రమశక్తి! చిన్నతనమంకోడించు టేగాదురా।
రారాయిప్పుడునీదు వైరమునుగర్వంబుంగనన్ వచ్చితిన్।
శూరుండున్ముఖుఁడౌ చుశత్రువులనోర్పుంగానినీమాడ్కినీ।
ర్జ్యారోద్రంబున నాలిముచ్చువలెనన్ జంపంగ యత్నించు నే॥ ౫౨.

క॥ ఇదివినివిక్రమశక్తియు । వదనంబునఁ బొగలుగ్రమ్మువడువునదోఁపన్।
బొపలెడు నాగ్రహమునఁగ్రీ । బెదవిన్నొక్కుచుఁగరంబుబిగ్గఁ బలుకున్॥ ౫౩.

క॥ ఏమేమీ! శ్రీదత్తున । కాముండలకెక్కె నోభళా మంచిదితేయుం।
దేమార్గాలము చెంగట । నేమంబునఁదగు నెయోలుకచెల్లాటములున్॥ ౫౪.

మ॥ తరమున్ యోగ్యతనెంచకుండఁగడునిర్దాక్షిణ్యముంబూని మే।
దురదర్పంబునఁగన్ను గానకరణోద్యోగంబునన్ వచ్చిము।
ష్కరభావంబునఁజేతగానిపిఱికిన్ సాధించుటం బోలని।
ష్ఠురకుంబంపెనునిష్ఠురోక్తులకుఁజోటుంజూపిదీపింపఁగన్॥ ౫౫.

సీ॥ క్షత్రియుండను నేనుచవిటిబాఁపఁడువాఁడుతారతమ్యములేదొశూరులార।
రాజ్యాధిపతి నేనురజ్జులాఁడలవాఁడుతారతమ్యములేదొవీరులార।
సైన్యనాథుఁడ నేనుసడిసనాథుఁడువాఁడుతారతమ్యములేదొధీరులార।
కోటీశ్వరుఁడ నేనుకుక్షింభరుఁడువాఁడుతారతమ్యములేదొపౌరులార।
వట్టిడంభముప్రకటించువానినోర్చు । లెంతమాత్రములెందుసామంతనృపులఁ
వోడుపడు నాజ్ఞపంపుడుతొడరుఁడనుచు । జృంభణంబునయుద్ధసంరంభమడర॥ ౫౬.

మ॥ సరగన్ లేచిచమూసమూహముప్రశస్తప్రక్రియంగుంతతో।
మరబాణాసనఖడ్గసంఘటనభీష్మంబౌచు నేతేరఁగ్।
పురవాటీవిలసద్వనీతతిపురోభూమిన్ వడింజేరిభీ।
కరుఁడైవిక్రమశక్తిశాత్రవులపైకందాఁకెఁగోపోద్ధతిన్॥ ౫౭.

క॥ ఇరుమొనలుందలపడసం । గరమునకుఁబ్రతాపకలనఘనమయ్యెఁబర।
స్పరనాశహేతువగునా । దురముమహారుధిరసిక్తదుర్భరమగుచున్॥ ౫౮.

సీ॥ కఱుకుటమ్ములవొమ్మిగావింపఁబేరెదల్ చిరిగికాల్బలములుచేవదొఱఁగ।
వాఁడికత్తులవేట్లకూడితొండములనెత్తుటఁదోఁగియేనుఁగుల్ త్రుళ్లిపఱవ।
గాటంబులగునీఁటెపోటులనాయుముల్ నొచ్చినగుఱ్ఱాలుచచ్చిపడఁగ।
టెక్కెముల్ విఱిగిచూటికిఁజక్రములునేలఁగ్రుంగినబలుతేర్లుగూలుచుండ।
మొనసియెదిరించిబెదిరించిపోటుమగలు । కసిమసంగినదయ్యాలకరణిఁబోరి।
రుగ్రముగనిట్టులిరువాగునుక్కుమిగులు । నపుడువిక్రమశక్తిసైన్యాగ్రమందు॥ ౫౯.

క॥ నెట్టుకొనివచ్చిముంగల । బిట్టడరుచునిల్చిరోషభీషణభంగిన్।
గట్టెదుటభూసురుంగని । గట్టిగవినవచ్చునట్లుకడిమింబలుకున్॥ ౬౦.

ఉ॥ పోకిరిబాఁపఁడా! యెదిరిపొంకమెఱుంగకపోరనీవుము।
కాకలుతీఱినట్టిమొనగాడవొ బాపురె! తోడిబాపలన్।
దాఁకఁగనీదుశౌర్యములుదక్షిణలిచ్చెడుచోటఁజెల్లునే।
గాక, భయంకరాహవముఖస్థలిఁజూపఁగవచ్చునెట్లురా॥ ౬౧.

ఉ॥ నావుడుభూసురుండునుమనంబునరోషము రేఁగ నోరి! నీ।
కావరమేమిసెప్పనిటఁగాఱరపుల్ పనిసేయఁజాలునే।
రా! వృథగాక, ప్రల్లదములాడకనిల్వుముచాలునింకనిన్।
లావఱునట్లులిప్పుడయలంతిశ్రమంబుననేలఁగూల్చెదన్॥ ౬౨.

మ॥ అను మన్ ఘోరమృగాంకఖడ్గముదగన్ హస్తంబునందాల్చి గ్ర।
క్కునసింగంబుమదావళంబుపయిసక్రోధంబునన్ దూఁకుచా।
ద్భుననావిక్రమశక్తిపైకుతికిబల్ పూన్కిన్ శిరంబొక్కటన్।
దునియన్ ప్రేసెవిరోధిసైన్యమడలన్ దోశ్శక్తిశోభిల్లఁగాన్॥ ౬౩.

ఉ॥ అంతటబాహుశాలిరయమారఁగఁజేరవకేగిచూపటుల్।
వింతగఁజూచుమండనలవిక్రమశక్తికిరీటమూడ్చితా।
నెంతయువేడ్కన్స్నేహితుమహీపతిఁజేయఁగసైన్యమండలం।
బంతయునుబ్బెభూసురవరాంగముదానసలంకరించినన్॥ ౬౪.

క॥ సుమవర్షముగురిసెను మొగి । నమరీసంగీతనాదమమరఁజెలంగెన్।
గ్రమముగఁగయ్యమునిలిచెను । దమమిత్రునితోడహితులుడగఁబల్కిరిటుల్॥ ౬౫.

ఉ॥ భూసురవంశవర్ధన! రిపుప్రకరంబుహరించితింక నీ।
కీసుహృదన్వయంబుభరియించెదుభారముపచ్చెఁ, జూచితే।
యీసువఁగార్యసంఘటనమెందునుసాగకకీడెమూడె, నెం।
తేసుమనోవిలాసమునవియ్యలనేలుము పత్యసంధతన్॥ ౬౬.

చ॥ అనవుఁడుభూసురేంద్రుండుసహర్షతమిత్రులఁజూచిపల్కినా।
యనుఁగువయస్యులార! తమయండతిసాయముచేతఁగాదెయీ।
కవదుసరాజ్యసంపదలుగల్గుటచేకుఱెఁగామినీమణుల్।
దనరఁగభార్యలైరిమటిదాల్కనిమార్తురనోర్వఁజాలితిన్॥ ౬౭.

సీ॥ కోపశీలురమనస్తాపంబుఁబోకార్చుఁబసిపాపఁబోలెసంతసముఁగూర్చు।
సరిలేనికరుణారసంబుఁజిప్పిలఁజేయుఁబడువానికెనలేనిప్రాపొసంగుఁ।
గల్మిలేములభేదముల్మదినుంపదుతోడివారలనెప్డుమాఱనిడదు।
కాలవైకల్యంబుజోలికేగదుమహాసౌభాగ్యములనైనసరకుగొనదు।
తల్లిదండ్రులప్రేమముల్ దవులుగొల్పు । బంధుజనములపేర్మిఁబైపైచిగిర్చు।
మనమనోవ్యాధికినిమేల్మిమందుగాదె । వరసుహృచ్ఛక్తినెన్న నెవ్వారివశము॥ ౬౮.

సీ॥ కోరంకిసుబ్బమాంబారుణాచలశాస్త్రితల్లజులకుజ్యేష్ఠతనయుఁడఖిల।
బుధనిధేయుఁడుకొండుభొట్లసుబ్రహ్మణ్యశాస్త్రికవ్యాజశిష్యప్రవరుండు।
వైజయంతీభవ్యపత్రికాధిపుతనూజునికూర్మిఁగృతకృత్యశుభయశుండు।
కుప్పుదయాఖ్యుఁడునేర్పుకొలదిశ్రీదత్తచరిత్రంబునర్పించుమిత్రతతికి।

అగ్నిసంస్కారమొందినహాటకంబు । పగిదిఁదగ్గుకసంస్కృతులఁ బడసినట్టి।
కానిపాత్రంబువిబుధసన్మానమంది । విదితసర్వజ్ఞకృపచేతఁ వెలయుఁగాత॥

గద్యము॥ ఇది శ్రీకుప్పుస్వామిప్రణీతమైన శ్రీదత్తచరిత్ర తృతీయాశ్వాసము సర్వంబును సంపూర్ణము.

---

VYJAYANTI SERIES No. 7.

SREE

# CHANDRAHASA CHARITRA

BY

BRAHMASREE

SALAPAKA VENKATASURYA PRAKASA PRADHANI GARU,

Telugu Pandit, American Evangelical Lutheran Mission Lower Secondary School,

PEDDAPURAM.

A Reprint from Sree Vyjayanti.

1895

VYJAYANTI PRESS,

Egmore, Madras.

శ్రీరస్తు.

శుద్ధాంధ్ర నిర్వచన

# చంద్రహాస చరిత్రము.



క॥ వెలిదీవిపాలెగాఁడా । చలువలగాపాన్పుసోఁగసిరిచెలికాఁడా।
మలఁదాల్చుదుండగీఁడా । తొలిజాతితుపాసిఁగన్నతోఁగపుఁబోఁడా॥ ౧

తే,గీ॥వినుముచంద్రహాసునికతఁ దెనుఁగుబాస । నీదు పేముడికలిమినినాదరువుగఁ।
జేసికొనిపద్దకబ్బముఁజేయఁగడఁగి । నాకుఁగానియంతకవిద్దనాకులేదు॥ ౨

క॥ సిరికిరవైతెలుఁగింటుల । పురికిఁబొయిసచ్చక్రసముపెంపుముతోవై।
పరగెడుకేరళమునులా । వరియగుసుమతియను ఱేఁడువాసిగనేలున్॥ ౩

క॥ ఆతనికిసంతులేకను । నాఁతియునుందానుఁదిగులనచ్చికతోడన్।
వ్రేతలమేలుతుపాసిని । నీతముతోఁబత్తిగొడుచునెఱిఁగొలుచుంగన్॥ ౪

సీ॥ సుమతికిఁజంద్రహాసుండను నొకపట్టికలిగెనుమంచివైనగాములుండె।
గాములుండెడుతీరుఁగనుఁగొనిజోస్యులెబ్బుడుతఁడుగొప్పఁగాబూమినేలు।
ననుచుఁజెప్పిరిగానిమతఁడుపుట్టినకొన్నినాళ్లకేయొకదాయినడికిరేయిఁ।
జనుదెంచితండ్రితోననిఁజేసిమతినినిసేనతోఁజంపుచూగానిఁగొనియె।
మగఁడుచచ్చినమగునయ్యుమ్మగ్గనలయు । నసెడమప్పటివాడుకగొనుచుఁదల్లి।
దండ్రితోఁగూడెస్రమందెనుదయ్యమెంత । మనముతేనట్టినాఁడొయీబిడ్డయందు॥ ౫

తే,గీ॥తల్లిదండ్రులుచన్నసుదాదివానిఁ । బెనుచుమందెనుదనయింటఁబేర్మినైన।
నెప్పుడైననుబగిలచేముప్పువచ్చు । నేమొయనివానినటనుండినెగులుపెంది॥ ౬

ఉ॥ అంతటదాదియాబుడుతనక్కసనుంచకఁకొంచుఁబోయితాఁ।
గుంతలబూమిఁజేరిమటఁగుఱ్ఱనిసుద్దులనేరికైనన।
వంతయువెల్లడింపకయపాఁచిపనుల్దగఁజేసియెంతయో।
వింతఁగవానిఁబెంచుచునువెళ్లఁగఁబుచ్చుచునుండెరోజులన్॥

తే,గీ॥ అట్లుమూఁడేండ్లుకడచినయవలనదియు । నీనిసువునాదరువులేనివానిఁగాఁ
[illegible] । నిఁక [illegible]

తే.గీ॥ సూనరిని రాఁబనిచియాడుచుండునట్టి । చిన్నికుఱ్ఱని జూపించి చిట్టచివికి ।
సొరులకంటను బడకుండ సాగవీని । దీసికొనిపోయి మడియించి తెమ్ము గుఱుతు॥ ౧౭.

మ॥ అనుచుం జెప్పఁగ మంచిదంచు నట నేయాఁటూఁడు నప్పాపనిన్ ।
దినుబంధుల్గొని తెచ్చియిచ్చెద ననెం తేనేగ రమ్మంచుఁ బి ।
ల్చిన నాసన్నన వెంటవచ్చి చిఱుతజ్జైవట్టియు కాన్కనకున్
గొనిపోసూనరిఁ జూచి పల్కె నిటులా కుఱ్ఱండు నా సొంబు గాన్॥ ౧౮.

తే.గీ॥ ఆఁటలాఁడుచునుండంగ నాసఁగొల్పి । యింతిపవ్వగఁ గొనివచ్చితీవు నన్నుఁ ।
బండ్లచె ట్లేవి యనుచు నంటఁబలికిచటను । నిఁక నుగొనిపోవుచుంటి నేయెందుకొఱకు॥ ౧౯.

క॥ అనవిని సూనరతనయొఱ । నని వినయాయుడిమునూసియుక్కలుఁ బొగుచున్ ।
గను లెఱ్ఱఁజేసి తలకా । యనుపెఱుగి నెబ్బాసఁ జూచి యానిసునంతిన్॥ ౨౦.

క॥ వెలవెలఁబోవుచుఁ గన్నుల । నిడిసిపడుచును దునీటులే క్లిపాఱన్ ।
మిడుకుచు నాలుక తోఁబడ । వెవిలుకుని యనుగుణించి వేడఁగఁ దొడఁగన్॥ ౨౧.

ఉత్సాహ॥ పసిగవారి కొనిసొమ్ముఁ బక్కసొని తేజియున్ ।
గసుసు వాలుఁగడిఁదబూనగొమ్మువడుగు చెమ్మయున్ ।
వెడఁదయొదఁగలిమికొమ్మ నెల్లఁ గిపివిడిదియున్ ।
గడిమిఁగలుఁగి వెలుఁగు మేటి కావుమయ్య నన్నిటన్॥ ౨౨.

క॥ అని మొఱలిడఁ గావనియా । కనికనసంప్రదంపు నెపొదఁగల వన్నుఁజూచి ।
య్యన నాకటికుని యుల్లం । బును మార్పఁగ మదిగరంగి చాఁడమినఁ జేర్చెన్॥ ౨౩.

శా॥ వానిన్జంపఁగ బుద్ధిపుట్టక మది న్వాఁడిట్లు కుందెన్నతం
బే నేరంబును లేని వీనితల నే నేలాఁగునుగ్గాడుగున్ ।
వీని న్మ్రింగఁగఁ జేసి గుర్తుతనకు న్వేఁ జూపుమీయంచు నా ।
తో నెయ్యంబున నన్నుఁ బెగ్గడకు సంతోసంబు నెట్లిచ్చెదన్ ।

చ॥ అనితలపోసియాకటికుఁ డప్పుడె కుఱ్ఱని మేను సంతసించియున్ ।
జనువున నంటి చూచి యొకచక్కనిఁ గాలికి నాఱువ్రేళులుం ।
టను గని సంతసించుచుఁ గటారిని నాఱవ వ్రేలుఁ గోసి పం ।
య్యనఁగొనిపోయి పెగ్గడకు నప్పనఁ జేసెను మెప్పుఁ బొందఁగన్॥ ౨౪.

క॥ వ్రేలుం గనుఁగొని మంతిరి । చాలఁగను బ్బొంగి కటికుని దురతనమునన్ ।
మేలుగఁ బొగడుచు వానికిఁ । బాలిడు నెను మొక్కటిచ్చి పంపెను బసకున్॥ ౨౫.

తే.గీ॥ అంతన సెవిని సొక్కఁ డైయాబుడుతఁడు । కాలి నెత్తురు చూచుక గోలుగోలు ।
మనుచు నేడ్చును నేలపై నటులనిటుల । దొరలుచుండెను బాదకుఁ దెరపిఁగనుక॥ ౨౬.

సీ॥ కుంతలపబువునకుంగప్పముసుగట్టుమన్నీలుగొందఱుమత్తగిల్లి।
తేనియానతికై నలోనుగాకనుగరువంబుచేఁబన్నీకపరగుచుండెఁ।
బెనకువందునవారిపీఁచమునడఁగించిపన్నులుగొనిరాఁగఁబబువునానఁ।
బఁపెసిమంతిరిదండువెడలఁగనేగిపన్నీనిమన్నీలమానానములను।
బెనకువలఁజేసికైకొందుమనుచుఁజాటఁ । బనుపనాలించిమన్నీలువారివారి।
దళములనుగూర్చుకొనివచ్చిబలిమిఁబోరి । సాగనంపిరిమంతిరినాగడియనె॥ ౩౬.
తే,గీ॥అకబురువినియాచంద్రహాసుఁడయ్యె । దండుతోనేగిమన్నీలగండడంచి।
వారియాంధ్రనుగొడుకులగోరమైన । చెఱలఁబెట్టించిసొత్తెల్లసేకరించి॥ ౩౭.
తే,గీ॥వేగనింటికివచ్చియావితమునంత । విన్నవింపఁగుళిందుఁడువేడ్కతోడఁ।
జంద్రహాసునిమగటిమిఁజాలఁబొగడి । యతఁడుతెచ్చినసొమ్ములోనరఁగొనిచని॥ ౩౮.
తే,గీ॥మన్నెదొరలనాకొమరుండుమడియఁజేసి । కొల్లగొనినటువంటిసొమ్మెల్లనిదిగొ।
యనుచుమంతిరిముండటనునుపనుబ్బి । యతఁడుప్రొగడెఁగుళిందునినచ్చెరువుగ॥ ౩౯.

కవిరాజవిరాజితము.

అటుగొనియాడినమీఁదటమంతిరియాతఁడుతెచ్చినరొక్కములోఁ।
దటుకునసామునుదానిడుకొంచునుదక్కినసామునునేలికచెం।
గటికదనంబగువేడుకతోడనుగ్రన్ననఁదీసుకపోయియిడన్।
నెటుగొనివచ్చితివెక్కడిసొమ్మిదియేర్పడఁజెప్పఁగదోయియనన్॥ ౪౦.
ఉ॥ ప్రెగ్గడతేనికిట్లనియెవిక్కచునుండెడుమన్నెగాంధ్రడవే।
ర్మగ్గఁగఁజేసిసొత్తులనుమానకదోచుకరమ్మటంచు నే।
లగ్గుగఁజెప్పనాదిగువలావరియొక్కఁడుతెచ్చెఁబన్నుగా।
దిగ్గనదీనిఁగొండనినఁదేఁకువఁబంటవలంతితేఁడనున్॥ ౪౧.

చామరము.

పెక్కుసారులీవనాదుబీరమైనదండురా।విక్కచుండుమన్నెగాంధ్రఁబీచముద్పనేగిపెం।
పెక్కగెల్వలేకయోడిబేలవైతివప్పుడా । యుక్కుతున్నయొక్కడుండెనూఁపకిప్డుచెప్పమా॥
చ॥ అనవినిసామి! యిందనుకనయ్యయితేఁపలుమన్నెగాంధ్రచే।
తనుదగనేనయోడుటనుదాకొనెబల్బిడియంబునాకుఁగ।
ల్గినబిడియంబుదయ్యమిదెగేటపఁగింపుచునన్నుఁగాచెనాఁ।
బనివడిగారవించియునెఁబంటవలంతిపబుండువెండియున్॥ ౪౩.
క॥ అనిలోనగెల్చుకొనివ । చ్చినమానానములునీవుసేమముగాఁగై।
కొనుమనిసెలవిడమంతిరి । సనియందుఁగుళిందునకునుసామిడిపనిచెన్॥ ౪౪.

తే,గీ॥ చంద్రహాసుండును మిగుల సంతసమున । వారువము నెక్కి పోవుచు దారియందు।
మంచిసకినాలె తాఁ గనుఁగొంచునుండె । నవ్వినుడివెదడిగువను మొవ్వముగను॥ ౧౪.

క॥ ఇలువిడిచి వెడలఁగా సం । కులుమద్దెలతుడుము మొదలుకొను వాయిదము।
ల్సెలఁగఁగఁ బెండ్లముతోఁ బెం । డిలికొడుకొక్కరుఁడు గీము డిగ్గునఁ జేరెన్॥ ౧౫.

తే,గీ॥ అప్పుడేయీనినటువంటి యావునుబసి । దూడతోఁ దనగుడి సెకుఁదోలుకొనుచు।
వెళ్లుచుండెను సెకగొల్లపిల్లవాఁడు । సాదుసకినంబులివి యకాజగములోన॥ ౧౬.

తే,గీ॥ ఇట్టిసకినాలుగనుఁగొంచు నేగికుంత । లమునకసదుబవ్వనను బుప్పములతోఁటఁ।
గనుఁగొని యలఁపుదీరిచికొననటఁజని । తురికి సెకచెట్టునీడను దిరుగవిడిచి॥ ౧౭.

తే,గీ॥ తాను సెకచెట్టునీడను వేనిదురను । బోయెనల్లదిమంతిరిపూలతోఁట।
యగుటనాతనికొమరితయగువిషయయూఁ । బబునికొమరితయైనచంపకవతియును॥ ౧౮.

క॥ తమతమచెలికత్తెలతోఁ । దమకకయాఁటలను నాడఁదలఁచియటకునే।
మముగాఁ జేరవిషయపు । ష్పములను నొడినింపఁబుణికిపసదనములుగాన్॥ ౧౯.

తే,గీ॥ కొన్ని చంపకవతికిడి కొన్నియాపె । మీఁదఁ గుప్పలుగాఁ జల్లి మేలుమగని।
నీవుతురితమపెండ్లాడి నెఱిసిరులను । గలిగిమనియెదుగాకనిపలికెనంత॥ ౨౦.

తే,గీ॥ రాచకొమరితవిషయనుజూచి నీమొ । గమునఁదోఁచుసోబనలచ్ఛనములునూడ।
నేఁడె నాడెంపుమగనిఁ బెండ్లాడెదనుచుఁ । దోరముగ నాకునిప్పుడేతోఁచెననియె॥ ౨౧.

క॥ ఈలాగున నొండొరువులు । వేళాకోళంబులాఁడి వేసరియుండన్।
గేళాకూళికిఁ జనియెను । నీళులు గ్రోలంగవిషయ నెఱిదగఁగొనుటన్॥ ౨౨.

మహాస్రగ్ధర॥ చనికాంచెన్జెట్టునీడన్ సతముబడలికన్ జాలఁగూర్కొన్నవానిన్।
బెనుకాఁకల్దీరివన్నెల్పెరుగుపసిఁడినా వెల్గుమైచాయవానిన్।
బును కేకంచంబుగాఁగన్ బ్బెలుచుదొరసికన్బువ్వుఁబోల్మోమువానిన్।
దు నెదారుల్బత్తిమొక్కన్దొడఁగ నెఱుపుగాఁదోఁచునద్గుల్లలానిన్॥ ౨౩.

క॥ కనుఁగొనఁగ వానియందము । తనడెందముఁగొంచుఁబోవఁ దానుంజనియా।
తనియొడిలో నెకకాకిత । మునుగనుఁగొనియందుఁ దండ్రిమొహరుండుటచేన్॥ ౨౪.

క॥ అదితనదునన్నగారికిఁ । బదిలముగానప్పగింపఁబడవలసినదై।
యొదవుటచేతనుదనయయ । యదివరలోనన్నమాటయాదియగుటచేన్॥ ౨౫.

తే,గీ॥ సోబనపులేకయీయది చూడననుచుఁ । జంద్రహాసుని మేల్కొల్పఁజాలకప్పు।
డతనియొడినుండునట్టి కాకితమునుగొని । సరగవిప్పి కడవఱకుఁజదివిచూచి॥ ౨౬.

సీ॥ ‹‹ సిరియును గొడుకులుఁ బరగఁగోడండ్రును మనుమలు మనుమరాండ్రనువుమీఱ।
మదనునకుఁ బొనరిమనుగాత యెప్పుడీజాబును గొనివచ్చుచంద్రహాసుఁ।

డనువీఁడునిక్కముగనమిత్రుఁడగునాకునాసొత్తుఁగైకొనునానఁజెందెఁ।
గనుకనువీనిజవ్వనముమొగముతేఁటఁగనినాతలఁపుసరియనితలంచి।
గొప్పవాఁడాయితఁడులేకకొలఁదివాఁడ । సత్తిగలవాఁడలేకనుసత్తిలేని।
వాఁడమొఱకుఁడమొఱకుఁడుగాఁడయనెడు । వెసనముఁగొనకవీనికివిషమునిమ్ము॥ ౨౨.

తే,గీ॥ అనెడుమాటలఁబలుమాఱులనుజదువుచు । నబ్బకక్కటికములేమిఁకబ్బురంబు।
నొందివానియందముఁగనియొబ్బివిషయ । యిటులసవరించెలేకలోఁగిటుకుమీఱ॥ ౨౩.

సీ॥ "సిరియునుగొడుకులుఁబరగఁగోడండ్రునుమనుమలుమనుమరాండ్రనువుమీఱ।
మదనునకుఁబొనరిమనుగాతయెప్పుడీజాబునుగొనివచ్చుచంద్రహాసుఁ
డనువీఁడునిక్కముగనెమిత్రుఁడగునాకునాసొత్తుఁగైకొనునానఁజెందెఁ
గనుకనువీనిజవ్వనముమొగముతేఁటఁగనినాతలఁపుసరియనితలంచి।
గొప్పవాఁడాయితఁడులేకకొలఁదివాఁడ । సత్తిగలవాఁడలేకనుసత్తిలేని ।
వాఁడమొఱకుఁడమొఱకుఁడుగాఁడయనెడు । వెసనముఁగొనకవీనికివిషయనిమ్ము"॥ ౨౪.

ద్విపద॥ అటుదిద్దితనవ్రేలినమరెడుతండ్రి । బటువునసీల్వేసిపదిలంబుగాను ।
మునుపున్నతీరునఁబొలిచెడులాఁగు । నునిచితానాడెదునువిదలఁజేర ।
రాచకొమరితయాపెఁజూచియిట్లనియె । నోచెలియ! విషయ! యోడకనీదు ।
మొగముఁగనుంగొనముద్దులుగుల్కు । మగవానినెక్కనిమరులుకొన్నట్లు ।
జాపెబయల్పడసాగెనమ్మేలు । జాడనాకునుజెప్పిచనవలెనన్న ।
చిఱునవ్వునవ్వుచాచెలియనువిషయ । మఱపించెవేఱొక్కమాటసందడిని॥ ౩౦.

పద్మనాభవృత్తము.

వారట్లుపూఁదోఁటయందాఁటచాలించివైళంబయేరిండ్లకున్వారువోగా।
నారాచజాబిల్లియాచంద్రహాసుండునారాటముంజెందిమేల్కాంచిబాబా।
పైరాణగానెక్కిపేరెంబుపారించిబాగొప్పనవ్వీటఁదాఁబోవుగీముక్।
చేరంగలోనుండికన్గొంచుఁదానంతచిప్పిల్లుసంతోసఁపుస్సోముతోడక్॥ ౩౧.

తే,గీ॥ మంతిరికొమరుఁడైనట్టిమదనుఁడెదురు । చనియపుడెతోడుకొనివచ్చిచంద్రహాసుఁ
గూరుచుండంగనేమింపఁగూరుచుండి । మంతికొసఁగినజాబిచ్చెమదనునకును॥ ౩౨.

తే,గీ॥ "మదనుఁడద్దానిఁగైకొనిచదివిమిగుల నంబరంబునుబీతునునంతనంబు।
నచ్చెరియమునుగొనియయ్యయానదాట । గూడనిదిగానెయున్నదిమూపనిట్లు॥ ౩౩.

తే,గీ॥ గొప్పవాఁడాయితఁడులేకకొలఁదివాఁడ । సత్తిగలవాఁడలేకనుసత్తిలేని।
వాఁడమొఱకుఁడమొఱకుఁడుగాఁడయనెడు । వెసనముఁగొనకవీనికివిషయనిమ్ము"॥ ౩౪.

క॥ అనియుండెఁగనుక ప్రొద్దును । జనజేయక పెండ్లి వేగ సలుపవలెనటం।
చునుదలఁచి యప్పుడే జో । స్యుని బిలిపించి యడుగఁ గంగ జోస్యుం డంతన్॥ ౭౫.

తే.గీ॥ చంద్రహాసుని చుక్కయు సరగ విషయ । చుక్కయు నడిగి తెలుసుక లెక్క చూచి।
తగిన ముహూర్తము నేటి సందెకె కుదిరె । ననుచు నుడువ విని మదనుఁ డాతురమున॥ ౭౬.

తే.గీ॥ పెండిలికిఁ దగునట్లు గావింపవీధు । లన్నియును నుదనయిల్లును వన్నె మీఱఁ।
బలు దెఱంగుల గైసేయఁ బౌరు సత్య । కాంక్ష నేమింపవారట్లు కడఁగి చేయ॥ ౭౭.

క॥ మదనుండు తండ్రియానతిఁ । గొదలేకయొనర్చి యయ్యకుం దెలుపంగా।
మదిఁదలఁచి నాఁడు గావున । గుదెఁదాలుచు వాని తండ్రి గ్రుంకకమున్నే॥ ౭౮.

తే.గీ॥ అప్పడంబులు వడియంబు లటుకులుఁదగు । పప్పులును బిండివంటలు మేలొప్పకూర।
గాయలూఱుగాయలు లోనుగగల పెండ్లి । పనులనన్నియుఁ జేయించె వడిగనంత॥ ౭౯.

క॥ తొగసూడు గ్రుంకెఁ దమ్ములు । మొగిడెనిరులు గ్రమ్మెరిక్క మొత్తపు పొడమెన్।
దిగ కానితపసి కంటఁగ । లిగినతు పాసితగ మింటరేకవడువునన్॥ ౮౦.

క॥ అప్పచను దేరఁ బెండ్లికిఁ । దప్పక పనిచెఱుపగునని తలఁచి విషయయున్।
జిప్పిలుసంతోసంబున । నప్పుడె గైసేఁత చేతనలరె సొగసుగా॥ ౮౧.

క॥ సొగసరి పెగ్గడకూఁతురు । నగు విషయం బెండ్లియాటనగు గైసేఁతన్।
దగఁ జంద్రహాసుఁడెంతయు । వగకాఁడై కొలపుటొజ్జపనుపుఁబడయుచున్॥ ౮౨.

క॥ ఎడలేదులగనమనుచున్ । బుడమి మినుతెరువరులనఁగ ముత్తైదువరాం।
డ్రెడసేయకఁ గొనివచ్చిరి । పడఁతిని బెండిలికొమరునిఁ బజ్జ కెలమితోన్॥ ౮౩.

తే.గీ॥ అట్లుగొనివచ్చి పెండిలియరుగుమీఁద । వఱలు సోబనపుటుదుటు పైఁడిపీఁట।
మెల్లఁగూర్పుండఁ జేసిరి యెల్లకడల । దివ్వటీలును దివ్వెలుఁ దేజరిల్ల॥ ౮౪.

ఆ.వె॥ అప్పుడొజ్జబాపలయ్య పేరును దాతి । తాతతండ్రి పేర్లుఁ దగఁగఁ జెప్పు।
మనఁగఁ జంద్రహాసుఁడెనెదయ్య ముదినాగ । వేఱయేరు నాకులేరటంచు॥ ౮౫.

క॥ అనఁగా నియోగికొమరుఁడు । తనయయయానతిని మదినిఁ దలఁచుక యబ్రం।
బును బొందియింకనేమియు । తనినడుగక పెండ్లిజఱుపఁ దగునని పలుకన్॥ ౮౬.

తే.గీ॥ బాఁపనయ్యలు ప్రామిన్కు పల్కులోలిఁ । జదివి కొంచును దీవెనల్ చాల సొనఁగి।
చంద్రహాసుని చేత విషయయుతను । దాళిఁగట్టించిరట వాయిదములు సెలఁగ॥ ౮౭.

కవిరాజవిరాజితము.

మదనుఁడు పెండ్లికి వచ్చినవారికి మన్ననగందమునత్తరువున్।
బదపడి పువ్వులదండలు కప్పురపుఁబాగలొసంగెను బాఱులకున్।

జదువులమెట్లకునట్టువగాండ్రకుఁజాణలకున్దగాణలకున్।
గొదుగకయిచ్చెవరాలనుహత్తులుగుఱ్ఱములున్దెసెపవుల్గొహారీల్॥ ౯౮.

క॥ ఆపీటిదచ్చికడలం । దీవితమంతయును దెలిసియొస నెడను బజల్।
వేవచ్చియిచ్చుచుండిరి । దీవెనలాలికిమగనికిఁదిరమగుమదితోన్॥ ౯౯.

సీ॥ ఇటనిట్టులుండఁగానటఁగుళిందునివీట నుండినమంతిరి మెండుచలము।
బూనికుళిందునిచానలతోఁగూడ చెఱయందుఁబెట్టించి సేవనడచి।
వానిరాచరికంబుతోనసాత్తంతయు నెరునకు నెకనికి నెసఁగియంతఁ।
బోనీకయాతనియానకులోనయి యుండుదిట్టల నెల్లగండడంచి।
చంద్రహాసునిఁజంపితిసాటిరొవరు । నాకనుచువిఱ్ఱవీగుచు వేఁకుసంత।
నమునసఱ్ఱవీడువీడుచుసరగఁదనదు । వీటికే తెంచితనయింటివీదిలోన॥ ౧౦౦.

ఆ,వె॥ పెండ్లిపందిరియును బెల్లువాయిదముల । నట్టువంబు సేయునాఁతిగములఁ।
బసదనంబులందివెసఁజనుపాఱులఁ । గనుచునిల్లుసొచ్చెఁగడునెగులున॥ ౧౦౧॥

ఆ,వె॥ ఇంటఁజొచ్చుతన్ను నెదురుకకొనివచ్చి । కూరుచుండఁజేసికూర్మితోడఁ।
జాలదీవెనలిడు నేలవేలుపుటిండ్లఁ । జావమోదఁదొడఁగఁబోవనంత॥ ౧౦౨.

ఉ॥ కొందఱు నేలపైఁబడిరి కొందఱుపాఱిరి గోఁచులూడఁగాఁ।
గొందఱుమూలమూలలనుగొబ్బునడాగిరికాళ్లదబ్బలన్।
గొందఱుదొర్లి గిల్లుచునుగుయ్యిడుచుండిరి చూసనందఱున్।
జిందఱవందరై రచటఁజేరినవారలుబీతునొందుచున్॥ ౧౦౩.

తే,గీ॥ అంతమంతిరిమదివ్రాయియటమరిలుచుఁ । గూరుచుండిపూఁబోఁడులుగొంద టలమి।
నారతులనిచ్చుచుండంగనట నెయున్న । చంద్రహాసునివిషయానుసరగఁజూచి॥ ౧౦౪.

చ॥ పటపటపండ్లుగీఁటుచును బల్మఱుకన్నులనగ్గిరాలఁగా।
నటునిటుచూచుచున్ గొడుకునక్కసెఁగానకలోనియింటికిన్।
దటుకునఁబోయిబిడ్డఁగనిదగ్గరిబిగ్గరయోరికూళ! యొ।
క్కటివయిరోరియానినిటుకర్జముసల్పితిబీతినొందకన్॥ ౧౦౫.

తే-గీ॥ వీనిఁజంపుమటంచును నేను వ్రాయ । వీనికే నాదుకొమరితఁ బెండ్లిఁజేసి।
నావుమొఱకుఁడ! యీగిని నాదుసొమ్ము । వమ్ముచేసితిగద యనివదరనతఁడు॥ ౧౦౬.

క॥ అయ! నీదుజాబుపనుపున । నియకొంటిని బెండ్లికర్జమిటుసలుపంగా।
నయమొప్పఁగఁగనుమిదియని । యయచేతికిమదనుఁడిచ్చెనాజాబంతన్॥ ౧౦౭.

తే-గీ॥ కాలుసేతులువడఁకంగఁగళవళపడి । నోటివెంటనుదడఁబడుమాటలొప్ప।
జాబుఁజదువుకతాసిడ్డజాబెయగుటఁ । జేసిదిద్దునుగనలేకసెబ్బితిఁగొని॥ ౧౦౮.

క॥ తానొకటిఁదలఁచ దయ్యము । మానుగ వేఱొకటిఁదలఁచు ననుమాట నిజముగా।
నేనొకపనినిఁదలంచినఁ । దానొకలాఁగయ్యె నంచు దద్దిలుచుంతన్॥ ౧౦౯.

క॥ కడచినపనికివగచినం । బడిబడియల్లునిగుఱించి మల్లాడినన్।
పడిఁబజలుదూఱుదురనుచు । నెపదందలపోసి పైకి నేమియు నెగులున్॥ ౧౧౦.

తే-గీ॥ తోపనీయక ముద్దుకూఁతునకు నల్లు । నకును బుద్ధులు గొన్నిటి నప్పుడె సెప్పి।
బయటికందఱు మెచ్చంగఁ బలువితముల । దీవనలొసంగె మంతిరి దిటముగాను॥ ౧౧౧.

క॥ అంతట జఱుపఁగవలసిన । తంతును నారేయి జటిపెఁదరువాతను నా।
దుంతతు పాసియయపాడము । సంతసమును జెందుచుండెఁ జగఁదలారిన్॥ ౧౧౨.

తే-గీ॥ పిలువనంపించి వానికిఁ బెల్లుతోడవు । లిచ్చునట్లుగఁ గట్టడ నొచ్చె మేమి।
లేకయొనరించియుట నేరు లేకపోవు । టనుఁగనుంగొని వానికిట్లనుచుఁ బలికె॥ ౧౧౩.

తే-గీ॥ వేగమే దుర్గగుడికి నీ వేగి డాగి । యటకు నీసందెఁ బైఁడియొదుటు తెలెఁగొని।
దుర్గకును పారమును దెచ్చు దుంటెగీని । తలనుగగ్గముతోఁ దెగఁదఱుగుమనిన॥ ౧౧౪.

తే-గీ॥ వల్లెయనుచుఁ దలారి తా వెళ్లి గుడికిఁ । గూఁతు మొగమైన నల్లుని గోనములైనఁ।
జూడకను మంతిరిటు చేసెఁ జూడఁగూళి । లెట్టిపని చేయుటకు నైన దిట్టలెకద॥ ౧౧౫.

ద్విపద॥ అంతట మంతిరి యల్లుని బిలిచి । మంతనంబున ననె మరియాదతోడ।
మాపాపఁ బెండ్లాడు నీపాపఁ డైన । నీపాదయీపీట నీపాండు దుర్గ।
గుడికిను పారంబుఁ గొనిసంజవేళ । వెడలియప్పనఁ జేసి వేవేగవచ్చు।
వాడుకకలదనవడిఁ జంద్రహాసుఁ । డోడకనటు సల్ప నొప్పెనునంత॥ ౧౧౬.

ఉ॥ ప్రెగ్గడకూఁతు పెండ్లయిన రేయి సకుంతల తోఁడుకాంచెఁ బె।
ల్లెగ్గను జేయు నొక్క కలనీల్వన వేకువ సెజ్జనుండి తా।
దిగ్గన లేచి పెద్దలకుఁ దేటగ నా కలవిన్నవింపఁగా।
లగ్గి సుఘుంత లేదనుచులావతివారలు వల్కి రిట్లుగన్॥ ౧౧౭.

ఆ-వె॥ కలవితంబుఁ జూడఁగలుగు నుదురితమ । వెల్లజాలుగలుగుపీటవిడిది।
మీకటంచు నొడువమిక్కిలి వెత నొంది । దాని తెఱఁగెఱుంగఁ దలఁచి తోఁడు॥ ౧౧౮.

సీ॥ తననీడ నెండలోఁ గనుగొనఁదలలేని మొండెంబుగనపడ మూల్గుచుండి।
యెవ్వని నీడయు ననవ్వితమగుపడ నేడు రోజులలోన వాఁడు మ్రందు।
ననిజోస్యులే వేళ ననుటను నెంచుక తనచావు నిజమని తలఁచి మనెడు।
కొన్ని రోజులనైన వన్నెయు వాసియుఁ గనుకర్జములు చేసి కడపవలయు।
నంచు నేర్పాటునప్పుడె కావించుకతన । ప్రగ్గడయిరవుఁ జేరినలగ్గు నుద్ది।
దెలియకవిషయ పెండిలితీరినముఱు । నాడె మదనుని రప్పించి తోఁడుపలికె॥ ౧౧౯.

మత్తకోకిల॥ నేనురాచరికంబునిప్పుడనీకునొప్పఁగవీడఁగన్।
బూనివింటివిజంద్రహాసునిబుద్ధినేర్పుమగంటిమిన్।
గాననాతఁడెఱేఁడుగాఁదగుఁగాయటంచుఁదలంచితిన్।
వానిఁదోడ్కొనిరమ్మువేగమెవానిమీఱఁగనీవునాన్॥ ౧౨౦.

క॥ మదనుండునుదనబావను । ఱేఁడిచెందఁగఁబోవునట్టిరాచపదవికిన్।
మదిలోనఁబొంగియతనిని । వెదకుటకుంబోయివీటివీధికడదెసన్॥ ౧౨౧.

తే,గీ॥ సొన్నతళియనుపాఠంబుసారిదిఁగొంచు । దుర్గగుడికేగుచుండంగఁదోరముగను।
గాంచిగుడికేగుటనుఘూనిపించియతని । ఱేనినగరికిఁజనుమనియానతిచ్చి॥ ౧౨౨.

తే,గీ॥ సందెనాఁతఁడుగొనిపోవుజాళువాత । ళియనుమదనుండుచేకొనినయముమీఱ।
దుర్గగుడికేగుచుండఁగఁదొంగలనూడు । గ్రుంకెఁబడమటిదెసనంతఁగొఱలెనిరులు॥ ౧౨౩.

క॥ అప్పుడుమదనునితలపై । నొప్పగనొకగుడ్లగూబయొరగెనుబిల్లుల్।
దెప్పరముగఁబోరాడుచు । గుప్పననడ్డపడిపోయెఁగొల్తలచేతన్॥ ౧౨౪.

తే,గీ॥ ఊఱకేమదనునికండ్లఁగారఁజొచ్చెఁ । గరమునెత్తుటిబొట్టులుగాల్వగాఁగ।
నట్టిచెడుసకినాల్గనియతఁడుబీతు । గుడిచియువిచంద్రహాసునిగుఱిచినవని॥ ౧౨౫.

క॥ తలఁచితనబావమఱఁదికిఁ । బొలచెడుముప్పేదియైనఁబోయతనిబదుల్।
గలుగవలెనాకటంచును । వెలిదీవినినేలువానివేఁడుచుఁజనియెన్॥ ౧౨౬.

క॥ చనిదుర్గగుడితలుపుమె । ల్లనఁదీయమఱుగునఁగలతలారియొకగ్గం।
బునవానితలనుదఱిగెవె । సనుజనియెనునింటికపుడుసంతసమొప్పన్॥ ౧౨౭.

తే,గీ॥ చంద్రహాసుండుసేయుకర్జంబుఁదానె । చేసెదనటంచుమదనుండుచేటునొందె।
నొకరుచేయఁదగుపనినేఱొకరుచేయ । ముప్పుఁజెందుటయెప్పుడుతప్పదుగద॥ ౧౨౮.

తే,గీ॥ అంతటనుజంద్రహాసుండుసంతసమున । రాచనగరికిఁబరువెత్తిరమణులతో।
నిండుకొలువుననున్నఱేనియెదుటకును । జనినిలువఁబడియుండెనుజతనమొప్ప॥ ౧౨౯.

ఆ,వె॥ వానిఁజూచిపబువుమానికంబులచేతఁ । జెలఁగుగద్దెపయినియలరఁజేసి।
తనకుళాయివానితలనుసింగారించి । కూఁతుఁజంపకవతిఁగూడనొసఁగి॥ ౧౩౦.

క॥ తనకొలువునఁగలమానిసు । లనుఁగనుఁగొనిమీకితండురాజింకనునీ।
గనునానన్నికర్జము । లనుజఱుపందగునుమీరలందఱునాఁగన్॥ ౧౩౧.

తే,గీ॥ చంద్రహాసుఁడీకుంతలచకరవరితి । యగుటమాకందఱకుసేమమగునటంచు।
మించువేడుకతోవిన్నవించఁబబువు । కానకేగెనుబెండ్లముతోనయ్యుపుడె॥ ౧౩౨.

తే,గీ॥ చంద్రహాసుండురాజునుసాగనంపి । కొలువుకేతెంచియందున్నబలులఁజూచి।
క్రొత్తరాజేలుపడెనంచుఁగూర్మిమీఱ । చేరిచఱపించుఁడనిచెప్పవారలంత॥ ౧౩౩.

క॥ ఈమాగానికిఁ గ్రొత్తఁగ । సామియొకండేరుపడియొజగమునఁబజలా।
బూమిచెలిమగనిపనుపున । వేమనఁదగునంచు భేరివేయించంగాన్॥ ౧౩౪.

ఉ॥ మంతిరియాలకించితనమచ్చికపట్టికెపట్టమిచ్చితా।
నంతటఁగానకేగఁబబువంచుఁదలంచుకకుల్కుచుండసీ।
మంతుఁడుచంద్రహాసునకుమన్ననబట్టముఁగట్టఁ గోఁడుబ।
ల్సంతసమొప్పనంచుఁదనచాకిరివాఁడొకఁడప్డుచెప్పఁగన్॥ ౧౩౫.

క॥ ఆమాటవిసువసించక । నేమానిసియైననింకనిటువాకొనినన్।
నేమమునవానినాలుక । సాముగ్గోయింతునంచుఁజాటెన్ గినుకన్॥ ౧౩౬.

క॥ తరువాతఁజంద్రహాసుఁడు । కరమరుదుగఁదానుగనినకలిమికిఁగుదురై।
పరగెడుమంతిరిఁగనుఁగొనఁ । దరలవలెననవుకరరదముఁగొనిరాఁగా॥ ౧౩౭.

తే,గీ॥ తనదురెండవపెండ్లమైతనరుచంప । కవతితోఁగూడతేరెక్కికడకఁజంద్ర।
హాసుఁడంతటమంతిరియంతిపురికిఁ । జేరుచుండంగనాతఁడువీరిఁజూచి॥ ౧౩౮.

తే,గీ॥ రాచకొమరితఁబెండ్లాడిరాచరికముఁ । గొనికొడుకగుమదనుఁడెదీవనలఁగొనఁగఁ।
దనదుపజ్జకేతెంచుచుండెననితలఁచి । యొడలెఱుఁగనిసంతసమునియోగిసెందె॥ ౧౩౯.

ఉత్సాహ॥ అంతఁదేరుడిగ్గిచంద్రహాసుఁడప్పడాలితో।
మంతిరికడకుఁజనఁగాంచిమండిపడ్చుఁగిన్కచేఁ।
గొంతసేపుతాపడిబువికోరసిల్లిమెల్లఁగాఁ।
గొంతవడికిఁదెప్పిఁదేలికూర్మికొమరుఁడేఁసనాన్॥ ౧౪౦.

తే,గీ॥ చంద్రహాసునకుబదులుసందెవేళ । జాళువాపల్లెరంబునుసరగనెత్తిఁ।
బెట్టికొనినీదుకొమరుండువెడలెదుర్గ । కోవెలకునంచునటనుండుకొండఱనిన॥ ౧౪౧.

క॥ తత్తఱపడిపలవించుచు । మొత్తుకొనుచుఁగాలినడనెపోవుచువేగన్।
సత్తిగుడిఁజేరియచ్చట । ముత్తిఁగొనినకొమరుఁజూచిమూల్గుచునంతన్॥ ౧౪౨.

తే,గీ॥ అచ్చటనెయున్నయొకకత్తియందుఁదలను।
మోదుకొనిమంతిరియుఁగూడమత్తిఁగొనియె।
సొరులఁజెఱుపంగఁదలఁచెడుసోఁగులెందుఁ।
దామెచెడిపోవుదురుగాకతప్పకుండ॥ ౧౪౩.

తే,గీ॥ మామయగుమంతిరిదిబావమఱఁదియైన । మదనునిదిచావువినియష్టమదినిగుంది।
చేయవలసినపనులన్నిచేసిపిదపఁ । జంద్రహాసుఁడాండ్రనుగొనిచనెనగరికి॥ ౧౪౪.

క॥ చనినతరువాతనమునుపు । తననుబెనుపుఁజేసికొనిసతముకూర్మింబెం।
చినయాకుళిందుసేమముఁ । గనుఁగొనఁగాఁబారుపత్యగాండ్రవలనన్॥ ౧౪౫.

క॥ తనువచ్చినపిదపఁగులిం । దునియాస్త్రీయునూళ్లుఁబైఁడిదుస్తులొనరునకున్ ।
జనఁజేసిమంతిరతనిని । బెనుచెఱనుంపించెనంచువినితురితముగన్ ॥ ౧౪౬.

తే,గీ॥ పూనిచెఱనుండివిడిపించితోనయాస్త్రి । యంతయానునూళులునువానికమరఁజేసి।
చంద్రహాసుండునాయంబునరవినాళ్లు । కాళులనుసొప్పబూమినినేలుచుండె॥౧౪౭.

ఉ॥ వేలుపుపిండుతోఁడెడిక వేల్పుజముండలయూలతోఁడుము।
నీళులరాయఁడీదపెనునీలిమెడన్గగుతోనినేస్తుఁడ।
మ్మేలిమిమెట్టవింటిదొరమిన్నునఁగ్రాలెడుమానికంబురే।
గోలతుపాసియున్బలిసికొల్వఁగఁగొల్వనరించునేర్పరీ॥ ౧౪౮.

చతుర్విధకందము.

క॥ మినుకులతుదలనుదనరెడు । గనుఁడా! పరువంపుగొల్లగరితల, మరుఁడా! ।
పెనుబొగడికలనమరుల । చ్చనుఁడా! సిరిచెలియమగఁడ! సైరణ,దరుఁడా!॥ ౧౪౯.

మాలిని॥ కలుములచెలియాలున్గాటమాచిల్లవాలున్ ।
వలమురిగలకేలున్బచ్చవిల్కాఁడుమాలున్ ।
నలుపుమొయిలడాలున్నచ్చుపాన్పల్వమేలున్ ।
గలిగివెలుఁగుతోఁడా! కావవేవేల్పుప్రోడా!॥ ౧౫౦.

గద్య॥ ఇది శ్రీనందనందనపదారవిందద్వంద్వజన్యామందమరందబిందుసందోహపానమానసేందిందిరుండును, శ్రీమచ్చలపాకాన్వయాంభోధిరాకానిశాకరవీరరాజామాత్యనిజప్రేయసీ రాజమాంబాగర్భశుక్తి ముక్తాఫలుండును, నారాధిశౌర్య జాలుండును, నగు వేంకటసూర్యప్రకాశప్రధానినిర్మితశుద్ధాంధ్రనిర్వచనచంద్రహాసచరిత్రంబునందు సర్వంబు నేకాశ్వాసము.

సంపూర్ణము.

---

శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీరస్తు.

# వాసవపత్త్ర.

## పూర్వభాగము.

---

ఉ॥ శ్రీకరమున్ విశిష్టపరిసృష్ట్యవనప్రళయాదికారకా।
ర్యాకరమున్ జిదాత్మకమహామహిమంబు నిజాప్రమేయమా।
యాకలితంబు నిర్మలనిరంజననిర్గుణనిర్వికల్పభా।
వాకలనంబునై వెలుఁగు నా పరతత్త్వము నాశ్రయించెదన్॥ ౧.

---

క॥ శ్రీభూతరుణీముఖకమ । లాభంబగు నాంధ్రభూమి యందమితయశః।
ప్రాభవసురత్ననగరము । శోభిల్లు లలాటకాభశోభితమగుచున్॥ ౨.

క॥ ఆపురము జయశ్రీలతి । కాపురకాపురము రత్నకాంచనకుంభో।
ద్దీపితశిఖరాస్ఫోటిత । గోపురగోపురమునగుచుఁ గోమరరాయరహిన్॥ 3.

జయశ్రీలతికాపుర=జయలక్ష్మియనెడు లతాంగి. గోపురము=స్వర్గపట్టణము—మేడ.

క॥ ఎంతయు వనంతవిజయది । గంతరవిశ్రాంతకీర్తి నమరుచున చటన్।
సంతతబుధచింతామణి । చింతామణియనఁగ నృపతి శోభిలుఁడలరున్॥ ౪.

సీ॥ (1) కృతహేమకశిపుక్షేత్రదానక్రియారంభుఁ బ్రకృతి నారసింహుఁడనఁగ।
(2) సౌకర్యగతిసమాసాదితక్ష్మాపక్రమవిక్రమంబున నాదిపుష్టుఁడనఁగ।
(3) వరయశోదానందవైభవాస్పదసుప్రభావవైఖరి వాసుదేవుఁడనఁగ।
(4) దినదినకృతవసుదేవతర్పణజాతకీర్తివిస్ఫూర్తి శ్రీకృష్ణుఁడనఁగ।
(5) గీ॥ నామహానంతభోగిచూడామణిప్ర । భావిరాజితనిజపాదపద్మయుక్తి।
సంతతంబును సాగరశాయియనఁగ । నెందు బెంపొందు నాభూపురందరుండు॥ ౫.

## టిప్పణము.

---

(1) హేమ = బంగారు-కశిపు = అన్నవస్త్రములు—"అస్త్రీ కశిపు శయ్యాయాం వస్త్రే న్నే తద్వయేపిచ॥ నా." హేమకశిపు = హిరణ్యకశిపుఁడను రాక్షసుఁడు. క్షేత్ర = శరీరము - వరిమడి; దాన = ఈవి—ఛేదనము.

తా॥ రాజుపరమునందు- బంగారు- అన్నము- వస్త్రము- భూమి- వీటిని దానమిచ్చువాఁడనియును- నృసింహునిపరమునందు- హిరణ్యకశిపుని వక్షమును ఛేదించినవాఁడనియును గ్రహింపవలయును.

(2) సౌకర్యగతి = సూకరభావము - వరాహావతారము. సుకరము = శోభనకరమగు హస్తము- లేక- కప్పము—తద్భావము = సౌఖ్యకరము.

తా॥ విష్ణుపరమునందు వరాహరూపముచే భూమండలమును భరించినవాఁడనియు రాజుపరమునందు- శోభనకరమగుహస్తముచేత భూచక్రమును భరించినవాఁడని- కాని- సులభములగు కప్పములను తీసికొనుటచేత రాష్ట్రములను రక్షించువాఁడనికాని, గ్రహింపవలయును.

(3) వాసుదేవునివరమునందు- తలితండ్రులగు యశోదానందనుల వైభవమునకాకరమగు ప్రభావవైఖరియనియు—రాజుపరమునందు—యశఃప్రదమగు నానందవైభవమునకాస్పదమగు మాహాత్మ్యవైఖరియనియు గ్రహింపవలయును.

(4) వసువులు అష్టవసువులు—ధనము. వసుదేవుఁడు=కృష్ణునితండ్రి.

తా॥ కృష్ణునిపరమునందుఁ దండ్రియగు వసుదేవునిఁ దృప్తినొందించినవాఁడనియు- రాజుపరమునందు వసువులను దేవతలను దృప్తినొందించినవాఁడనియుఁ జెప్పనగును.

(5) అనంతభోగి=ఆదిశేషుఁడు—అనేకులగు భోగవంతులు—అనఁగా—రాజులు.

చూడామణి=శిరోమణి—శ్రేష్ఠుఁడు.

క॥ పరిమాద్భుతమాధరణీ । భరణుండుబృహన్నలానుభావుండయ్యెన్ ।
ధరనఖిలవిబుధులంత । స్సరళుండనవలనధికచాతుర్యమునన్ ॥ ౬.

టిప్పణము.

---

ఇందు విరోధాభాసాలంకారమును గ్రహింపవలయును.

(1) బృహన్నల యనఁగా నపుంసకరూపియగు నర్జునుఁడు = నపుంసకుఁడు; సరళుఁడనఁగా ననేకస్త్రీసాంగత్యముగల దక్షిణనాయకుఁడు; నపుంసకుఁడు. దక్షిణుఁడగుట విరోధము.

(2) నల=తృణవిశేషము=కనుపగడ్డి; సరళ=దేవదారువృక్షము; తృణవృక్షములగుట విరోధము.

(3) ఆరాజు నలమహారాజువంటి ప్రభావము కలవాఁడనియును- పరకార్యనిర్వాహకమగు బుద్ధి నిశ్చయము కలవాఁడనియును తాత్పర్యము.

(4) నలఃపోటగళేరాజవిశేషకపినాయకే (నా.)

పీతద్రుస్సరళఃపూతికాష్ఠంచ;
దక్షిణేసరళోదారా— } అమరము—

బృహత్ = గొప్పదియగు; అంతి = సమీపస్థమగు; అనుభావము = ప్రభావము.

సీ॥ (1) వ్యాకృతప్రథితకావ్యాదరుండాఘనుఁడానకదుందుభినతిశయించు।
(2) దక్షిణాశాప్రసాదకుఁడామహారాజుసవిమలాగస్త్యప్రశస్తిఁగాంచు।
(3) నసదృశసమరసాహసుఁడామహాభాగుఁడాతతవిజయవిఖ్యాతినెంచు।
(4) సంతతాశాంతరక్షణదక్షుఁడానరాభరణుండువరుణవైభవమునొందు।
(5) గీ॥ నహహ రాజన్యమాత్రుఁడే యతఁడు సతత । కనకవర్షప్రహృష్టార్థిజననికాయు।
చాతకుఁడుకృష్ణపదజలజాతచింత । నాతిమూర్కృతాఖిలపాతకుండు॥ ౭.

టిప్పణము.

---

(1) వ్యాకృత = విస్తరింపఁబడిన; ప్రథిత = ప్రసిద్ధినొందిన; కావ్య = ఈ పేరుగలరాక్షసియును – కావ్యమును; ఆదరము = విశ్వాసము; దరము = భయము; ఆనకదుందుభి= వసుదేవుఁడు.

తా॥ కావ్యయనురాక్షసికి భయమును విస్తరింపఁజేసినవాఁడు వసుదేవుఁడు—కావ్యములయందు విశ్వాసమును విస్తరింపఁజేసినవాఁడు రాజు.

(2) దక్షిణ=పండితుఁడు—దక్షిణదిక్కు. ఆశా కోరికే—దిక్కు. ప్రసాదకుఁడు=అలంకరించువాఁడు- నెఱవేర్చువాఁడు.

తా॥ దక్షిణదిక్కు నలంకరించినవాఁడగస్త్యుఁడు; విద్వాంసులకోరికెలను నెఱవేర్చువాఁడు రాజు.

(3) సమర = యుద్ధము; సాహస = పరాక్రమము; సమరస = శృంగారము; ఆహస= విలాసము—క్రీడ; (ఆహసోవిజయక్రీడా. అ.

తా॥ యుద్ధమున నన్యసామాన్యసాహసము కలవాఁడర్జునుఁడు; అసదృశశృంగార విలాసము కలవాఁడు రాజు.

(4) ఆశాంత = పశ్చిమదిక్కు—కోరికెలవినాశము.

తా॥ పశ్చిమదిక్కును రక్షించుటయందు సమర్థుఁడు. వరుణుఁడు—కోరికల నెరవేర్చి వానిని నశింపఁజేయువాఁడు రాజు.

క॥ ఘోరతరవారిధారా । దారితబహురాజహంసదర్పోజ్జ్వలునా।
ఘోరమణుఘనుఁడుఘనుఁడని । ధీరులునుతియింతురట్టితెఱఁగొప్పుఁగదా॥ ౭.

(1) ఘోరతర = మిగులభయంకరమగు—వారిధార = జలధార- అనఁగా వర్షము. రాజహంస=రాయంచలు; ఘనుఁడు = మేఘుఁడు; ధీరులు = పండితులు.

(2) ఘోర = భయంకరమైన—తరవారి= ఖడ్గము; ధార = అంచు; రాజహంస= రాజశ్రేష్ఠులు; ఘనుఁడు = గొప్పవాఁడు—ధీరులు=శూరులు.

తా॥ మిగులభయంకరములగు జలధారలచేత ననఁగా వర్షము గురియుటచేత భయపెట్టఁబడిన రాయంచలుకలది మేఘమనియు—భయంకరమగు ఖడ్గధారచేత విదళింపఁబడిన రాజశ్రేష్ఠులను గలవాఁడు రాజనియును- గ్రహింపవలయును.

సీ॥ (1) అతరళుఁడయ్యు సంతతమహానాయకప్రఖ్యాతిఁగనిధాత్రిఁబ్రబలునతఁడు।
(2) విద్యాధరుండయ్యువిలసితసుమనఃప్రథాసమావిఖ్యాతిఁదనరునతఁడు।
(3) ధృతరాష్ట్రుఁడయ్యునంచితగుణప్రియభావవిలసనామలమతి వెలయునతఁడు।
(4) మహిషీభవుండయ్యుబహుజనాహితవృషోత్పాదినానిరతంబుఁబరగునతఁడు। [డు।
(5) గీ॥ బంధుజనబృందములకుసుబంధుఁడనఁగ । బంధురతనొప్పియునుసుబంధుఁడతఁ
భూతలంబునఁగవిపారిజాతుఁడనఁగ । ఖ్యాతిమనఁగాంచియుపపారిజాతుఁడతఁడు॥

టిప్పణము.

---

(1) తరళము=చలించునది—నాయకమణి. అతరళుఁడు=చలించని- అనఁగా—భయములేనివాఁడు—నాయకమణిలేనివాఁడు. మహానాయకుఁడు= గొప్పరాజు—గొప్పనాయకమణి గలవాఁడు.

తా॥ నాయకమణి కానివాఁడు మహానాయకమణి యనుట విరుద్ధము—భయరహితుఁడనియును—గొప్పరాజనియును పరిహారము.

అభిప్రాయసూచిక = ఈపద్యమున నితరస్థలములయందును నిదేరీతిగా విరోధాభాసమును గ్రహింపవలయును.

(2) విద్యాధరుఁడు = దేవతలలో నొకతెగవాఁడు—పండితుఁడు. సుమనుఁడు=దేవతలలో మఱియొకతెగవాఁడు—మంచిహృదయము కలవాఁడు. ప్రథా=ఖ్యాతి.

(3) ధృతరాష్ట్రుఁడు = కురురాజు—రాష్ట్రమును ధరించినవాఁడు. గుణప్రియుఁడు=భీమునకు హితుఁడు—సుగుణప్రియుఁడు.

(4) మహిషీభవుఁడు=ఎనుమునకుఁ బుట్టినవాఁడు—పట్టపుదేవికిఁ బుట్టినవాఁడు.

వృషోత్పాది-ఎద్దును బుట్టించువాఁడు—ధర్మములను గలిగించువాఁడు.

(5) సుబంధుఁడు=మంచిచుట్టము; అసుబంధువు=చెడుచుట్టము—ప్రాణబంధువు. కవిపారిజాతము=కవులకుఁగల్పవృక్షమువంటివాఁడు. అపారిజాతుఁడు=శత్రువులులేనివాఁడు.

క॥ సకలకళాకులశోభితుఁ । డుకుముదవనముఖ్యబంధుఁడుక్షణదానం।
దకరుండతఁడుతమోభం । జకుఁడునతారాతిబలుఁడుచంద్రుండనఁగన్॥ ౧౦.

ఇందు రాజుపరమొకయర్థమును—చంద్రునిపరమొకయర్థమును—గ్రహింపవలయును.

(1) సకలకళాకులశోభితుఁడు = సమస్తవిద్యలచేఁ బ్రకాశించువాఁడు—షోడశకళలచేఁ బ్రకాశించువాఁడు.

(2) కుముదవనముఖ్యబంధుఁడు = కు=భూమియొక్క - అనఁగా—భూజనులయొక్క-ముత్=సంతోషమును—అవన = రక్షణమునకు-ముఖ్యబంధుఁడు—కుముదవన=కలువవనములకు ముఖ్యబంధుఁడు.

(3) క్షణదానందకరుఁడు = ప్రతిక్షణమందును దానముచేయు హస్తము కలవాఁడు—రాత్రియందు హర్షము కలుగఁజేయువాఁడు.

(4) తమోభంజకుఁడు = పాపధ్వంసకుఁడు—అంధకారవిరోధి.

(5) నతారాతిబలుఁడు=వంచఁబడిన—అనఁగా—జయింపఁబడిన శత్రుబలముకలవాఁడు.
తారా=నక్షత్రములచేత— న + అతి=నాతి=అతిక్రమింపఁబడని—బలుఁడు=ప్రకాశము కలవాఁడు.

(6) చంద్రుఁడు=ఆహ్లాదకుఁడు—జాబిల్లి.

గీ॥ ఆసదాగతిపావకాగ్రేసరుండు । నుతమహాబలుఁడునుసుమనోహరుండు।
రహినభోగోత్సుకుఁడుజగత్ప్రాణుఁడావధూతకాంతారుఁడనమహాఖ్యాతినలరు॥ ౧౧.

ఇందు రాజుపరముగాను—వాసుదేవునిపరముగాను—రెండర్థములు గ్రహింపవలయును.

(1) సదాగతి = సత్=సత్పురుషులయొక్క—ఆగతి= ఆగమనముకలవాఁడు=సత్పురుషులతనియొద్దకు వచ్చుచుండుదురనుట. వాయువు.

(2) పావకాగ్రేసరుఁడు = పావక = పవిత్రులయందు, అగ్రేసరుఁడు=శ్రేష్ఠుఁడు. వాయువు.

(3) మహాబలులుఁడు=అధికసామర్థ్యము కలవాఁడు—వాయువు.

(4) సుమనోహరుఁడు = మిగుల మనోరంజకుఁడు—పుష్పములనుహరించు వాయువు.

(5) నభోగోత్సుకుఁడు=భోగములయం దిచ్ఛలేనివాఁడు—ఆకాశగమనోత్సుకుఁడు=వాయువు.

(6) జగత్ప్రాణుఁడు=ప్రపంచమునకుఁ బ్రాణప్రాయమగువాఁడు—వాయువు.

(7) అవిఘాతకాంతారుఁడు=పోఁగొట్టఁబడిన దుర్భిక్షములు గలవాఁడు—ఎగరఁగొట్టఁబడిన వనములు కలవాఁడు=వాయువు.

సీ॥ (1) సమకరోదారప్రచారుండు వాహినీశతనాయకుండునై జలధిఁ దెగడు।
(2) నిర్జితమారుఁడున్నిద్రసాహసమహాసేనానుగతుఁడునై శివునిఁ దెగడు।
(3) విబుధాలయంబును విశ్వకర్మాశ్రయస్థితియును నై మేరుశిఖరిఁ దెగడు।
(4) రతిసుఖప్రదుఁడును రహిజనితానిరుద్ధాతివైభవుఁడునై యతనుఁ దెగడు। [డు।
(5) గీ॥ మఱియు క్షణదానహితుఁడు సన్మార్గవర్తి । యగుచు నామేటి రవిమహాఖ్యాతిఁ దెగ
గాన నా రాజవరునకుఁ గలయనెందు । నరసి పరికింపఁ గరఁ బెరదొరలు దొరలె॥ ౧౨.

## టిప్పణము.

(1) ఇది రాజపరమును—సముద్రముపరమును.

సమ=లక్ష్మియుక్తమగు—కర = హస్తముయొక్క—ఉదారప్రచారుఁడు = త్యాగప్రచారము కలవాఁడు = రాజు; మొసళ్లయొక్క విశేషసంచారముచేఁ గూడినవాఁడు సముద్రుఁడు.

వాహినీశతనాయకుఁడు—అనేకసేనలకు నాయకుఁడు=రాజు; అనేకనదులకు నాయకుఁడు=సముద్రుఁడు.

(2) ఇది రాజపరమును—శివునిపరమును.

నిర్జితమారుఁడు=శత్రువులను జయించువాఁడు=రాజు; మన్మథుని జయించినవాఁడు=శివుఁడు.

మహాసేనానుగతుఁడు—అధికసేనాసహితుఁడు=రాజు; షణ్ముఖసహితుఁడు=శివుఁడు.

(3) విబుధాలయము=పండితులకు శరణము=రాజు; దేవతులకు వాసస్థానము=మేరువు.

విశ్వకర్మాశ్రయస్థితి=విశ్వకర్మ యను దేవశిల్పికి నాశ్రయము మేరువు—ప్రపంచముయొక్క శుభాశుభకర్మలకు నాధారభూతుఁడు=రాజు.

(4) రతిసుఖప్రదుఁడు=రతీదేవికి సుఖమునిచ్చువాఁడు = మన్మథుఁడు—ప్రీతిచే జనులకు సుఖమునిచ్చువాఁడు=రాజు.

జనితానిరుద్ధాతి=వైభవుఁడు=అనిరుద్ధుఁడను పుత్రసంపత్తిగలవాఁడు=మన్మథుఁడు. అప్రతిహతవిభవము కలవాఁడు=రాజు.

**క్షమోదు** సంపుటి.... .... .... .... ....

**క్షణ** క్షణదానహితుఁడు = క్షణ = పర్వకాలములయందలి—దాన= దానములచేత—హితుఁడు=సర్వజనులకుఁ బ్రియుఁడు=రాజు, రాత్రికివిరోధి=సూర్యుఁడు.

సన్మార్గవర్తి = నక్షత్రమార్గవర్తి=సూర్యుఁడు, మంచిమార్గమున సంచరించువాఁడు రాజు.

పెదదొరలు=ఇతరరాజులు;

దొరలె=సమానులా? కారనుట.

ఆ, వె॥ అతనిరిపులు సదాప్తాస్థులై యభార । తరణయోగ్యులు భీష్ములై తగనశాంత ।
నవులుమఱి సానుచరులయ్యు నలినగోత్ర । భూషితులు భూషితులుగారె పుడమినహహ॥

టిప్పణము.

---

సదాప్తాస్థులు = సదా = ఎల్లప్పుడు—ప్తాస్థులు = అప్తజనులు, సదా=ఎల్లప్పుడు—అప్తాస్థులు = ధనరహితులు.

అభారతరణయోగ్యులు = భారతరణయోగ్యులు కారు; కార్యభారమును తరించుటకు యోగ్యతలేనివారు.

భీష్ములు = దేవవ్రతులు—భయంకరులు.

అశాంతనవులు = భీష్ములుకానివారు—శాంతిరహితులస్త్రము కలవారు.

సానుచరులు=పర్వతసానువులఁ జరించువారు. అనుచరులతోఁ గూడినవారు.

అగోత్రభూషితులు – గోత్రభూ = పర్వతప్రదేశమందు—అషితులు = లేనివారు—వంశభూషితులు కానివారు.

ఇందు విరోధాభాసమును గ్రహింపవగును.

ఆ, వె॥ ఆతఁడలత్రిశంకుఁడయ్యు నాక్షత్రప । థచ్యుతుండుగాఁడుధరణిశంక ।
ప్రభావుఁడయ్యు రహివిషాదియుఁగాఁడు । చిత్రమతనిపిహితశీలమెపుడు॥ ౧౪.

టిప్పణము.

---

త్రిశంకుఁడు=ఇక్ష్వాకువంశపురాజు ; శంకు=శక్తి—త్రిశంకుఁడు=శక్తిత్రయసమన్వితుఁడు; త్రి = త్రికాలములయందును—శం=సుఖముతోఁగూడిన—కు=భూమినిగలవాఁడు.

నాక్షత్రపథచ్యుతుఁడు=నక్షత్రసంబంధమైనది= నాక్షత్రము—నాక్షత్రపథమనఁగా నాకాశము--దానినుండి త్రోయఁబడినవాఁడు. అ=ప్రసిద్ధమగు—నక్షత్రపథ=రాజమార్గమునుండి—చ్యుతుఁడు=భ్రష్టుఁడగువాఁడు—కాఁడు.

శంకరప్రభావుఁడు = ఈశ్వరునివంటి ప్రభావము కలవాఁడు—సుఖకర మహిమకల వాఁడు.

విషాది=విషభక్షకుఁడు—దుఃఖముకలవాఁడు.

ఉ॥ అంబురుహాప్తతేజుఁడతఁడచ్ఛిలి నేలఁధరిత్రి రాజవై ।
రంబుసరోజముల్ దదితరంబగునంచితసార్వభౌమయో ।
గంబలదిగ్గజంబుబహుకంటకయోగముయోగముల్ శర ।
ణ్యంబులు గాఁగఁజేకొనికనంబడవశ్యములందు నెల్లెడన్॥ ౧౫.

టిప్పణము.

రాజవైరము=రాజునందలివిరోధము—చంద్రవైరము.

సార్వభౌమయోగము=చక్రవర్తిత్వము—సార్వభౌమనామక దిగ్గజత్వము.

కంటకయోగము=క్షుద్రశత్రుయోగము—రోమాంచయోగము. యోగము=యోగ విద్య—మిథునభావము.

క॥ ఛలనిగ్రహప్రయోగం । బులునిరతమున్యాయశాస్త్రములమతియఁనునా ।
ఖలసంప్రయోగ మొల్లనుఁ । గలమంబులసూచిభేదగతిమణివితతిన్॥ ౧౬.

టిప్పణము.

ఛలనిగ్రహము = కపటనిగ్రహము—న్యాయశాస్త్రప్రశస్తములగు ఛలాది నిగ్రహములు.

ఖలసంప్రయోగము=దుర్జనసాంగత్యము—కల్లమునవేయఁబడుట- కలమము = వరిపైరు.

సూచిభేదగతి = సూచి=కొండెగాండ్రచేఁ గల్పింపఁబడిన—భేదగతి=శత్రుత్వము, సూదులచే భేదింపఁబడి రంధ్రములు వేయఁబడుట.

క॥ ఏ దెసనారసినఁబరీ । వాదముపీణాళి;శూలభంగముప్రసనా ।
పాదనముప;మతియుఁగర । చ్ఛేదముకుసుమాపహరణసీమంతినులన్॥ ౧౭.

టిప్పణము.

పరీవాదము=అపవాదము—వీణోపకరణవిశేషము.

శూలభంగము=దుష్టులను శూలమునకు వేసిశిక్షించుట-శూలరోగభంగము;

కరచ్ఛేదము = కరమును ఖండించుట—లేక—కప్పముల నివ్వకుండుట; కరములచేఁ బుష్పములఁ గోయుట.

---

క॥ పాటితనాస్తికమతిగత । పాటవచార్వాకవితతిఁబటుతరనేత్రో।
త్పాటనమఁతపోధనముని । కోటిద్విజిహ్వాప్తియురగకులముననుదగున్॥ ౧౮.

టిప్పణము.

---

నాస్తికమతి=దేవుఁడు లేడనువాదము. నేత్రోత్పాటనము=కనుగ్రుడ్లు పీకించుట-కనులు తెరచుట.

ద్విజిహ్వాప్తి=రెండునాలుకలు కలిగియుండుట--అనృతమాడుట.

పైమూడుపద్యములకును—తగున్—అను నొకటేక్రియ కలిగియుండుటంజేసి-యీమూటిని నొకటేవాక్యముగా భావింపవలయును. ఇట్టివాక్యమునకు విశేషకమనిపేరు.
శ్లో॥ ద్వాభ్యాంయుగ్మమితిప్రోక్తం । త్రిభిశ్లోకైర్విశేషకం । కాలాపకంచతుర్భిస్స్యాత్।
తదూర్ధ్వంకులకస్మృతం॥

---

సీ॥ (1) గోత్రోద్ధరణవృత్తిఁగొమరారగాంచియుగోత్రోద్ధళనవృత్తిగొఱలఁడేని।
(2) జనకభూత్యాగసంసక్తుడైమించియుజనకభూరాగియైజరుగఁడేని।
(3) రామపర్శితభక్తిరాజితుండయ్యురాజ్యవిరామయుక్తిఁదానలరఁడేని।
(4) భీమభూభోగసంప్రీతుఁడయ్యునుబునరూఢపరిగ్రహకాంక్షఁబొదలఁడేని।
గీ॥ రమణవాదివరాహునిరామభద్రు । భరతునిషధావనీనాథుఁబ్రతియనంగ।
వచ్చునలమేటిధారుణీవాసవునక । నిందితామందగుణబృందసుందరునకు॥ ౧౯.

టిప్పణము.

---

(1) గోత్రోద్ధరణము = వంశపరిపాలనము—భూమిని యుద్ధరించుట.

గోత్రోద్ధళనము=వంశనాశనము—తుంగముస్తలకుఁగాను భూమిని బెకలించుట.

(2) జనకభూత్యాగసంసక్తుఁడు = జన్మభూమినివిడుచుటయందాసక్తికలవాఁడు—సీతను విడుచుటయందాసక్తి కలవాఁడు.

(3) రామదర్శితభక్తి = రామునియందగుపరచఁబడిన భక్తి—రాజ్యవిరామయుక్తి—రాజ్యమున రాముఁడు లేకుండుట—రాజ్యమందలి విరక్తి.

(4) భీమభూ=దమయంతి—పునర్భూ = రెండవవివాహము చేసికొన్న విధవ.

---

క॥ అతనిబహుమణీఘృణీసం । గతకటకచరన్మదాంధగంధర్వనిద।
ర్శితకనదభంగశృంగో । న్నతినచలునిఁబర్వతుండనంజన డెమహీశ॥ ౨౦.

టిప్పణము.

---

కటక - రాజధాని—పర్వతనితంబము.

గంధర్వ=గుఱ్ఱము—దేవగాయకుండు.

శృంగము=ప్రభుత్వము—శిఖరము.

పర్వతుఁడు=శైలము—ఉత్సవములు కలవాఁడు.

ఇచటమత్వర్థమున తప్రత్యయము.

---

సీ॥ (1) రాహువునాద్విజరాజమిత్రాధికోన్మేషాపహరణాభిలాషిగాఁడు।
(2) నళుఁడునానక్షకాంక్షాపరత్వానుసంగతకలివిజితవిగ్రహుఁడుగాఁడు।
(3) నహుషుఁడునాభువిసంతతమునకస్మాదపహృతజీవనఖ్యాతియుతుఁడుగాఁడు।
(4) చక్రినాబహుపుణ్యజనసదాహితసృగాలప్రవర్ధనసముల్లాసిగాఁడు।
(5) గీ॥ శక్రుఁడనశతమన్యుప్రసక్తిమనఁడు । శుక్రుఁడనధాత్రిఁగవితావిశుద్ధిఁగనఁడు।
శంభుఁడనముఖవిధ్వంసనరణిఁజనఁడు।ధరనతుల్యుండుగాఁడెయాధరణిధవుఁడు॥

టిప్పణము.

---

(1) ద్విజరాజ = బ్రాహ్మణశ్రేష్ఠులు—చంద్రుఁడు. మిత్ర = స్నేహితుఁడు—సూర్యుఁడు. ఉన్మేష=ఆధిక్యము—నా=అనుటకు.

(2) అక్ష=పాచికెలు—ఇంద్రియములు, కలి=యుద్ధము—కలియుగము.

(3) జీవనము=వృత్తి—ప్రాణము.

(4) పుణ్యజన=పుణ్యవంతులు—రాక్షసులు. సదాహిత = దీనికొకయర్థమున- సదా + హిత-అనియు, మఱియొకయర్థమున - సదా + అయిత-యనియు, గ్రహింపవలయును. ప్రవర్ధిత=వృద్ధినొందింపఁబడిన—సంహరింపఁబడిన, సృగాల=నక్క—రాక్షసుఁడు.

(5) మన్యు=వ్యసనము; కవితా=జలపక్షిత్వము;

తే, గీ॥ పావకుఁడు గాని మహికృష్ణవర్త్మగాఁడు। దహనుఁడును గాఁడు మఱి గంధవహసఖుండు।
గాఁడు నగవిప్రభంజనఖ్యాతి గాఁడు । గాఁడు గాఁడాశ్రయాశుండు ఘనుఁడతండు॥

టిప్పణము.

---

ఇందు గల నామములన్నియు నగ్నిదేవునకుఁ జెల్లునైనను, పావకేతరములీ రాజున కర్హములు గావని చెప్పంబడినది--ఎందుకనఁగా:—

కృష్ణవర్త్మ=మలినమార్గము కలవాఁడు=దుర్మార్గుఁడు. దహనుఁడు=దహించువాఁడు= తాపకారి. గంధవహసఖుఁడు=గర్వగ్రంథులకు మిత్రుఁడు. విప్రభంజనఖ్యాతి=బ్రాహ్మణులను హింసించువాఁడు. ఆశ్రయాశుఁడు=తన్నాశ్రయించినవారిని భక్షించువాఁడు.

అని యీతీరున దుష్టార్థద్యోతకములుగా నుండుటచే నారాజునకు నివి యనర్హములనియు-పవిత్రుఁడని యర్థమిచ్చు—పావక—శబ్దము మాత్రము తగుననియును తాత్పర్యము.

---

సీ॥ (1) విఘటితపటుసంధివిగ్రహుండా రాజసింధురండ జరాసంధు నెపయు।
(2) సుసుమిత్రాసుమంత్రోపేతుఁడా సత్యరాజితుండా దశరథునిఁ దొరయు।
(3) సుత్తమకుశలవయోగసౌభాగ్యుఁడా ఘనుఁడు రామావనీకాంతుఁ బోరయు।
(4) రక్షితహితగోసుదక్షిణాన్వితుఁడా ప్రతాపదీపితుఁడు దిలీపు నోలయు।
గీ॥ (5) సమధికసదానభోగప్రశస్తిమహిమఁ । గాంచియామేటిభార్గవఖ్యాతి వెలయు।
నతఁడు రిపువర్గభీకరాహార్యధైర్య । బంధురుండార్యకార్యధురంధరుండు॥ ౨౩.

టిప్పణము.

---

(1) ఘటింపఁబడిన, సంధి—విగ్రహములను నుపాయములు కలవాఁడు—జరయను రాక్షసిచేఁ గూర్పఁబడిన శరీరము కలవాఁడు.

(2) సుమిత్రయను భార్య- సుమంత్రుఁడను మంత్రి- కలవాఁడు—స్నేహితులయొక్క మిగుల సమీచీనములగు నాలోచనలతోఁ గూడినవాఁడు.

(3) కుశల=క్షేమము—వయః= యౌవనము—వీటిని—గ = పొందిన సుఖము కలవాఁడు—కుశ—లవ— నామకులగు పుత్రులతోఁ గూడిన సౌఖ్యము కలవాఁడు.

(4) గో = నందినీనామధేనువును—సుదక్షిణా—సుదక్షిణాదేవియను భార్యను—గూడినవాఁడు. గో=భూమిని—సుదక్షిణా=మంచిపండితులను రక్షించినవాఁడు.

(5) దానభోగములుగలమహిమ—ఆకాశగమనమహిమ.

సీ॥ హేలాజితాఖిలాభీలాహితానీపాలాతతశ్రీప్రభాయుతుండు।
దానాగతానేకదీనావనదయానిదానామలానూనమానసుండు।
రామాజనమనోభిరామాతిశయధామధామాసమానసుందరతనుండు।
ధీరాభినుతసత్కళారాజియుతసూక్ష్మధీరాజితాతినీతిక్రముండు।
గీ॥ రాజమాత్రుండె రాజాధిరాజమకుట । కోటిపాటితపటురత్నకూటఝూట।
శాణగణనిర్మలీకృతచరణనఖర । మండలుండగునాధరాఖండలుండు॥ ౨౪.

టిప్పణము.

హేలా = క్రీడ; ధామ = ఉనికిపట్టు—కాంతి; ధీర=పండితులు—శూరులు; ధీ=బుద్ధి; ఝూట=సమూహము; శాణ=సాన;

క॥ ఆతనికిలఁగలఁడొకతను । జాతుఁడుకందర్పకేతుసమధికసంజ్ఞో।
పేతుఁడురవికేతుఁడుజయ । కేతుఁడుశాత్రవశశాంకకేతుఁడునగుచున్॥ ౨౫.

టిప్పణము.

కేతు=ప్రకాశము—ధ్వజము—రాహువు.
(పతాకాయాంద్యుతౌకేతుగ్రహోత్పాతాపిలక్ష్మసు—అనిరుద్రుఁడు )
ఉ॥ ఆతఁడుపారిజాతమహిమాశ్రయుఁడాశ్రితనందనైకవి।
ఖ్యాతివహించి;మందరవికాసిసమావృతభోగిభోగజా।
తాతిశయంబుగాంచి;శరదభ్రుఁడువిష్ణుపదావలంబనా।
యాతసదావదాతహృదయస్థితిమించి;సమంచితోన్నతిన్॥ ౨౬.

టిప్పణము.

ఆశ్రితనందన=ఆశ్రయింపఁబడిన నందనవనముకల—ఆశ్రయించినవారిని సంతోషపెట్టు.

భోగిభోగ=రాజభోగము—వాసుకిశరీరము. విష్ణుపద=విష్ణువుయొక్క పాదము—ఆకాశము. అవదాత=నిష్కల్మషమగు—శుభ్రమైన.

వ॥ మఱియు నారాజకుమారకంఠీరవుండు.

ఆ, వె॥ సుముఖనందనుఁడైతా స్తుత్యసొబగునెంచు । జనితశివుఁడనఁదగిహిమాచలునినొంచు।
మఱిసుశర్మాభిశోభియైమహిఁగలంచుఁ । గౌరవవ్యూహసన్నాహగౌరవంబు॥ ౨౭.

టిప్పణము.

---

సుముఖనందనుఁడు=సుముఖుఁడను నందనుఁడు కలవాఁడు—లేక—(నందనుఁడగు) సుముఖుని సంతోషపెట్టువాఁడు.

జనితశివుఁడు = తనయందు జన్మించినపార్వతికలవాడు, కలిగినకల్యాణములు కలవాఁడు.

సుశర్మ=మంచిసుఖముకలవాఁడు—త్రిగర్తదేశాధిపతియగు రాజు

---

సీ॥ (1) వరమహేశ్వరనిరంతరసమ్యగుపభుక్తకోటియైకైలాసవాటిఁదెగడు।
(2) సంధ్యోచ్చలితనిత్యశశ్వత్ప్రభావుఁడైశాంకరభూతిసంచయముఁదెగడు।
(3) క్రోడీకృతాత్మయకోమలసుతనుఁడైపురుషోత్తమామోఘభూతి దెగడు।
(4) నీడితకువలయాపీడభూషణుఁడైప్రదీపించికంసద్విషదైతేయుఁదెగడు।
గీ॥ (5) స్వవశకాలధర్మసంశోభియైసదా । శాంతనవయశోభి సరణిఁదెగడు।
(6) దినదినోల్లసితరతిప్రియుండైయల । రాజసుతుఁడురాగిరాజుఁదెగడు॥ ౨౮.

టిప్పణము.

---

(1) మహేశ్వర=శంకరుఁడు—గొప్పరాజు. ఉపభుక్త=అనుభూతమైన—సేవింపఁబడిన. కోటి=శిఖరము—ప్రకర్షము. (అత్యుత్కర్షాశ్రయఃకోట్యో—అమరము.)

(2) సాయంసమయమునసటించు—సంధి=సంధియను నుపాయమందు—ఆ-విశేషించి—ఉచ్చలిత=ఉద్యుక్తమగు.

(3) క్రోడీకృత=ఆలింగితులగు—సుతను—కాంతలుగలవాఁడు;—వరాహి.---కృతమగు—సుతను మంచిశరీరము కలవాఁడు.

(4) కువలయ=కలువల—ఆపీడ=శేఖరము (శిఖాస్వాపీడశేఖరౌ—అమరము.) కువలయాపీడమగు గజము.

(5) కాలధర్మ=కాలమును—ధర్మమును—మరణము.

(6) రతి=క్రీడ—రతీదేవి.

---

క॥ సుందరుఁడతఁడువసంతుఁడ । నందగుననయంబనూనసా నారామా।
నందకరుఁడగుటవిచల । న్మందరుఁడగుముఖరభువనమాన్యుండగుటన్॥ ౩౦.

టిప్పణము.

---

అనేకులగు స్త్రీలకానందకరుఁడు రాజు. అనేకారామములకానందకరుఁడు వసంతుఁడు. ముఖర=మ్రోయుచున్న—భువనజనములు; స్తుతించుచున్న—జగములు;

---

సీ॥ (1) సతతంబుసమదృష్టిసహితుఁడై తనరియునిరుపముఁడగుమహేశ్వరుఁడతండు।
(2) భూరిముక్తామయహారియైయలరియునతరళమధ్యుండతండు।
(3) ఘనవంశదీపసంకాశుఁడైయొనరియుదీప్యదక్షతదశాధికుఁడతండు।
(4) సాహసోత్సాహసుబాహుఁడైయొసఁగియుధరణిరామానందకరుఁడతండు।
గీ॥ (5) సరసచతురాస్యుఁడయ్యుశంకరుఁడతండు।
(6) చంద్రుఁడయ్యునుబుధుఁడనఁజనునతండు।
(7) ధర్మరాజయ్యుమదిసుయోధనుఁడతండు।
చిత్రమాతనిదివ్యచారిత్రమహిమ॥ ౩౧.

టిప్పణము.

---

(1) సమదృష్టి=రెండుకన్నులుగలవాఁడు—నిష్పక్షపాతి. మహేశ్వరుఁడు=త్ర్యంబకుఁడు=గొప్పరాజు.

(2) ముక్తామయహారి = విడువఁబడినరోగములచే—అనగా—ఆరోగ్యముచే నొప్పువాఁడు—ముత్తెపుసరముగలవాఁడు; అతరళమధ్యుఁడు=చలింపనిహృదయము, లేక న్యాయము కలవాఁడు—నడుమ నాయకమణిలేనివాఁడు.

(3) కులమునకు దీపప్రాయుఁడు—వెదురుబొంగుమీఁది దీపము.
అక్షతదశ చ్యుతిలేనిస్థితి—నశింపనివృత్తి.

(4) సుబాహుఁడు=మంచిబాహువులుకలవాఁడు—ఆపేరుకల రాక్షసుఁడు.
రామానందకరుఁడు=శ్రీరామునకానందకరుఁడు—స్త్రీలకానందకరుఁడు.

(5) చతురాస్యుఁడు=బ్రహ్మ—చతురమైన వాక్కుకలవాఁడు.

(6) చంద్రుఁడు=ఆహ్లాదకుఁడు—జాబిల్లి. బుధుఁడు=పండితుఁడు—బుధగ్రహము.

(7) ధర్మరాజు=యుధిష్ఠిరుఁడు—ధర్మపరిపాలకుఁడు.
సుయోధనుఁడు=దుర్యోధనుఁడు—మంచియోధ.

---

క॥ ఘనతమహిమాలయస్థితిఁ । దనరునుమాయూహితుండుదారుఁడుమఱియున్।
గననావశ్యాయోగ్రుఁడు । కనదమలినసుగుణరత్నఖనియునునగుమన్॥ 3౨

టిప్పణము.

---

ఇందు రాజుపరముగాను—హిమాలయపరముగాను నర్థద్వయము గ్రహింపవలయును

రాజుపరము॥ ఘనతమహి=గౌరవస్థానము; మాలయస్థితిఁదనరున్=లక్ష్మికివాసస్థానమగు స్థితిచేనొప్పుచు; మాయూహితుండు=మోసమునకుశత్రువు; ఉదారుఁడు = దానశీలుఁడు; నావశ్యాయోగ్రుఁడు=గర్వముచే భయంకరుఁడు కానివాఁడు—(న + అవశ్యాయ + ఉగ్రుఁడు.) సుగుణరత్నఖని - సుగుణములను రత్నములకాకరము,

హిమాచలపరము॥ ఘనతమ=మహోన్నతమగు—హిమాలయస్థితి=హిమాచలస్థితి; ఉమాయూహితుండు—ఉమా=పార్వతీదేవికి—యూ=వాహనములగు సింహములకు—హితుఁడు=వాసయోగ్యుఁడు—లేక—ఉమాయూ=పార్వతీదేవికి—హితుఁడు—జనకుఁడగుటచేఁ బ్రియుఁడు—అనియలుక్సమాసముగా గ్రహింపవచ్చును; ఉదారుఁడు - గొప్పవాఁడు; అవశ్యాయోగ్రుఁడు=అవశ్యాయమనఁగా హిమము—తత్సంబంధముకలవాఁడగుట భయంకరుఁడు; సుగుణరత్నఖని=మంచిలక్షణములుగల రత్నముల గనులుగలవాఁడు.

---

సీ॥ భండనాగ్రమునఁగోదండమూనకమున్న ఘోరమైఘనశరాసారమడరు।
ఘనశరాసారంబుగవిసిమూఁగకమున్న వితతారిబహుశిరస్తతులుఁదొరలు।
వితతారిబహుశిరస్తతులుగూలకమున్న మహిఁబూర్వనాయకస్మరణమొదవు।
మహిఁబూర్వనాయకస్మరణమూరకమున్న వరకీర్తికకుబంతసరణిఁబొదలు।
గీ॥ గీర్తికకుబంతసరణిరాగిలకమున్న । రహిక్షణక్షణమాశ్చర్యరసముపొసఁగు।
నహహయా మేటిపటుధాటినహితమహిప । కోటిచాటించినిలిచిపైకొనినయపుఁడు। 33.
చ॥ అతనిమహోదయస్ఫురణనార్యులువర్ధితకైరవున్ బ్రసా।
ధితనిఖిలాశుఁజంద్రవరదివ్యకళాలయుసత్పథున్నివా।
రితతముఁగాంచిమించినసరిత్పతిఁబోలిప్రసన్నసత్వ్వలా।
యతబహుజీవనూల్లసితులావృతగోత్రులునైరిధారుణిన్॥ 3౪.

## టిప్పణము.

ఉదయ=ఉన్నతి—పుట్టుక.

వర్ధితకైరవుఁడు=క్షీణింపఁజేయఁబడిన దుష్టులుకలవాఁడు—వృద్ధినొందింపఁబడిన కుముదములుకలవాఁడు. (కైరవంకుముదేపిస్యాత్స్త్రిషు నేతుపుమానయం. అమరము.)

ప్రసాధితనిఖిలాశు=సాధింపఁబడిన సమస్తములగు కోరికెలుకలవాఁడు—అలంకరింపఁబడిన దిక్కులుకలవాఁడు.

చంద్రుఁడు=ఆహ్లాదకరు—జాబిల్లిని.

కళాలయు=విద్యలకునికిపట్టు—కళలకుస్థానము.

సత్పథు=సన్మార్గముకలవాఁడు—నక్షత్రమార్గసంచారి.

నివారితతము=నిరసింపఁబడిన పాపములుకలవాఁడు = పోఁగొట్టఁబడిన చీఁకటికలవాఁడు.

ప్రసన్నసత్త్వలు=నిర్మలచిత్తులు—సంతోషించిన జలజంతువులుకల.

జీవన=వృత్తి—జలము.

ఆవృతగోత్రులు=ఆవరింపఁబడిన భూములనఁగా నగ్రహారాగులుకలవారు— ఆవరింపఁబడిన పర్వతములుకలవి.

---

సీ॥ చండనారాచజర్జరితమాతంగకుంభస్థముక్తావళీపరిసరంబు।
ఉరురక్తవారిసముద్దీనమానద్విరదపదకచ్ఛపరంజితంబు।
అమరనారీసమాగమమహెూద్భటభటభాషణభీషణఘోషణంబు।
బహుసమాకులతరత్పత్రరథోత్పలపుండరీకకబంధపుంజితంబు।
గీ॥ నగుసమగ్రోగ్రపటువిగ్రహాగ్రమునను । దగ్రవిగ్రహపటుమండలాగ్రసక్త।
రక్తమలరారుజయరామరాజితాంఘ్రి । సమధికాలక్తకారుణచ్ఛాయయనఁగ॥ ౩౫

## టిప్పణము.

పత్రి=అశ్వము—పలం = మాంసము —పుండరీక = గుండెకాయ—కబంధ =మొండెము—అలక్తక=లత్తుక.

శా॥ఆహావిస్మయమామహామహునిబాహాసాహసోత్సాహస।
న్నాహోగ్రాహవభూహతారివిలపన్నారీసమూహంబము।

క్తాహారంబయిశోకమోహభయమగ్నాంగంబు గాముక్తము।
క్తాహారంబయిశత్కుచాళితనరుస్గాధాను తాపోన్నతి౯॥ ౩౬.

సీ॥ సతతదక్షిణసదాగతిహితవిభవుండువిస్ఫృతకనకాభివిభ్రుతుండు।
లాలితకోకిలాలాపసంకలితుండుసమధికాతిక్రాంతదమనకుండు।
రమ్యకాంతారతరంగాభిరాముండుసురభిళత్సుమనోభిశోభితుండు।
ప్రాకటపల్లవప్రకరసంసేవ్యుండుచక్షుశ్శ్రవానందసాధకుండు।

గీ॥ నగునతని గాంచిమాధవునలరఁగాంచు । ఘనలతలఁగలినుత్కలికాసహస్ర।
సంకులలుభ్రమరావళీసంగతులుప్ర । వాళహారలునైచెలుల్వలతురహహ॥ ౩౭.

టిప్పణము.

---

దక్షిణ = దక్షిణదిక్కు—పండితుఁడు—సదాగతి = సత్పురుష సమాగమము—వాయువు—కనక = సంపెఁగ—బంగారు—దమనక=శత్రువు—దవనము— కాంతారతరంగ=వన తరంగములు—కాంతా - స్త్రీల—రతి = సంగమమందు—రంగ = రక్తి—సురభిళత్ = పరిమళించు—పల్లవ = చిగురు—యౌవనపురుషుఁడు—చక్షుశ్శ్రవానంద = కన్నులకు—చెవులకు—ఆనందము—పాములకానందము—మాధవుఁడు = వసంతుఁడు—ఉత్కలిక - ఉత్కంఠత—మొగ్గ—భ్రమర = భృంగము—కాముకుఁడు — ప్రవాళ = చిగురు—జడ—హారలు = ఒప్పువారు—హారములు కలవారు.

---

మ॥ అలరాజన్యకుమారుఁడొక్కమధుమాసాస్తోకరాకానిశ౯।
గలితానూనమనోహరానిలలతాగారాంతరోదారని।
ర్మలశోభామలనూత్నరత్నమయపర్యంకస్థలింజేరియు।
న్నిలినిద్రారతినుండెసంతసముపేర్మి౯దత్ప్రభాతంబున౯॥ ౩౮.

సీ॥ ప్రత్యూషకాలక్షపణకకల్పితదధిస్నితాతిధవలాన్నపిండమనఁగ।
మేచకాకరనఖానూనమార్జనఘనస్ఫటికశిలాస్నిగ్ధశకలమనఁగ।
యామినీయమునాసమాలోలధళధళత్కాంతిభాగ్డిండీరఖండమనఁగ।
వారుణాశావధూభూరినీలమణీవిశాలరాజతమధుచషకమనఁగ।

గీ॥ చరమశైలోపధాననిషణ్ణనిజశి । రోవిరాజితరాత్రివధూవినూత్న।
చారుతరహీరతాటంకచక్రమనఁగఁ । జంద్రుఁడలరారెఁగాంతినిస్తంద్రుఁడగుచు॥ ౩౯.

టిప్పణము.

క్షపణక = పాషండుఁడు—డిండీరము = సముద్రపు నురుగు—రాజత = వెండిచేఁ జేయఁబడిన—చషక = గిన్నె—ఉపధాన = తలదిండు—తాటంక – చెవికమ్మ—

సీ॥ ఆకులాయివి గావుకోకస్తనీహస్తవిస్తారమృదుతామ్రపశస్తిగాని।
పోకలాయివి గావుఫుల్లాబ్జనయనావికాసభాసురకుచాగ్రములుగాని।
సున్నమాయిది గాదుసుందరీకుచకుంభరంచితకర్పూరరజముగాని।
కప్పురమాయిది గాదుకాంతామణీమందహాసకందళములవాసిగాని।
గీ॥ కుసుమమాలికలివి గావుప్రసవతల్ప। దత్తపరిరంభయుగప్రాణదయితబాహు।
లతలనుచు నెంచి వెతనించిమతిభ్రమించి। వేఁగు వెన్నెలనట్టివిదోగియొకఁడు॥ ౮౦.

సీ॥ (1) హిమకర్దమితనవ్యకుముదరజోబద్ధచరణషట్చరణనిస్వనయుతంబు।
(2) వితతప్రలాపప్రోధితసుఖసుప్తాభిసారికసారికాసంకులంబు।
(3) వేదవేదాంగశాస్త్రాదికాధ్యయనకర్మఠమఠపటలాభిమండితంబు।
(4) పరహాసరాగముఖరకార్పటికకావ్యకథ్యాళిరథ్యాప్రకాశితంబు।
గీ॥ (5) ప్రియసమన్వేషణస్ఫురత్ప్రేమారదేకకోక। ప్రియతమారుతమారుతప్రియతమంబు।
ప్రాతసంధ్యాద్యనుష్ఠానభూషితాగ్ర। జాతజాతంబుతనరెఁబ్రభాతమపుడు॥ ౮౧.

టిప్పణము.

(1) కర్దమిత = బురుదగాఁ జేయఁబడిన.
(2) అభిసారిక = ధూర్తస్త్రీ—
(3) కర్మఠుఁడు = కర్మదీక్షితుఁడు.
(4) హాస = శీఘ్రమయానమునందు—రాగ—ఆసక్తికలిగి—ముఖర = మ్రోయుచున్న—కార్పటిక = నిత్యయాత్రాశీలురయొక్క—కావ్య = శుక్రసంబంధమగు—అనగా—ఉదయ సంబంధమగు—కథ్యా = కథలు. (హాసోహాస్యరసేశీఘ్ర గమనానందయోరపి॥ నిత్యయాత్రః కార్పటికః—అమరము)
(5) ప్రియ=ప్రియుఁడగు మొగపక్షిని—ప్రియతమా=మిగులప్రేమకుఁ బాత్రమగునాడు పక్షి=కోకి—రుత=ఏడ్పు ధ్వని.

(6) పూఁత = పవిత్రమైన—అగ్రజాత = బ్రాహ్మణులు—జాత = సమూహము—

---

సీ॥ మిక్కుటంబుగ రేయి మ్రింగినతమ మెల్లఁ గజ్జలచ్ఛలమునఁ గ్రక్కునవియు।
నిక్కుపల్కురతిఁ జొక్కువారలఁ జూచి మూచినయలమట స్రుక్కునవియు।
మఱుఁగుఁ జొచ్చినచిఱుమబ్బులఁ దమతోడి నీడలగతిఁ బ్రోచి నెగడునవియుఁ।
దమతేజములు గొనుఁ దపనుఁ డస్తమయమునఁ బోలె వెల్వెలనయి పొగులునవియు।
గీ॥ బలువిరాళి నిమురు బారిఁ బడి కరంబు। తారుజారలమీఱు నిట్టూర్పులకుఁ।
దలకి పడవడవడఁకుచుఁ గొలఁగునవియుఁ। గాఁగ వేకువ గృహదీపకళికలమరె॥ ౮౨.

టిప్పణము.

---

కజ్జలము = కాటుక—ఛలము = సాకు—విరాళి = మోహము—కళిక = మొగ్గ.

---

సీ॥ (1) దుర్జనోక్తులు వ్రాలెఁ దోఁచె దగ్ధస్నేహసముపాత్తమందభావములు గొన్ని।
(2) యతివృద్ధమానవస్థితిఁ దోఁచె బహుకార్శ్యసముదాత్తతను దశాంతములు గొన్ని।
(3) యాపన్నసత్పురుషాభంబులై తోఁచె నమపేతపాత్రమాత్రములు గొన్ని।
(4) యస్తాద్రిశిఖరప్రశస్తంబులై తోఁచెఁ బతత్పతంగములు గొన్ని।
గీ॥ కనుఁగొనఁగ మతిదానవులనఁగఁ దోఁచె। రహినిశాంతగతప్రచారములు గొన్ని।
ధూమకేతువులనఁ దగి తోఁచెఁ గొన్ని। దీపములు మందమందప్రదీప్తములుగ॥ ౮౩.

టిప్పణము.

---

(1) దగ్ధస్నేహ = కాలిననూనెగల—మైత్రిలేని.

(2) దశాంతములు = వత్తి కొనవరకుఁ గాలినవి—వార్ధక్యమును బొందిన—

(3) ఆపన్న = ఆపదనొందిన—పాత్రపాత్రములు = నూనెలేని ప్రమిదమాత్రము కలవి—సత్పురుషుఁడను పేరుమాత్రము కల—

(4) పతత్పతంగములు = అస్తమించుచున్న సూర్యుఁడు కలవి—పడుచున్న శలభములు కలవి.

---

శా॥ వాసాగారసుమోపహారములు శశ్వద్వ్యాపతత్సన్మధూ।
ళీసంధానవిధానపానకలనాలీలావిలోలాళిపా।

వ. ఇట్లు తలంచి యొక్కనాఁడు తనహృదయేశ్వరిం బిలిచి రహస్యంబుగ నిట్లనియె. ౯౭.

చ. "మనకున నేకరత్నమయమండనసంఘముతో లభించెనీ
యనుఁగునిసుంగు, దీని నెరులారసికేనియుఁగీడుమూఁడుఁగా
వునమఱియొక్కపల్లియకుఁబోయిసుఖించుటమేల" టన్నన
వ్వనితయుభర్తయానతికి "వల్లె" యనెన్ గడుభక్తిపెంపునన్. ౯౮.

వ. ఆకాలంబున. ౯౯.

క. మలయాళయరాజ్యమునకుఁ, దలమానికమనఁగఁదనరితఱుగనిసిరులన్
జెలువైయనంతసేనము, పొలుచున్ భూరమణినుదుటిబొట్టోయనఁగన్. ౧౦౦.

క. ఆపురమునెంతలక్ష్మికిఁ, గాపురమైతనరుకొట్టికకుఁజనియుటనా
గోపకుఁడొకగృహముంగొని, కాపురమునుజలుపుచుండెఁగౌతూహలియై. ౧౦౧.

గీ. ఇట్లుకాపురముండివ్రజేశ్వరుండు, ప్రమతిభూషలఁగొన్నివిక్రయమొనర్చి
పశువులనుగొనితనసాటివారిలోనఁ, గలిమిబలుములమిక్కిలిఘనతకెక్కె. ౧౦౨.

గీ. పార్థివతనూజఁదనముద్దుపట్టివలెనె, కాంచిపెంచుచునుండెనుగానిసుంత
తెలిసికొనఁజాలఁడయ్యెనుదెఱవమిన్న, సింహళద్వీపనాయకశిశువటంచు. ౧౦౩.

వ. ఇట్లత్యంతానురాగంబునఁ బెంచుచుండ నా రాజపుత్రి శుక్లపక్షక్షపాకర బింబంబు డంబున దినదినప్రవర్ధమానయయ్యె నంత. ౧౦౪.

సీ. కొదమతుమ్మెదదిమ్మునదలించునెఱికురుల్ కనుబొమ్మగవసోడగునిసియాడెఁ
దెలితామరలకువెచ్చెలికత్తియలఁబోనికనుదోయినునుసిగ్గుగడలుకొనియెఁ
జక్కరపలుకులనెక్కసక్కెయమాడుపలుకులఁబ్రౌఢత్వమలమికొనియెఁ
జివురుసోయగమెన్నుచెలువంపుఁగెమ్మోవిపగడంపుజిగులనుబరిహసించె
నారుచీమలబారునుగేరఁజాగెఁ, దళతళత్కాంతిచెక్కులదలముమీఱె
నడలురాయంచబెడఁగునునవ్వఁదొడఁగె, వనజనయనకునూత్నయౌవనమునందు ౧౦౫.

క. సింగారమురూపూనిన, భంగిని, దొలుకరిమెఱుంగుపరతెంచిధరి
త్రింగొలినతెఱఁగున, న, య్యంగనవఱలెన్నవీనయౌవనమందున్. ౧౦౬.

ఉ. ఆరమణీలలామమువ్రజాలయమందభివృద్ధినొందియున్;
వారలకన్నవిద్యలనవారిగనేర్పకయుండియున్, ధరి
త్రీరమణాబ్జలోచనలతీరునరూపవివేకవైభవౌ
దారతనొప్పెనైజగుణతత్వముమాఱునెయేడనుండినన్. ౧౦౭.

క. ఆ మెను జూచినమనుజులు, భూమీశ్వరదివ్య సౌధములనిలఁదగుక
న్యామణియేలొకో గొల్లల, సీమలవసియించెననుచుఁజింతింతు రెవనన్. ౧౦౮.

వ. అట్లు జవ్వనంబుననివ్వటిల్లు నాపల్లవపాణిని గొల్లండిల్లు కదలనీయక యెల్లతెఱం
గులనరయుచుఁ, దగినవల్లభు వెదకి విక్రయింప శేషించిన యాభరణంబు లరణంబుగా
నొసంగి పరిణయంబుసేయ నిశ్చయించుకొని యుండెనప్పుడు. ౧౦౯.

చ. చెలువునమీనకేతనుఁడు, శిష్టజనస్తుతిపాత్రుఁ, డంచితో
జ్జ్వలగుణరత్నభూషణుఁడు, పాపవిదూరుఁడు, ధైర్యసారసం
చలితసువర్ణభూధరుఁడు, సత్యవచోనిధి, రామవర్మనా
నలరుసుతుండొకండుమలయాలయభర్తకుఁజంద్రవర్మకున్. ౧౧౦.

శా. ఆతండొక్కదినంబునందుమృగయావ్యాసక్తిమై నేగుచున్
బ్రాతఃకాలమునన్ వ్రజాలయముఖద్వారప్రదేశంబునన్
బ్రీతిన్గాంచెనుబూర్ణచంద్రవదనన్, బింబాధరోష్ఠిన్, గుణ
స్ఫీతన్, గోకిలవాణి, సింహళమహాద్వీపాధిరాట్పుత్రికన్. ౧౧౧.

మ. కనియాశ్చర్యమునొంది "యిట్టికలికిన్, గార్తస్వరాంగిన్, లస
ద్వనజాతాయతపత్రలోచన, శరత్పూర్ణేందుబింబాననన్,
వనితాలోకశిరోమణిన్, గుణవతిన్, బంధూకబింబాధరన్,
ఘనవేణిన్, గరిణీమనోజ్ఞగమనన్, గన్గొంటిమేయెయ్యెడన్. ౧౧౨.

క. నెలఁబోలుమోము, క్రొందే, నెలఁబోలుసువాక్యగరిమ, నెలతాబలుతి
న్నెఁబోలుంబిఱుఁదులు, చి, న్నెలగనియగునీ మెఁబొగడ నేర్చునెవిధియున్. ౧౧౩.

ఆ. గుణమణీరజంబుఁగూర్చిశృంగారంపు, రసమునందు, వలపులెసఁగుమలయ
పవనుఁగూడఁజేర్చిపలుమాఱుమర్దించి, స్రష్టయీమెసృష్టిసలుపఁబోలు. ౧౧౪.

ఆ. మోముచందమామ మొగిగెల్వ నెనుదన్ను, నిరులనంగసోఁగనురులుదనరు
నధరబింబమనకునాసించివచ్చిన, చిలుకలనఁగముద్దుపలుకులలరు. ౧౧౫.

ఆ. వనితసోయగంబువర్ణింపఁదిలకింప, జిహ్వలొక్కవేయిశేషునకును
గనులువేయిదివిజకాంతునకొసఁగంగఁ, బోలుపలుకుపూవుబోణిమగఁడు. ౧౧౬.

సీ. అమృతాంధసులకైననలవిగానిఫలంబుగోపకుల్వసియించుకొటికఁబొడమె
రతియైనవతిభక్తినుతిచేసిపూజింపఁదగినవేలుపుగొల్లతెగలమెలఁగెఁ
జక్రవర్తులమనస్స్పర్థకైననుజాలురత్నంబువ్రజమందిరమునవలరె
రాజేశ్వరులకందరానిపదార్థంబువెడఁగుగొల్లలమందవెలసెనేఁడు

ఏమహాత్మునకబ్బునోయీ మెఁగలసి, యీరాజవంజవసుఖములననుభవింప
వాఁడెసుకృతాత్ముఁడరయంగవానిగృహమె, భూతలస్వర్గమనిచెప్పఁబోలునహహ.

ఉ. ఔరవిధాత! నీమహిమమద్భుతమేమనవచ్చు, నిట్టియొ
య్యారిఁద్రిలోకసుందరిధరాధిపదివ్యనిశాంతసీమలం
జేరుపకేలచేర్చితివిసీ! యొకగోనగృహాంగణంబునన్
భూరిరుచింజెలంగుమణిబూదినిదాఁచినయట్టులక్కటా!” ౧౧౮.

ఆ. ఇట్లుమగువసొగసు నెంతయుఁగొనియాడి, మరుఁడుగురియుకుసుమశరములకును
నిలువలేక మోహజలధినిమగ్నుఁడై, తనయెడంపనిట్లుతలపఁదొడఁగె. ౧౧౯.

ఉ. “ఏలసమస్తసంపద! లిఁకేటికిరాజ్యముగీజ్యముల్, క్షమా
పాలనముల్, సువర్ణమయభవ్యగృహంబులు, నిష్కుటంబులున్?
వేలుపువాలుగంటులను వేమఱుసోయగమందుమించునీ
బాలికఁగాఁగిటందనుపుభాగ్యము దైవము కల్గఁజేసినన్. ౧౨౦.

ఉ. వేఁడిమిమాపితండ్రినను వేమఱుఁదిట్టిపరిత్యజించినన్
వాడలవాడలంగలుగువారు దిసంతులుగొట్టినవ్విన్
జాడలెఱింగిబంధుజనసంతతిమాటికిరవ్వచేసినన్
వీడఁగఁజాలమోహమునువీసమయేనియునీవెలందిపై.” ౧౨౧.

చ. అనితలపోసితానొకధరాధిపపుత్రుఁడనిట్టినీచపుం
బనికెటుచొత్తునంచునులవంబునుసంశయమందకాత్రజాం
గనసుబరిగ్రహింపఁగడకట్టొనరించిబిఱానగొల్లమా
డ్కినిజనెంచె, నీచమునుగీచమదేటికిఁగామికారయన్. ౧౨౨.

వ. ఇట్లుచన నిశ్చయించి, వేఁటతమి న్వెనుకఁబడి యప్పుడు తన్నుంగదిసిన పరివారం
బున కుచిత సత్కారంబులొనరించి యర్యొ మిషలంగల్పించి వారివారియగారంబుల
కనిపి యనంతరంబ. ౧౨౩.

సీ. చెలువంపుసరిగంచుజిలుఁగుగుప్పటిచుట్టికేలఁబిల్లంగ్రోలుగీలుకొలిపి
నెమ్మిపించెముభూషణమ్ముగాఁదలఁదాల్చిచెవిదమాలకిసాలనివహమునిచి
మొగమునసొగసుగామృగనాభిసవరించిసుమహారవితతివక్షమునఁజేర్చి
భుజములఁగురువిందపూసపేరులుగట్టిగడితంపుఁగోలకక్షమునవిఱీకి
రాచచిన్నియలెడలించిరామవర్మ, గొల్లఁడైవచ్చెఁబ్రమతిఁగన్గొనెడువేడ్కఁ
దన్నుఁజూచెడుపాయంపుఁదలిరుబోండ్లు, విరివిలుతుఁడొకోయనికడువింతపడఁగ.

వ. ఇట్లువచ్చిన కుమారు నాగోపాలుని రూపంబునకా వృద్ధగోపకుం డాశ్చర్యంబునొందుచు నిట్లనియె. ౧౨౫.

ఆ. "ఎవరివాఁడవయ్య! యిచ్చోటికేగెదు! నామమెద్ది! నీవునలినబాణుఁ
డేమియగుదురయ్య! యెఱిఁగింపు"మనవృద్ధ, గోపకునకురాచకొమరుఁడనియె ౧౨౬.

సీ. "వల్లవబాలుండ; భద్రుండు నాపేరు; మలయాలయేశ్వరుమందిరమున
నాలగాపసులపైనధికారినైయుండునాతండుప్రాణంబురీతినన్ను
గారాబమునఁజూచికన్నకుమారునికరణినెల్లప్పుడుకాచుచుండు
రాజసూనుండగురామవర్మకునాకునాతఁడేనేననునంతమైత్రి
యిప్పుడారాజనందనుఁడిచటిపనికి, వేఁటకుదేరనలసినేవిశ్రమింప
వచ్చితి"నటన్నవృద్ధగోపప్రభుండు, వేడ్కనొందెఁదదీయసద్వచనమునకు. ౧౨౭.

గీ. ఇట్లువేడుకనొందిప్రజేశ్వరుండు, ప్రియకుమారికఁబ్రమతినిబిలిచిపలుకుఁ
"దల్లిరో! భక్తినతిథిసత్కారమిపుడు, సలిపికృతకృత్యురాలవైవెలయు"మనుడు.

సీ. అడుగుదామరలకెంపందందుఁబొలసికుంకుమువన్నెపూసినకొమరుదాల్ప
నొడలిచక్కనిబాజులడరిగోడలుతిన్నియలుపొన్నలందినయట్టులలరఁ
గనుబోయిమించులక్కజముగాఁబర్వముఁగలవిరుల్ చల్లినపొలుపుదెలుపఁ
గ్రొవ్వెదజిగిమీఁదకునుఁగినీలిదువ్వలువమేల్కట్టుచెల్వమునుబడయఁ
గలికిముసిముసినగవువెన్నెలలుగాయఁ, బ్రమతిచనుదెంచెనారాచకొమరుకడకుఁ
జక్కఁదనమిట్టులేనీదుసదనమునకుఁ, గలుగఁజేసెదమందనితెలుపుపగిది. ౧౨౯.

వ. ఇట్లు పితృశాసనంబునం జనుదెంచి భూలోకమన్మథునిలీలం గ్రాలునృపాలబాలకుం గాంచి యత్యద్భుతరసాక్రాంత హృదయారవిందయై తనలోఁ దానిట్లని వితర్కింపం దొడంగె. ౧౩౦.

క. "కందర్పుఁడొ త్రిదశేంద్రుని, నందనుఁడో చంద్రుఁడో నలకూబరుఁడో
డెందములరింమనీతని, యందంబువిలాసవతులకందఱకుబలే. ౧౩౧.

ఆ. ఇతనిఁగలసిమెలసియెల్లప్డుసంసార, రాజ్యభోగములనరహీనిదేలు
వారిజాక్షిపుణ్యవైభవంబేపుణ్య, వైభవంబువేయుపలుకులేల" ౧౩౨.

గీ. ఇట్లుతలపోసియాశరదిందువదన, తనదుకులదైవతంబుచందమునఁగాంచి
నతిథిపూజలొనర్చెనత్యధికభక్తి, రాజపుత్రుండుకుతుకపారాశిఁదేల. ౧౩౩.

వ. ఇట్టులా కాముకీకాముకులకుఁ బ్రథమదర్శనసమయంబుననె బద్ధానురాగంబు సిద్ధించు
టం జేసి పృథ్వీవరకుమారుండు భద్రనామకుండై ప్రచ్ఛన్నవేషంబునఁ దదీయఘో
షాంగనానిలయంబునకుం జని దినదినంబును బంధుత్వగౌరవంబు నెఱపుచు. ౧౩౪.

సీ. ప్రాచీనరాజన్యబలశౌర్యగాథలనొగిఁ జెప్పి యలరించు నొక్కనాఁడు
పిల్లనఁగ్రోవి మోవిని బూని పాడి యత్యుత్సాహ ముదవించు నొక్కనాఁడు
అత్యంతనీతిదాయకపుసుద్దులు పల్కి సొక్కించుమక్కువ నొక్కనాఁడు
మందపైఁ గవియుదుర్మార్గజంతులఁ జంపి యక్కజం బొదవించు నొక్కనాఁడు
పెద్దపులిజున్ను తెమ్మన్న వెఱపులేక, తెచ్చి ప్రియపూర్వకంబుగ నిచ్చి వేడ్క
యొనవఁ జేయును నెమ్మది కొక్కనాఁడు, ప్రమతిపై మోహమున నఘరావరసుతుండు.

గీ. భద్రుఁడింత కసేపు కన్బడక యున్న, విరహవేదనఁ బెపెయించు వెలఁది మిన్న
ప్రమతియింతక సేపు కన్పడక యున్న, విరహవేదనఁ దపియించు విభుసుతుండు. ౧౩౬.

క. వారలయనురాగమునక, పారము దంబుధిని దేలి వల్లవుఁ డాసిం
గారంపుం గనినతనికిఁ, గూరిమి సునఁ గంగిఁ దలఁచు కొనె నుల్లమునన్. ౧౩౭.

వ. ఇట్లు తలంచి "యింద్రోత్సవానంతరంబున పరిణయప్రయత్నంబులు గావింతు"మని
తనదేవేరి కెఱింగించె. ప్రతిమయుఁ దల్లివలన నీసమాచారంబు విని డెందంబున నానం
దంపుముం దేనం తినట. ౧౩౮.

గీ. ఇల్లుపట్టక తనపుత్రుఁ డిచ్చ వచ్చి, నట్లు తిరుగుచునుంటయు ననిశ; మక్క
గవయమున నిద్దుగను "బ్రమతీ" యటంచుఁ, గలువరించుటయును గనికలఁగి నృపుఁడు.

గీ. బంధులను బిల్చి తనపుత్రువర్తనంబు, నరసి రంభవనవాసునప్పు డెదలి
సర్వమువిమర్శ గావించి చంద్రవర్మ, పాలికే తెంచి యిట్లని పల్కఁ దొగిని. ౧౪౦.

గీ. "ధరణినాయక! నీయాజ్ఞ తలను దాల్చి, మాఱువేసాన తోడఁ గుమారు వెంటఁ
జనితి మాతండు గోపవేషము ధరించి, క్రోశదూరంబునందున్న ఘోషమునకు. ౧౪౧.

క. చని యొకజంగిలి పొంతం, దనరారెడు నొకరసాలతరురాజము క్రిం
దను గూరుచుండి యీరెలుఁ, గునఁ దనలోఁ దానె యిట్లు గొణఁగం దొడఁగెన్. ౧౪౨.

సీ. "నీమొగంబును నిండు వెలనుగన్గొనకున్న నలివరో! పరితాపము ఱుట్లు
నీనవ్వు చిగురు వెన్నెలలు సోఁకకయున్న మదనాంధకారంబు మాయుటెట్లు
నీముకెమ్మోవి తేనియలఁ గ్రోలకయున్న విరహవిదాహంబు వీడుటెట్లు
నీనిండుకౌఁగిట నెమ్మిఁ జేర్పకయున్న వలకాఁకబలు ధాకవదలుటెట్లు

నీదువచనామృతంబును నాదుచెవులఁ జిలుకకున్న నుదేహంబు నిలుపుటెట్లు
పరుగునను వచ్చి కడుప్రువఁ బాలువోసి, రక్షణము సేయవే శరద్రాజవదన. ౧౪౩.

ఆ. లేమ! చెంతనీవు లేనిక్షణం బొక్క-, యుగము వలె నెతోఁచుచుండు నాకు
నీవు చెంతనున్న నెలలెల్ల క్షణముల, పగిదిఁ దోఁచుచుండు మగువ నాకు. ౧౪౪.

క. నినునమ్మితి నీదాసుఁడ, నను వేఱుగఁ జూడఁ బోకు నళినదళాక్షీ!
చనుదెంచి సరగ నిచటికిఁ, గనుఁగవకుత్సవ మొనర్పఁ గదవే యబలా! ౧౪౫.

వ. ఇట్లు పలవించి పలవించి కన్నకన్నట్టివారి నడుగుచున్న యవసరంబున. ౧౪౬.

ఆ. తనశరీరకాంతిధరణీరుహములకుఁ, బసిఁడిపూఁతపూయఁబడఁతియొకతె
వచ్చి రాచకొమరుఁ గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి, కుస్తరించి తోడుకొనుచుఁ జనియె. ౧౪౭.

క. రమణీయుఁ నీకొమరుఁడు ప్రియు, తమముగ మాటాడు వాక్యతతి నెఱిఁగి విమా
విమలాబ్జనేత్రనామము, ప్రమతియనం దనరునర్థవంతంబగుచున్. ౧౪౮.

వ. అట్లయ్యుత్తమనాయికానాయకరత్నంబు లరిగిన యనంతరంబ తత్ప్రదేశ సంచారులగు గోపకుమారులం బిలిచి యడుగ నీ "ప్రమతి" యొకవల్లవపల్లవపాణి యనియును; నీభద్రుండు భూపాలుని కీలారుల కేలికయనియును నుడివి"రన. భూరమణుండు వారలవగారంబుల కనిచి బహుమానునిం బిలిపించి తనసూనుని వృత్తాంతం బాద్యంతంబును వినిపింప నతండును "మధుపూత్సవంబు సమీపించుచున్నయది గావున నచ్చటికి గొల్లలు తమయిల్లాండ్రతోడను; బిల్లలతోడను; నరుదెంతురు. అప్పుడు నిగూఢవేషంబున మనమును బోయి కర్తవ్య మరయుద"మన నమ్మహీశ్వరుండు సమ్మతించె. ౧౪౯.

ఉ. శ్రీకర! సుప్రసాద! సరసీజభవార్చితదివ్యపాద! సు
శ్లోకశివావినోద! శ్రితలోకసదావనమోద! భక్తహృ
ద్వ్యాకులభంగ! ఘోరతరదానవలోకతమఃపతంగ! ద
ర్వీకరరాజహార! సువివేకిమనోంబుజబాలభాస్కరా! ౧౫౦.

క. విషధరనికరవిభూషణ!, విషమశరప్రాణహరణ! వృజినవిదళనా!
విషరుహరవిశశిలోచన!, విషరుహదళనేత్రబాణ! విద్విడ్దహనా! ౧౫౧.

క. శాపాయుధబాలకహృ, త్తాపహరా! పవనభంగ! ధరణిశతాంగా!
తాపసహృదబ్జభృంగా!, కాపురుషోన్మదవిభంగ! కంధినిషంగా! ౧౫౨.

గద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర కౌశికసగోత్రపవిత్ర జయంతికులకలశార్ణవరాకాకైరవమిత్ర భావనారాయణపౌత్ర రామవార్యపుత్ర వేంకమాంబాగర్భశుక్తిముక్తాఫల సకలబుధజనసేవాపరాయణ భావనారాయణప్రణీతంబయిన సుమిత్రచరిత్రంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీభీమలింగార్పణమస్తు.

---

శ్రీరస్తు.

శ్రీభీమలింగాయనమః.

# సుమిత్రచరిత్రము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీవేంకమాంబికాకృతి, సేవాపరితృప్తహృదయ! శ్రితసుమనస్సం
భావితపదకమల! మహా, దేవా! భీమేశలింగ! దివ్యతరాంగా! ౧.

వ. దేవా! యనంతరకథావిధానంబు సావధానంబుగ నవధరింపు మట్లు బహుమానుండు పలికిన పలుకులకియ్యకొని మలయాలయేశ్వరుండు శక్రోత్సవసమయంబు ప్రతీక్షించుచుండె. ౨.

గీ. అంతనొకనాఁడు వల్లవులమరనాథు, నుత్సవము సేయ సమకట్టి యూరిబయలఁ
బొదలు భూధరరాజంబు పొంతకరిగి, సలుపుచుండిరి పూజలాసమయమునను. ౩.

సీ. ఆనందరసపూరితాంతరంగములతో సారెకుఁ ద్రుళ్లుచుఁ గేరువారు
కులము వారలతోడఁ గూడి బంతులు సాగి కూర్చుండి విందులు గుడుచువారు
తమభార్యలకుఁ బ్రియతమమైనవస్తువులెలమిని గొని తెచ్చి యిచ్చువారు
అమృతప్పెల్లనాదమ్ము పిక్కటిలంగ వజ్రిపై గీతముల్ పాడువారు
కొమ్ముబూరలు గొని యాకసమ్ము వగులు, నట్లు గానూఁది సంతోసమందువారు
పద్మదళనేత్రుసుద్దులు పలుకువారు, నగుచు వల్లవులుత్సాహమందుచుండ్రి. ౪.

సీ. దధిదుగ్ధముఖపదార్థముల బృందారకాధీశు జలకంబులార్చువారు
గ్రావజావరణరాజీవద్వయంబు హృజ్జలజంబులను నిల్పి కొలుచువారు
ఘనఫలాహారముల్ గొనివచ్చి గాలిగంగలకిచ్చి ప్రస్తుతుల్ సలుపువారు
భూసురాశీర్వాదములకు నానందించి భూరిదక్షిణలిచ్చి మ్రొక్కువారు
దర్శనాగతవిబుధసంతతికి నర్హ, విధిని గౌరవమొనరింపవేచువారు
హితజనాళికి బహుమతులిచ్చువారు, నగుచు సంతోషపరవశులైరి వ్రజులు. ౫.

గీ. పటకుటీరసమీపభూభాగమునను, వఱలు శాడ్వలతలమున వ్రజకుమారు
లాడుచుండిరి తలిదండ్రులధికకౌతు, కమున విస్తారితాక్షులై కనుచునుండ. ౬.

వ. ఇట్లు వల్లవులెల్లను మహోల్లాసంబున సురవల్లభునుత్సవంబు జరుపుచున్న సమయంబున. ౭.

సీ. కొప్పునవలరాజకుసుమమాలికలతోఁ గురులనంపెఁగతావిసరసమాడఁ
గంఠసంగతమౌక్తికప్రకరములతోఁ మాణిక్యరోచులుమాఱుమలయ
వరకపోలచ్ఛవుల్ దరహాసచంద్రికల్ గలసియొండొంటితోఁ జెలిమిసలుప
ముక్కుముంగరకెంపుమోవిరంగులసొంపు మొగమునకొకవింతసొగసుగూర్పఁ
గలికిపదియాఱువన్నెబంగారునగల, జిగులుదేహప్రభలతోడఁ జేరివెలుఁగ
క్షితినిజరియించుచంచలాలతికవోలెఁ, దరలివచ్చెనుభ్రమతి సంతసమెలర్ప. ౮.

ఆ. ఇట్టులేగుదెంచియిలువేల్పులకుమ్రొక్కి, తల్లిదండ్రులకుముదంబుగదుర
వందనములొనర్చి పార్వతీదేవ్యాల, యంబుఁజొచ్చివినయమతిశయింప. ౯.

పంచచామరము.

కరద్వయంబుమోముఁజేర్చి ; కన్నుదోయిమూయుచున్ ;
శిరంబువంచి ; తద్భవానిచేష్టలెంచి „శాంకరీ!
నిరంతరంబునీదుపాదనీరజంబులన్మదిన్
గరంబుభక్తిఁగొల్చునట్లుగాననుగ్రహింపవే. ౧౦.

సీ. ఆద్యంతశూన్యమై యలరుతత్త్వము నీవ నిఖిలవస్తువులందు నెగడెదీవ
మూఁడుమూర్తులకునుమూలకందము నీవ పంచభూతములంగుఁ బ్రబలుదీవ
అండఱశక్తులకాధారమే నీవ సచరాచరంబైనజగము నీవ
దుష్టులపాలింటిదోఁకచుక్కవు నీవ శిష్టులకును బెట్టుచెట్టవీవ
బహుళపాపౌఘములనెల్ల భస్మముగను, బొనరుచుచు భక్తులనుబ్రోచుజననివీవ
పరమశివునర్ధదేహమై పరఁగెదీవ, తల్లి! నిన్నెన్న నేనెంతదాననమ్మ. ౧౧.

ఆ. ఏనుగోరికొనినయెమ్మెకానిని నాకు, జీవితేశ్వరునిగఁ జేయుమమ్మ
తొంటిసతులతోడఁ దులఁదూఁగఁజాలుక్రొ, త్తడితనమ్మునిమ్ముదయదలిర్ప." ౧౨.

గీ. అనిపలుతెఱంగులను వేఁడియలరుబోఁడి, దేవళంబును వెలువడి జీవితేశుఁ
డైనభద్రునివెనుకంగనభిలషించి, మెలఁగఁదొడఁగెఁదదుత్సవస్థలమునందు. ౧౩.

సీ. పురుహూతవిగ్రహంబును నిల్పి వల్లవుల్ వేడ్కమైఁ బూజగావించుచోటుఁ
గర్పూరహారతుల్ కాళీమహాదేవికలరు బోండ్లర్పించునట్టిచోటు
సురపాలపల్లవప్రాకారతోరణములచేఁ జెలువారుపందిళ్లుగలుగుచోటు
బల్యన్నములఁదెచ్చి భక్తిమై గాలిగంగలకిచ్చునలతలపాలుపుఁజోటు

బర్హిబర్హంబుఁ గైకొని పద్మనేత్రు, సుద్దులను గాన మొనరించుచోట్లఁ జూచి
ప్రాణనాయకుఁ గానక పడఁతి మిన్న, విరహమును బొందిక న్నీరు విడువఁ జొచ్చె. ౧౪.

క. అడుగిడఁ దలంచు ననుగంటం, బడిన సఖీమణుల ; సిగ్గుపైకొననుడుగుల్ ;
బడఁతుల నేఁచకుమనుచున్, వెడవిలువోరఁ గేలుసాచి వేఁడును వెసఁగై. ౧౫.

ఇ. ఇట్టులాపికవాణి యోపికమాలి మారమదాపతాపంబునఁ గోపంబాలక తదుత్సవంబున నిలువనొల్లక దవ్వులం జెలంగు నొకమాకందంబు క్రిందం గూరుచుండి ప్రాణేశ్వరు శృంగారప్రసంగంబుం దలంచుకొనుచు సుఖంబు నపనయించుచుండె నంత. ౧౬.

చ. కమలిని క్రుంగ ; జక్కవలు కారియ నొందికలంగఁ ; దమ్మికల్
ప్రమహితకౌతుకంబున నెల్మిఁ బొంగ ; సుమాయుధుండు నే
ర్పమరఁగఁ బాంధపాళిపయి నల్గులు లోఁగించిలుకంగ ; నల్లప
శ్చిమమున కిర్ల గొంగ కను ప్రఘుమునం జని క్రుంగె నర్తుఁడున్. ౧౭.

సీ. ఆభీరబాలకు లాలజంగిలితోడఁ జేరిరి నైజకుటీరసీమఁ
బక్షిమూధిపదివ్యభవనస్థగితరత్న రక్తిమం బనసాంధ్యరాగ మడరెఁ
గర్షకుల్ తమ సేద్యకర్మముల్ ముగియించి చనిరి గేములకు విశ్రాంతి నొందఁ
దతతమోదైత్యనేత్రప్రవద్విస్ఫులింగములన నత్యోతిరంగణము లలరె
గూండ్లఁ దూఱెను విహగముల్ ; గుమ్మగాంబ, లెల్ల దెసలకు వెలువడె నెరను నెమకఁ;
దమ్ములను గూర్కె మదషట్పదమ్ము లెలమి, నంధకారంబు పాంథులనలఁచఁ దొడఁగె. ౧౮.

గీ. అంతరిక్షాబ్ధికన్యాముఖాంబుజాత, కలితప్రస్వేదజలబిందుగణమనంగ
స్వచ్ఛరుచిఁ బొల్చె నక్షత్రసముదయంబు, మల్లికాపుష్పనికరంబు మాడ్కి మింట. ౧౯.

చ. కుముగని హృత్పుటాంతరమకుంఠమదబ్ధిని నోలలాడఁ, జ
క్రములు వియోగతాపమునఁ గ్రాఁగి కలంగు మనోడుపీడఁ; ద
త్కుముదినికిన్ ముఖాబ్జమున గాటపు విన్నఁదనంబు గూడఁ; జం
ద్రముఁ డుదయించెఁ దూర్పునఁ గరంబుఁ జకోరము లుత్సహింపఁగన్. ౨౦.

చ. “ పరుఁ డొకఁ డొంతదవ్వ పెడఁబాసి చనంగ నెతమ్మికొమ్మయున్
బరమసతీత్వగౌరవముఁ బాడఱఁ జేసి మిళిందభర్తమం
దిరమునఁ జేర్చికూడె” నని దెప్పుచున వ్వనసంగఁ గల్వపూ
విరిసెమ; బద్మినీరమణి విన్నఁదనంబున వాంచె నాదలన్. ౨౧.

గీ. పాలమున్నీరు బడబాగ్ని వలనఁ బొంగి, తెల్లవిరిసెవవంగను; వెండికొండ
యొరగలిఁ గరంగి లోకంబులెల్ల నిండె, నన గ నెల్లెడ వెన్నెలలలము కొనియె. ౨౨.

క. గగనస్థలి తన్నువలరా, జగముంచిన చంద్రుఁ గాంచి పనటను మాటా
డఁగలేక కనుల నశ్రులు, మొగినించె ననంగ మంచు బ్బొట్టులు గురిసెన్. ౨౩.

ఉ. అత్తఱిఁ జిత్తజల్లు గననంగుఁడు తీవ్రతరాశుగంబులన్
బుత్తడిబొమ్మపైఁ గురియ భూమిఁ పయింబడి సొమ్మసిల్లి; రే
కత్తిన తెల్విమైఁ దలిసి; కీరతురంగుని బారికోర్వక
ట్టుత్తలమందఁ జూగెఁ దనయుల్లమునన్ బ్రియమిత్రు నెంచుచున్. ౨౪.

చ. "మొనయు పిసాళి తేంట్ల బలుమూకలకున్; వలిగాలి ధాటికిన్;
మనసిజుఁడేయు గాఢతర మార్గణపంక్తులఁ బుట్టు కాఁకకున్;
వనజవిరోధి రాకకును; బల్మిఁ గూయు పికాళి పేఁకకున్;
దనువును నిల్పిరేఁ క్రియను దాల్చి వహింతును! జీవితేశ్వరా! ౨౫.

ఉ. నీముఖచంద్రమండలము నెమ్మి మెయిం గనకున్న నెట్టు లీ
కామమహాతమంబడఁగుఁ? గ్రన్నన నీయధరామృతంబు నే
నేమఱుఁ గ్రోలకున్న నెటు వీడును నీవిరహజ్వరార్తి! భా
మాముఖపుండరీక నవభాస్కర సన్నిభ! సద్యశస్కరా! ౨౬.

ఉ. సౌరవిలాసి నీహృదయ సంపదలై నహరింపఁ జాలు నీ
భూరితరాతిరూపమును బొల్పుగఁ జూచిన యంతమాత్ర నే
మారక ఘోరసాయక సమాజకృశానుని పాలుగాక యే
సారసపత్రనేత్ర కుపశంబు దృఢత్వమునూని నిల్వఁగన్. ౨౭.

చ. "ఇది యుగు ఱెంతునంచుఁ జని యిప్పటికైనను రాకయుంటివో
సదయుఁడ! నిన్ను నేమనఁగఁ జాలుదు; ధర్మమె యేఁచ ముగ్ధలన్;
మదనమహాగ్ని మధ్యఁ బడి క్రమ్మగ్గడు నా దురవస్థకొంతనీ
మదికి నినాఁటె నేనిలనమాత్రము జంపొనరింప నెంతువా! ౨౮.

క. ఆలింపుము నామనవిని; దేలింపుము దఖ్ఖి నీదుతీయనినుడులన్;
బాలింపుము మన్మథుఁడను, పాలసుపెను బారిఁ జిక్కఁబడలక యుండన్. ౨౯.

ఆ. కూర్మికాఁడవైనఁ; గూర్చుచుట్టమవైన, నీవసుమ్ము నమ్మునిక్కువమ్ము
మున్నె నాదు హృదయమును నీకు నొసఁగితిఁ, దనువు గూడ నిదిగొ గొనుము సఖుఁడ!"

చ. అని పలవించుఁ; గన్నుఁ గవ నశ్రులు నించు; వహించు గంపమున్;
దమవిఁక నేలయుంచుఁ గడుఁ దత్తఱపాటున నేవగించు; దాఁ

పువవగ కాని సంచుఁగని పొందుఁ; గలంచుఁదలంచుఁ; దన్నుఁదాఁ
ననిశముఁగుస్తరించుఁ; గుసుమాయుధుమూర్ణను మెంచుఖిన్నయై. ౩౧.

ఆ. కైరవాప్తుఁదిట్టుఁగలహంసములఁగొట్టు, జిలుకగములఁబట్టి చెఱను బెట్టుఁ
గెంపుకంట్లనట్టువంపుఁబిట్టలరట్టు, గలుగునట్టుదిట్టుక సరికొట్టు. ౩౨.

ఉ. చీమ దిటుక్కుమన్నఁదనజీవవిభుండని భ్రాంతిపొందితా
వేమఱుఁదొంగిచొంగికను; విన్నఁదనంబును బొందుఁగాని చోఁ;
దామరసాక్షి మోహపరితాపము దేమసవచ్చునద్దిరా!
కాముని బోలు మేటివిలుకాఁడల కాముఁడెయెంచి చూచినన్. ౩౩.

ఉ. మానవనాథుఁడంత బహుమానుని తోడను మాఱువేసముం
బూని పురందరోత్సవము పొంతకు వచ్చెను వృష్ణిగోప స
మ్మానము నొంద; దీక్షను కుమారుని చర్య పరీక్ష సేయు; నా
మానిని తల్లిదండ్రులను మాటలతోడ నెమందలింపఁగన్. ౩౪.

ఉ. వచ్చినవాఁడు తోఁడను మవల్లవవృష్ణుఁడెఱుంగకుండియున్
బొచ్చెము లేక యాదరణముం బొనరించెను గూర్తిమైఁ; బరుల్
వచ్చిననైన నుత్సవపుఁబట్టుల గౌరవమాచరించుటల్
హెచ్చిన ధర్మమై ప్రజాలయింపలను బూర్వమునుండి వెల్లుటన్. ౩౫.

ఆ. ఇట్టులాదరించి యెంతయు నతిథిప, త్కారవినులుజరిపి తమ్ముఁగలిసి
యుత్సవమునఁ జొచ్చి యుల్లాసమందంగ, వేఁడికొని యెమిగుల సినయమునను. ౩౬.

క. జననాథుఁడందులకునీ, కొనియానందడినిదనదు కొమరుని పోకల్
కని పెట్టఁదిరుగుచుండెను, గవలెద మాటికిని రేఁపఁగా సచివునితోన్. ౩౭.

వ. ఇట్లు తిరుగుచు నయ్యుత్సవంబున కెడగలుగంజని యొకానొక తావున. ౩౮.

సీ. కళలెల్ల నిండి చక్కఁగ వెలింగెడి చంద్రమామఁగేరెడు ముద్దుమోముదాని
శతపత్రనికర సంగత సౌకుమార్యంబు హసియించు నేత్రద్వయంబుదాని
గున్నమామిడి పంటిగుజ్జానికూయు చిల్కల మేనతికమాడు పలుకుదానిఁ
బదియాఱువన్నె క్రొంబసిఁడి చాయల నిగ్గు నగఁజాలు నెమ్మేని జిగులదానిఁ
జిన్నివాతెఱనమృతంబు చిలుకుదాని, విమల సద్గుణపుంజమై వెలయుదాని
నడఁకువకు నాటపట్టయి యలరుదానిఁ, బ్రమతిఁగన్గొనె నాశ్చర్యభరితుఁడగుచు. ౩౯.

క. కనుఁగొని యామచక్రం, దనమును వేనోళ్లఁబొగడి తనసుతుఁడు వరిం
చినవల్లవకన్య యొకో, యనిమనమున సందియంబునందుచు నుండెన్. ౪౦.

సీ. రతిఁ గేరు సతి సౌరు మతి మెచ్చి యతనుండు మేనూని ప్రత్యక్షమైనయట్లు
కామినీమోహాంధకారంబు వోరింప బాలభానుఁడు నేలవాలినట్లు
తరుణీమణీ మనస్తాపంబు వాపంగ నింగి జాబిలి భూమి నిలిచినట్లు
సురసుందరుల నవ్వు సుదతి సొంపును జూడ జగతి క్రింద సుతుండు డిగినయట్లు
రంభ పైవల్గి నలకూబరప్రభుండు, తెఱవదాస్యంబుఁ గోరి యేతెంచినట్లు
భద్రవేషంబునను రామవర్మప్రముతి, సరసకగుడెంచె నెంతయు సంతసమున. ౪౧.

వ. ఇట్లు వచ్చిన నిజసూనుని మానవనాథుం డానవాలుపట్టి బహుమానునికిం జెప్పి "యిక్కాముకీకాముకులకుం జరగు శృంగారప్రసంగంబు నాలింతువుగాని నా వెనువెంట రమ్మ"ని తోడ్కొని చని యొక రహస్యస్థలంబున డాఁగియుండె నక్కడ ప్రముతి రాకొమరుం జూచి యిట్లనియె. ౪౨.

ఉ. "జాలము జేసి ; పుష్పశరజాలము పాలొనరించి పోవనే
లీల సహించెనీ మనసు ; లేశమయేని యునీకునక్కటా !
జాలిజనింపలేదొ ; పెలుచాన యొకర్తుక నాపయిం దమిన్
డీలువడంగఁ జేసెనొ ; వడిన్ వినిపింపుమ నుంగుచుట్టమా ! ౪౩.

ఆ. అన్నిటికిని నీవె యునినమ్ముకొని మహా, కాననములనైనఁ గౌతుకమున
నిన్నుఁ గూడియుండ నే నెంచుకొనియుంటి, నకట ! వేఱు సేయనగునె నీకు. ౪౪.

గీ. వామనము నిట్లు నవనీతకోమలముగఁ, జేసి నీహృదిపడుకు గాఁ జేసినట్టి
కమలసంభవునన వలెఁ గాక నిన్ను, వ్యర్థముగ ననఫల మేమి ! వన్నెకాఁడ ! ౪౫.

గీ. అలిగి విడనాడ విడనీ యుదతి వమనసు, పురుషుని యెడందమాత్రమప్పోల్కిఁ గాదు
మగలు మగువల మదులొక్కపగిది యాగుచు, వాక్కునర్థంబు చందాన వఱలుటరుదు. ౪౬.

చ. గురువిరహంబునం దనువు క్రుస్యఁగ ; వెన్నెల నెండి ; మారుతీ
వరమగు పూలకోర్ల బలువానను నాని ; సుగంధశైలదు
ర్భరపవనంపుఁ బెన్వడను బాధలనొంది ; తపంబు నీకునై
జరుపుచునున్న దాననుఁ బ్రసన్నుఁడవేటికిఁ గావు ! చెప్పుమా. ౪౭.

క. విరహదవానలమునఁ బడి, పరితాపము నొందుచుండు వారలకుత్తుణం
బరయఁగ యుంగమని యెంతేఁగిన, సరసుఁడవై తేనిజంపు సలుపవు గాదే ౪౮.

క. కనుఁగొనుము కంఠసంగత, ఘనమౌక్తికహారవితతి కామజ్వరపీ
డనమున నుగ్రాఁగి హారినీ, లనికాయాకృతిధరించె లలితగుణాఢ్యా ! ౪౯.

క. కాలాగురులేపనముం, బోలెఁదలిర్చెడునుమేనఁబూసినగంధం
బాలరిపైయెమదనుఁడుశర, జాలముతనువుననుజిత్తజల్లుగఁగురియున్." ౫౦.

క. అనిపలికిపొంగివచ్చెడు, వనటనడంపంగలేకవనితామణియొ
య్యననేడ్చెంబరపుష్ప, స్వనముననిజజీవితేశుస్వాంతముకరుఁగన్. ౫౧.

ఆ. భర్తుఁడంతగోపభామినీరత్నంబు, నూరుతలముఁజేర్చిగారవించి
కురులుచిక్కుదీసిగురుతరప్రేమని, ట్లనియెఁదనపలుకులనమృతమొలుక. ౫౨.

చ. "మనముభవస్తనంబుననుమాటికిలగ్నముచేసిపోవనే
వనితకుసాధ్యమౌను ; మగువా ! తగవాయిటులాడబేలవై !
తనువెటసంచరించిననుదప్పకప్రాణములెప్డునీదుప
ద్వనజయుగంబుచెంగటనెదాస్యమొనర్చెడునంచెఱుంగవే. ౫౩.

చ. సరసిజనేత్ర ! నీకనులపన్నమెలంగెడువాఁడఁగాక ; నేఁ
బరుఁడనె ! బేలవైయిటులపల్కెదవేటికి ! రాజకార్యత
త్పరతనునింతసేపునెకతావుననిల్వకతప్పదయ్యె ; హృ
త్సరసిజమందునాయెడలసందియమందకుమెంతమాత్రమున్. ౫౪.

ఆ. చక్రవర్తిపదముసంప్రాప్తమైనను, వదలివైతుగడ్డిపరకవోలె
నీదుచెలిమివిడువనేరనిద్దియెనాదు, నిశ్చయమ్మునమ్మునీరజాక్షి ! ౫౫.

గీ. జాగుచేసిననేరంబుసైపుమింక, నెన్నఁడిట్టులనొనరింపనింతిమిన్న !
అతనుఁజేసెడితీవ్రసాయకములకును, దాళఁజాలనుసాఁకుముదయదలిర్ప. ౫౬.

చ. అలుకదొరంగినాపయిఁగృపామృతవృష్టినిజిమ్మికౌఁగిటన్
నిలుపుము ; మోవితేనియలనిమ్మినొసంగుము ; లాఁతివానిగాఁ
దలఁపకవైశ్రమంపడఁగఁదన్విరో ! పీవఁగనిమ్ము ; నీదుప
జ్జలరుహసన్నిధానపరిచారకుఁజేయుముకేలుమోడ్చెదన్." ౫౭.

వ. అని మోహాతిరేకంబునఁ బలికినపలుకుల కచ్చెలుకలకొలికి యలరి తన చెలువున కా
లింగన సుఖంబొసంగి ; చుంబనదానంబుం గటాక్షించి ; సల్లాపసుఖ కల్లోలిని నో
లలాడించుచుండెనంత. ౫౮.

ఉ. వెన్నెలతేటతోఁబడవువేడ్కమెలంగియనంతరంబరే
యున్నులమిన్ననైజగృహమ్ములఁజేరెడువేళఁగ్రొవ్విదన్
జెన్నలుగుల్కుమల్లెపువుచెండొగిజాతిననంగసత్ప్రభా
భ్యున్నతివేగఁజూడ్కనసునోత్సవముంబొసరించెదూర్పునన్. ౫౯.

ఆ. పగలుసేయ నేఁడువచ్చునన్నెగడునఁ, బోవుచున్న చంద్రువలను గాంచి
చుక్కలెల్లమిగుల ద్రుక్కెనువానితో, దివ్వెయులును గూడఁ దెలివితప్పె. ౬౦.

గీ. అలజగద్బాంధవుని రాకకరుచమందు, మేదినీనిర్జరాశీర్న్నినాదమనఁగఁ
గర్ణపర్వంబుసేయుచు మఁగడుఁజెలంగె, ద్విజనికరసుస్వరంబులు దిక్కులందు. ౬౧.

సీ. పద్మినీనికరంబు ప్రాగ్భవంబునఁ జేసికొన్న పున్నియములకుప్ప యనఁగఁ
బ్రాక్సతీమణిఫాలభాగంబునం దొప్పు తీర్ణనసింధూరతిలకమనఁగ
పరచక్రవాకజంపతులనొక్కటిగాఁగఁ గలుపవచ్చిన పెత్తగాఁడనంగఁ
బ్రజలొనర్చెడు పుణ్యపాపముల్ పరికింపసర్వేశుఁ డంపినచారుఁడనఁగ
నంధకారాంబునిధిశ్రమమున్ దుదేహ, ధాగలమయూఖరజ్జుసంతతులచేత
మీఁదికెత్తంగవచ్చినమిత్రుఁడనఁగ, బాలభాస్కరుఁడుదయాద్రిఁ బరిఢవిల్లె. —

వ. ఆ సమయంబున. ౬౩.

గీ. అటని గూఢంబుగానున్న యువనిపతికిఁ, బడఁతినుడివినముదువులప్రౌఢమయ్యె
వీనులకుఁజాలమధురమైవిందుసేయ, నచ్చెరువునొందనిజమంత్రికనియెనిట్లు.- ౬౪.

ఉ. "హీనతరాన్వవాయములనింతటిచక్కఁదనంబుగల్గెఁ గొం
దే వెలఁజిల్కుపల్కులమదింగరఁగించెడుముద్దుగుమ్మలం
గానము పూర్వమెయ్యెడలఁ ; గౌతుకముంగలిగించెడుం బళే !
దీనిమనోహరాకృతియు ; దీనిచొకాటపుముద్దుపల్కులున్. ౬౫.

గీ. వనితసంభాషణమునఁబ్రవర్తనమున, హీనకులజాతియనుటకునించుకైన
కొరకదాధారమేమియు చ్చుతమొ సేను, గనుఁగొనినయంతదనుకనోయనఘచరిత!"

చ. అనబహుమానుఁడిట్లనియె "నామతిసందియమేల ! నీ పెపా
వనమొనరించెగోపకులవారిధి ; నీ మెసురూపపత్పవి
ర్తనములఁగన్న మన్మథశరంబులఁజిక్కరెయోగులైన ; నీ
యనుఁగునినుంగు మేలుపడుటబ్బురమేనరపాలశేఖరా!" ౬౬.

చ. అనవుడు గొల్లవానికడ కాన్నపచంద్రముఁ డేగి "యోయినీ
తనయకుఁ బ్రేమగల్గనొకదాసునిపోలికనుండి ; మోహసం
జనకమృదూక్తులన్వినయసంపద యచ్చువడంగఁ బల్కునా
జనుఁ డెవఁడ" న్నఁ గోపుఁడురసాధవమాళిని గాంచియిట్లనున్. ౬౭.

ఆ. అతఁడుభద్రుఁడనెడు నాభీరబాలుండు; మనసునందు నాకొమార్తెమీఁద
వలపుమిక్కుటముగనలరారుచున్నట్లు, తెలుపుచున్న వాఁడు దినదినంబు. ౬౮.

చ. అతనికి నాకుమారికను హాళిని బెండిలియాడు యోగిమా
శతధృతి వ్రాసెనే నియును స్వప్నమునందును జూడఁబోనియ
ద్భుతమగు లాభము న్గనుచుఁ బొల్తుక రాఁగలదం" చుఁ బల్కి తా
మతినిదలంచె భూషణసమాజము నమ్మఁగనున్న వంచఁ గోరికన్. ౨౦.

ఆ. గొల్లవానిపుడు కుపలయాధీశుండు, వదలిసుతుఁడు రామపర్ణయున్న
తానకమున కేగి తనయెలుంగును మార్చి, పలికెఁ బరుఁ డెవండొ పలికినట్లు. ౨౧.

గీ. "ఓకుమారక! వేడ్కగానుత్సవంబు, జరుగుచుండఁగ దానిననడ్డ చేసి
మఱియొక పదార్థమున నీదుమనసు లగ్న, మగునటులతోఁచుచున్న దీయవసరమున. ౨౨.

ఆ. నాదుజవ్వనంబు నమడెందమునకును, దగిలినట్టి మంచిచిగురుబోండ్ల
కెన్నొ సూఢిదలను నెలమి మైఁబంపించి, వశము చేసికొనెడివాఁడ మున్ను. ౨౩.

చ. అలుతవినోదవస్తువుల నమ్మెడివాఁడొ గిఁబోవుచుండ నీ
తెలవకు నొక్కటైనఁ గొని తెచ్చియొ సంగకయుంటఁ జూడనీ
తెలుఁగు విచిత్రమయ్యెడు భవదీయమనోగతమేమొ తెల్పవె
చ్చెరను శ్రుతిద్వయంబునకుఁ జేయ వెలుండువు గోపబాలకా!" ౨౪.

వ. అనవుడు రాజతనయుండు తన జనని కంఠస్వరంబు గుఱుతిడఁజాలక పరుండను
తలంపున నిట్లనియె. ౨౫.

క. "వినుమట్టి స్వల్పవస్తువు, లను నీయమలెక్కగొనదు లవమైనను, నా
మనమున నెదాఁచఁబడెనే, వనితామణికిష్టమైన వస్తువు మనసే!" ౨౬.

వ. అని పలికి తన కలికివంకఁ దిరిగి యిట్లనియె. ౨౭.

ఆ. "పూర్వమెపుడొ నిన్నుఁ బోలిననవనీత, కోమలాంగి నొకర్తెఁ గోరి వలచి
మెలఁగియున్న యీ ముసల్మా నాలకింపనా, మనసు తెలుపువాఁడ వినుము ప్రమతి!" ౨౮.

వ. అని యంతటనైన విరమింపక మఱల ధరణీశ్వరువంకఁ దిరిగి "మా పరిణయనిర్ణయంబుఁ
గనుము. ఈ నెలఁతకు నాపలిపిన వాగ్దానంబునకీవు సాక్షిభావంబు వహింపు" మని
యడుగ నప్పుడమి ఱేఁడప్పుడు తన ప్రచ్ఛన్న వేషంబు బరిత్యజించి నిజస్వరూపంబుతోఁ
బ్రత్యక్షమై కుమారుని గద్దించుచు నిట్లనియె. ౨౯.

క. "కనుఁగొని యెదఁ బరిణయమో, ఏనమో కలుషాత్మ! పూతసవితృకులమున
జనియించి గోపకన్యను, గొనియెలువడినడఁగఁ జేసుఁ గోరితె! చెడుగా. ౩౦.

ఆ. సాటిలేని యశము సంపాదనము చేసి, వంశమునకు మిగుల వన్నె తెత్తు
వనుచు నమ్మియుంటి నక్కటా! నీవిట్లు, పలువవగుదువనుచుఁ దలఁపనైతి. ౩౧.

చ. గరిమమహాకులీనయగు కన్యను దోర్కొని వచ్చి ; నీకు నేఁ,
బరమకుతూహలంబునను బట్టపుదేవిని జేయ నెంచ ! సా
దరమతి వెట్టిగొల్లమగుడం గొనినిర్మలమైన కీర్తియుక్
బరువు వమ బాము చేయుటకుఁ బాల్పడితే ! దురితాత్మ ! యిర్ష్యాదర్క్."  ౨౦౨.

వ. అని బహుప్రకారంబులఁ గుమారునిదూఱి యనంతరమా నారీమణివంకఁ దిరిగి యి
ట్లనియె.  ౨౦౩.

గీ. "ఇంకముందెప్పుడైనను నిటకు మరల, నిటఁ డువచ్చుటకంగీకరించితేని
నీకు నీతండ్రికినిగూడ నెనరువిడిచి, మరణదండనవిధియింతు మగువమిన్న"  ౨౦౪.

క. అని బెదరించి యమాత్యునిఁ, గని "నీవిదుండఁగ నీగడురయమునఁ దో
కొనిరమ్ము" నినుడువు మఁ జనె, జనపాలుఁడు కినుక నాత్మసదనంబునకుక్.  ౨౦౫.

గీ. పార్థివకుమారికా స్వభావంబు దాఁగి, యుండనేరదు గానవట్లు గ్రుఁడగు మఁ
బ్రభువు వెడలంగ నతనిఁ గ్రూరప్రసంగ, మునకుఁ గోపించి ప్రమతి యిట్లను చుఁ బలికె.  ౨౦౬.

సీ. "మనకందఱకును జేటొనగూడను న్నమనవుడించుక యుభయమందలేదు
ఇరుమాఁడు సాయలాభరణీకుఁ బలికించి "మీరాజభవనంబు మీఁద వెలుఁగు
భాస్కరుండే శంకపడకుండ మా గొల్ల గూడెంబు మీఁదను గూడ మొగిని
వెలుఁగుచు మిమ్ము మమ్ములనొక్క రీతి నేకనుచున్నవాఁడు వేగనులతోడ"
నను చు మొకమోట విడిచి నేనతని మదికిఁ, దాఁకునట్లుగ మొగముమీఁద నెవచింప
వలయునను కొంటి" నను చును బలికిపిదపఁ, గొందలము గ్రమ్మ నిట్లనుఁ గుందరదన.  ౨౦౭.

ఆ. "ఇంతదనుక నేన దేమి మొకలఁ గాంచఁ, బోలు ; నింకనిపుడు మేలుకొంటి
నిష్టవిషయములను నిసుమంతయేని నా, హృదయమునకుఁ గష్టమొదవనీను.  ౨౦౮.

గీ. ననువిడిచి మీరు మిత్రోవఁ జనుఁడు నాదు, మేఁకలను జుట్టుపట్టుల మేపికొను చుఁ
బిలికికొను చును బాల ; నా వెతలు నేను, పడెద" ననుచును నిస్పృహఁ బలికెఁ గలికి.  ౨౦౯.

వ. అనిపలికి కొంతవడికిం దెలివి తెచ్చుకొని తనపజ్జల నిర్విణ్ణుండైయున్న రాజపుత్రుం
గాంచి కన్నులనీరు వెట్టుకొనుచు నిట్లనియె.  ౨౧౦.

సీ. "పార్థివత్వము తృణప్రాయంబుగా నెంచి తగ గోపవేషంబుఁ దాల్చినావు
కమనీయ రాజసౌధములకు ద్వ్యజియించినీ దమగృహములనిలిచినావు
ఘనులుండు పేరోలగములు కాదనిరోసి మామందకొలువుగా మార్చినావు
సచివసామంతపౌరచయంబు నెడఁబాసి వెడగుగొల్లల చెల్మి వేఁడినావు

శాంతిమద్రత్న పటలసంఘటితభూషణములు వలదని బర్హి పింఛము ధరించి
మాకులము వారితోడను మసలినావు, నాలిమిత్తంబునను నరనాథతనయ ! ౯౧.

ఉ. దైవము నేఁడు సర్వము పృథాయోనరిం చెనిఁకెట్లు ప్రాణముల్
పోవక యుండనిల్పుదును ! బొందిని వీడిననిల్వ నేర్చునే
జీవము లెన్నఁడైనను ! ప్రసిద్ధగుణాకర ! మేను వాసియా
దైవతలోకమునఁ గనెదఁ దావక పత్కమలంబులెంచుచున్. ౯౨.

ఆ. చెలిమి కాఁడ ! నిన్నుఁ గలసి సుఖించెదు, భాగ్యమిపుడు నాకు వ్యర్థమయ్యెఁ
గనుక ముందు జన్మమున నైన భగవంతుఁ, గొలిచి నీదు ముద్దుచెలియనగుదు. ౯౩.

వ. ఇప్పటికింతయే యదృష్టంబనుకొని నిశ్చింతస్వాంతుండవై నిశాంతంబున కరుగుము. భవజ్జనకుని కోపానలంబు పాలుగాక తదాజ్ఞానువర్తివై ప్రవర్తింపుము. నారెయెడం గలుగు మోహలతాజాలంబును వివేకకరవాలంబున మూలచ్ఛేదంబు గావించి మరణంబున కనుజ్ఞ నొసంగుము. నీపడిన ప్రయాసంబునకుఁ దగిన ప్రత్యుపకారంబు సేయఁజాలని నా నేరంబు సైరింపుమిదె జోహారువు లొనరించెద”నని వియోగదుఃఖాతిరేకంబునం బలుక నా రాకొమరుం డతివ్యాకులహృదయుండై కన్నీరు మున్నీరుగాఁగాఱ నయ్యన్నులతలమిన్నం గాంచి గద్గదస్వరంబున నిట్లనియె. ౯౪.

ఆ. “రమణి ! నీవులేని రాజ్యంబు నాకేల!, రత్నరాసులేల ; రామలేల !
కోటలేల ! పూలతోఁటలేల ! పసిండి, మేడలేల ! కడిఁదివాడలేల ! ౯౫.

ఆ. నీవులేక యున్న నిఖిలంబు శూన్యంబు, నీవు నాదు చెంతనిలిచియున్న
నిరయమైన నాకు సురలోకతుల్యంబు, చారుశారదేందుసదృశవదన ! ౯౬.

సీ. పార్వణచంద్రబింబముఁ గేరు నీముఖకమలంబుఁ గన్నారఁ గానకున్న
నమృతప్రవాహంబు ననుకరించెడు నీదు చిన్నారి నుడి చెవిఁజేర్పకున్నఁ
బల్లవ ప్రమదిమంబుఁ బరిహసింపఁగఁజాలు నీ కేల నెమ్మేను నిమురకున్నఁ
గటికరాలైనను గరఁగెడు చందానవీణియ మీటి మెప్పింపకున్న
నతనుఁడు గ్రతనిక్షుశరాసనమున, మార్గణావళి సంధించి మర్మమరసి
యేసి యసువులు గొనకున్నె యింతలోన! నింతి ! నీతోడిదే లోకమింక నాకు. ౯౭.

క. ననుఁ బాసి నిగవీక్షింపకు, నెను వెంట నెపత్తుమరని వెతకోరు నఁజా
లను ; మరణోత్సవమిరు పుర, మునుగలసి యొయనుభవింతము విలాసవతీ. ౯౮.

ఆ. ఇట్టులొకరి నొకరు వీడఁబోయఁజాలక, పొగులుచుండ మంత్రిపుంగవుండు
వారివలపు మెచ్చి కారుణ్యముదయించి, తనమనంబునందుఁ దలఁచె నిట్లు. ౯౯.

ఉ. "జీవసమానయౌవతనజీవనజాక్షుతి నేత్రమిద్దినీ
భూవరపుత్త్రిచిత్తమునఁబుట్టినగాఢతరానురాగమా
భూవిభుఁడల్గినంతట నెపోవఁగ నేరదొకించుకనియుం?
గావునవీరినొక్కటిగఁగల్పుటకన్నను సన్నుసన్న." ౧౦౦.

క. అనితలఁచివారినేకం, బొనరిచిచిరకాలము దయయుల్లంబున నె
క్కొనియున్నయోగ్యతగవాం, గనొకండ్రేఁడేర్పుకొనఁగసముకట్టనొగిన్. ౧౦౧.

వ. ఇట్లు సమకట్టి బహుమానుండు తిరుపూర్వప్రభుండగు సుమిత్రుండు కళత్రపుత్త్రికావి
యోగంబునం గరంబుపరితపించి పశ్చాత్తప్తుండగుట యెఱింగియున్నవాఁడు గావున
మలయాచలేశ్వరుం డెంతయును గలిసిన సఖుండయ్యెను రాజసందర్శనాభిలాషం
బును; సభిజనాభిమానంబును, మానసంబున విడకుండుటం జేసి మరలనొకపరి నిజదే
శంబున కరుగనిశ్చయించి యానాయికానాయకరత్నంబులం గూడఁదనతోడంగొం
డ్పొనిపోవం దలంచి యిట్లనియె. ౧౦౨.

క. "లంకాపురమును బోలిన, సొంకు తెలుపు లేదు; చను దెంపుమదిన్
జంకక నా వెంటను మీ, రంకిలి లేకుండ శుభములలవడ్డనటన్. ౧౦౩.

సీ. మనుజులెవ్వారుఁ ద్రవ్వని యగడ్త యనంగ సలుపు లంకుల మహాజలధి దనరు
రేయింబగళ్లొక్కరీతి మహోగ్ర రథములు గామమునుం గ్రాకట్ట కంబుఁ
బోతుటేఁగకు నైనఁబురమునఁ జేరదు పరము రాజేంద్రుశాసనము లేక
శరణాగతత్రాణబిరుదైకచిహ్నుఁడత్యంత సద్గుణిసుమిత్రాఖ్యవిభుఁడు
కాపురంబుండె మీకుయోగ్యస్థలంబు, వలసిన పదార్థనికరమవారిగాఁగఁ
దెచ్చియిచ్చెదమ నిశ్చయముపిడిచి, పోవుదమురండు నా వెంట పోతమెక్కి. ౧౦౪.

గీ. చంద్రదత్తకు సింహళక్ష్మావిభునకుఁ, బూర్వమత్యంతమగు మైత్రి పొదలుచుండెఁ
గాని యిప్పుడు పగగల్గెఁ గాలవశతఁ, గావునను నాతఁడచటికిఁ గదలిరాఁడు. ౧౦౫.

క. చిరకాలము మును నేనా, పురవరమునఁ గాపురంబుఁ బొనరిచితిదుర్భా
వరునికడ వ్రాసి చివ్వము, జరిపి గడించితి నిజాండిదను వెక్కుడుగన్. ౧౦౬.

వ. అని పలికి రాజకుమారుని వంక దృష్టి నిగిడించి యిట్లనియె. ౧౦౭.

గీ. "ప్రభువు ప్రతిమాలినీతంద్రి పరిణయమున, కుత్తరువునిచ్చునందాక నొక్కకీడు
గలుగకుండఁగ మిమ్ములఁ గాచునట్లు, చేసెదను చింతపడఁబోకు క్షితిపతనయ!" ౧౦౮.

చ. అనవుడు వారు సంతసము నందుచు నందుల కియ్యకొంగనా
యయ్యనఁబయనంబు సేయుటకు నర్హపదార్థము లయ్యమాత్యుఁడే

చ. అనినఁగనొందిరాజసుతునల్లనఁగన్గొనిపల్కె "నక్కటా!
ఘనుఁడగునీదుతండ్రిచెలికారమకారణమొక్కసందియం
బునుమనమందుఁబెట్టుకొ నిమూఢుఁడనై చెడఁగొట్టుకొంటి; నా
యననొకపారిచూడవలెనన్న ముదంబుదయించెనిత్తఱిన్." ౧౧౮.

చ. అనివచియించుచుండఁగ వ్రజాధిపుఁడాధరణీశుఁగాంచి "యో
యనుపమదివ్యతేజ! భవదాత్మజఘోరవనాంతరంబునం
దునుపఁగఁబంచివత్సరములొక్కటనెన్ని యతిక్రమించెనో"
యనవరనాయకుండు "పదియాఱు" నెఁగన్నులనీరునించుచున్. ౧౧౯.

క. తనకుందోఁచినవత్సర, మునువిడువఁగఁబడెనటంచుభూమీశుఁడుప
ల్కినవత్సరమొక్కటియగా, టనుగొల్లఁడుసందియంబెడందంబొందెన్. ౧౨౦.

గీ. ఘనతరాన్వయసంజాతయనుటకామె, విలువవలువలుభూషణంబులునుదగిన
సాక్ష్యముగనుంటఁజింతింపఁజాగెనతఁడు, ప్రభుకుమారికయొకొయనిబహువిధముల.

గీ. ఇట్లుచింతించితుదకుమహీశ్వరుండు, విపినసీమనుబూర్వంబువిడువఁబడిన
దనుకొనుచునున్నకూఁతురే యరసిచూడఁ, బ్రమతియనినిశ్చయముచేసెవల్లవుండు.

వ. అనంతరంబ నాఁటికిఁ గొలువుచాలించి ధరణీపురందరుండు నిజమందిరంబున కరిగె. తక్కినవారలును దమతమ విడుదలకుం జనిరి. మఱునాఁడరుణోదయంబునన లేచి కాల్యకృత్యంబులందీర్చి మహారాజును; రామశర్మయుఁ; బ్రమతియు; బహుమానుం డును; మిత్రవిందయు; దక్కంగల పెద్దలును సభనలంకరించియున్న సమయంబున గోపవృద్ధుం డరుదెంచి తనకుఁ బ్రమతి లభించిన విధంబును; నాయమం గొనివచ్చిన మనుజుండు పులివాతంబడఁదాఁ బొడగనుటయుఁ; జెప్పి నాఁడా శిశువున కలంకరిం పఁబడిన యమూల్యాంబరంబులును; గంఠాభరణాద్యలంకారంబులును; దదీయవస్త్రం బునకుం గట్టియున్న కాగితంబును గొనివచ్చి మేదినీశ్వరుపాద సన్నిధానంబునం దిడు టయు; మిత్రవింద వానినిం బరిశీలించి చూచి శోకజాశ్రువులు దృగ్గోళకంబులనుండి జొటజొటంజాఱ ధారుణీశ్వరున కిట్లనియె. ౧౨౩.

ఉ. "పండెనునీయదృష్టమునృపాలకచంద్ర! భవత్కుమారియీ
యండజయాన; కాగితమునందలియక్కరముల్ మదీయనా
థుండెలిఖించెనిశ్చయము; దుర్విచలంబునఁగొన్నయమ్మను
ష్యుండతఁడేసుమీయిఁకఁద్రిశుద్ధిగనమ్ముముకావుమీయమన్. ౧౨౪.

చ. స్మరణకుఁదెచ్చుకొమ్ముచెడునందియముల్ త్యజియించి ; నాఁడునీ
తరుణినిసుంగునీదుపదతామరసంబులచెంతకంపుచో
సరిగపసిండిదువ్వలువఁజక్కఁగఁదాఁగయిసేసె ; దానినే
గురుతరభక్తిగొల్లఁడిగిగోఁగొనివచ్చెనుజూడుమీనృపా ! ౧౨౫.

క. ఇదెకంఠాభరణమునా, టిదనుమి ; యీయమ్మమొగముతేవంగననీ
మదవతినిబోలియున్నది, పదిలుఁడవైయొక్కసారిపరికింపఁగదే." ౧౨౬.

ఆ. అనుచుమిత్రవిందయంగమచ్చంబులు, గానిపింపనోలగంపువార
లద్భుతంబునొందియవనీశుపుత్త్రిగా, విశ్వసించిరెదలవిడిచిశంక. ౧౨౭.

గీ. పోయెననుకొన్నయారాజపుత్త్రిమరలఁ, జిక్కఁగావునవేలుపుచెప్పినట్లు
నిలిచెరాట్కులమనుహోళి ; చెలువుఁడీగ్గె, నవెడువగమిత్రవిందనునలమికొనిరె.

వ. అప్పుడు సుమిత్రుం డత్యానంద పారవశ్యంబున నించుకతడవు నోటమాటరాక యూ
రకుండి పిమ్మట కూఁతుంజూచి యత్యాతురతతో నిట్లనియె. ౧౨౯.

సీ. "రాఁగదే నాపాలిరతనంబులకొటార ! రాఁగదే నాదుసురద్రుమంబ !
రాఁగదే నాదుపురాకృతపుణ్యంబ ! రాఁగదే మత్కృతవ్రతఫలంబ !
రాఁగదే మత్సౌధరాజదివ్యపతాక ! రాఁగదే జితతామరసనయన !
రాఁగదే సుగుణవిరాజితహృత్పద్మ ! రాఁగదే నిందితరాజవదన !
రాఁగదే నాదువంశవర్ధని ! బిడాన, రాఁగదే నాదుసౌభాగ్యరాశి ! నిన్ను
నడవివిడువఁగఁబంచినయట్టిఖలుఁడఁ, గ్రూరుఁడనునన్నుదయఁగనుంగొనుముతల్లి !"

ఆ. అనుచుఁగూఁతుఁగౌఁగిటనుజేర్చిముద్దాడి, "తనయఁజూచికొనఁగజననికకట !
ఋణములేకపోయెనే" యనిపలుకుచు, వ్యసనపడఁదొడంగెఁబ్రభువరుండు. ౧౩౧.

వ. ఇట్లు కొంతతడవు దుఃఖించి మఱియు నేమో చెప్పం దలంపుగొని "నీతల్లి ; నీ
తల్లి—" అను పలుకులుదక్క మఱేమియుఁ బలుకనేరక సంతోషమ్మొకవంకను ;
దుఃఖమ్మొకవంకను దన్నుం గ్రమ్మ నిశ్చేష్టుండై యుండె. ౧౩౨.

ఆ. అపుడుమిత్రవిందయవనీశ్వరునిచెంత, కరుగుదెంచియిట్టులనియె "దేవ !
దేవిగారిఁబోలుదివ్యసుందరవిగ్ర, హంబుగలదుమాగృహంబునందు. ౧౩౩.

క. మనగరమునకుఁగ్రొత్తగఁ, జనుదెంచినశిల్పియొకఁడుజాణతనమునఁ
బొనరించెఁ ; గనివరాణియె, యనిభ్రాంతింబొందవలయునవనీశమణీ ! ౧౩౪.

గీ. వచ్చిమానిలయమునుబావనముచేసి, చిత్తగింపవెబహుసుప్రసిద్ధుఁడైన
చిత్రకారునిప్రౌఢత ! చిత్తమనను, గలుగునీవంతలెల్లనుదొలఁగునంత." ౧౩౫.

గీ. అనుడు జనపతిభార్యయాపుణ్యగంగ, దమిగలిగియుంట ! బ్రమతియుం దానునున్న
కాంచియొఱుఁగని శిల్పియాకారమెట్లు, లలనతో మాడనాసక్తయైనకతన. ౧౩౬.

గీ. అందఱును గూడి యుస్మిత్రవింద సేవ, మునమునకు గంగినప్పుడప్పువ్వుబోణి
విగ్రహంబునకడ్డుగా వెలయుచున్న, కాంచిపటమును దొలంచెఁ గడురయమున. ౧౩౭.

గీ. అచ్చముగ మంజువాణియే యవతరించి, నట్లు కాన్పించు నవ్విగ్రహంబుఁ జూచి
పొరలివచ్చెడు దుఃఖసాగరము నాఁపఁ, జాలఁడయ్యెను నానరపాలవరాళి. ౧౩౮.

ఆ. కనకకొంత సేపు కదలకుండుటకును మాట, లాడుటకును శక్తిఁగూడ కతఁడు
చిత్రమట్లయుండ మిత్రవింద మహీశు, సంకదృష్టి నిలిపి పలికె నిట్లు. ౧౩౯.

ఉ. ఊరక మీరు గ్రుక్కపడియుండుటఁ జూచెఁగ శిల్పికౌశలం
బారఁ జిత్తమందుఁ బరమాద్భుతమందుచునున్నయట్లుగా
సారెకుఁ దోఁచెఁ గావున ననంతసమంచు మనంటె ! విగ్రహం
బారమణీలలామవలె నంపను పొందఁగలేదె ! భూవరా!" ౧౪౦.

చ. అనఘ యనాయకుండు హృదయంబున దైన్యము పొందుకొల్పఁ దా
మెనుమును నేవరించుతఱి మిక్కుటపుం దమి నెట్లు కన్నదో
యిరి వెలిపుచ్చె నా క్రియను నేయిప్పుడును న్వెలిపుచ్చి ధీరధీ
తి నినిలుమండె నాకడ నెదృష్టి నిగుడ్చుచు మానినీమణీ ! ౧౪౧

గీ. కాని నిజముగ నావాలుగంటి మిన్న, ప్రతిమకనసట్లు సంతసిల్లినయా సుమిత్ర
"పోయికదికాద" నంగన ప్పాలఁతి పలుకుఁ, జెలువగ పువా తెలుసు వింత మొలుఁగు వెట్ట.

చ. జనవర ! యట్టులైనయెడ సాధ్విఘరాస్థలి నింత కాలముం
దనువుఁ బునిల్పియుండిన దానిపుడెట్టులనుండునట్టులే
పావరి చివిగ్రహంబుఁ దనప్రోడతనంబును జూపినట్టి శి
ల్పినిమతిచాల మెచ్చఁగవలెన్ గద వాఁడె డను శ్లాఘింపఁగన్. ౧౪౩.

తే. క్షోణినాయక ! మీరిట్లు మాడఁ జూచ, నిదెకదలుచున్న యట్లు భ్రమింతురే మొ
యనిభయముగ ల్పుచున్నదిగనుక కాండ, పటము వేయఁగ సెలవీయవలయు" ననుడు,

గీ. "తెరను వేయంగవలద" ని తెలుపవేఁడి, "కనుము బహుమానుఁడా ! దానికనులఁ జలన
మడగుచున్నట్లు ; శ్వాసంబు విడుచుచున్న, యట్లు కాన్పించుచున్న దీయవసరమున."

వ. అని బహుమానునికిం జూపుచుండ నింతలో మిత్రవిందనదుమ నడ్డువచ్చి యిట్లనియె.

గీ. "తమకిపుడు గల్గినట్టి సంతసముఁ బట్టి, చూడనది జీవనంబులఁ గూడఁగలిగి
యున్నదని యాను భ్రమియించుకొన్న చాలుఁ, జెరనుదింపఁగ నీయ వేధివిశాల!" ౧౪౬,

క. అనన్యపుడు "మిత్రవిందా!, వినుమేండ్లకువగియునైనవిగ్రహమునన
ట్లనె నేనుదలఁచునట్లుగఁ, బొనరించుచుఁగన్నులారఁబొడగననిమ్మా. ౧౪౯.

గీ. ఆమనోహరమగువిగ్రహంబునుండి, యూరుపిప్పటికినివచ్చుచున్నయట్లె
కానఁబడియెడు నెంతచక్కనిదియొలియును, జెక్కఁగలుగు నెశ్వాసంబుచెందునట్లు.

ఆ. దానికొక్కసారితటిసిముద్దాడంగ, వాంఛగలదు; నవ్వవలదుమీర"
లనుచుమనధికమోహమునఁబల్కనప్పుడు, విందయిట్టులనియెవిభునిఁజూచి ౧౫౦.

గీ. "దేవరా! తామఁడా మెహాతెఱపునిడిన, యొజ్జిగాఁగ దెచ్చిగా నెసఁగుచుండె
ముద్దిడిననంటుకొనును మీమోవికింక, జవనికనుగింతునా!" యనజననింభుండు. ౧౫౧.

క. వలదట్లెయుంచనిమ్మా, యెలనాగరో! వత్సరంబులిరువదియైనం
దిలకింతునిట్లె"యనుమనఁ, బలుతెఱఁగుల వేఁడికొనియెఁబడతుకమిన్నన్. ౧౫౨.

వ. ఇట్లువారు సంభాషించుచున్నంతనంత బ్రహాతి నిశ్చలచిత్తయై నిలువంబడి సావధానంబుగ నా నిరుపమాన విగ్రహంబుపై దృష్టినిలిపి "మాప్రియజననీముఖారవిందం బత్యానందంబునం గనుంగొనుచు నెంతకాలంబైన నీలీల నిలువంగలు"నని పలికె నంతట మిత్రవింద మరల ధాత్రీశ్వరునినంక దృష్టినిగిడించి యిట్లనియె. ౧౫౩.

సీ. "ఆలోకనాతిసౌఖ్యముకొంతవఱువంగఁ జెరకీరయైనను దించనిండు
తమకట్లుసేయఁజిత్తముగొల్పకున్నను నింతకంటెనగొప్పవింతయొకటి
కలదువానిని నేనుసలుపుటకైనను సెలవునాదయసేయవలయుమీర
లదియెద్దియనిననీయందంపుబొమ్మనుగసలునట్లుగఁ జేయఁగలనుజూండి
యంతెగాదుతమయాజ్ఞయయ్యెనేని, పీఠమునుండి దిగివచ్చిప్రియముమెఱయ
సంబుజంబులఁబోలుమీహస్తయుగముఁ, బట్టుకొనునట్లుసహితమేర్పఱచఁగలను.

ఉ. ఏనటులాచరించినను నెల్లఋ నెద్దియొక్షుద్రదేవతం
బూనికఁబంపుచేసికొనిపోకలువ్రాపుమనున్నదంకురో
మానవనాథ! కాదనిప్రమాణముచేసివచింతు"నన్ననా
చానను జూచి యిట్టులను క్ష్మావిభుఁడద్భుతమగ్నచిత్తుఁడై. ౧౫౫.

గీ. "ఇంతి! నీవామెచేఁ జేయింపఁగలుగు, దానినెల్లను జేయింపుతత్క్షణంబ
కన్నెదఁగన్నారఁ జిత్రంబుఁగదలునట్లు, చేయుదానికిమాటాడఁజేయుటెంత. ౧౫౬.

గీ. కనుకనీవేమిపలికించిననుగరంబుఁ, దమినివినియెద"నవవుడుతలిరుబోణి
యంతకునుముందెపిలిపించినట్టిపాట, కులగడంగిరిశుభగీతములనుబాడ. ౧౫౭.

ఉ. అప్పుడు మాపటద్భుతమునందఁగ విగ్రహమల్లపీఠమున్
గుప్పనడిగ్గి తాని యుడుగుం గవచెంతకు నేగి చేతులన్
గొప్పఁగఁ జాచి కూర్మి మెయిఁ గుత్తికఁ గౌఁగిటఁ జేర్చె ; దైవమున్
దప్పులు సైచి భర్తను సుతం గరుణింపుమటంచు వేఁడుచున్. ౧౫౮.

వ. ఇట్లు కౌఁగిలించుకొనిన యనంతరంబ యవ్విగ్రహంబందలివిన నృపపురందరున కిట్లనియె. ౧౫౯.

ఉ. మానవనాథ! నీవిటుల మాటికి నన్నిలకించి యుబ్బరం
బూనఁగ నేల! నేఁ బ్రతికియున్న భవత్ప్రియమంజువాణి నే
మానముఁ గాచికోలునకు మార్గముఁ గానక డాఁగియుంటి నీ
మానవతీలలామ నను మన్నన సేయుట నీ మెగీమునన్. ౧౬౦.

క. నాఁడటుల నేను బ్రాణము, వీడితినని తెలిపి మిత్రవిందయె నాకే
కీడొదవకుండఁగను గా, పాడెను దన ప్రాణమట్లు పార్థివచంద్రా! ౧౬౧.

గీ. అక్కృతంబున నీకు కోపాగ్ని హోత్ర, మునకు బలిగాక బ్రతికితి భూమినాథ!
పట్టికనఁబడునంబాక బయలు పడఁగ, మనసుగోలుపమినుంటి నిమ్ముగువ కడనె. ౧౬౨.

వ. నేఁడు కుమారిక అభియించిన కతంబున భవద్దర్శనంబు సేయం గలిగితి" నని పలికి యత్యాదరంబునం గూఁతుం గౌఁగిలించుకొని ముద్దాడి శిరంబు మూర్కొని మరల ప్రాణేశ్వరుం జూచి యిట్లనియె. ౧౬౩.

గీ. "ఈవు చేసిన యొగ్గుల నెల్ల నాఁడె, మఱచితిని గాని హా! నోముమాలినట్టి
నిసుఁగు నడవికిఁ బంచిన నెగులొకండె, మఱపు రాద" నికన్నీరు మాఁగు వనించె. ౧౬౪.

గీ. అప్పు డావిభుండు కన్నుల నశ్రుపులు రుల, మెలఁత పదముల వ్రాలి క్షమింప వేఁడ
"నను చితంబ" ని ప్రాణేశు నల్ల నెత్తి, యక్కునను జేర్చి యోదార్చె నబ్జవదన. ౧౬౫.

సీ. పోయినదను కొన్న పూబోణి బ్రతుకుటఁ జిన నాఁడె యుడవిని జేర్పఁబడిన
పుత్త్రిక నిజగృహంబునఁ బ్రవేశించుటఁ గని దీర్ఘకాలంబు వనటమునిఁగి
యున్న విభుండిప్పుడొందిన యానందమింతంత యనుటకు నెడము లేదు
ఏవంకఁ గనుఁగొన్న నెవ్వలేని యుత్సాహవాక్యంబులే చాలవన్నెమీఱె
మంగళధ్వను లెల్లెడ మలయుచుండె, నప్సరసలను బోలిన యబ్జముఖులు
గాన మొనరించి రత్యంత కౌతుకమునఁ, బౌరులందఱు సంతోషభరితులైరి. ౧౬౬.

ఆ. హీనజాతి నాతి గా నెన్నఁబడినప్డు, కూడఁ దమదు ముద్దుకూఁతు మెచ్చి
మేలుపడిన యా నృపాలాత్మజుని గొని, యాడిరెల మిమిగుల నాలుమగలు. ౧౬౭.

గీ. పిదప భూవల్లభుఁడు గోపవిభునిఁ గాంచి, పరమవాత్సల్యమునఁ దనపట్టిఁ బెంచి
పెద్దఁ జేసినకతమునఁ బెక్కువగల, మెచ్చు మాతనికి బహుమతు లిచ్చె మిగుల. ౧౧౯.

గీ. తాము చేసిన యత్నమంతయును గుదుర, మంచిగ ఫలించుటను బహుమానవిభుఁడు
మిత్రవిందయు మగులను మిక్కుటముగ, సంతసము నొందఁగడఁగి రా సమయమునను.

వ. అటఁ జంద్రవర్మయుఁ దొలుదొల్తఁ దన సూనుండును బహుమానుండును గానఁ బడ మికిఁ గలఁతనొంది యంతకుమున్నె బహుమానుండు స్వదేశంబునకు జనమన్న సంగతి నెఱింగినవాఁడగుటం జేసి సింహళంబున కొఱకుదురని యూహించి సత్వరంబుగ బయలువెడలి తరణి నెక్కి సుమిత్రుని జీవితకాలంబునం దెల్ల మిగుల సుదినమైన యమహానందసమయంబున నెద్దియుం గొఱంత యొదవకుండ సలుపుటకో యన నచ్చట నుట్టిపడి రాజమందిరంబుఁ బ్రవేశించి వారలం గలిసి సంతోష మనుభవించుటయె కాక తనమీఁద నిష్కారణంబుగ జారత్వశంక నిరూపించినవాఁడగుటం జేసి తన మొగంబు చూచుటకు లజ్జించుచున్న సుమిత్రుని యపరాధంబు మన్నించి పూర్వస్నేహంబుం జూపుచు ననిర్వాచ్యమైన సల్లాపసుఖం బనుభవించె. ౧౨౦.

గీ. చంద్రవర్మక్షమావరచంద్రముండు, ప్రమతి నిప్పుడు తన ముద్దుకొమరునకును
జేసికొనఁడే మొయనుశంక వెదరిపోయె, నా సుమిత్రాధిపుని హృదయంబునుండి. ౧౨౧.

ఆ. మున్ను తలఁచినట్లు ముదిత తా నొకగొల్ల, పడుచు గాక సార్వభౌమపుత్రి
యగుచు సింహళమున కతిబాధ్యురాలైన, రాణి యయ్యెఁ బ్రజలు రహిని మెచ్చ. ౧౨౨.

గీ. అంత నొకమంచిమూరుతమందు రామ, వర్మకు బ్రమతికి మహావైభవముగఁ
బరిణయము చేసె సింహళప్రభువరుండు, భూసురాశీర్నినాద మింపుగఁ జెలంగ. ౧౨౩.

వ. అట్లు చిరకాలం బాపత్పరంపరలం బడి కృశించిన యప్పరమపతివ్రతాశిరోమణియగు మంజువాణి శ్రమలెల్లను నాఁటితో నివారణమైన కతంబునం దనయతోడం బెనిమిటితోడం గలిసి సకలసంపదలం దులఁదూగుచు బహుకాలం బాజవంజవసుఖంబుల ననుభవించుచుండె. ౧౨౪.

గీ. ఏరు చదువు పురీకథ వారు సతుల, యెడలను నిరాపనిందల నిడక ; యసుబు
కరణిఁ గనుఁగొందు సర్వేశు కరుణ వడసి, సౌఖ్యముల నొందుదురు గాత సంతతంబు. ౧౨౫.

చ. పరమదయాలవాల ! నిరపాయ సుసుఖప్రద ! నిత్యనిర్మలా !
నిరుపమసత్ప్రభావ ! నవనీతసమానమృదుస్వభావ ! భా
స్కరశశివహ్నిలోచన ! వికారవిమోచన ! లోకపీడనా
కరదివిజారిదుర్మదవిఖండన ! కైరవమిత్రమండనా ! ౧౨౬.

THE

# TRAVELLER

(A NEW ORIGINAL TELUGU POEM.)

BY

BRAHMASREE

**ADIBHATTA NARAYANA DASS GARU**

OF

*VIZIANAGARAM.*



A REPRINT FROM

**SREE VYJAYANTI**

PRINTED BY

G. RAMASAWMY CHETTY & Co.,

**MADRAS.**

**1895.**

 [*Price 4 Annas*



విజయనగరపురవరనివాసియగు

బ్రహ్మశ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారిచే

రచితమయిన

# బాటసారి

అను నూతనప్రబంధము.



ఇది

పనప్పాకము శ్రీనివాసాచార్య్యులు (బి. ఏ.,) గారిచే

లేఖకప్రమాదాది దోషములులేక

పరిష్కరింపఁబడినది

శ్రీవైజయంతినుండి పునర్ముద్రితము



చెన్నపురి:

జి. రామస్వామిసెట్టి అణ్డు కంపెనివారిచే

ముద్రింపఁబడెను.

శ్రీరస్తు.

శ్రీ విజయనగరనివాసియగు

# బ్రహ్మశ్రీ ఆదిభట్ట నారాయణదాసుగారిచే రచింపఁబడిన ప్రబంధము.



## బా ట సా రి.



ఉ॥ ఒక్క మహానుభావుఁడుమహోదధియానముచేసిముప్పనం।
దక్కి తొలంగిపోవునిజదారసుతార్థము నైమహానదీ।
పక్కణసీమలన్వెదకివారలుసుస్థితినుంటఁగాంచిపే।
రెక్కనుబాటసారియయియిక్కథపేరయశోవిహారియై॥ ౧.

ఉ॥ ఎప్పటనుంటి నేనిదటికెట్టులవచ్చితిఁగన్నులెంతయుక్।
విప్పినఁగానరావిదియునిక్కమయేమిది పెద్దమోతనా।
కప్పెగు వైవినంబడుఁగటా తెలిసెన్మదిదిట్టసేతుఁబై।
వచ్చిననీటితాకుననుబ్రాకుచునెట్టననొడ్డుచేరితిక్॥ ౨.

గీ॥ చిన్నకొడుకుతోఁ జెలియయేమయ్యెనో । కొండదగిలియోడకొట్టఁబడిన।
తెన్నుదోఁచకుండెఁదెలిపినీయదుమబ్బు । గ్రమ్మిరేయిమిగులఁగానరాదు॥ ౩.

గీ॥ ఇట్లుబాటసారియెంతయుదిగులంది । కడువివేకశాలిగానఁగొంత।
దెప్పిరిల్లిప్రేమఁదెంపలేకవిరాళిఁ । జెందిముద్దరాలిఁబొందుఁదలఁచి॥ ౪.

ఉ॥ పాపపుదైవమెంతపొరపాటొనరించెనునన్నిగిల్చెన।
య్యోపికవాణియోవికసితోత్పలలోచననిన్నుఁబాసియె।
ట్లోపుదుజామురేందమననుంటిమిముచ్చటలాడుకొంచునా।
హాపరిపూర్ణచంద్రవదనామనకింకఋణంబుచెల్లెనా॥ ౫.

గీ॥ అనుచుమూర్ఛనందియతఁడెట్టకేలకుఁ । దెమ్మదేరిడెందముమ్మలింప।
నలసినట్టియంగములఁగూర్చుకొనిలేచి । నిలిచినాల్గుదెసలుఁగలయఁజూచి॥ ౬.

క॥ కానీదైవమయిక్కడ । కాననుఁదెచ్చితివియెట్టుకానీమీఁదక్।
బూనిసైరింతునదిగో । పైనెగడెడుతూర్పుతెల్లవాఱుచునుండెక్॥ ౭.

చ॥ అనుచతఁడంతఁ గాంచెఁ జటులానిలసంచలదూర్మిమాలికా
ల్బణవికటధ్వనిప్రబలవార్నిధిసంప్లవనీయమాననూ
తనరవిబింబ మొక్కదెసఁ దక్కినదిక్కులఁ బిక్కటిల్లియు
న్కనదడిమిన్నుఁ దన్ను నొకకొంకనుపండనుగాంచి వెండియున్॥ ౮.

గీ॥ తోడరియ కొండదనడుమ నెక్కసెను తొల్చు । కొనుచు వడి సైపలేక హోయాయనఁ బియ్యఁడి
కీడ్గలంబడు బండలనీడ్చుకొనుచు । నేఁపుమైఁ ద్రుళ్లిపడు సెలయేరుఁ గనియె॥ ౯.

గీ॥ కాంచి యతఁడెట్టకొత్తలోకంబునందు । నున్నతీరున నచ్చెరువంది వేఱు
వంకఁ బోలేక యొద్దియుఁ బాలుపోక । తెంపుతోఁ దుదకా యేటి తెన్ను పట్టి॥ ౧౦.

సీ॥ ఆయేటికిరువంకలందేటవాలుగ మెట్లమర్చినయట్లు మీటి నెఱయఁ
బండినమావిళ్లఁ బనసలు నిమ్మలు నేరేళ్లు మఱి వింతతీరుచెట్లు
లెడనెడఁ గొలలతో నింపారవంగిన కపురంపుటనటులఁ గమ్మతావి
వెదజల్లు గొజ్జంగిపొదరిండ్లు సందందఁ జిన్నిపూదేనియల్ జిల్కు కొట్లు
కన్నులకు వింతపండువు గాఁగ నతఁడు । చూచుచీశ్వరసృష్టికిఁ జోద్యపడుచుఁ
గొంచెపుగ మెక్కి శ్రమఁ దీర్చుకొనఁగఁ దలఁచి । కూర్చునియె నొక్కపంపఁగి గున్నక్రింద॥

సీ॥ నెమరవేయుచు లేళ్లు నీడల నాగెలోఁ బొదలలో నెమలులు కుదురుకొనియె
లోతుమడుగులనీఁతాడె నేస్గలు పందులు బురదలఁ బొదుకొనియెఁ
గొమ్మలపైఁ జేరుకొనియెఁ గ్రోఁతులు పుల్గులన్నియు దొఱ్ఱలయందుఁ జొచ్చె
లోపలఁ బడి పులులో పలింతలుదీసె నెండులలోఁ బాములూర్పులుచ్చె
నడవిసందడి తగ్గ నల్లపెల యందుఁ । జెలఁగి పొగఁ జిమ్ముకొంచుఁ గార్చిచ్చు పెచ్చె
రెండుజాముల వేసవి మండిపడుచుఁ । గొంపెబీటలు వాఱఁగ నెండ పెగాచె। ౧౨.

క॥ ఆయెండ తాకుపడియున్ । హాయిగఁ జలినీరుజల్లు నా యేటిదరిన్
రేయిపవు దాఁక నిద్దుర । పోయి యతఁడు మేలుకాంచెఁ బొలుపుగ నంతన్॥ ౧౩.

గీ॥ కపెలినవ్వచుఁ బొంగి సందసులు జేసెఁ । గప్పురపుదివ్వె వెలెఁ జంద్రుఁడొప్పమీఱెఁ
గొండయంతయు మెండుగ వెండిబాటి । పండువెన్నెల కన్నులపండువయ్యె॥ ౧౪.

ఉ॥ అంతనతండు కన్నులకు హాయిగ వెన్నెల గాయఁ గాంచి తా
నెంతయు సంతసించి పరమేశుని పైఁ దనభారముంచి ని
శ్చింతతఁ బోవ నెంచి నలుచెంతలు దాఁ బరికించి దారయొ
క్కింతయుఁ దప్పకుండ సెలయేటిదరిం బడిపోవుచుండఁగన్॥ ౧౫.

గీ॥ పులుగుమూల్గులు బెబ్బులి బొబ్బరింత । ల [illegible] వినందందమనమునకడరు సేయఁ
దపఁబడుచతండు నడిరేయి దాఁక నడిచి । దారికడ్డుగ నొకకొండ పదగులఁ జూచి॥ ౧౬.

చ॥ ఇదియొకసూదికొండ తెరవీయకయీసెలయేరుదీనిలోఁ
బుడొలచివచ్చుచున్న యదిపోవగ నాకికమీఁదదారియె
య్యదియిటఁ బొద్దుమాఱువఱకాగదనంచొకచాపరాయిపై
న్గదియఁగమోపి మింటికెదఁగన్గొనుచుందలపోసెనిట్టులన్॥ ౧౭.

గీ॥ వెల్లబాఱినజాబిల్లి వేఁగుచుక్క । యును నభంబున వెలయుచునున్నయట్లు
చిన్నికొమరునితో ముద్దుచెలియ తేలు । మందెఁగాఁబోలు మున్నీటనిండువారఁగ॥ ౧౮.

ఉ॥ ఎక్కడినావయా! తలభియించెనహో మునపాలవిక్కతే
కక్కటనిన్నుఁ బాసి చెలియాయిటులొంటిగ నుంటఁ బ్రాపెనే
ముక్కడి పైనమింతపని పుట్టునటంచు నెఱుంగనైతి నే
చక్కనినిన్ను వంటిసతి జన్మశతంబులనైనఁ గల్గునే॥ ౧౯.

క॥ అనిబిట్టుసొమ్మసిలి నె । ట్టనఁ దల్వోఁ బొందియంతటం జేగునుబూ
సినయట్లు ప్రొద్దు పొడమఁగఁ । గనుఁగవనీరొత్తుకొంచుఁ గనుఁగొని పలుకన్॥ ౨౦.

గీ॥ ఔరగాఁడి సూర్యుండ యద్భుతంబు । గద బహుపమలెనీకరకౌశలంబు
అల్పభౌమంబులం జూపి యధికదివ్య । ములను గన్పడనీయక మోసపుచ్చు॥ ౨౧.

క॥ అనియిట్లు బ్రతుకు పైరో । తను బట్టియసూయఁబట్టితనకక్షులని
చ్చిన లోకబాంధవుఁ డన । కనిష్ఠురములాడి యలిఁడునగి మనోన్ముఖుఁడై॥ ౨౨.

క॥ పరికించి కొండచూపటి । కరిగడియొకలోసనాపనాటసి యడుఁగుం
జోరబాఱిమొట్టకేలును । జెరువుప్రక్కకేఁగాఁ జిరాలి వెలువ ప్రనుతించెన్॥ ౨౩.

సీ॥ చుట్టునగట్టుగాఁబెట్టినయట్టులు బలుకొండపలనెనందునిలిపినాఁడు
నీటిమట్టముదాఁక నాఁటినట్లుండునట్లుల వృక్షపజ్తులెవాఁడు పెంచినాఁడు
కనుమూపుమూఁకంబు గాఁజవరిముగ నెంతయులోఁతుగ నెవఁడు ద్రవ్వినాఁడు
పలువన్నెయలపద్మములతోఁ బల్లాసలగుపూలనారెవ్వఁడుంబోసినాఁడు
సృష్టిపై విచిత్ర్యముహాయూహింపఁదరమె । యేమనుష్యులసేతకీయింపువచ్చు
నేను జూచినసెలయేరు దీనిలోనఁ । బొడరికాఁబోలు నక్కొండఁదొలిచినడియె॥ ౨౪.

క॥ ఇటులబ్బురనడియతఁడా । తటాకమున స్నానమాడి తపనుం గనిదూ
రటకై వొక్కుచు నంజలి । పుటమ్ముతో నీరుపట్టి పొగడఁగఁ జొచ్చెన్॥ ౨౫.

గీ॥ భయముఁగొలిపెడిచీకటి పెలనమసుఁద । రింపఁజేసెదు తరణి నీకిదిగొ మ్రొక్కు
అహితములఁ గొట్టి హితముల నాదరించి । యేలుచుండెదు మిత్ర నీకిదిగొ మ్రొక్కు॥ ౨౬.

క॥ అనువర్ఘ్యమొసఁగి యొడ్డున । దినుబడిదుంపలను గొన్ని దీసిన మలితీ
యనినీరు ద్రాగి యొకకా । న్గని సకుం గడఁగియతఁడు కూర్చున్న తతిన్॥ ౨౭.

చ॥ గిరులదరంగ నెక్కు మొగిఘీంకృతినాదము పుట్టినంతటన్।
ధరణివడంకునట్టులు పదంబుల దప్పడుపోఁ జెవిమ్మటన్।
గరములఁబట్టి చెట్లు పెకల్చుచు వీనుల వీచుకొంచు బ।
ల్దఱుచుగఁ గొండలీనినవిధంబున నేన్గులు చెర్వఁ జేరఁగన్॥ ౨౮.

గీ॥ తమ్ముమాలినధర్మంబు తెగడటంచుఁ। దలలవలచెంచు తమమొదలులను గావఁ।
బూనిచాచిన నీడలముడుచుకొనియెఁ। బాదపంబులు నడిమింట భానుఁడొప్పె॥ ౨౯.

క॥ అబ్బురము వెలుపుఁ బెనఁగొన। నొబ్బునసతిఁడొక్క మట్టి కొనకెక్కసర।
స్సబ్బుఁగ నేనుఁగుకదుపులు। గుబ్బున దిగి దప్పిఁదీర్చుకొని చెలువారన్॥ ౩౦.

ఉ॥ కొమ్మలఁ జొన్పియొప్పు పడఁ గుమ్మును గొన్ని జలమ్ముఁ బీల్చి పైఁ।
జిమ్మును గొన్ని తామరలు చెంగలువల్వెకలించుఁ గొన్ని తోఁ।
డమ్ములనీటియందునఁ బటాలున మోదును గొన్ని హర్షసం।
తమ్ములనీఁదుఁ గొన్ని సురలంబులఁ జొక్కను గొన్ని యేనుఁగుల్॥ ౩౧.

గీ॥ దంతియూథమ్ములిట్టులు తనివితీఱఁ। జెలువుల బలఁ దేలాడి పసవుల ముడుచు।
మూఁకొన్ను వెసలు బెట్టుచుఁ బోవుచు నిదె। మూలలకుఁ జేరెఁ బడమటఁ బ్రొద్దు వాలె॥ ౩౨.

గీ॥ అంతవఱకుఁ జెట్టునందుండి దవ్వుల। నాలఁ జొక్కయున్న తాలయంబు।
డెందమలరఁ గాంచి క్రిందికిఁ దిగి యొక। త్రోవఁ దోఁటనుండి పోవుచుండె॥ ౩౩.

సీ॥ ఏవైపుఁ జూచిన నావైపున నెమంచి తావులీనెడు విరితప్రాపుఁ బొదలు।
నేవంకఁ జూచిన నావంకనే ఫలియించు నానావిధవృక్షషండములు।
లేదిక్కుఁ జూచిన నాదిక్కున నెసంతతము నీరుజల్లు యంత్రములు మఱియు।
నేతట్టుఁ జూచిన నాతట్టునను తీర్చి కట్టినమణిమయ కుట్టిమమ్ము।
లద్భుతానందములు బెనయంగఁ జేయుఁ। గనుచుఁ గలయందు విహారింపు కరణిఁ జనుచు।
నొంటిపాటున నైవగపొందిఁ జూచె। యాసఁ దనచెలిఁ దలఁచియిట్లు పలవించె॥ ౩౪.

సీ॥ పించియంబుల విప్పి పెండ్లియాటల గొప్పి యాడునట్టి నెమలిపిట్ట జోడుఁ జూచి।
తనమిటారికి కంబు తలిరుటాకు విడెంబు నాను గోయిల యొకిమీఁ జూచి।
కమ్మతేనెల మెక్కి కొమ్మకాఁగిటఁ జొక్కి పాడు లేతుమ్మెద కోడెఁ జూచి।
పడఁతితోడుత నచ్చసందుగుబురులమచ్చటాను చుంచదిను చిల్కలనుఁ జూచి।
యంతగంతుల హెచ్చిరవంత నుచ్చి। నేర్పరి చటుంచు మెచ్చి నిట్టూర్పు పుచ్చి।
బయలు కౌఁగిళులకుఁ జొచ్చి హాయలు నిచ్చి। సచ్చిపోగలుచునుంటి చానయిటు వచ్చి॥ ౩౫.

గీ॥ ఇన్ని సోద్యంబులు జూచియేగుచుంటి। మనమునకు నిచ్చ దగులదు మఱియ దేమొ।
కానితలఁపున మెలఁగు చక్కని వెలంది। బిడ్డలం బాసి వచ్చుటకడ్డులేమొ॥ ౩౬.

గీ॥ అను మవలవంతఁదూలు మనతఁను రేయి । పడిన వేళకునద్దివ్యభవనమునకు।
వచ్చియాలోపలికిఁజొచ్చి యచ్చెరువుగ । నచటిసౌధ్యంబుఁగాంచియిట్లనినుతించె॥ ౩౭.

సీ॥ కమలాకృతియుఁజుట్టుకై వారమున్నకోసుగలిగియేడంతస్థములఁజెలంగి।
మొదటిదౌయంతస్థమున కేడుమణివేయునావలయివాని కాత్రిప్పు వరుసతోడ।
నొక్కొకటియెతగ్గియుండెగదులసంఖ్యదనరునంతస్థమంతస్థమునకు।
నొక్కొకబలుకంబమూలయై యంతస్థమునకొక్కవర్ణంబుబోలుపువిూఱు।
ధాన్యరాసులకుఁదోలియంతస్థముజల । యంత్రములకావయిదియుమూఁడదివటు।
కాయదియూరగింపులకై దనయుది । సభకునావైదియయ్యెకర్చనకుఁదుదిది॥ ౩౮.

శా॥ ఔరా యేమిమహాద్భుతంబిదినిజంబా చిత్తవిభ్రాంతియా।
యేరీయెవ్వరుఁగానరారిచటనూహింపంగశక్యంబుగా।
దేరాజ్యంబుననుంటి నోయెవరిదోయీ సౌధరాజంబునా।
నారత్నాంచితమైతమంబుడిపియానందంబుఁగావించెనుఁ॥ ౩౯.

గీ॥ అన్నియంతస్థములయందు నేటుకులేక । వెలయునతనాలుబలుకంబములునిమూల।
ములుగగోడలుగాఁదిన్నియలుగఛత్రి । ధరణిజెంద్రిననిట్టి చిత్రంబుగలదె॥ ౪౦.

క॥ ఎచ్చోటనుండిచూచిన । నచ్చెరువుగ సౌధమెల్లనగుపడెసుఁగిటా।
యచ్చపుమణిమయమగుటన్ । హెచ్చుగనిదియిట్లు ప్రతిఫలించుచునుండెన్॥ ౪౧.

క॥ భువిలోఁగిరిచిదొక్కగం । భవిష్యతి యనంగనిపటుస్పష్టంబాయెన్।
దివిజేశ్వరునకయిననీ । భవనోన్నతిఁబొందనెట్లుప్రాప్యంబౌనో॥ ౪౨.

మ॥ సరులాకానని మేషభావముదటంగాన్పించుటన్వేల్పులో।
దురునన్నెవ్వరుఁబల్కరింపరదియేదో మాయకాఁబోలుబా।
పురెయినోక్షీఁబనులెల్ల సేయుటకుఁగీలుబ్బొమ్మలుండంగ నెంబారిం।
బారిఁగాలోచిత రాగశబ్దములసమ్మోదంబుగావించుచున్॥ ౪౩.

గీ॥ అనుచుఁదుదిమిద్దెపైనుండియాతఁడుమగ । యాడబొమ్మలనోప్యంబులగయునుండ।
నంతలోపలఘంటభుంగనుచుమ్రోగె । వెంటనే సౌధమునవింతవెలుఁగుదోఁచె॥ ౪౪.

గీ॥ చుట్టుచెలులుపలుగొలువఁగ సొంపుతోడఁ । జెలఁగుతేనముద్దుకోమలిచెట్టబట్టి।
చుక్కలందునరోహిణి ప్రక్కనున్న । చందురునివలెనొకదివ్యజనుఁడుదోఁచె॥ ౪౫.

క॥ అద్దివ్యపురుషుఁడత్తఱిఁ । దద్దయుజలకంబులాడితరుణులుగొల్వన్।
ముద్దియచేతింగొనితుది । మిద్దెనుఁజనియీశుభక్తిమించినుతించెన్॥ ౪౬.

ఉ॥ కారణకారణుండ! త్రిజగత్ప్రభువా! సకలాంతరాత్మ! సం।
సారవిదూర! ఘోరకలుషఘ్న! దయాంబుధి! సర్వజీవనా।

ధార! యశోవిహార! విబుధస్తవనీయచరిత్ర! దీనమం

దార! నమోనమోయనుచుఁదత్పరుఁడై యతఁడంతదిగ్గనన్॥ ౪౭.

గీ॥ పలుకులెవ్వియులేక్రమాన్పడినవాని । నార్తిమూర్తిభవించినయట్టులున్న।

దిస్సమొలవానిమిక్కిలిడస్సియున్న । బాటసారినిఁగన్గొనిపలికెనిట్లు॥ ౪౮.

మత్తకోకిల॥ ఔరయెవ్వఁడవీవుసుంతభయంబునొందకసౌధమే।

తీరునంజొరఁగల్గినాఁడవుదిగ్గనన్నముఁజూచిక।

న్నీరువంచెదవేలనిన్గననెమ్మిబుట్టెనుమాకునీ।

యూరుపేరువినంగవేడుకలూరుచున్నదితెల్పుమా॥ ౪౯.

క॥ అనిదువ్వలువనొసఁగినం । గొసములపైబిగియఁజుట్టికొనిలేచియతం।

డనునాయేలికతోఁగ । న్గొనలందునవేడినీరుగొబ్బునజారన్॥ ౫౦.

మ॥ అనఘాయేమనితెల్పువాఁడనినుఁగన్నారంగఁగన్గొన్నయం।

తనెనారాత్మజులున్నచోటువెదుకంగాఁబోయిశోకంబునె।

మ్మనమాశంగొనసాగెనంగములకున్మార్గశ్రమల్దవ్వులే।

య్యెనుస్వప్నంబునిజత్వమందుగతియయ్యెన్వ్యర్థతంబొందితిన్॥ ౫౧.

క॥ మున్నీటినావముప్పునఁ । జిన్నికొడుకుతోఁడముద్దుచెలియదొలంగన్।

గన్నీటఁగొంపఁదడుపుచు । నెన్నొగండములదాటియేనిటులుంటిన్॥ ౫౨.

గీ॥ అనుచునిట్టూర్పునిగిడింపనతఁడుమిగుల । జాలిఁబడిబాటసారిదాకేలుపట్టి।

తండ్రినీవలెనీవారుతప్పిబ్రదికి । రేమొసైరించుముందుమేలెనయావచ్చు॥ ౫౩.

క॥ తెలివింగొనికపదినపుది । కలవలెఁదలపోసిపోయిగనుమనిమఱపుం।

గొలిపించువింతపూఁదే । నెలఁజొక్కంజేసియాతనిందోడ్కొనుచున్॥ ౫౪.

గీ॥ కుడుచుమిద్దియకాతఁడుగొబ్బునఁజని । చేడెలంగూడిముచ్చటలాడుకొంచు।

నాసవములానిపలుచవులారగించి । యాటపాటలవెన్నెలబైటనుండ॥ ౫౫.

సీ॥ సన్నపువెలుఁగుతోఁగిన్నెరజతజేసిప్రభువుపైఁబాటలుపాడునొకతె।

యదుగొచందురుఁడునాకంటెఁజూడుఁడియనియేలికమోముముద్దిడునొకర్తె।

చెల్లరేవెన్నెలచీరఁగట్టితిననితోడవులాడిచినవ్వఁదొడఁగునొకతె।

యీఁతలోనాకెవ్వరెనయనినున్ననిరతనంపుఁదిన్నెపైఁబ్రాకునొకతె।

కోయిలలవెక్కిరింపుమఁగూయునొకతె । యెద్దియోతలపోయుచునేడ్చునొకతె।

యేమియల్లరియనియదలించునొకతె । సోలియాడెడునొక్కతెచొక్కునొకతె॥ ౫౬.

ఉ॥ చల్లనిరేయిఁదెమ్మెరలుచక్కిలిగింతలువెట్టవెన్నెల।

ల్జల్లఁగనవ్వనెచ్చెలియచక్కనిమోమునువల్లభుండుజా।

బిల్లిగనెంచిసందిటనుమువీసఁగముద్దిడియందువాస్తవం।
బెల్లనెతెంగిమైమఱచుచెంతయుముద్దిడుమాటిమాటికిన్॥ ౫౭.

గీ॥ ఒడలుతెలియఁగకరక్తులందోలలాడు । వారిపలెఁబాను గూడవికారపడుచుఁ।
దలఁపులోనున్నచెలియదవ్వులఁజెలంగు । పగిదిపొరపాటుతోఁదొట్రుపాటుఁజెందె॥ ౫౮.

శా॥ ఏమేయెట్టులవచ్చినావుపసివాఁడెట్లోటనున్నాఁడహో।
స్వామీప్రాణముమర్లిచేరినటులన్వచ్చెంగదాచెల్వయం।
చామోదంబునఁగౌఁగలింపఁజనియంతందెల్వితోనాసవం।
బీమోసంబొనరించెఁగానిచెలియేదీయంచుసిగ్గొందినన్॥ ౫౯.

క॥ కనియందఱొక్కమొగిఁబ । క్కుననెండొరుగాంచినవ్వకొనిరంతటమిం।
టనడఁగసాగెంజుక్కలు । వెనువెంటంజందమామవెలవెలబాఱెన్॥ ౬౦.

సీ॥ ఒంటిపాటునఁజొక్కియురువయికెంపెక్కివిన్నుతూర్పునదూరెవేగుచుక్క।
తెక్కలఁజాడించిముక్కువాడిగఁజేసికుక్కురోకోయనికూసెఁగోడి।
నీటితావులవారితోఁటలలోమీటియొపలువల్లనసేయుచుండెగాలి।
యైదుజాములపద్దుగాఁదోఁచునిఁకప్రొద్దుపొడమెడుననిచాటఁదొడఁగెఁగంట।
పట్టులెడఁబాసిపిట్టలుబయటఁబాఱె । దలలురిక్కించిమొక్కలుచెలువుమీఱె।
బలిమితోడుతనిద్దురబరువుజాఱె । దిబ్బునన్వేసవినిరేయితెల్లవాఱె॥ ౬౧.

గీ॥ అంతఁదనకాంతనవ్విభుఁడందలమునఁ । జెలులుగొలువఁగనగరికిఁజేరఁబనిచి।
యదివఱకెపిల్వవచ్చినయపవిహాంద్ర । నగుపఱిచిబాటసారితోననియెనిట్లు॥ ౬౨.

శా॥ కంఠేవేఁటకుఁబిల్వవచ్చెదవుడేగంబోలువేరమ్మునా।
వెంటన్గుఱ్ఱమునెక్కుమంచొకయరబ్బీనిచ్చిపేకెటఁగే।
ల్దంటంబట్టఁగఁజేసిమైమఱవులందట్టంబుగావించిబ।
ల్బంటుల్జాగిలముల్గపంగియిరుప్రక్కేపల్గాచియేతేరఁగన్॥ ౬౩.

గీ॥ తానునెక్కివింతతరగతిగుఱ్ఱంబు । పైసవారుసేసిబయలుదేరి।
గడియలోననెక్కుకాఱడవికిఁజేరి । బాటసారితోఁబలికెనిట్లు॥ ౬౪.

మ॥ చెలికాఁడాయదెకొమ్ముపందిబురదంజెర్లాడియీవైపుపే।
రలుకందూపువలెంగడంగెడురవంతైనందిగుల్బొందక।
వ్వలచేయీటెనుపర్దుమంచుఁదనయశ్వంబుందగన్బందియా।
దలపైనాటఁగఁజేసివెంబడిపిఱుందన్బల్లెముంగ్రుచ్చుటన్॥ ౬౫.

క॥ మెడఁద్రిప్పలేకబల్లెముఁ । దొడలోనెరముకొనువదియుఁదునియలుసేయ।
న్వడినీటెఁగ్రుచ్చెనానిం । బడవైచెన్బాటసారిప్రభువానఁగన్॥ ౬౬.

గీ॥ అంతలో నొక(డుమహా ప్రభువావన్నె । వాఁడయొక టిదుప్పినీడు చూచెను
దల్లవాకలోనికరుగుచున్నదియని । విన్నవించి విభుఁడు వేడుకపడి॥ ౬౭.

మ॥ భళి రాచేచులుశాగిలంబులునిశోల్పంజేసిపోనీకుఁడీ।
పులినంచుంజెలికానితో మిగులఁడన్పుంబొందిబాకుల్లుపా।
కులు చేఁబట్టిబి రానపోయి యుదటుంగొంకేమియుల్లేకక।
న్నులనిప్పుల్గురియించు బెబ్బులియెదన్గాయంగఁగుండేసెన౯॥ ౬౮.

క॥ ప్రేటుపడియుఁబోగతోఁ జెనె । మీటినటులబాటసారిమీఁదంబడెఁబే।
రీ టెఁబులి నోటఁజొన్పుచు । మా టెనతఁడుతన్ను విభుఁడుమాటికి మెచ్చ౯। ౬౯.

గీ॥ ఇట్లు వేఁట వెఱపిఁయేపాటుబడలిక । దడఁపనాసవంబులానిగుట్లు।
ములనుమార్చియొక్క పురిదెసఁబోవుచు । హితునిఁజూచియధిపుఁడిట్టులనియె॥ ౭౦.

క॥ ఓయన్న యింతవాఁడవె । నీయోర్పున్గావు తెంపు నేర్పుంగంటి౯।
నీయడిగిన దెల్ల నిడెద । హాయిగనాయొద్దనుండుమాయిటమీఁద౯॥ ౭౧.

క॥ ఎనిమిదియామడలు వెలు । పునమతీయంతకును రెట్టి పొడవునీమి।
త్రుని రాజ్యమెట్టులుండెను । కనుమానలుపట్టఁగఁ జెలికాచుచునుండె౯॥ ౭౨.

గీ॥ దొడ్డకాలమునుండెనిక్కొం తతూపునందు । నదియొకటి కంటఁబడవచ్చునదికొనియెద।
నందులోఁబుట్టి పెరిగి రాజ్యమునకెల్ల । మించినియొక పెద్దయేరుపండించుచుండు ౭౩

క॥ నిన్న మనమున్న సౌధం । బెన్నండికోఁడఁదొలిచియెపగొనచిరో।
యెన్నఁగఁజాలము మేమది । యె న్నెన్నో తరములబడియేలుచునైన౯॥ ౭౪.

గీ॥ ఇంకఁబల్లంబుఁజేరితిమిటునాలు । గామడల మేరమనకోటయులరు మండె।
గడియలోఁగాల్వపైఁబోగఁబెవమీఁద । నేగునము చేగరమ్ము ప్రొద్దెక్కకుండ॥ ౭౫.

గీ॥ అనుచుఁదన్నుఁగూర్చితనదు రాజ్యముఁగూర్చి । బాటసారితోఁడఁదేటపఱచి।
యతనిఁదోడుకొను మనవ్వి భుఁడేగునా । యేటికాల్వకుఁగడియె సమలందు॥ ౭౬.

లయగ్రాహి। నింగికిఁజెలంగిపుదలంగలిసిపందిరివలెంగదఁగినీడల నొసంగుబలుపోకల్।
సంగడిగనల్లినలవంగములకొమ్మలఁబెనంగికొనసాగువిడెముంగొలుపుటాకుల్।
రంగుమయిపండుకొలలంగలిగినిచ్చెనలనంగినయనంటులబెడంగయినమోక।
ల్మొంగలిగనిల్వ చెలువంగను మనంటుతెనయుంగఁబరిపోపలు తెఱంగులగు మాకుల్। 

చ॥ చెలువుగఁగాచువేప్పనసచెన్నగికొబ్బరిబాగ్గరేవులం।
బొలుపుగమేటియుయ్యలలపోలికనూడలడించిమించుచు।
ఱులువమయుక్కచెప్పఁగమఱుంగగువాడలునూర్లుసల్లెలు।
న్పొలసెలునత్రముల్మతియుఁబచ్చనిపైరులతోఁబొలంబులు౯॥ ౭౮.

గీ॥ కనుచుఁబడవకాల్వకట్టులలోఁదూరి । మబ్బులందుడాఁగిమరలమరలఁ।
దోఁచుప్రొద్దుపగిదిఁదోఁడరఁగనివ్వాళిఁ । బట్టువారికెల్లబసిఁడినిడుచు॥ ౨౯.

చ॥ చనిచనియవ్విభుండుపవనసంగిడికానినిజూచిమిత్రుఁడా।
కనుమదెపెద్దయేఱుపవికైవడిసూడలుమిన్నుముట్టుచుం।
పెనెటులనైదుకోసులవెడల్పయియొడ్డులుతీసిపాఱుచుం।
డెనుయెటులంబిరంగులుపడిన్మనరాకకుమ్రోఁగుచుండెనో। ౩౦.

గీ॥ అనుచుఁజెప్పుచుండునంతలోఁబెనువోజ । పలెఁడిగుపాగిపడవపట్టెమును।
గొనఁగనాల్గుజోళ్లగుఱ్ఱములుబ్బాన్చిన । బండిమీఁదవారుబయలుదేరి॥ ౩౧.

సీ॥ ఆమహాపట్టణమైయంతటనేటినీరుబికెడుపెన్మరలొప్పవిఱఁ।
బెద్దమేడలుగల్గివిరివియైదిద్దినయట్టుతిన్ననివీధులందమర।
మిన్నుఁగప్పుచుఁబోగమేఘములవలెనుశిల్పశాలలనుండివెలఁగుచుండ।
సందువెట్టఁగనీకజనములంగళ్లసంతలనుండిరాకపోకలనుసలుప।
బిచ్చగాండ్రునువెలయాండ్రుఁబేరునకయి । నంగలుగికవెలయుచుండునగరియందుఁ।
దసరువింతలునేర్వఁబడనహితునకుఁ । జూపుచాప్రభువేగెడుచోప్పనందు॥ ౩౨.

చ॥ తెలిపియొకింతయీాకచనుదెంచెడిమాకఁబోలంగఁబుచ్చుబ।
ల్తురుపుసవార్లయార్సలుతళుక్కనుచెంకెకుఁబోల్చుకత్తులం।
బరఁగుతుపాకులూనినసిపాయిదళంబులజోళ్లఁదప్పడుల్।
పొరిఁబొరిభేరిమ్రోఁతలుసముద్రపుఘోషవలెంగడంగినన్॥ ౩౩.

సీ॥ తడఁబడికొప్పులుసడలఁగఁబయ్యెదలెడలమేడలపయికెక్కువారు।
కనులారఁజూచిదీవనపాటఁబాడిదోసిళ్లతోఁబువ్వులుసల్లువారు।
పట్టణమందలిపతితులకుందండ్రివలెఁగోకలిడునంచునలరువారు।
ధర్మమొకింతయుఁదప్పనివాఁడుకావునదైవమితఁడనిమ్రొక్కువారు।
దేవిదేభాగ్యమనుచునుతించువారు । చక్కఁదనమెంచిచేష్టలుదక్కువారు।
నగుచుఁజెలువలుగనుచుండునంత । లోనమెల్లనఁదనకోటలోనికరిగె॥ ౩౪.

క॥ ఆకోటకునల్దట్లం । బ్రాకారమగడ్తయుంజొరనశక్యములౌ।
నాకోటలోనిమేడలు । నైకొన్నసొగసునుబొగడఁగనశక్యంబౌ॥ ౩౫.

గీ॥ అట్టినగరియందునధిపునివలెబాట । సారికొల్వఁబడుచునంతసంబు।
వడయలేకవిభునికడకొక్కనాఁడేగి । కనులనీరువంచుపనియెనిట్లు॥ ౩౬.

మ॥ అకటారోగికివిందొనర్చునటులీవందించుభాగ్యంబురి।
త్తకదాచెల్వనుబాసిమేటివలపంతంగుందునీసంగడీ।

నికిరాజోత్తమయూర్తబాంధవుఁడవౌనీ ప్రాపుఁబోనాడినే।
నిఁకనెందేగుదు నాలిబిడ్డలను నే నేతీరునంజూచెదన్॥ ౮౭.

సీ॥ తానుముందుగ లేచిస్నానంబుగావించి పొందమ్మినలెనాకు మోముఁజూపు।
నిల్లునీటుగఁజేసియెంతయుఁగ్రొంజవులూరువంటలుగడుపొంక మేపు।
నేపైకిఁజనిమల్లియే తేరనాయడుగులఁబట్టినిమిరిబడలికవాపు।
నామాటకెన్నఁడైనంజనదాటక నా నేర మెట్టిదియైన నోపుఁ।
గల్మిలేములనిల్లొక్కకరణిజరపు । నన్నిటికి నెక్కుడంచుమర్యాదనెఱపు।
మతియుబీదలపైఁగనికరముఁబరపు । నట్టియిల్లాలిఁబాసినే నెట్టులుందు॥ ౮౮.

క॥ అనివగచుబాటసారిం । గని యధిపుండూఁడించికనికరమునని।
ట్లనెనన్నయింకవగవం । బనిలేదొక మేలునార్తిఁబలికెదవినువా॥ ౮౯.

గీ॥ పట్టణముఁజేరునపుడెనీవారికొఱకు । నరయఁబంపినవారలుతిరిగివచ్చి।
చల్లగానీదుజవరాలుఁబిల్లవాఁడు । బ్రతికినారంచునిప్పు డేపలికిరనుమ॥ ౯౦.

క॥ అనిచెప్పినవినిసందియ । మునువేక్కయునబ్బురంబుముప్పిరిగొనునె।
మ్మనమునఁదనఁబడియొద్దియు । ననఁజాలకకొంతనిలిచియతఁడిట్లనియెన్॥ ౯౧.

శా॥ నన్నుంబెంచినతండ్రియోప్రభువయో నాపాలిదైవంబవా।
రున్నారాయెటులైననుంబ్రతికితాము న్నారయెందున్నవా।
రెవ్వండిచ్చటికేగుదెంచెదరుబంట్లింకెట్టులంజెప్పినా।
రన్నా నాకొకమాటలోన సెలవిమ్మాయంతయున్నొక్కెడన్॥ ౯౨.

గీ॥ అనుచుఁదత్తఱపడుచుండునతనితోడ । నధిపుఁడిట్లనువినుసందియంబువడకు।
మనమిటకు రాకమున్నె నీమగువవచ్చె । నెద్దియో వ్రాసినినిన్నట్టులెఱుకవడియె॥ ౯౩.

క॥ అనిచెప్పియవ్విభుండా । తనిఁదోడ్కొనియోడరేవుదాపుననింపాం।
దినగంటకంబునుకుం । జనియుండలివ్రాలినిల్లు చదువంగోడెఁగన్॥ ౯౪.

అక్కర॥ పెనుగాలినోడమున్నీటఁగొంతపైవిడిచెడంగ।
వెనుకొన్న వేటొకయోడయంతటిం బెనిచితెచ్చె।
ననుఁగట్టుకొన్నయతండొకండెకన్పడకయుండె।
నినుఁగొల్తుఁగంబమువానిఁగాంచినన్వేదకఁబంపు॥ ౯౫.

గీ॥ ప్రభువిటులు చదువఁగావినిబాటసారి । తౌను నొకనూఱుసారులద్దానిఁజదివి।
యాపెగుర్తులుచెప్పఁడీయని యడిగినఁ । గొందఱచ్చటనిల్లు పేర్కొనఁదొడఁగిరి॥ ౯౬.

చ॥ పిఱుఁదులమీఁటియుంగరపుఁబేర్లవలెండఱుచొందిజాఱుమే।
ల్నెఱిసవరించఁబోకమెయినిండఁగమాసినచీరఁగట్టిపె।

న్వే యప్పుడుఁ జూచి లేడికరణిన్నలు దట్టులఁ గాంచుచూర్పుల।
న్నెఱపుచు బల్లిగుల్వడెడు నీయెలప్రాయపుఁ బ్రతికన్నడన్। ౯౬.

గీ॥ తెలిమొగిలిపువ్వు లేఁత కేసులతళ్కుతళ్కుఁ। గలుగు రెక్కల్లనుండి వాగ్గనుల నీకు।
వలపు సముత్తియ ములపసౌఁ బడుట నీదు। చెలువవలవంతి కొక వింత చెలువుఁ దెచ్చె॥ ౯౭.

క॥ వినుమిలుకు త్తెరమునఁ బదు। నెనిమిదియామ సల మేర నెసఁగిన రాజ్యం।
బునకిపు డాసరులను గొఁ। జను దండిసయోషనీదు చానం దెచ్చెన్। ౯౯.

గీ నెలపోడుపు నాఁడు నీదు నెచ్చెలి మయిపట। నాదియొక్క తెచిఱుతి చూపార్చుచుండ।
పంపుకంబులఁ గొనియిది వ్రాసినీనిఁ। గావుఁడనిమాకుఁ బెక్కు రూకలిడితనియె॥ ౧౦౦.

క॥ అనినమ్మకింబుపుట్టిం। చినఁ గొండ తెఱఁగునఁ బొంగి చెలి ప కినులఁగ।
ట్టినమాడ్కి దోఁగు నొకకొం। త విలిచి యాబాలుసాక్షులపో సెవిటుల్ ౧౦౧.

గీ॥ కట్టుకొన్న తెలిమికట్టులఁ దప్పితిఁ। గట్టుకొన్నవాఁడె నెట్టులైతిఁ।
గట్టరానిమనసుఁ గట్టి బతికితినిన్। గట్టుకొన్నవాఁడెనుకఁ జెల్లె॥ ౧౦౨.

గీ॥ బొంటి బ్రతికినదని నాకుఁ దేటపడియెఁ। గాలినాయుని యేటుఁ దెచ్చానయకట।
పిట్టవలె నాకు రెక్కలు వెలయు నేనిఁ। బడ తెఁగనకుందు నే రెప్పపాటులోన॥ ౧౦౩.

చ॥ అనితలపోయుచున్న గమనాతని నేలికబుజ్జగించియు।
ట్లనుఁ జలికాఁడ నీదు చెలియన్న నుఁ గొందువు సైఁచుమంచు నాఁ
డెలిసి వినిక్కమయ్యెను గదా యికఁ గుందకునిమ్ము నంపులో।
పున నొక మేలు నీవలనఁ బొందికఁ గావలెనమ్ము చెప్పెదన్। ౧౦౪.

గీ। ఇట్టులా విభుఁ డాతని దిట్టపఱచి। కోటలోనికి దోడ్కొని కొంత తడవు।
వేడుకలఁ బుచ్చి యాతని తోడ నింటె। నరిగి యొకపూవుతోఁటలోన నియెనిట్లు॥ ౧౦౫.

క॥ కనఁ బడిగినవి తశాస్త్రము। తనంతజతి విడిచి స్వతంత్రత్వ ష్టుఁడు పాం।
గునఁ బలనినుఁ గన్న దిము। లఘు నీహితుఁడు లోసనలరుం జుమ్మా॥ ౧౦౬.

గీ॥ అదుగొ వచ్చెడుఁ జూడు నాయన్న కొడుకు। వేఁగిక్రోల్పులి నాడించు జట్టి కాఁడు।
తండ్రి కెకసుడుగా నన్నుఁ దలఁచుచుండు। నెల్ల చదువులు నేర్చు నీపల్లవాఁడు॥ ౧౦౭.

సీ॥ మావంశమునఁ గలమర్యాదఁ జెప్పెదనన్నదమ్ములు పెద్దపిన్న వరుసఁ।
బరఁగి రాజ్యము సేయవలయును మాయన్న యేలి రాజ్యంబు నాకిచ్చె నేను।
వీనికి నుసఁగెద వీఁడు నా కొడుకులకిచ్చు నేలుబడి యిట్లెసఁగవలయు।
నిరువదియైదేండ్లకేలిక యై మఱియిరువదియైదేడు లేలవలయుఁ।
బిమ్మట న్మనమానాఁడు విడిసియున్న। కొండపై కేగి హాయిగ నుండవలయుఁ।
బెద్దలేర్పాటు సేసిన దిద్దుపాట్లు। మఱియుఁ జెప్పెద వినుము మామతముఁ గూర్చి॥ ౧౦౮.

చ॥ కలయుం దెత్తెడి మేను దోఁచెడి జగత్కార్యంబులుం జిత్తసం।
చలత న్వాస్తవముం దుఁబోల్కిఁగను మీ సత్ప్రపంచంబున।
జ్ఞులకున్ నిక్కముగాఁగ నంబడెడుఁ బ్రాజ్ఞుల్ పూర్ణభావంబుని।
శ్చలమా టందమకన్న వేఱుగ నకిశత్వంబుఁ బ్రాపించుచున్॥ ౧౦౯.

గీ॥ గొప్పవారి ప్రతిమ కొప్పరు మావారు । గొప్పవారి యొప్పుఁ గోరుచుండ్రు।
కల్ల పెద్దతప్పగాఁ దెగడంబడు । తెలివి కొలఁతగాని కులము లేదు॥ ౧౧౦.

క॥ మామ తమన్నంగిట్టని । మామ యొకండుండె మేనమామ యితనికిన్।
నీ మగువ యున్న రాజ్యం । బామోపముఁ జూప నేలు నాతఁడు దొరయై॥ ౧౧౧.

క॥ ఆతఁడు జగడంబిప్పుడు । మతోడ న్నెట్టుకొని యెమతములు వేశై।
మాత్రోపలు రెండు నెడం । బైతిన్నఁగఁ గలయవద్దు తెన్ను నఁదప్పన్॥ ౧౧౨.

క॥ గుడిసుంకము బడిసుంకము । పడంతి సుంకంబు నేలుబడి పట్లదటన్।
మడిమైల లంచుఁ బిల్వం । బడు నీరును నిప్పునవటి వారల చేతన్॥ ౧౧౩.

గీ॥ అన్నవిను లేక లేక యా యధిపునికొక । కూఁతు రొదవెను నా మేనకోడలదియు।
వీఁడు నొకకోటఁదమ విన్న నాఁడు కలిసి । యుంట నెండొరులఁ దవిలి యుండిరపుడు॥

క॥ అన్నిట నీడుం జోడుం । గన్నాకే చిఱుతల కటకట్టేఁడి దైనం।
బెన్నడు జత గూర్చెదు నూ । యన్నాయా రాచమత మెయడ్డయ్యేఁగదా॥ ౧౧౫.

గీ॥ ఒంటి పాటున గ్రుమ్మరుచుండు మదపు । టేన్గువలె నాకలినిదుర లెఱుఁగఁడెకట।
యా దేశమునకొంటిననరుగఁదలఁచి । సైఁచకున్నాఁడు నా కేమిఁ తోఁచకుండె॥ ౧౧౬.

గీ॥ బలము సంగీత సాహిత్య వైభవంబుఁ । జక్కఁదనము స్వతంత్ర రాజ్యంబుఁ బిన్న।
వయసుఁ గలిగినవానిఁ దప్పమతియె యనిఁ । గట్టుకొన నుల్లనం బునక్కన్నె నిలిచె॥ ౧౧౭.

ఉ॥ ఇన్నియుఁ గల్గినట్టి యొరుఁడెందున నీతనికన్న లేమిన।
క్కన్నియ తానెఱింగినది కావునఁ బండ్రికినట్లు చెప్పెనం।
తన్నలు దట్ల రాజులకతం పెదివెల్లడి సేయఁబంచెనూ।
యన్నయుఁకైదు నాళ్లగడు వైకను పించెదు జుమ్ము పెండ్లికిన్॥ ౧౧౮.

గీ॥ అకట మాయన్న యితని నాకప్పగించె । నేను నీకప్పగించితి నీదు కొలఁది।
యొఱిఁగి యటుగాన మీరిరువురుఁ గడంగి । తరుణులను గూడి వేవేగ మరలిరండు॥ ౧౧౯.

క॥ మీరే తెంచినతోడనె । నా రాజ్యం బన్నకొడుకునకు నిచ్చెదనా।
త్మారాముల మై మనము । క్కా డడవి న్నాంతిఁ బొందఁగావలెసుమ్మా॥ ౧౨౦.

గీ॥ అనుచు బాటసారి కయ్యధిపుం డెన్న । కొడుకున నప్పగించి గడుసు బంట్లఁ।
దోడు చేసియేటి యోడ రేవు వఱకు । నంపకంబు వెట్టి యరిగె నంత॥ ౧౨౧.

క॥ కట్టెపలికదలి మేల్కని । బెట్టిదముగ నావులించి పెంబొగలెగయ।
న్నట్టేటంబడి పర్వులు । వెట్టం బేరోడజనము వేడుకపడఁగన్॥ ౧౨౨.

గీ॥ అపుడు బాటసారి యారావపట్టితో । నోడఁజొచ్చి త్తరువులకుల్లసంబుఁ।
బొందలేనితనదు డెందంబుఁ దెలుపుచు । ననుఁగుఁదనముతోడననియెనిట్లు॥ ౧౨౩.

క॥ ఓడక పెంపుమసింగఁపుఁ । గోడవన్నెచ్చెదీవు కొమరుఁడవకటా।
జోడయినచేడియలవిడ । నాడియునికి మనలకొకటి యైకన్నట్టెన్॥ ౧౨౪.

శా॥ అన్నాకన్నె తనంబునుండి తగులై యామున్దరాలెంతయు।
న్నిన్నుం గన్గొనునంచు వింటిఁదనకున్నీ వేడ్కఁ దెల్పంగనీ।
కెన్నం డేయదియానవాలిడియె నీవీకీరు చేటొప్పటుతోఁ।
జెన్నొందూలుట లేలనాఁ జెలఁగి రాసింగంబు బెంపందుటన్॥ ౧౨౫.

గీ॥ మీఁదజగము శోభగ మేల్కనియున్నదు । రించునట్టిమదిచలింపముద్దు।
గుమ్మయుంపినట్టి కమ్మఁజేకొనిచవు । లూనఁజది వెబాటసారికిట్లు॥ ౧౨౬.

క॥ వలపుం దెలుపఁగఁజాలదు । కలంబున మనచిన్ననాఁటి కలసి మెలఁగుట।
ల్దలఁపునకువచ్చినయెడ । న్నిలుచుం బ్రాణములు వాఁచ నేరంబావా॥ ౧౨౭.

గీ॥ వావిమేనత్తికము పసితనంబుననుండి । చనవునేఁతయెంచుకొనినసామ్ము।
దవ్వులయ్యె నిందు జవ్వనఁపుంగొర్కె । కఅవుదీర నెపుడుకందునిన్ను॥ ౧౨౮.

గీ॥ మనలమతమున నీమామమతముచెల్లిఁ । బూను తెన్నున నేర్పుచు కన్నుఁద్రిప్పి।
యా పఁజాలనాయె పెబాటువాటి । రమ్ము నీబలశౌర్యదర్పమ్ముఁ జూపి॥ ౧౨౯.

క॥ పలుమఱుఁదనపైనీచూ । పులుబాఱఁగ నీదు డెందముం గొనినీచే।
తులనంటి ముందుగను బెం । డిలినీకీసవతి కమ్మనెఅపుం జూమ్మా॥ ౧౩౦.

సీ॥ చిలుకబూ చులకుల్కి జిలిబిలిగాఁ బల్కి సాబాలుగాఁదిన్న చల్దిబువ్వ।
చిఱుజగడములానిబిరబిరఁ బొత్తూని తనివిదీరక తూఁడుదాఁగుమూత।
పట్టుపంతములాడి బాగుగఁ గవఁగూడి మెలపునఁ బాడినమేలుకొల్ప।
అంటు జంటగఁ గట్టిదంటగ నీర్వెట్టి నిలుపునంపఁగిఁనున్నతొలిసమర్త।
ఆనవాళ్ళివినన్నుఁ గన్నారఁజూపఁ । నేగుదెంచినయీగాలిపోగుబొమ్మ।
మనసువచ్చినయట్లు విస్మరులఁ గొల్పఁ । బొగలుచున్న దినిక్కఁపుబొమ్మయి పటు॥ ౧౩౧.

క॥ అనిపగమీఱఁజదివిదాఁ । పునఁగలయచ్చెలువచిత్రము ముందనకన్దో।
యినలఁదుకొంచమార్పులనిడు । చునతేఁడు చెలివాలుగనుఁలఁ జూచియిటులనున్॥ ౧౩౨.

గీ॥ మొదట వావులెత్తింగినముద్దుమాపుఁ । బిదపఁగురులుంచుదాపున బెదురుమాపుఁ।
దవిలియెడబాయఁజాలని దివులుఁ జూపుఁ । గనులదో బూచిమాపునక్కన్నెచూపు॥ ౧౩౩.

వ॥ అనిదిగులందునాతనికినంతటరోజుచుబాటసారియి।
ట్లనుఁజెలికాఁడయచ్చెలువనంటకయేయిటువేగుచుంటివే।
మనియెదనెల్ల వేడుకలనందఁగఁజేసినవానిఁబాసిపా!
క్కనుఁదలంచియైననిఁకఁగుండకుచూడుమురేయిమించెదుర్॥ ౧౩౪.

సీ॥ ఆకసంబుననడుగంటిచుక్కలుఅవలట్లుచీకటినీటనలరుచుండెఁ।
గరఁగినవెండినీర్బరపినయట్టులునలలవాలుగమీలుబరఁగుచుండె।
మీఁదిక్రిందులఁబొల్చుమింటినట్టనడుమగారడియద్దమైకడలిదోఁచె।
దొప్పచేతులవలెఁదూగాడుకరటముల్గొప్పజంతువులఁజొక్కొట్టుచుండెఁ।
జుక్కజాడలఁబొగయోడచొక్కుచుండె । గాడుపుద్దైనలంజోలఁబాడుచుండె।
నెగడిగడియారమిదిగొపన్నెండుకొట్టె । నిపుడుచెలికాఁడెమనమునిద్రింపనలయుఁ॥౧౩౫.

క॥ అనిరాకొమరున్నిద్రకుఁ । జొనిపితనకుఁగన్నుమూఁతచొప్పడమిమన।
మ్మునకగుపడుతనచెలియకు । ననఁగఁదొడఁగెబాటసారియడలుచునిటులర్॥ ౧౩౬.

మ॥ తరుణీకన్గవఁబోలితెల్వియెడనిద్రంజొక్కునష్టాంటిపా।
లెఱుఁగంబోవనినిన్నునన్నెడపెనేమేకూళ్ళదైవంబుపో।
నిరవంతైనఁదొలంగకుండుముగదానీరూపునాలోనన।
ద్దిరనాకిద్దియెచాలుఁజూచుకొనెదం దెల్లంబుగానెవ్వడుర్॥ ౧౩౭.

క॥ నిడువాలుకనులుతీయని । నుడువులుముంగురులుచెదరు నుసలుస్తేల్పు।
త్తడిమేనుసన్ననడుముపా । గడఁదగునీనడకకనులఁగట్టుంజుమ్మా॥ ౧౩౮.

సీ॥ అడుగులుగందనెన్నడుమువడఁకనీవుదెసలుచూడకనీళ్లుతెచ్చుపహొరాలు।
చెక్కిళ్లకిరుదట్లఁజివురుచేతులఁజేర్చియొప్పగానీవుపాయ్యూదుతీరు।
దాకేలువెన్నుమీఁదనుమోపినెమ్మేనువంచుమనీవువడ్డించుచెల్వు।
కొనగోళ్లనీనియల్దనుముచుమడుపులమచ్చికతోడనీవిచ్చుసొగసు।
సన్నుఁగనినప్పుడెల్లనీకున్నజోక । నేనుజబ్బుగనున్నప్డునీదువంత।
నాదుచుట్టములందునీయాదరింపు । లెంతకనితలపోయుదునెట్టులోతుర్॥ ౧౩౯.

క॥ ఇదియేమిచోద్యమోగద । ముదితానిర్దలఁచినేనుబొంచెదుశోకం।
బెదకింపైతోఁచుచును । న్నదియిటుఁదక్కనతలంపులన్నిఁటికన్నర్॥ ౧౪౦.

ఉ॥ ఎన్నఁడునిన్నుఁగందుఁజెవికింపుగనీదగుముద్దుమాటలిం।
కెన్నఁడువిందునక్కటచెలీయిప్రుడెక్కడనున్నదానవో।
నాన్నయటంచుబిడ్డఁడనునప్పుడునీయెదయెట్టులుండునా।
న్నన్నతొలంగుప్రాణములనాఁగయెపోవగనీకనిల్పెదుర్॥ ౧౪౧.

గీ॥ అనుచుఁబెక్కు తెఱంగులనతఁడు వగచి । నెగడు నిద్దురఁదనదు కన్నీటఁదుడిచి।
రేయిపోవుటఁబొడగాంచి లేనిఁదెల్పి । ముచ్చటించెనిటుల శోకమున్మ్రింగి॥ ౧౪౨.

శా॥ అన్నా హాయిగ నిద్రవట్టినది యేహా చూడుమా యోడకు।
న్మున్నీర్వాయలు విచ్చియత్తుకొన కెంతో లోతుగాఁదోఁచునె।
న్నెన్నో కోసుల మేరనద్దిరయి దేమీ కొంపలుంజెట్టులు।
న్మిన్నున్మన్నుని వెల్లయున్వెనుకకున్వేబర్వులంబెట్టెడున్॥ ౧౪౩.

చ॥ అదె మన మేగఁబోవు పురియబ్బురమై పొడగట్టుచుండెఁబ।
న్నిద మొనరించు గుజ్జుమటు నిల్పడు నోడపయిన్పడెంబులా।
ష్పదముగ సన్నలం దెలుప నేగిరపాటున మిట్టుపల్లము।
ల్గదియుచుఁజూడు తెప్పలలలంబడి యిచ్చటి కేగుదెంచెడున్॥ ౧౪౪.

గీ॥ ఇట్లు వారిర్వురున్ముచ్చటించుకొనుచు । నాసయువ్విళులూర సంతోసమలర।
నోడదిగి పసిపలఁజొచ్చి యొక్కగడియ । కొద్దునకుఁజేరి హాయిగనున్నయంత॥ ౧౪౫.

గీ॥ వారుదమకు నెదురువచ్చిన యారాచ । కన్నె చెలులఁగాంచి కలతెఱంగు।
వినఁగ వేడ్కపడఁగ విన్పించిరివ్వారు । కేలుదోయి నొసటఁగీలుకొలిపి॥ ౧౪౬.

క॥ మమ్మేలు రాచకన్నియ । మిమ్ముందనపూలతోఁటమేడఁగలియఁగా।
నిమ్మొనరిచి వేవేగమె । రమ్మనియిదె కెంపుటుంగరము గుఱుతిచ్చెన్॥ ౧౪౭.

క॥ అని చెలులిచ్చిన యుంగర । మును గన్గొనవద్దుకొంచు ముద్దిడికొంచ।
క్కునఁగదియించుచుఁదనచిటి । కెనవ్రేలనమర్చి వానికిఁబలికెనతఁడున్॥ ౧౪౮.

గీ॥ నీదు పసిఁడిచెలియ నెమ్మేని జిగిఁదెల్పు । నీదు కెంపుమోవి నిగ్గుఁదెల్పుఁ।
గాని చెలువ మనసు గనిపెట్టి చెప్పక । యుంటివేమె ముద్దుటుంగరంబ॥ ౧౪౯.

క॥ చెలియేమి సేయుచున్నది । పలుమఱు నిడువాలుగనులఁబర్వుచు నీతోఁ।
బలికిన పలుకులుగలవా । తెలుపుమనఁగఁజెంతనున్న తెఱవలఱుచున్॥ ౧౫౦.

చ॥ తెలిపిరి తోఁటనీవు చనుదెంచుటకున్న కునంబుఁజూపు మా।
వెలఁదియుఁ జంపకంబు పసిపిల్లనిమ్ముంగలఁగాయపండుల।
న్నిలుపుచుఁజాము రాకవిని నివ్వెరతో నొకకొంత నమ్మక।
వ్వలనగు పర్చు వేడ్కకను పండువసేసెను మమ్ము బోంట్లకున్॥ ౧౫౧.

చ॥ కలకలనవ్వు వేలుపుల కైకయి మోడుచు పైటసర్దుకొం।
చలసటఁజూపు ముంగురులనద్దములో సవరించు దిట్టమా।
డ్కులఁబచరించు మమ్ముఁగనుఁగొంటకు సిగ్గలరించు నెత్తలం।
బలుమఱు నూచు మా చెలువ పట్టఁగఁజాలని వేడ్కయుబ్బుటన్॥ ౧౫౨.

క॥ అనిచెలులుసెప్పితోడ్కొనఁ । దనివింగొనిరాచపట్టితనకై యేర్పా
ర్చినపూఁదోఁటవిడిందికి । ననుఁగుంజెలికానితోఁ జనరిగెఁదనయకటా॥ ౧౪౩.

గీ॥ అపుడుబాటసారియా రాచపట్టికి । జరుగువేడ్కఁజూచిసంతసించి।
యనుమఱితనచెలియయున్నచోఁ ప్పెటుగాంతు । ననుచుఁదనమదిననుకొనియెనిట్లు॥

సీ॥ కోన్నాళులడియాసఁగొనుచుండు డెందంబుసెప్పనేఁతలకెల్ల నొప్పియొప్పి।
తలఁచనిభోగముల్దమయంతఁజేకూరునప్పుడు రాకుంపెనొప్పిరొప్పి।
కోన్నాళ్లుపొట్టకకూర్తికై యందందదిక్కుమాలినబొందిఁద్రిప్పిత్రిప్పి।
యనురాగపడకుఁడోఁయయ్యలా రాయనిగొప్పనావలవంతఁజెప్పిచెప్పి।
యదియటులగానియెడ నేమిఁయగాదు నేను । మఱియుఁబ్రతుకుటలా మొండిమొరడువలెను।
గాదుబ్రతికెదనింక నీమీఁదనేమి । యగును నానాఁటికెట్టులోయరుగుటగద॥ ౧౪౪.

గీ॥ మిగులలోకానుభవముగలుగుటఁబట్టి । నాదుమదిదిట్టపడుచునింతపఱకైన।
నిల్వఁగలిగితిఁగానినన్విడిచిలోక । మెఱుఁగనిచెలియయెపబోటునెట్లు సైఁచు॥ ౧౪౫.

గీ॥ పిల్లవానినెవరికైనఁబెంచనిచ్చి । యకటననుఁజూడలేననియాసదొఱఁగి।
నాదునిల్లాలు నాజీవనమిదియటకె । బలిమిచేతనుసురులెడఁబాసెనేమొ॥ ౧౪౬.

క॥ కానియెడన్నగవేసముఁ । బూనిమగువలోనమిగులఁజొక్కుచునేనెం
దైననగుపడుదునోయని । తౌనూరులువల్లెలందునారెడునేమో॥ ౧౪౭.

గీ॥ తలిరుటడుగులలోముండ్లుడగిలెనేమొ । పసిఁడిమేనెంపతొఁకునబపలెనేమొ।
పట్టుమెత్తనినెఱులంటఁగట్టెనేమొ । నాకనులపండువింతఁగానఁబడదేమొ॥ ౧౪౮.

సీ॥ నినుఁజెప్పపాటైనఁగనకున్న నూర్వనికన్నులుగాడలుకాయవలసె।
క్షణమైననీమాటవినకున్న సైఁచఁగఁబోని చెవ్వుల్జెట్లు నొలువవలసె।
నీదుపేర్చవిగొంటనిముసమైననుమాననట్టినాలుకగడ్డికట్టవలసె।
గడియయైనన్నినుపెపసినీరగుఁగండుగుండెబండ్రాయిగనుంపవలసె।
కటకటా నాదుచిన్నిబంగారుబొమ్మ । నాదుప్రాణమయెచటనున్నావొ ప్రవాలు।
కన్నుఁగవనీరువఱదలుగార్చుచెట్లు । కుందుచున్నావొయిపుడునన్నుందలంచి॥ ౧౫౦.

గీ॥ విన్నఁబోయియిట్లు వెతఁజెందునాబాట । సారిమోముఁగాంచిజాలిమించి।
యపుడురాచకొమరుఁపెచ్చెలికానికిఁ । దలఁపుమల్లినట్లు పలికెనిట్లు॥ ౧౫౧.

గీ॥ అయ్యయింకమీఁదపాయిమనకుఁగల్గు । నంచుగుర్తుచెప్ప నాకసంబు।
వేఁడిగాడ్పువేసవింబొసిచల్లని । మబ్బుగమ్ముచున్నమాడ్కిఁగంటె॥ ౧౫౨.

సీ॥ తొలితెల్లకొంపెలవలెనున్న మొయిళులుగొప్పలై నీలిరంగులఁదనర్చి।
దూదిపింజలవలెనొడ్డమబ్బుల సేకిగాడుపుపరుపులుగానొనర్చి।

వెండికమ్మిఁ ద్రిప్పి వేసినయట్టులు మెఱుపుతోడుతఁ బెద్దయుఱుము పుట్టె।
నేలఁగమ్మనితావి నెగడించుచందందవలుదలై లెక్కచిక్కులు మొదలిడె।
మింటికి న్మంటికిఁదఱుచుమీఱవాన । ధారలందీగెలబిగించియారజంపు।
కాలవాద్యంబుతోఁగవగల్పిరసము । చిందునట్టులగాలిపాడందొడంగె॥ ౧౬౩.

గీ॥ వంగియక్కన నొకచిఱుతం గదించి । చూడువచ్చెడు నెవతొయీ మేడదరికి।
జడిసిపిల్లకు నక్కలుచాటుసేసి । పట్టునకుఁబర్వెడెడికోడిపెట్టఁబోలి॥ ౧౬౪.

క॥ అనుచుందునమదిఁ ద్రిప్పినఁ । గనుఁగవనగుపడఁగ నీక క్రమ్మిననీటన్ ।
మునికొంగునఁదుడుచుకొనుచుఁ । గనుఁగొనియాచాటుసారికడునబ్రమునన్॥ ౧౬౫.

గీ॥ లేచినిలిచినిదానించిచూచికేలు । దోయిఁదట్టుచు నెఱుఁగుచుదొడ్డమాట।
నిదిగొ నావాసి నాయయ్యయిదుగొకంటి।నను చు నెదురేగె నేస్తునికబ్బురముగ॥ ౧౬౬.

క॥ అప్పుడుపాదియు నాతని । జప్పునఁబరకించిపోల్చిసరగననియెమా।
యప్పానీబిడ్డండిదె । యొప్పుగనీయాలునిచటనున్నదిసుమ్మా॥ ౧౬౭.

గీ॥ ఇచటిరాచకూఁతురెంతయుఁగూర్మితో । మమ్ముఁ బెంచుచుండెమామొరవిని।
వెదకి వెదకివిసికిసాడఁజొత్తునంచుమా । యమ్మరేపునిశ్చయమ్ముసేసె॥ ౧౬౮.

గీ॥ పాలుపొంగుఁజూపిపైమూఁతలుబికించి । పడెడుపోల్కి డెందపుడికినిదుర।
నైననుబ్బికనులయందునీరై పార్లుఁ । జెలియ యంతయేమి చెప్పుదింక॥ ౧౬౯.

గీ॥ ఇచటబుడుతనికింజల్దియిడుచునేను । దిరుగఁజప్పునవానయుమ్మిరగవచ్చె।
నంతబిరబిరనీమేడచెంతఁజేరి । మిమ్ముఁగనఁగల్గెనాయదృష్టమ్ముచేత॥ ౧౭౦.

క॥ అనిచెప్పినఁదత్తఱపా । టునువేక్కయునబ్బురముకడుంగనితనమే।
ల్వినిపించుమనుచనద్దా । సినాలికడకంపిబుడుతఁజేకొనియతఁడున్॥ ౧౭౧.

ఉ॥ అక్కునఁజేర్చిముద్దిడునవాయనిముచ్చటలూరుఁజిన్నినా।
చక్కనితండ్రిని న్నెడయఁజాలితి నేయనికంటనీరిడున్।
జక్కెరవెట్టుమచ్చికలుసల్పుఁగురుల్దుడుచున్నగించున।
మ్మక్కనిపించువిద్దియలనాడఁగఁజేయునుమాటిమాటికిన్॥ ౧౭౨.

గీ॥ చాటుసారియంతఁబట్టఁజాలనివేడ్కఁ । జెలఁగిసంగడీనిచేతికిడన।
యనుఁగుఁగొడుకునిచ్చిజనకగర్వంబుతో । నొసటఁగేలుమోడ్చినుడివెనిట్లు॥ ౧౭౩.

గీ॥ అలసినట్టేటిలోనఁ గ్రుక్కలను ద్రిమింగు । కొనుచుఁగొట్టుకొనెడునష్టమనుపడోఁచు।
నడుగుమీయయ్యగానొడ్డునందుఁజేర్చు । నోడగానీవునన్నుఁగాపాడినావు॥ ౧౭౪.

ఉ॥ ఇంచుకవాండ్రనైనఁదమకెక్కుడుగాఁగనుచుండ్రుకోర్కెకా।
సించకకొల్చుచుండ్రుకడునెగ్గిడువారికినైనమాఱుచె।
ల్లించరుకల్లలిచ్చకములెన్నఁడుఁబల్కరుకూర్మియెల్లెడం।
బెంచుదురార్తబాంధవులుమిమ్ముఁదలంచినఁగీడులంటునే॥ ౧౭౫.

గీ॥ మున్నునీటిలోనమున్గియూపిరియాఁడ। కున్నమాడ్కినిడుమనొందుచుంటి।
నిపుడుపైకిఁదేలినపగిదిమీప్రాపుఁ। బట్టియున్నహాయిఁబ్రతుకఁగంటి॥ ౧౭౬.

గీ॥ అనుచుఁబల్కఁగవినియారాచకొడుకనె। సంగడీఁడయిట్టిసమ్మదమ్ము।
మనకుఁగలుగుటకునుమాయార్యకారిణ। మతఁడుమాఱుదేవుఁడనఁగవచ్చు॥ ౧౭౭.

గీ॥ అయ్యనీయాలిగావచ్చునదిగొవచ్చు। చుండెనిరుపట్లఁజెలువలనుప్పుమీఱి।
మీఁదియంతస్థమందునేమెలఁగుచుందు। నింకమీరిచటన్సుఖించుకొనుఁడు॥ ౧౭౮.

క॥ అనిరాచపట్టిచనెవె। ల్గునువెన్గొనుచందమామకొమరునవాఁడి।
స్సునుగొనితనయిల్లాల్రాఁ గనుఁగొనెనాబొటసారికనుపండువుగాన్॥ ౧౭౯.

గీ॥ పిదపనాలుముగళ్లుపెన్వేష్కనొండొ। రువులకాఁగిళ్లఁగొబల్లడవుగఁజొక్కి।
నంతఁబెనిమిటితోడనాయతివపలికె। జాలియున్నిగ్గఁగన్గవమేళగింప॥ ౧౮౦.

క॥ నీకాఁగిటఁబడుపున్నెము। చేకూఁరుననుకొనలేదుచీకటిగానీ:
లోకమగుపడియెనిన్నా। ళ్లాకలినిద్దురలుడిప్పులయ్యెంజుమ్మా॥ ౧౮౧.

గీ॥ ఆసయున్నందియముడెందమందుఁబెనయ। నెంతియోయోర్చితుపిడికిసుమంతయైన।
మీఁదిజాడయుఁబొడగట్టమింతెగించి। చిచ్చుఁజొరనుంటినింకేమిచెప్పుదాన॥ ౧౮౨.

గీ॥ అనుచుఁబల్కెడుచెలియనక్కునఁగదించి। కురులుదువ్వుచుముద్దులుగొనుచుబాట।
సారియనెముద్దరాలయీశ్వరకరుణను। దొరఁగెమనకాపదలునాదుతెఱఁగువినుము॥ ౧౮౩.

సీ॥ అపుడట్లుమున్నీటియందుఁబెంగాలికిఁదలడిల్లునోడచాపలనుడించఁ।
జనిమెట్టపాకునఁజప్పునఁద్రుళ్లిపైఁబడితినేమనిచెప్పువాఁడఁబిదప।
మున్గితేలుచునదేమూలకోకొట్టఁగఁబడియొకింతటఁదెల్వివచ్చియొడ్డుఁ।
జేరితిననిపొల్చిచేతులుగాళ్లుమెల్లనఁగూర్చుకొనిలేచినిసుఁదలంచి।
యేలబ్రతికితిననియేడ్చియేడ్చియొక్క। కొండమీఁదుగనొకతోనిపించఁజేరి।
వానినగరుననీదుచేవ్రాలుఁజదివి। పుణ్యవశమునమరలనిన్ బొందఁగంటి॥ ౧౮౪.

క॥ పడఁతీవెనుకటివంతల। కడరపలదుమనకుహాయినందించినరా।
ద్డుకదెనడతెంచెదుసం। దడితోనేనచటికేగెదననిపలుకుచున్॥ ౧౮౫.

మ॥ వడివడి నేగి యిల్లని యెబాపురె యేలిక వేడ్క లెవ్వియో।
పొడమిన యట్లు తోఁచెనని బొంగుచు రాకొమరుండు సెప్పెని।
క్కడి మన కార్యము ల్పొసఁగెఁ గాంచితి మామ నతండనాకొడం।
బడి తనకూఁతు నిచ్చుటకు బాసయొనర్చె ను సుష్మమిత్రుఁడా॥ ౧౮౬.

గీ॥ నన్నుఁ బోలువాని నామామ వెదకియుఁ। గాంచలేక యిట్లు కట్టువడియె।
వేఱు మతముల గుటఁ బెండ్లి మానగి రున। సలుపుకొనఁగ సెల వొసంగి నాఁడు॥ ౧౮౭.

గీ॥ అనుచు నతఁడు బల్కుచుంతఁ జెలులు జూట్ట। గొలుచుచుండఁ బెండ్లికూఁతు గరుగు।
దం వెహొయలు మీఱ దివ్వెలకు నడుమఁ। దనరు నట్టి తెలిమతాబుఁ బోలి॥ ౧౮౮.

క॥ అప్పుడు మంగులు తడబడ। గుప్పున బూఁదావులీను కొప్పున పెలసి।
గ్గొప్పఁ బసి నాటి చనువున। నప్పఁడతుక మగని కేలినందిరయమునన్॥ ౧౮౯.

గీ॥ ముత్తెపుఁ జేలున గివు మొల్క లెత్తుచుండఁ। జీఁకటి మెఱుఁగు వాల్జూపు జిమ్ముచుండ।
గుల్కు గుబ్బలఁ బయ్యెద కొంగుసదురఁ। గొంచు బాలాయను మఁబల్కరించు నంత॥ ౧౯౦.

మత్తకోకిల వృత్తము॥ పొంపు మమేను గుర్కొను నంపమి బొదలఁగఁ బువ్విలుతుని వెలెరా।
సింగము మైమపు పుంగొని వంగి టె చెలులఁగను గొనక కవుఁగిటిలో।
సంగి గయించి తను నంగడు ముగ్ధ నగి చెలి బెనఁగి మరలు నటుచ।
న్నుంగ పదాఁకుల వాతెరసోకులను బలుమఱు నొసఁగెఁ జెలువముగా। ౧౯౧.

గీ॥ ఇట్టులానంద వార్ధిలో నీఁదులాడు। సఖులఁ దోడ్కొ నియా బాటసారి కడలి।
దాటి కొన్నాళ్లు కుండిన మేటి సంగి। డీని విప్పెండ్లి కొడుకు సుం దినిగ నియ నె॥ ౧౯౨.

క॥ ఱేఁడా కను నీకొడుకున్। గోడలి నిన్వీరె నాదు కోమలి బుడుతల్।
నేడు మొదల్నీవారము। నేఁడుక తోమమ్ము నింక బెంచఁగ నలయున్। ౧౯౩.

గీ॥ అపుడు విభుఁడు బలికె నా బాటసారితో। నయ్య మా కుటుంబమందు నీవు।
నీదు సంతతియును నెగడిన లెస్సం తృతు। లగుచు పేరుఁ బొలునలరు మాడ్కి॥ ౧౯౪.

చ॥ అనియిటు పల్కె నానికపై హాయిగి నంతట నుండి బాటసా।
రి సెగ డిమంత్రియై తగిన రీతిని రాజ్యము నిర్వహింపుచుం।
దనదు కుటుంబమే పునఁ దనర్పఁగ శాశ్వత కీర్తి మీఱఁగా।
మనిరి యొననేక వర్షములు మాన్యుల లోపల మెప్పుఁ బొందుచున్॥ ౧౯౫.

## ప్రస్తావనోకవిత్వములు.

### హిందూదేశ చక్రవర్తినియగు విక్టోరియా రాణింగూర్చి.

ఏయమ్మపాలింప నెల్లహిందువులకు నిర్భయభోజననిద్రలొదవు।
నే రాణిశాసింప మారిదేశంబులు చేరువలయ్యె సంచారములకు।
నే దేవియాజ్ఞచే నేర్లు కట్టువడి కోరిన తావులందు జీవనము నొసఁగు।
నే చక్రవర్తిని యేలఁగ ధనధాన్యవిద్యాయురారోగ్యవృద్ధిఁ బడవరు।
నట్టి విక్టోరియాంబయాస్యశశిబింబ । వితతసింహాసనప్రదీపితనితంబ।
కోవిదజనావలంబ సద్గుణకదంబ । నేఁడు పుట్టినదివమఁట నేస్తులార॥
ఎనుబదేండ్లప్రాయమెంతయో సుగుణంబు । నేలయందు సగము నేలుచుంట।
కడుపునిండ మంచిగంపెడుపిల్లలు। దెవరు రాణిఁగన్న తల్లితల్లి॥

జీయాదాంగ్లేయరాజ్ఞీ చిరతరవిభవాదీనవాత్సల్యమూర్తిః।
దేయాద్విక్టోరియాంబా స్మితముఖకమలా హిందురాజ్యాభిలాషమ్।
డ్యూకాఫ్ కెంట్వాత్మజాతాం శతదశవర్షాణ్యాదిదేవః ప్రపాయాత్।
గేయాత్సర్వత్రలోకే ప్రతికవితిలకః పాలినీం భారతోర్వ్యాః॥





శ్రీరస్తు.

శ్రీమాన్ మాడభూషి నరసింహాచార్య

కవివర్యవిరచితంబగు

# వల్లీపల్లవోల్లాసము

అను శృంగారమహాప్రబంధము.



ఇది

శ్రీ వైజయంతీ పత్రికనుండి

తత్పత్రికాధిపతుల యనుమతి నొంది

పనప్పాకము శ్రీనివాసాచార్యులు (బి. ఏ.,) గారిచేఁ

బునర్ముద్రితంబయ్యె.



చెన్నపట్టణము:

జి. రామస్వామిశెట్టి అండు కంపెనివారి ముద్రాక్షరశాలయందు

దర్శింపఁబడి ప్రకటింపఁబడియె.



వెల ౧౦ అణాలు.

శుభమస్తు.

# వల్లవీపల్లవోల్లాసము.

## ప్రథమాశ్వాసము.

శా॥ శ్రీలక్ష్మీకరకర్ణభూషణములై చెన్నొందుపద్మోత్పలో।
ద్యోతోల్లాసనిదాన నేత్రయుగళీదివ్యార్క చంద్రద్యుతిన్।
త్రైలోక్యాఘతమోనివారణముఁ జిత్రంబొప్పఁగావించునా।
శ్రీలక్ష్మీనృసింహనామకశుభాద్రిస్వామిని న్గొల్చెదన్॥ ౧.

చ॥ సురుచిరపాణిపల్లవముసొంపునఁ గన్గవతేఁటినీటునన్।
గురుకుచయుగ్మరమ్యసుమగుచ్ఛములన్ మధురాధరప్రభా।
సరసఫలస్ఫురితిన్ దనరి శౌరిమహీరుహము చుట్టుకొన్న మా।
హరిసఖికల్పవల్లి సకలార్థసమృద్ధి నొసంగి ప్రోవుతన్॥ ౨

చ॥ నిజపదకంజభావనల నిర్జరకోటి సుఖంబునొందుటల్।
గజవదనాదిపార్షదనికాయము దెల్పుచుఁ గొల్వఁగొల్వునన్।
విజయముఁజేయుచున్ దనదువేత్ర శిఖాచల నాస్పదంబుగాఁ।
త్రిజగము నేలు విష్ణుభటదేవుని సూత్రవతీశుఁగొల్చెదన్॥ ౩

ఉ॥ ఎవ్వఁడు శ్రీమనోహరున కింపుగవాహనమై చెలంగుచున్।
నివ్వటిలెన్ ధ్వజవ్యజన నిత్యసుహృన్మణిపీఠలీలఁదా।
నెవ్వఁడు సర్వవేదమయుఁ డెవ్వనిఁగొల్చు సుపర్వ భూవిభుం।
డవ్విహగాధినాథుని సమగ్రసుఖస్థితికై నుతించెదన్॥ ౪.

చ॥ విపులఫణామణిప్రభలవేమఱుభానుకృశానుతారకా।
ధిపతనుకాంతులన్ దెగడి తేజముమీఱఁగఁ జక్రపాణికై।
యపరిమితాతపత్ర శయనాంశుకపీఠ నివాసపాదుకా।
దిపరికరంబులన్ దనరు దివ్యమనీషుని శేషుఁగొల్చెదన్॥ ౫.

ఉ॥ భూతసరోమహన్మునుల భూరికృపానిధి భట్టనాథునిన్।
శ్రీతతభక్తిసార కులశేఖర సత్పదరేణుమిశ్ర వి।
ఖ్యాతమునీంద్రవాహపరకాల పరాంకుశ భాష్యకారులన్।
జేతులఁజాచి మ్రొక్కి మదిఁజేర్చెదఁ దత్పదసారసంబులన్॥ ౬.

గీ॥ సర్వతంత్ర స్వతంత్రులై జగమునందుఁ । దేజరిల్లిన వేదాంత దేశికులను।
మాటిమాటికి సేవింతు మదిఁదలంతుఁ । బూని నేఁజేయుకావ్య సంపూర్తికొఱకు॥ ౭.

గీ॥ జగతిఁ శ్రీశైలవంశ సంజాతులగుచు । సకలవేదపురాణ శాస్త్రములుచదివి।
బ్రహ్మవిష్ణ్వంద్య చరణులౌ రంగనాథ । దేశికులఁగొల్తు మత్కృతి తేజమునకు॥ ౮.

క॥ అతిశయమతిసంయుత సం । స్కృతవైకృతకవిసమాజ కీర్తితులను మ।
త్కృతిముఖమున నుతియించెద । నతులితవాల్మీకినన్నపాహ్వయసుకృతులఁ॥ ౯.

గీ॥ వృత్తనియమాశయాభావవృత్తిఁగాల్చి । కపటవాక్యాపసార్థసంగ్రహమొనర్చి।
మలయుకుటిలాళి మాన్యసాహాస్యనంటి । కుకవికృతిఁజూడఁజెల్లరు సుకవులెపుడు॥ ౧౦.

వ॥ ఇవ్విధంబున నిష్టదేవతా ప్రార్థనంబును, స్వాచార్య ప్రముఖ గురు పరంపరాభి వంద
నంబును, సుకవిసత్కారంబును, కుకవి తిరస్కారంబును గావించి యనంతరంబ. ౧౧.

సీ॥ ద్విజరాజకేతన ద్విజరాజధవళిత ద్విజవాహసన్నిభ ద్విజగణంబు।
కార్తవీర్యార్జున కార్తికేయార్జున కీర్తిలక్ష్మీయువ రత్నంబు।
రాజీవపరమహా రాజీవనిధిరాజ రాజసమ్మిళ వణిగ్రాజితంబు।
కర్ణాంచితబాహు ధర్షితవైరిసంకర్షణామిత సర్వకర్షకంబు।
చటులవిక్రమ పటురటచ్ఛటచయంబు । నటవిటశ్రేణిరంజితనరచయంబు।
మత్తవేదండతండంబు మహితచక్రి । తురగనికరంబునూజిల్లుపురవరంబు॥ ౧౨.

ద్వంద్వప్రాసకందము.

ఆపురమవనిరమణిమణి । నూపురమై శోభదనరి నూచకరమహా।
గోపురమై నృపకోటికిఁ । గాపురమై లసదురాజ్య కమలాకరమై॥ ౧౩.

గీ॥ ఆపురంబునవిలసిల్లు భూపమౌళి । రత్ననిచయప్రభాపుంజరంజితాంఘ్రి।
రమ్యుఁడౌ శోభనాద్రీశ్వరాయరాజ । శేఖరుఁడుతేజమునవిందుశేఖరుండు॥ ౧౪.

సీ॥ ఎవాని [illegible] ందిరం బింబిరామందిరా నందమై లోచనానందమయ్యె।
ఎవాని [illegible] నుశం బిందుబింబోపమంబై లోకసంతోషమాచరించె।
నెవ్వానిఘన [illegible] మిత్రుధన్వసమానమై మానినీమ [illegible] మపహరించె।
నెవ్వానిసౌదర్య బినమండలాకారమై వైరితాపదమై వెళ్ళఁగె।
నెవ్వాని విక్రమం [illegible] గాభిరామ । విపులభృతనాధినాథ సంస్తుతమదేభ।
నతఁడురథభటకరితుర [illegible] గానుబృథ్వి । నేలుచుండెనుశోభనాద్రీశ్వరుండు॥ ౧౫.

గమనుఁడయియేకచక్రమ [illegible] రాజమువలె సకల మనుజపుంగవులను వి।
క॥ అజగతీరమణుఁడుసుర । భి [illegible] రాజిల్లుచు నుండు రాజరాజై జగతిఁ॥ ౧౬.
భ్రాజిత ధనముల నొసఁగుచు । [illegible] డు. ౧౭.

వ॥ ఇవ్విధంబుననుండుచు నొక్క [illegible]

సీ॥ సకలాగమపురాణశాస్త్రజ్ఞులొకచెంతఁ దర్కశాస్త్రోక్తులఁ బ్రసంగములు సేయ।
సంగీతసాహిత్యసారజ్ఞులొకచెంత శృంగారకావ్యముల్ చెలఁగి చదువ।
వరకంకణారావ కరకాంతలొకచెంత విమలానుపమ చామరములు వీవ।
రమణీయసౌందర్యరాజన్యులొకచెంత రాజకార్యప్రచారములు దెలుప।
వారకామినులొకచెంతఁ జేరి యాడ । వందిమాగధులొకచెంత వరుసఁ గొలువ।
సకలసామ్రాజ్య లక్ష్మీప్రసన్నుఁ డగుచు । నివ్వటిల్లుచుఁ గొలువున నవ్విభుండు॥ ౧౮.

మ॥ ననుగోపాలదయాసముల్లసితనానాశాస్త్రవిజ్ఞానుఁ డై।
ఘనశీలాంచితశేముషీ విలసితున్ భూరిప్రభావోన్నతున్।
వినతానూనకటాక్షలబ్ధకవితావిఖ్యాతచాతుర్యుఁ జ।
య్యనరారమ్మని చేరఁ బిల్చి రమణీయాహ్లాదచేతస్కుఁ డై॥ ౧౯.

గీ॥ కమలశంఖరథాంగరేఖలఁ జెలంగు । తనదు కరమున నాదు కేల్దనరఁ బూని।
సరసమోచారసస్వాదుచతురవాక్య । ములనిటులఁ బల్కె నానృపతిలక మెలమి॥ ౨౦.

చ॥ మృదుపదవాక్యగుంభనల మేదురమై శ్రవణాతిశాయి స।
మ్మద మొనరంగఁ జేయు రసమంజులమై సదలంకృతిన్ మహా।
యుదమగునవ్యకావ్యము శుభాద్రినృకేసరి కర్పితంబుగా।
మదిఁ దిలకింప సత్కవిసమాజ మొనర్పుము నేర్పుమీఱఁగాన్॥ ౨౧.

వ॥ అనిపలికి బహుమానపురస్సరంబుగాఁ దాంబూలం బొసంగినం గైకొని మదనగోపాల చరిత్ర చిత్రితంబగు నొక్క శృంగారకావ్యంబు రచియింపం బూని కవిసమయ సుప్రసిద్ధంబుగావున నిజవంశానుక్రమం బెఱింగించెద. ౨౨.

సీ॥ మహనీయగుణరత్నమాపభూపాన్వయకలశాంబురాశిశీతలకరుండు।
కమనీయుఁడై ధ్రువకాశ్యపగోత్రుఁ డాపస్తంబ సూత్రుఁడు పరమయశుఁడు।
వేదశాస్త్రపురాణ విద్యానవద్యుండు సకలధర్మాధర్మసారవిదుఁడు।
సంస్కృతప్రాకృతశౌరసేనాదిసద్భాషావిశేషప్రబంధకరుఁడు।
అతఁడు మద్వంశకూటస్థుఁ డఖిలరాజ । పూజనీయాంఘ్రిరాజీవరాజితుండు।
వాదివేదండపంచాస్య వైఖరీన । మంచితుఁడు వేంకటాచార్యుఁ డార్యవిభుఁడు॥ ౨౩.

క॥ ఆ వేంకటగురుచంద్రుఁడు । పావనగుణశేషమాఖ్య భామామణితో।
శ్రీ వెలయఁగ గార్హస్థ్యము । భావింపుచునుండె విబుధపరిబృఢుఁ డగుచున్॥ ౨౪.

క॥ నవసేవధిసంమితసుత । నవకంబోదంపతులకు నయ మొందఁగను।
ధ్రువమై గుణగణమణిసం । భవమై విలసిల్లె సర్వవైభవహితమై॥ ౨౫.

ఉ॥ ఆనవకంబునందనరె నాగమశాస్త్రవిశారదుండు శ్రీ।
మానుసమానసుందరుఁడుశోభితభూరియశోంచితుండు సం।
తానమహీరుహోపమిత దానమహీసురకోటిమోద సం।
ధానుఁడు శ్రీనివాసుఁడు బుధస్తవనీయ కళావిలాసుఁడై॥ ౨౬.

గీ॥ శ్రీనివాసార్యుఁ డిలయందు శ్రీనివాసుఁడనఁగఁ జెలువొంది వేంకటమ్మాఖ్యసాధ్వి।
తోడగృహమేధియై కడుప్రోడయగుటఁ । బండితౌఘంబులెంచఁ బరఁగెనతఁడు॥ ౨౭.

క॥ ఆపండితజనశేఖరుఁ । డాపన్నగశాయి ఘనదయాన్ వంశనము।
ద్దీపకతనూజరత్నముఁ । బ్రాపించెను వేంకటార్య భాస్వదభిఖ్యన్॥ ౨౮.

క॥ కృష్ణాంగజన్మవిలస । త్కృష్ణాలహరీసమాన కృత్యాంచితయా।
కృష్ణాంబతోడరమతో । విష్ణువువలె వేంకటార్య విబుధుండలరెన్॥ ౨౯.

గీ॥ పంచరత్నంబులో లేక పంచబాణు । పంచశరములో యన సుతపంచకంబు।
వారిసుకృతంబులెల్లను వన్నెకెక్క । నుదయమయ్యెఁదదన్వయాభ్యుదయమునకు॥ ౩౦.

గీ॥ అయిదుగురిలోనఁదండ్రికిదయితుఁడగుచు । సకలవేదపురాణశాస్త్రములఁజదివి।
యమితభాషావిశేషములభ్యసించి । తేజరిల్లెనువేదాంతదేశికుండు॥ ౩౧.

క॥ వేదాంతవేద్యవిలస । త్పాదాంబుజసక్తషట్పదాయితఘనస।
మ్మోదాంతరంగుఁడైభువి । వేదాంతాచార్యుఁడలరెవిఖ్యాతుండై॥ ౩౨.

క॥ అనసూయారుంధతులను । ఘనపాతివ్రత్యమునను గదుముచుఁగృష్ణ।
మ్మనునెలయునతీమణితోఁ । దనరెన్ వేదాంతగురుఁడు దద్దయువేడ్కన్॥ ౩౩.

వ॥ అమ్మహాత్ముండు లక్ష్మీనృసింహకటాక్షలబ్ధ సమస్తవిభవుండును, సకల విద్యానవద్య సారామృత హృద్యసుకనకకలశ విరాజితుండును, వితతవిచిత్రవసువసన వితరణసమ్మోదిత దీనజనమండలుండును, సర్వతంత్రస్వతంత్రుండును, బతంజలికరణి సరసపద విజృంభణారంభణుండును, నక్షపాదునిపగిదిఁబదార్థ శోధనదక్షుండును, జైమినికరణిఁగర్మకాండవిచారణనిపుణుండును, వేదవ్యాసునివలె సమస్తవేదవేదాంగపురాణేతిహాసాది విజ్ఞానుండునై, సత్యంబున హరిశ్చంద్రుండు, సౌభ్రాత్రంబున ధర్మనందనుఁడు, కల్యాణగుణాశ్రయంబునఁ గమలామనోహరుండని సమస్తవిద్వద్వరులు దన్నువినుతింప శ్రీకృష్ణమాంబా మనోరంజనుండై, వేదాంతాచార్యుం డార్యశిరోభూషణుండయ్యెనంత. ౩౪.

సీ॥ ఎవ్వండువిశ్వంభరేంద్రులసభలందు నఖిలవిద్వద్గజంబనఁజెలంగె।
నెవ్వండుయనక్షితీశులచదరులోఁబండితరాజని ప్రౌఢికెక్కె।
నెవ్వండుమహాణావనీంద్రులకోర్టులోసదరమీననిఖ్యాతిఁజాలనొందె।
నెవ్వండుభూదేవతేంద్రులగోష్ఠిలోవజ్రిపూజ్యుండనవన్నెమీఱె।

నలఁడుసురధేనుకల్పవిఖ్యాతదాన । సముదయంబునజనులనుసంతసింపఁ
జేయుచునుసర్వసంపద్విశేషములను । దేజరిల్లెనువేదాంతదేశికుండు॥ ౩౫.

క॥ ఆవేదాంతాచార్యుఁడు । భూవలయమునందుసకలబుధసన్నుతుఁడై
శ్రీవెలయఁగనియెమమ్ముల । నేవురఁదనయులనుబండితేంద్రచరితులన్॥ ౩౬.

క॥ వారిజలోచనుకరుణన । వారితసురవాహినీప్రవాహసుకవితా
ధోరణిఁగల్గిచెలంగితి । ధీరుల్ శ్రీనారసింహదేశికుఁడనఁగన్॥ ౩౭.

వ॥ మఱియు వైనతేయకటాక్షలబ్ధ విద్వత్కవిరాజ సమాజ మనోరంజక సంగీత సాహిత్య పాండిత్య విచిత్రకవిత్వ నిర్మాణనిపుణుండనై, నేరచియింపంబూనినప్రబంధమున కధీశ్వరుండైన శ్రీశుభాద్రిస్వామినిన్ వర్ణించెద॥ ౩౭.

సీ॥ మహనీయవిజ్ఞానమహిమయుగ్వైష్ణవనిత్యసూరిశ్రేణినివ్వటిలఁగ
దివ్యపద్మోత్పలదేదీప్యమానవారాహపుష్కరిణీవిరజజెలంగ
వేదశాస్త్రపురాణవేదాంతవిద్యనస్తామానీశ్వరసమితిమెలఁగ
శుకపికారావసంశోభితానోకహసురుచిరక్రీడాద్రిసొంపుగనఁగ
విధిశివాదిసమస్తవిబుధవరేణ్య । సేవితాంబుజపదనారసింహమూర్తి
సంగతావాసమైశ్రీశసదనమనఁగఁ । బరఁగుమేదినినాగిరిపల్లిపురము॥ ౩౯.

క॥ ఆపురపరిసరమునఁదగె । గోపురమంటపవితానగురుతరసుశ్రీ
దాపరమైశుభశైలము । శ్రీపరమానందదాయిశిఖరాంచితమై॥ ౪౦.

సీ॥ లక్ష్మీలతాశ్లేషలసమానతనుకాండభుజశాఖసంతానభూజమగుచు
శార్ఙ్గనందకజిష్ణుచాపసౌదామినీరారాజదసితాభ్రరాజమగుచు
సృష్టినేత్రద్వంద్వవిధుచండకరబింబభాసుర శ్రీవిష్ణుపదమునగుచు
భువనదుష్కృతతమఃపుంజాపనోదనోదీర్ణమహాదివ్యతేజమగుచుఁ
దనరిశ్రీరాజ్యలక్ష్మిశతనువహించి । భక్తజనులనుసంపత్ప్రసక్తిఘనులఁ
జేయుచునుశోభనాచలశిఖరమునను । జెన్నుమీఱునుశ్రీనారసింహమూర్తి॥ ౪౧.

సీ॥ రాజ్యలక్ష్మీసముద్భాసితుండయ్యునుబరహిరణ్యక్షేత్రహరణుఁడగుచు
శంఖచక్రగదాసిశార్ఙ్గసంయుతుఁడయ్యుఁగరరుహాయుధసమాకలితుఁడగుచుఁ
గందర్పశతకోటికల్పగాత్రుండయ్యుజ్వాలాకరాళాంగజాలుఁడగుచు
సంపూర్ణవిధుబింబసదృశాననుండయ్యుదంష్ట్రోల్లసన్మృగేంద్రముఖుఁడగుచు
సకలసురనరమునిజనాశ్చర్యకరవి । చిత్రచారిత్రయుక్తిచేఁజెన్నుమీఱి
సిద్ధసంసేవ్యశుభగిరిశిఖరమునను । సిరులఁజెలువొందులక్ష్మీనృసింహవిభుఁడు॥ ౪౨.

క॥ ఏతాదృశానుపమవి । ఖ్యాతాద్భుతవితతచరితకలితునకుసమా।
ధూతసురవ్రాతమనో । జాతామితసాధ్వసునకు జగదాత్మునకున్॥ ౪౩.

క॥ గాఢాశ్లిష్టరమాకుచ । లీఢమృగీనాభిమంజులితవక్షునకున్।
ద్రూఢఫణిప్రౌఢఖగ । వ్యూఢునకును మాఢమందరోర్వీధ్రునకున్॥ ౪౪.

క॥ పుణ్యాజనావళిగణ్యాహి । రణ్యకశిపుభూధరభిదురకరరుహునకున్।
బుణ్యౌఘవరేణ్యాగ్రశ । రణ్యాసరోజాతచరణరంరమ్యునకున్॥ ౪౫.

క॥ కుక్షిస్థితప్రపంచున । కక్షీకృతచంద్రభాస్వదమృతాంశునకున్।
రక్షోధిపవక్షోరుధి । రక్షోపితనఖరశిఖరరమ్యకరునకున్॥ ౪౬.

క॥ నక్రపరాక్రమనిర్జిత । విక్రమగజరాజవరదవిశ్వాత్మునకున్।
శక్రదమనచక్రశమన । చక్రగదానందకాబ్జశార్ఙ్గధరునకున్॥ ౪౭.

క॥ శ్రీభూనీళాదేవీ । శోభోల్లసదుభయపార్శ్వశుభవక్షునకున్।
శోభనఘృణిశోభితమణి । శోభనమందిరునకు సురసేవ్యునకున్॥ ౪౮.

క॥ లక్ష్మీనయనవరోత్పల । లక్ష్మీకరపార్శ్వకైణలక్ష్మాస్యునకున్।
లక్ష్మీకృతవిక్ష్మారతి । లక్ష్మీనరసింహునకు విలక్షణఘృణికిన్॥ ౪౯.

వ॥ సమర్పితంబుగా నా రచియింపంబూనిన వల్లభీపల్లవోల్లాసంబను సత్యాపరిణయాఖ్యాన ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. ౫౦.

చ॥ సలలితనైమిశాటవిని శౌనకముఖ్యులు సత్రయాగమున్।
సలుపుచు రోమహర్షణిని సంతసమొందఁగఁ గాంచిమున్ను కో।
సలవిభుకన్యనేకరణిసత్యను శ్రీహరి పెండ్లియాడె ని।
శ్చలమతిఁ దెల్పుమన్న మునిచంద్రులతో నతఁడిట్లనెంపయున్॥ ౫౧.

సీ॥ లసదాగమస్ఫూర్తి వెసఁబూని హంసాన్వసరణులై తనరు భూసురులు హంసలు।
తేజోబలోద్ధతి విజృంభినీశుల కెరలి రంజిల్లు భూపరులుకరులు।
కమనీయ నవరత్నకాంచన చక్రకోటులను శోభిల్లు వైశ్యులు రథములు।
పరమధర్మాభాతిపరజీవనక్షేత్ర దారతఁ దగినపాదజులు భటులు।
రమ్యసుమనః ప్రమోదాంగ రాగలలిత । పల్లవావాప్తిచే మించు ప్రౌఢవార।
కాంతలారామములు గల్గిఘనతనొందె । భూస్థలిఁగరంబు కోసలపురవరంబు॥ ౫౨.

గీ॥ భవ్యగుణరత్నబహుసుధా భవనరాజ । మండలోదయసదనంత మహితభోగ।
లసితపురుషోత్తమ శ్రీవిలాసలలిత । మగుచువిలసిల్లె నప్పురమబ్ధికరణి॥ ౫౩.

సీ॥ కస్తూరికారేణు కలితపన్నీరాంబు శీకరానీకసంసేవితంబు।
తారాఫలస్ఫూర్తితరళముక్తాజాల రంగవల్లీసముద్భ్రాజితంబు।

విద్రుమస్తంభాగ్రవికచనీలోత్పల । శ్రీరాజదంభోజతోరణంబు।
ఘనతరసామోద కర్పూరచందనాగరుధూప ధూపితాంగణచయంబు।
వారకాంతాదృగంచల వర్ధమాన । విటజనశ్రేణిచిత్తజ విలసనంబు।
సకలశృంగారకేళికాసౌధహర్మ్య । రాజమానంబు తన్మహా రాజగృహము॥ ౫౪.

చ॥ శుకమధురానులాపగతి సుందరపల్లవరాగసంపదన్।
వికచసుమాభిరామసురభిన్ హరిచందనసంగతిన్ లస।
త్పికకలరావసంయుతి రతిప్రియసస్మృతుల వారకామినీ।
నికరముగెల్తి నవ్వనవనీనివహం బలరారు రమ్యమై॥ ౫౫.

సీ॥ శారదపూర్ణిమాచంద్రబింబాస్యలై యలకాంధతమసంబు ననుకరించి।
మధుకీరకోకిలమంజులవాణులై పక్వబింబాధరప్రాప్తిఁ గాంచి।
తనరారు మృగరాజతనుమధ్యసీమలై కరికుంభవక్షోజగరిమఁ బెంచి।
బిసనాళమృదుబాహులసమానలై రాజహంసయానంబుల నతిశయించి।
చంద్రికాస్మితసాంద్రలై చరణనయన । వారిజంబులవిలసిల్లి వన్నెకెక్కి।
చిత్రలావణ్యగణ్యతఁ జిగురుబోఁడు । లాపురంబున విహరింతు రేఁపుమీఱి॥ ౫౬.

సీ॥ సతితిరో వెలయఁజూపవదేమి పొన్నపువ్వది యనంటులఁదీవియోఁగాదె।
చేఁడెకల్వసరంబుఁ జూపనీవదేల సరి యగాధసరోరుహంబుగాదె।
యింతిరో విరిబంతులిందుల ప్రియము లేయవి హేమవల్లీనవములుగావె।
మగువరో గాఁచెదు మల్లెలుగోర్వమే యవి సుధారసపూరభవములయ్యో।
నను మనసరసోక్తిసరణుల నలరిపుష్ప । లావికలుషిద్ధసముపభావమెలమి।
నుల్లసిల్లంగఁజేయుచు నుల్లసమునఁ । బువ్వులమ్ముచునుందురు నవ్వనమునందు॥ ౫౭.

శా॥ నీడాంతస్థితకేకికోకిలశుకానీకస్వనానోకహా।
క్రీడాభూధరకూటకోటివిలసచ్ఛ్రీమంజుకుంజంబులన్।
జోడుంబాయకకిన్నరుల్ సతులతో సూనాస్త్రసంప్రీతిగాఁ।
గ్రీడాతల్పరులై సుఖింతురుగతవ్రీడాత్ములై తత్పురిన్॥ ౫౮.

ఉ॥ అన్నగరంబునందనరు హైమసముజ్జ్వలహర్మ్యసీమలన్।
సన్నుతగాత్రుఁడై గతిపథంబునఁ జంద్రుఁడు సంచరింపఁగా।
సన్నలు చంద్రశాలలును సౌధములంచును దేజరిల్లెనా।
పన్నగరాజుకైనఁ దెలుపన్వశమే భవనప్రభావముల్॥ ౫౯.

ఉ॥ ఆపురసౌధభాగములనంబుజనేత్రలు కామికోటితో।
శ్రీరతిసూనుకేళివివశీకృతలై మధుపానగానరో।

జాస్ఫృతముం జూగంధవహాహాపితతచ్ఛ్రమవారిధారలై।
దీపితకామభోగములఁ దేజము నొందుదు రంద మొందఁగన్॥ ౬౦.

చ॥ ఇనుఁడు సయాద్రి నెక్కి మఱి కింపగు మేడలఁ గొప్పఁ గాంచి వా।
హనముఁ గడ్డమానను మదంబరవీధికి నేగి సౌధభా।
జ్మణిమయసింహరాశి తనమందిరమన్మతి నిల్చి మెల్ల నే।
చనుటను గాదె మధ్యదివసంబున మంగత నొందె నాతనిన్॥ ౬౧

క॥ ఆపురగోపురమణినిజ। రూపము వీక్షించి దివవిహారుల్ స్వలిహ సధీఁ।
గోపించి హీరహారులన। నాప్టుసఁ జూచి కాదె సటులెటులతోలఁగన్॥ ౬౨

క॥ సాలాభిరామనగరీ। సాలాంచలశాఖలందు శారదతారా।
జాలము విలసితముక్తా। జాలము గిరిన్ వసించుఁ జతురలమిగులన్॥ ౬౩

క॥ ప్రాకారసీమలంగునఁ। బ్రాకటశాఖాంతరములు భాగించుటచే।
భాకరరథము నిరోధము। లేక వెళలుఁ బల్సరణి నిలింపులు జూడన్॥ ౬౪

క॥ అరయఁగఁ దత్పురకాంచన। వరణాంచలఖచితరత్నవరకాంతులఁ దా।
నరుణాయుతుఁడై గాఖర। కిరణుం డరుణాభిధానకీర్తుఁడయ్యెన్॥ ౬౫

గీ॥ కనకమయకూటకలితమై కాంచనాద్రి। కరణి రంజిల్లు తత్పురీవరముఁ గను।
వారినిధిసప్తకము జుట్టువారెనఁగఁ। గిరమలరేఁ బరిఖాసప్తకంబు సుట్టి॥ ౬౬

సీ॥ రాజహంసవిలాసరాజమానాంగమై బహుశిఖావాప్తిసన్యాగము।
లసమానపల్లవోల్లాససంవాసమై సమతానురాగిణీసదనమగుచు।
రమణీయగుణశాలి రామాభిరామమై భరతిగోష్ఠీసమాభరితమగుచుఁ।
బురుషోత్తమహిత మైలక్ష్మీవిహారాభిలలితమగుచు।
మానసవరోవసంతరామాయణాంబు। నిగులతో సామ్యమొందినేవధివిశేషు।
మహితగోపురసౌధహర్మ్యప్రసక్తి। నలరుసన్నగరీనామమవరతము॥ ౬౭.

క॥ ఆపురమున విపులయశో। భూరికిరీటాగ్రఖచితభూరిమణివిభా।
దీపితచరణుఁడు సుగుణ। శ్రీపరిబృఢసముఁడు నగ్నజిత్విభుఁ డలరెన్॥ ౬౮

సీ॥ తనదీర్ఘబాహుసంతానభూరుహశాఖ వసుమతీవల్లికాస్పదము గాఁగఁ।
దనయశోమండలంబను ఘనసారంబు దిగ్వధూతనువులఁ దేజరిల్లఁ।
దనప్రతాపము రిజ్మదావళఘనకర్ణ తాళవృంతములవర్ధనము నొందఁ।
దనతీక్ష్ణధారాకతరవారిపన్నగం బరిజీవమారుతంబారగింప।
ధరణి వితరణమునకు సురతరుపయోధి। చంద్రసురధేనుసురమణిసదృశుఁ డగుచు।
మదనశతకోటిలావణ్యమహితగాత్రుఁ। డగుచు విలసిల్లెఁ గోసలనగరవిభుఁడు॥ ౬౯.

ఉ॥ ఆవసుధాధినాథుఁ డమరాధిపసమ్మితవైభవంబునన్।
భూవలయంబు నేలుచును భూవిబుధామరభూజమై కడున్।
భావజకేళులందు నిజభామినులన్ దనియంగఁ జేయుచున్।
శ్రీవెలయంగ రాజమణిశేఖరుఁడై విలసిల్లుచుండఁగాన్॥ ౨౦.

క॥ అంతటఁ గోనలధరణీ। కాంతునకు జగత్త్రయాదికారణలక్ష్మీ।
కాంతకరుణనలకంతువ। నంతజయంతాభపుత్రసంతతి కలిగెన్॥ ౨౧.

వ॥ ఇవ్విధంబున నవ్వసుంధరాధురంధరుండు, విబుధాధినాథసభామధ్యసురవధూజేగీయమాన యశోవిశాలుండై, శర్వాణికరణి సర్వమంగళావాసశరీరుండయ్యు సమదృష్టిసమేతుండును, శ్రీమన్నారాయణునివలెఁ గమలాలంకృతుండయ్యుఁ బుణ్యజనమిత్రుండును, కళానిధిసరణి నమృతహృదయుండయ్యు నిష్కలంకుండును, దివాకరునివలె స్వప్రకాశితలోకనికరుఁడయ్యు నపంకజబంధుండును, ధనంజయునిరీతి సుభద్రాభిరాముఁడయ్యు నిస్సహాయవిజయుండును, హరిశ్చంద్రునివలె సత్యవాక్యవిశారదుండయ్యు నిత్యైశ్వర్యుండును, నధునాతనపురాతనవసుమతీరమణాతిశాయివైభవాలంకృతుండై, యౌదార్యశౌర్యధైర్యాదిగుణమణివిరాజితుండై, ధరామండలంబుఁ బరిపాలనంబు సేయు సమయంబున. ౨౨.

క॥ ఆరాజోత్తమునిమహిషి। శ్రీరాజీవాయతాక్షి సితకరబింబ।
శ్రీరాజమానముఖియై। శ్రీరంజిల్లంగ నిట్లు చింతించె మదిన్॥ ౨౩.

చ॥ తనయులు పెక్కుగల్గినను దన్వికిఁ బుత్రిక పుట్టకున్న ని।
త్తనువు నిరర్థకంబని యొదం దలపోయుదు రింతులంచుఁ దా।
మనమునఁ గొంత సేపు నృపమానిని చింత యొనర్చి యేమి సా।
ధనమునఁ గన్యకావదనదర్శనజన్యముదంబు గల్గునో॥ ౨౪.

చ॥ అని మదిలోఁ దలంచి నతియబ్జనుమంబుల వేడ్కతోఁ బయో।
నిధినుతాంఘ్రి పూజనము వాసిగఁ జేయుచు నద్వ్రతోపవా।
ననియమమాచరించి సురసత్తములన్ గడు సన్నుతించుచున్।
మనుజులు వింతనొంద నృపమానిని యుండె నభీష్టసిద్ధికై॥ ౨౫.

క॥ ఈవిధమున భామామణి। భావంబున నిందిరాంఘ్రిపద్మములెపుడున్।
భావించుచుఁ బూజించుచు। వేవిధముల మ్రొక్కులిడుచు వేఁడుచునుండెన్॥ ౨౬.

క॥ ఈకరణి నుండి యొకనాఁ। డాకమలదళాక్షి సలలితాంతఃపురశ।
య్యాకల్పితాంగలతయై। చేకొని యుండంగ నిదురసిరి చెలువొందన్॥ ౨౭.

వ॥ అప్పుడు. ౨౮.

సీ॥ సోముగోమునఁ గెల్చు మోమునఁ జెలువొప్పఁ జిన్నివెన్నెలలీలఁ జెన్నుమీఱ।
సిరిమించు కెంగేలఁ జెలువొప్పు దుకెందమ్మి పైని జాఫులు తేంట్లపగిది మెఱయ।
గ్రొమ్మించుహారాయలుతోఁ గొమ్మినే యఁదలంచు మేనికడానిమేల్ మెఱుఁగులలర।
గావిపావడపసల్ గనిను తెల్లని కాంతి చెలువొందు మహితాంబుచీరడనర।
పైఁట పైతాణిజవికపైఁ బరిఢవిల్లఁ । దళ్కుతళ్కనురతనంపుఁ గుల్కుచిల్కు।
మేల్మిబంగరుసొమ్ములు మేనమరఁ । గల్కులసెలంతిచూపట్టెఁ గలనుసతికి॥ ౯౯.

క॥ కలలోనఁ గమలఁగనియ । క్కలవాణినతాంగియగుచు గౌరవమొదవన్।
గలవాక్సుమములఁ బూజా । కలనంబొనరించి పల్కెఁ గద్గదగళయై॥ ౧౦౦.

గీ॥ ఎవరి నగుదవమ్మ యీ జయంతిపురమునఁ । కేమిపనికి వచ్చితిపుడు తెలుపు।
మనఁగ నిట్లుపలికె నా రాజభామిని । తోడఁ గరుడగమనుతోయజాక్షి॥ ౧౦౧.

ఉ॥ క్షీరపయోధిగర్భమున శీతమయూఖునితోడఁ బుట్టినై।
త్యారిహృదంతరాళగృహమందు వసించినదాననమ్మ నా।
పేరలకల్మి కల్కియని వేల్పులు పల్కుదురమ్మ నేఁడు నీ।
కోరికఁ దీర్పఁగా దలఁచి కూరిమి వచ్చితినమ్మ కోమలీ॥ ౧౦౨.

సీ॥ ఆమాటవిని రాజభామిని హర్షించి వినమితాంగంబుతో వేడ్కమీఱ।
గూర్తినీసరియైన కూఁతు నిమ్మనుచును శతిభక్తి వడిగిననబ్జవదన।
సఫలమౌ నీకోర్కి సత్యంబు లెమ్మని పల్కెన మేల్కాంచి కల్కి మదిని।
వింత నొందుచుఁ దన విభున కీవిధమంతరంగంబునను దెల్పి రంగు చెలఁగ।
సిద్ధసంకల్పయై తపస్సిద్ధి నొంది । సంతతానందసంభృతస్వాంతయగుచు।
విపులసౌధాంతరములందు విభునితోడ । నిందువేడుక విహరించుచుండె నపుడు॥ ౧౦౩.

క॥ ఈకరణిఁ దేజరిల్లిన । యాకమలదళాయతాక్షి కనుపొంపై।
శ్రీకరమౌను జూలమరెన్ । శ్రీకరముగఁ గడుఁ దదీయచిహ్నములలరెన్॥ ౧౦౪.

సీ॥ నల్లకల్వలరేతినలు పైనకందోయి తెలిదమ్మిరేకుల తెలివి నొందె।
బంగారుపసిమి చేరంగైన చన్దోయి మొనలనల్లని కాంతి మొలకలెత్తెఁ।
గలదు లేదను మాటకలపైన లేఁగౌను కన్నులకుం జూడ ఘనత నొందె।
సొగసైన పెన్నిటి సుడి వన్నెనలరారు పొక్కిలి మొనకయ్యె పాలుపుమీఱె।
వళులు మెల్లనఁ జనుటకు సెలవులడిగెఁ । దెలుపు మించిన పసిమి చేఁ జెలఁగె మేను।
గతులమందత మిక్కిలి యతిశయించె । నంతకంతకుదౌహృదంబతివకలరె॥ ౧౦౫.

గీ॥ ఈవిధంబున విలసిల్లి యిందువదన । సంతసంబున నొకమంచి సమయమునను।
గలిమిచెలి సాటికూఁతుఁ దాఁ గనఁ జెలంగె । దివ్యశశిరేఖ శుక్లద్వితీయ కరణి॥ ౧౦౬.

క॥ బాలికగల్గినజగతీ । పాలుఁడుముదమందిశాంతిపౌష్టికవిధులన్ ।
మేలుగఁజేసిధరామర । మౌళులకొసఁగెన్సహార్ఘ్యమణివసనములన్ ॥　　౨౭.

క॥ ఈకరణిఁదేజరిల్లుచు । నేకాదశదినమునందునింతియుఁగానన్ ।
జేకొనిబాలన్ముదముసఁ । బైకొనిపేఁటలను భేరిభాంకృతులలరన్ ॥　　౨౮.

క॥ సత్యంబీచెలికమలా । సత్యవయవసుమచిరాంగిభాసురయనుచున్ ।
సత్యానామమునిడిమది । సత్యానందమునఁబొంగిరావంశతులున్ ॥　　౨౯.

గీ॥ నాగ్నజితియనిజనులెల్లనయముగాను । దల్లిదండ్రులుసత్యనాదయఁజెలంగఁ ।
జెల్మిమీఱసుదంతనిచెలులుఁపిలువ । నలరెనబ్బాలికాసత్యమనుసముముగ ॥　　౩౦.

సీ॥ ఈలీలఁబొత్తిళ్లనింపుగాఁగొన్నాళ్లుతల్లిచన్నులపాలఁద్రావి పెరిగి ।
అత్తత్తయనిపిల్చియడుగువేయఁగనేర్చియెత్తుకొమ్మనిచేతులెత్తిపిలిచి ।
చిలుకపల్కులునేర్చిచిన్నారిపొన్నారిపాటలఁబాడుచుఁబరిఢవిల్లి ।
బొమ్మలపెండ్లిండ్లుపాలుపొందఁగాఁజేసి వెలఁదులతోఁజాఁవియ్యమంది ।
విరులుగోయుచుఁబరువంపుసరులుఁగూర్చి । నేర్చియుయ్యాలనూఁగుచునెయ్యముగను ।
మీఱిశైశవబాల్యకౌమారదశలఁ । దేజరిల్లుచుబాలికాతిలకమలరె ॥　　౩౧.

వ॥ ఇట్లు దినదినప్రవర్ధమానయై.　　౩౨.

సీ॥ కన్నెలతోమచ్చికల్ దిన్నెలఘటియించి వెన్నెలకుప్పలు వెలఁదియాడుఁ ।
పదములందెలుమ్రోయఁగుదిసిపయ్యెదమాఁగఁబంతిచేడియలతోఁబంతులాడు ।
రమణీయమణిపద్మరాగపచ్చికములఁగోమలిమోమనగుంటలాడు ।
రాజమంత్రులఁగూర్చిరహిమించుబలములోసంగనామణిచదరంగమాడు ।
మఱియుమగువలతోఁగూడివిమలసౌధల । వెలయుపొన్నలనీడలవేదికలను ।
విపులసౌధాంతరంబులనేస్తమీఱి । యాటపాటలవిహరించునతివయపుడు ॥　　౩౩.

ఉ॥ ఇంపుగఁజల్వవల్వకటినించియొదన్ బలుకెంపురాల్చిన గా ।
రింపుమెఱుంగుఁగంచెలధరించిచొకారపువేణిమాల వ ।
ర్జింపుఁజకచ్చకల్ దనరిరంజిలుసొమ్ములుకాల్చినేస్తతో ।
సొంపుగసంచరించుసతిసోద్యముమీఱఁగరంగశాలలన్ ॥　　౩౪.

గీ॥ లలనఘనకావ్యనాటకాలంకృతులను । జదివివీణానుపాణియైసరసముగను ।
లాటకర్ణాటనాటవరాటముఖ్య । రాగములఁబాడుచుందనరారునెపుడు ॥　　౩౫.

గీ॥ కలికికరకంకణక్వణత్క్వణనమెసఁగ । బొంగరముఁబట్టిమింటికివైవనది వి ।
విధగతులఁదనరుచుఁదనవెలఁదిఁగలసి । చెలువుమీరంగఁజెఱునవ్వువెలయఁజేయు ॥　　౩౬.

గీ॥ ఇవ్విధంబునఁ గ్రీడించుపువ్వుఁబోఁడి । మెఱుపుఁదీవియకున్ బోలె యలఁగఁజాలు ।
మేనదినదినమొకవింతగానుఁజూడ । నివ్వటిల్లెనుసరసంపుజవ్వనంబు ॥ ౯౭.

సీ॥ చామరంబులనంగఁ జాలెను నెఱికురుల్ ముంగురులలరెసారంగములనఁ ।
గంతువిండ్లనుఁజూడఁగను బొమల్ విలసిల్లెఁ గలువ ఱేకులనంగఁ గన్నులమరెఁ ।
బున్నమచందురుపోలుపునొందె మొగంబు దరసుందరంబయి దనరెగళము ।
చెండ్లతోఁ గజనిమ్మపండ్లతోఁ సరిమీఱెఁ గుచములు నడుము సంకోచమయ్యె ।
శ్రోణిభరమయ్యె సైకతశ్రేణిసమము । ఊరువులనంట్లబీరముల్ దూఱసాగెఁ ।
గల్కిగమనంబు రాయంచ నుల్కఁజేసె । నిటులు నవయౌవనంబున నింతికలరె॥ ౯౮.

వ॥ అంత.

క॥ శ్రీలలనామణితోఁ సరి । పోలినబాలికను గాంచి భూవరుఁడు ఘన ।
శ్రీలక్షణములుఁ గలవరుఁ । డేలీలలభించునంచు నెదఁ జింతింపన్॥ ౯౯.

క॥ అరయఁగఁ దనమందనుగుల । గిరులవలెన్ దనరె నేడు గిబ్బలు పుడమిన్ ।
గరలుచు ఱంకెలు వైచుచు । నుఱుమాడుచుఁ బంటచేల నొరులఁ బొడుచుచున్ । ౧౦౦.

క॥ ఆవిధము జనులు దెలుపఁగ । భూవలయాధిపుఁడు తనదు భూరిబలముతోఁ ।
నావృషభంబులఁ బట్టఁగ । భావించుచు వచ్చి చుట్టువాఱఁగ నంతన్॥ ౧౦౧.

క॥ గొల్లలు గములై పెల్లునఁ । బల్లియులనువల్లెత్రాళ్లు పలుపులు నెల్లన్ ।
మొల్లముగఁ బూని గిబ్బల । నుల్లసమునఁ బట్టుకొనఁగ నుబ్బుచునుండన్॥ ౧౦౨.

గీ॥ పగ్గములు ద్రెంచి గొల్లలనుగ్గణంచి । భటులఁబడఁద్రోచి కొందఱి ప్రక్కలవియఁ ।
ద్రొక్కి కొందఱి తలల నెత్తురులు దొరలఁ । దాఁకి యాఁబోతులమ్మందతావుఁ జేరె॥ ౧౦౩.

వ॥ ఇత్తెఱంగున రంగుమీఱు నయ్యాఁబోతుసింగంబులకుఁ దురంగమాతంగంబులు పొంగణంగి మెలంగినం గమంగొని యజ్జగతీరమణుండు వృషభసంశిక్షణంబునం బలాధ్యక్షుల నియమించి వెండియు. ౧౦౪.

క॥ ఎవ్వండేని ధరాధిపుఁ । డివ్వసుమతిలోన నెక్కుఁడీవృషభములన్ ।
నివ్వటిలఁ బట్టి కట్టిన । నవ్వరునకు నాదుతనయ నర్పింతుననన్॥ ౧౦౫.

గీ॥ ఆప్రతిజ్ఞ సమస్తధరాధినాథు । లాదరంబున విని వచ్చి హర్షమునను ।
గిబ్బలను గాంచి మదిలోని యుబ్బణంగి । చనిరి వారలు నిజనివాసములకపుడు॥ ౧౦౬.

వ॥ ఇవ్విధంబున నవ్విశ్వంభరాభరణులావృషభశ్రేష్ఠంబులఁ జాఁపంజాలక చనుచున్న సమయంబునఁ గోసలధరారమణుండు నిజప్రతిజ్ఞానిర్వాహకవరాన్వేషణతత్పరుండై యున్నయెడ. ౧౦౭.

క॥ అంతవసంతాగమమున । కుంతరవాక్రాంతమమలకోమలదళమ।
క్రాంతమనోభవమళిరవ । దంతురితదిగంతరాళతలమైయలరెన్॥ ౧౦౮.

వ॥ అప్పుడు. ౧౦౯.

ఉ॥ అందముగానిజీర్ణదళనాంబరమున్విడనాడివేడుకన్।
గెందలిరాకువల్వఁదులకింపధరించిమిళిందచోళముల్।
బొందుగఁబాల్చిమాధవునిపొందునవాసకసజ్జలీలనా।
నందమెసంగవన్యరమనవ్యరుచిందనరారెనత్తఱిన్॥ ౧౧౦.

చ॥ కనదళిపాళిచూచుకవికస్వరగుచ్ఛకుశప్రకాశతన్।
ఘనశుకరావవాక్పటిమఁగాంతఫలావళిభూషణంబులన్।
దనరిపరాగగంధమునుదాల్చివనావనికాంతయావసం।
తునకనురాగమొప్పఁగనుదోఁచెనుదత్సమయాగమంబునన్॥ ౧౧౧.

క॥ తరుణార్తవనీతిమనో । హరయావనరేఖపల్లవాదృతినలరెన్।
దరుణార్తవనీతిమనో । హరయావనరేఖనమరునంగనసరియై॥ ౧౧౨.

గీ॥ అవ్వసంతునివితరణంబతిశయించె । వివిధఫలభోజనంబులవిప్రతతుల।
సకలసుమహితమనుదసాశనపరంప । రాప్తినభ్యాగతాళులునలరుచుండ॥ ౧౧౩.

గీ॥ లేఁతనెలవంకలై కెంపుటీలనమరి । పాలువునిండినమోదుగుమొగ్గలమరె।
మధుసమాగమమునవనిమగుచకపుడు । కరరుహక్షతశృంగారకళలువొలె॥ ౧౧౪.

ఉ॥ మాధవనూతనాగమనమంగళతూర్యరవంబులో రతీ।
నాథునివందిమాగధఘనధ్వనులోవిపినాభిరామ ల।
క్ష్మీనృతరమ్యభూషణనమీరితశింజితరీతులోయనన్।
మాధవమాసమందుఁబికమంజులరావముగొప్పెనెల్లెడన్॥ ౧౧౫.

వ॥ అప్పుడు. ౧౧౬.

క॥ కోసలవిభునందనమధు । మాసంబునసరసమ్రుదులమంజులసుమనో।
వాసితవనకేళికినవి । లాసగతిన్జనియెసద్విలాసవతులతోన్॥ ౧౧౭.

వ॥ చని యయ్యారామంబున రామామణులతో నక్కుమారరత్నంబు వనకేళీలోలురై విల సిల్లుచున్న సమయంబున లీలావతు లాబాలామణితో హేలాగతులఁ జనుచు.

సీ॥ వెలఁదికేలంటినవిరసెమాకందంబు సన్నుతాంగిహసింపఁబొన్నమీఱెఁ।
గనకాంగిపాటపాడినఁప్రేంకణముపూచెఁ దిలకినిచూచినఁదిలకమలరెఁ।
గల్కిపల్కినఁబూలఁగుల్కిగోఁగుసెలంగెఁ జానమోమెత్తినఁజంపకంబు।

కోమలియెదఁజేర్పఁగురవకంబలరారెఁ గాంతతన్నివనశోకంబుదనరె।
వనితనిట్టూర్పననుసింధువారమొనరె । నువిదపుక్కిటిమధువుపైనుమియమిగులఁ।
పొగడవిలసిల్లెవిరులతోఁబొలుపుమీఱె । ననుచుదోహదములుసల్పిరతివలపుడు॥ ౧౧౯.

రగడ॥ తరుణివనాంతలతాతరుజాలము । తరుణిమఁగన్గొనఁదలపంజాలము।
ముదితచూడుమిదె మొల్లలబృందము । ముదితమనుకరామోదమరందము।
కదళినటించుచొకాటపుదళములఁ । గదలిచూడు వేగమెదృగ్దళములఁ।
పొగడలనెల్లనుబొలుపగునీపలు । పొగడఁదరమెపొన్నలజూపులు।
నగములలోనున్నతిఁజూపించిన । నగమనరేపున్నాగముఁగాంచిన।
సరసిజములమనుసారమునిండెను । సరసములైకాసారములుండెను।
వరసహకారమునకుళిపరాగము । వరుసఁజూడవే వలనుసరాగము।
కలభాషిణినీగళరవమూమరు । కలికంఠాణముగదుమున్ నేమలు।
కుందముమనల్ కుదురునకందము । కందమటవెయిక్కడనాచందము॥ ౧౨౦.

సీ॥ తరుణిరోతనుసమ్మితలతామతల్లులఁ బవకరాధరసామ్యపల్లవములఁ।
జికురపుంజాంచితశ్రీమిళిందమ్ములఁ గుచయుగోపమసూనగుచ్ఛములను।
వదనబింబసమానవారిజాతమ్ముల సరసనాసాసమచంపకములఁ।
గమనీయనేత్రాభఖంజరీటంబులఁ బొక్కిలికెనయైన పొన్నవిరుల।
సరసవాక్సమశుకపికశారికలను । గమనసన్నిభఘనమరాళములగములఁ।
చూపలనిగనిగఁగలయంటితోఁటలగమి । నెలఁతకనవమ్మమదికింపుఁజలఁపవమ్మ॥ ౧౨౧.

క॥ అనియనురాగంబుపసుర । వనరుహమఖ్యాంబులందవారితలీలన్।
వనదేవతలోసాచా । మనులోయనననుల్లసిలుచుమానినుబసన్॥ ౧౨౨.

సీ॥ శ్రమవారికణజాలలసదురోజములందు రహిమించెనుబయోధరక్రమంబు।
బంగారుకాంతులఁబరిఢవిల్లినమేను దీఁగెలబడలికల్ దేజరిల్లె।
ఖరకరప్రభలచేఁగందినవెమ్మోము నందమ్ముకెందమ్మినపహరించెఁ।
దలిరుటాకులఁబోలితనరారుచరణముల్ రక్తోత్పలంబులైరహిఁజెలంగె।
సరససారసకాసారజలతరంగ । సంగతాంబుకణాభ్యంతరంగలలిత।
మారుతంబులపైఁదోఁచెమానసములు । సతులకారామవిహరణశ్రమమువలన॥ ౧౨౩.

క॥ ఈలీలనులీలావతు । లాలోలలతాసమంచితారామవనీ।
కేళులజాతశ్రమలై । యాలోజలకేళిలోలలైచనియెదుటన్॥ ౧౨౪.

క॥ సారసకువలయకైరవ । సారసకలహంసచక్రసారంగరవా।
సారసమాక్రాంతమహా । సారసముల్ గాంచిరచటసంరంభమునన్॥ ౧౨౫.

వ॥ అంత. ౧౨౬.

క॥ తరుణీమణులయ్యెడఁదమ । సరసోజ్జ్వలభూషణములుసడలించునెడన్।
బరువంపువిరులనెఱసిన । విరితీవెలయనఁగఁజూపవిలసిల్లిరొగిన్॥ ౧౨౭.

క॥ ఆకొలనుసొచ్చిముదమున । నీకీయింతికినిజోడునీలాలకతో।
నాకొమ్మఁజూపసరియగా । నీకమలదళాక్షియుద్దియింపఁగఁదనకున్॥ ౧౨౮.

చ॥ చిలుకలకొల్కి! కొమ్మ! సఖి! చేడియ! ముద్దియ! మచ్చెకంటి! తొ।
య్యలి! యొలనాగ! బిత్తరి! వయస్య! పణంతి! కురంగనేత్ర! యో।
యలికులవేణి! యింతి! జవరాల! నెలంతరొ! రమ్మటంచు నె।
చ్చెలియలఁగూడి సత్య విలసిల్లుచు సారస కేళికై చనెన్॥ ౧౨౯.

గీ॥ లలనలవలంబితాన్యోన్యలలితకరస । రోజలై తేజరిల్లిసరోజలములఁ।
జొచ్చిజలకేళిసలుపుచుఁజోద్యముగను । నాటపాటలవిహరించిరాదరమున॥

మ॥ వనకేళిశ్రమవారణంబునకునవ్వామాక్షులాసత్యతో। ౧౩౦.
వనకేళిన్ విలసిల్లిగత్తటిని శైవాలంబులన్ జిమ్ముచున్।
వనజాతమ్ములఁద్రుంచుచున్ జలచరవ్రాతంబులన్ దోలుచున్।
వనజాలమ్ములనోలలాడుచుఁగడున్ వాటమ్ముగానీఁదుచున్॥ ౧౩౧.

మత్తకోకిల॥ ఓలయోమృదువాగ్ధుగంధర! యోలయోదరకంధరా।
యోలయోనవపల్లవాధర! యోలయోసుపయోధరా।
యోలయోజితకామభామిని! యోలయోగజగామినీ।
యోలయోవనితామతల్లిక! యోలయోతనువల్లికా॥ ౧౩౨.

క॥ అళినీలాలకలీగతి । జలకేళియొనర్పనెఱులుజాతికటితటిన్।
మెలఁగుచునుండఁగఁజాంపవ । ములుసల్పెడికేకిపింఛములగతిసలరెన్॥ ౧౩౩.

ఉ॥ వారిజగంధులత్తటినివారిజకేళులవెన్కనీఁదుచో।
వారకపైఁటచాటుననువాటిలుచన్నులుతేజరిల్లె బం।
గారపుదీఁగెలందుఁగవగాఁదగిప్రాలినచక్రవాకముల్।
మారుఁడనున్గిరాతువలమాటునఁజిక్కిమెలంగుకైవడిన్॥ ౧౩౪.

వ॥ ఈలీలనమ్మరాళగమన చేడియలుం దానును జలకేళుల విలసిల్లి సరోవరమ్ము వెడలి॥ ౧౩౫.

చ॥ జలరుహనేత్రయత్తటినిసారసతీరముఁజేరియుండుచో।
వలిపముమేననంటిమెయివాటిలుకాంతులువల్వపైనిరం।
జిలఁగనుమించుబోణికడుఁజెన్నలరారెనుజూడవేడ్కఁగా।
మెలపునఁబల్కనారిచినమేలిమిబంగరుబొమ్మకైవడిన్॥ ౧౩౬.

వ॥ అంత. ౧౩౬.

సీ॥ తడివల్వ సడలించి తరుణియొక్కతె కావి పావడ ధరియించి శేవమీఱె।
జిల్గువల్వము మేనఁ జెలియయొక్కతె కట్టి రవిక రోపమమైన యవికఁ దొడిగె।
నెఱికురుల్ తడియార్చి నివిరి కొప్పునమర్చి విరిసరుల్ వెసనిల్పె వెలఁదియొకతె।
నుదుటఁ గస్తురిబొట్టుఁ గదియించి నెమ్మేన రతనంపుసొమ్ములుఁ దమణియునిచెఁ।
గులుకుఁబన్నీట మెలఁదినకలపమెపసను । గలికియొక్కతె యలఁదె నాకలువకంటు।
లటులలంకృతగాత్రలై యలరిచనిరి । సత్యతోఁ గూడి మణిమయసౌధములకు॥ ౧౩౭.

తే,గీ॥ చనిసరసభోజ్యముల ఖండశర్కరాది । కలితపానీయములఁ గాంచి కాంచి చంద్ర।
కాంత వేదికలను నూనకలితతల్ప । ములను సుఖియించుచుండె నమ్మురితయప్పుడు॥ ౧౩౮.

వ॥ అని తెల్పినఁ బరితుష్టాంతరంగులై శౌనకాదిమహామునులు రోమహర్షణతనూభవు నవ్వలి వృత్తాంతంబుఁ దెల్పుమని యడుగుటయును. ౧౪౦.

మ॥ గజరాజావనదక్షపక్షతనయాగ్రైవేయకత్వస్ఫుర।
న్నిజనామోత్కటధామధామనిచయోద్వేలోల్లసత్కౌస్తుభా।
శ్మజితోద్యద్రవిబింబబింబసదృగోష్ఠ శ్రేష్ఠగోష్ఠాంగనా।
వ్రజరుచ్యాననశోభశోభనమహాగ్రావాగ్రగజాగ్రగ్రహా॥ ౧౪౧.

మాలిని॥ దినమణిశతతేజా దీనమందారభూజా।
సనయగుణసమాజా శంబరద్విట్తనూజా।
మునిమనుపసరోజా ముక్తిసంధాయిపూజా।
వినతవిధిబిడౌజా విశ్వలోకాధిరాజా॥ ౧౪౨.

గద్య॥ ఇది శ్రీమాడభూషికులపయోవారాశిసుధాకర వేదాంతాచార్యతనూభవ వైనతేయకటాక్షలబ్ధవిద్వత్కవిరాజమనోరంజక సంగీతసాహిత్యకవిత్వ చతురనరసింహాచార్య ప్రణీతంబైన వల్లవీపల్లవోల్లాసంబను సత్యాపరిణయాఖ్యానప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము.

శుభమస్తు.

# వ ల్ల వీ ప ల్ల వో ల్లా స ము.

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీలక్ష్మీతటిదంచిత । నీలాంబుదరుచిరదేహనిరుపమమణిభూం।
జాలంకృతనిర్జగమకుట । టాలంకృతచరణశోభనాచలరమణా॥ ౧.

వ॥ అవధరింపుము మదనగోపాలచరిత్రశ్రవణాసంజాతకుతూహలులగు శౌనకాదిమునీంద్రులకుఁ దత్కథాసుధాపరిమళితహృదయకమలుండై సూతుండిట్లనియె, నిర్విఘ్నంబున సకల రాజనందనారత్నంబు విలసిల్లుచున్నసమయంబున నొక్కనాఁడు. ౨.

సీ॥ మగువయొక్కతె సూనమంజరీవ్యజనంబుఁ గేలఁబాలిచిగాలిఁగీలుకొలుపఁ।
గలవాణియొక్కతె కర్పూరభాగముల్ దనరారుతాంబూలదళములొసఁగ।
జలజాక్షులిరుగెలంకులఁ జామరంబులఁబూనిసంజిల్లియింపుగనువీవఁ।
గనకాంగియొక్కతె కనకదండంబు చేవగఁగుల్కుగొడుగుఁజేఁబట్టి మెఱయఁ।
దగినబంధుజనంబుల త్తఱిఁజెలంగఁ । దనయులొకచెంతఁజెల్వొందఁదనదుతన్వి।
తోడనిష్టానులాపములాడుకొనుచు । నంతిపురిఁగొల్వుఁదీర్చెనయ్యవనివిభుఁడు॥ 3.

క॥ ఈకరణిఁదల్లిదండ్రులు । ప్రాకటముగఁగొల్వునందుభాసిలుచుండన్।
రాకేందుముఖులతోడను । శ్రీకరముగసత్యయునటఁజేరెను వేడ్కన్॥ ౪.

క॥ వచ్చినసూఁతుంగనిమది । నెచ్చిన వేడ్కనువసుంధరేశుఁడప్పుడుతా।
నిచ్చందొడపైనిడుకొని । యచ్చోనిటుపల్కెసుజనులచ్చెరువందన్॥ ౫.

క॥ ఈజగమునఁదగినవరుం । డీజలజాననకుఁజూడ నెవ్వండనియా।
రాజేంద్రుఁడనఁగబంధువు । లాజాడనుబెండ్లిమాటలాడుచునుండన్॥ ౬.

క॥ శారదనీరదపారద । శారదలఁదిరస్కరించుశారీరరుచిన్।
నారదుఁడాత్మవిచారవి । శారదుఁడాసమయమునను జనుదేరంగన్॥ ౭.

ఆ॥ నగ్నజిద్విభుండునయమొప్పఁగానాని । చంద్రునెదురుకొనుచుసరసమైన।
పూజలొసఁగితెచ్చిభూరిపీఠంబున । నునిచియిట్టులనియెనుచితలీల॥ ౮.

శా॥ ఏదైవంబులఁబూజచేసిసతతంబేమేమిధర్మంబులన్।
మోదంబొప్పనొనర్చినారమొకొమిమ్ముంజూడఁగాఁగల్గె మీ।

పాదాంభోజపరాగసంగతిమహాపాపంబులంబాపు మీ।
రే దేశంబులసంచరించియిటకిట్లేతెంచుటల్ నాయకా॥ ౯.

వ॥ అనిన నమ్మానవేంద్రునకు దేవమునీంద్రుండిట్లనియె. ౧౦.

గీ॥ శ్రీనివాసునియర్చావిశేషదివ్య । దేశములరమ్యపుష్కరతీర్థములను।
సత్రయాగాదిసత్కర్మసముదయముల । నలరుచున్నట్టివసుమతీతలమునందు॥ ౧౧.

సీ॥ శ్రీరాజదుభయకావేరీనదీమధ్యసీమనుమహనీయశేషశాయి।
శ్రీరంగనాథునిసేవించికాంచీవరదరాజులభజించిరమ్యశేష।
గిరియందు వేంకటేశ్వరునంఘ్రులకు మ్రొక్కి శోభనాచలమందు సొంపుగాను।
సిరులఁజెల్వొందులక్ష్మీనారసింహునిభక్తిపూర్వంబుగాఁ బ్రస్తుతించి।
భద్రశైలంబునను రామభద్రుఁగాంచి । చెలఁగి సింహాద్రిపైనరసింహుఁజూచి।
యటులఁబురుషోత్తమక్షేత్రమందు విబుధ । సేవ్యుఁడైన జగన్నాథు సేవఁజేసి॥ ౧౨.

వ॥ మఱియుం దక్షిణ దివ్యక్షేత్రంబుల సంచరించుచు గంగా కావేరీ కృష్ణవేణీ గౌతమీ యమునాది పుణ్యతీర్థంబుల స్నానంబుసేయుచుఁ దద్దర్శనమజ్జనవిశేషకౌతుకపులకిత గాత్రుండనై కొన్నిదినంబులీరీతి వర్తించుచు బదరికాశ్రమవాసి నారాయణచరణసేవా కుతూహలుండనై వచ్చుచు ద్వారకానగరంబున లీలాగృహీతశరీరుండైన హరిం గాంచి తదీయ విలాసావలోకనపరవశుండనై కొంతకాలంబా పురంబునం దుండి తదనుజ్ఞాలంకృత శిరస్కుండనై మరలివచ్చి యో నిన్నుం గాంచితినని తెలిపిన నక్కోసలవిభుండు వినమితాంగుండై యిట్లనియె.

క॥ ద్వారకచక్కఁదనంబున్ । వారకనానగరమేలు వసుదేవజుసు।
శ్రీరమ్యచరితమున్విన । గోరితిమౌనీంద్ర తెల్పు కూరిమిమీరన్॥ ౧౪.

వ॥ అనియడిగిన మౌనీంద్రుండిట్లనియె. ౧౫.

సీ॥ వరణాగ్రహితసుధాకరశిలాదీధితిప్రకరచంద్రాయితభాస్కరంబు।
సౌధాగ్రకామినీసంగీతసాహిత్య సమ్మోదితామరీసముదయంబు।
కల్పవల్లీసుమాక్రాంతకాంతామోద వాసితారామప్రకాశితంబు।
లలితశీతలతోయకలితప్రవాహ సంశోభితక్రీడాద్రిసురుచిరంబు।
రమ్యసౌదామనీలతా రాజమాన । వారకాంతాసమాచారవర్ణితంబు।
సరససుందరనరవరసముదయంబు । భువనరుచిరంబు ద్వారకాపురవరంబు॥ ౧౬.

చ॥ అఖిలపురాణశాస్త్రనిగమాగమమంత్రసమాజపద్ధతిన్।
ముఖరితవక్త్రులై దివిజపుంగవమాన్యుని రాకరించి స।

న్నఖబహుళర్ధినల్ల శతమన్యుహసించివసింతు రాత్మభూ।
ముఖభవులప్పురీవరసమున్నతహర్మ్యములన్ ముదంబునన్॥ ౧౭.

ఉ॥ పౌరవిరోధమున్ గలిన భావసమన్వితపక్షపాతమున్।
వైరులధాటికోడియొరుపంచవసించిశరమ్ములేయుటన్।
సారెకుసత్ప్రతానము వెసన్మదిఁదల్పనిరుద్రులద్రులా।
గౌరతురంగులర్కులరికర్కశులప్పురి రాజశేఖరుల్॥ ౧౮.

మ॥ ధనపాలుండును బేదఁడాయెనను చందర్శించితత్సర్వ వి।
వ్యనిధివ్రాతములాతనిన్వలితత్స్వర్ణ్యస్థలింజేరెనో।
యనవైశ్యోన్నతరమ్యగేహములధాన్యస్వాంబరానర్ఘనూ।
తనరత్నావళులొప్పెశంఖములు పద్మంబుల్ మహాపద్మముల్॥ ౧౯.

గీ॥ హలముఁ గేలఁబూనిబల రాముఁడిల నేమి । ఫలము జనులకొసఁగి యలరెననుచుఁ।
జెఱకు రాజనంబుఁదఱుచుఁ బండింపుచు । మోపహాయులవటిపాదభవులు॥ ౨౦.

చ॥ హరహయుధాటికోడికలశాంబుధిఁజొచ్చినభూధరంబు లీ।
పురిఁదిరుగన్ బలంబిశరపూగమగడ్తగఁ గాపువెట్టి తా।
మరయఁగఁ గుంభినీధరములై చెలువొందఁగ నిర్ఝరంబుల।
య్యురుమపధాగలై యలరెనో యనఁబొల్చుఁబురింగ రేంద్రముల్॥ ౨౧.

గీ॥ శుభఫలప్రదనణదివ్యాపుక్తియుక్తి । మహితసంపత్తికరదేవమాతలుగలిగి।
రోచమానమహావర్తరుచులఁదనరె । సింధువులనంగఁదత్పురి సైంధవములు॥ ౨౨.

క॥ కాంచనపటుకేతనపట । సంచలనభవానిలప్రశాంతాభ్రభవ।
చ్ఛంవన్నినునరతిశ్రమ । మంచితమణిచక్రమగురథఘోషుంబనటన్॥ ౨౩.

ఉ॥ బెబ్బులిమీసముల్ వడిసి పేరిమిమన్యులనూఁగునూపికల్।
గొబ్బునమత్తవారణముకొమ్ములఁబట్టుచుఁద్రోయుసత్వముల్।
అబ్బురమైనసింహములనైన నెదుర్కొనుసాహసంబులున్।
జొబ్బిలుచుందురెల్ల పుడు సొద్యమెలర్పఁగఁదత్పురీభటుల్॥ ౨౪.

వ॥ మఱియు నప్పురవరంబు మధ్యమభువనదర్శనకుతూహలాగత పాతాళనిలయభోగిభోగాం చపరుణమణిప్రభాపుంజరంజితసలిలమీనకర్కట మకరఖరికరసుధాకరసముల్లాససంజాత గగనోపమాన శరనిధిపరిఖాసమావృతంబును, మేరుధారుణీధరపంబరాధరీకరణ చణస మున్నతవరణాచలఖచితరత్నప్రభాపటల ధగద్ధగాయిత గీర్వాణపట్టణప్రాకారగోపురం బును, సమున్నతహర్మ్యసౌధప్రాసాద చంద్రశాలాది భవనాంతరనితాంత పుంభావాంత తాంతకాంతాస్తనాంతఃప్రదేశావాంత శ్రమసలిలసంతాన మలిమ్లుచీభవద్గగనధునీశీకర

శీతల నందనవన మాకంద మందార మంజరీ పరిమళ ఘుమఘుమితాంతర మాధవీనికుంజ నిర్గళ న్మరుత్కందళ విరాజితంబును, నరుణకోమల పల్లవరాగ శుకపిక వాణీవిలాస కాముకగేహాయిత సముల్లసిత వకుళవంజులపున్నాగ మాకందకుంద మందారాది భూరుహ విరాజమానోపవన మధ్యభాగభాసమాన క్రీడాగిరి పరిసరశశికర ప్రాసాదనిష్యంద కాంచనమయ వితర్దికాస్థగిత చంద్రకాంత జలపూరిత కమలకల్హార సుగంధబంధుర దీర్ఘికాక్రీడదమందానంద పౌరజన బృందంబును, గార్తస్వరదండకేతన శతవిరాజమానాట్టాలక గోపురాలంకృతంబును, లసమానశోభాపుంజ నిగనిగాయమానోదార శశిశునాసీర శిలాతలభాసమానవేదికావిలాసంబును, ముక్తారత్నశ్రేణీధుర్యగేహాళీ సౌందర్యలసిత గారుత్మతమణినిర్మితాగ్ర సముదగ్రప్రవాళ స్తంభాంచిత ద్వారరాజవజ్రమయకవాటంబును, సరసహీరమణిమంజుల సాలభంజికాపుంజరంజిత బలభిన్మణిస్థగిత శాతకుంభ స్తంభ సహస్రభాసిత రాజసభానికేతనంబును, కైలాసనగరముపగిది నీలకంఠాభిరామంబును, శ్రీరామసైన్యంబువలె సుగ్రీవగజాభిరామంబును, శ్వేతద్వీపంబుకరణిఁ బరమపురుషవిరాజితంబును, శ్రీపతివక్షస్స్థలసమంబై వనమాలికారంజితంబును, చతుర్ముఖువదనంబుకైవడి బహుశ్రుతివిశ్రుతంబును, రాజరాజనివాసంబుపోలికఁ బుణ్యజనానందకరంబును, సంక్రందననగరంబువైఖరి సుమనోవిలాసితంబై, యయోధ్యానగరంబుమాడ్కిఁ బంక్తిరథాంచితంబై, సమస్తసంపదాకరంబై, సకలభూచరఖేచరలోచనానందకరంబై, బ్రహ్మాండంబున మెండుమీఱి యొప్పుచుండు. ౨౫.

క॥ ఆనగరంబునకధిపతి । యైనగసమధైర్యుఁడంబుజాక్షుఁడు కమలా।
జానిపరాక్రమనిర్జిత । గోనగరవిభుఁడు దనరెగోపాలుఁడనన్॥ ౨౬.

వ॥ అమ్మహానుభావుని యవతారక్రమంబును, లీలావిశేషంబును, బలపరాక్రమాతిశయంబును, ననుపమానసౌందర్యంబును, గళ్యాణగుణాకరత్వంబును, విచిత్రచరిత్రంబును వివరించెద సావధానచిత్తుండవై యాకర్ణింపుము. ౨౭.

సీ॥ క్షీరాంబునిధియందు శేషతల్పంబున విలసిల్లుచున్న శ్రీవిష్ణుమూర్తి।
వసుమతీభారంబు వారింపఁగఁ దలంచి వసుదేవతనయుఁడై వన్నెమీఱఁ।
బొత్తిళ్లలోనుండి పూతనహింసించి శకటంబుఁ బడవైచి ప్రకటముగను।
సుడిగాలియై పైనఁబడిన తృణావర్తు సేడాదిబాలుఁడై యెగసి చదిమి।
తల్లితనుఱోలఁగట్టిననుల్లసమున । మద్దులను గూల్చి చెలువొందె మహిమ ఖరాది।
రాత్రిచరులను దునిమి పర్వతము కేలఁ । దాల్చి దేవేంద్రు నోడించె దానవారి॥ ౨౮.

సీ॥ బృందావనమున నాభీరసుందరులతోఁ గందర్పకేళుల ఘనత నొందె।
హింసాపరోత్తంసుఁ గంసుని ఖండించి యుగ్రసేనుని వాననుగ్రహించె।

సకలరాజన్యమస్తకములఁదనపాదకమలంబులునిచిలోకంబులేలెఁ।
గర్తనైపుణవిశ్వకర్తసృష్టద్వారకాపురమ్మునను౦డెఁగాపురముగ।
సనకముఖ్యచతుఃసంచిషట్సహస్ర । సదనగణనీయగుణగణవరసుకీర్తి।
సార్వభౌమసమున్నతచక్రవర్తి । హ్యాతవతపకరార్తిత్రశీకృష్ణమూర్తి॥ ౨౯.

ఆ॥ ఆమహానుభావుఁడఖిలలోకేశ్వరుం । డట్లుద్వారకాపురాధినాథుఁ।
పగుచుమిగులసిరులనలరారుచునుసర్వ । విబుధకోటి నేలు వేళయందు॥ ౩౦.

ఉ॥ భంపసమందురుక్మిశిశుపాలజరాసుతులంజయించియా।
కుండినపట్టణాధిపునికూరిమిపుత్రికవాసుదేవుఁడా।
ఖండలుఁబోఁదోలిసుధఁగ్రైకొనుపన్నగవైరికైవడిన్।
మెండుగఁదెచ్చిలోకములుమెచ్చఁగఁబెండిలియయ్యెనర్మిలిన్॥ ౩౧.

గీ॥ జాంబవంతునకనిఁబరాజయమునొసఁగి । జాంబవతికన్యఁదెచ్చియాశార్ఙ్గధరుఁడు।
పెండ్లియాడెనుసురలెల్లవెల్లిగొనెడి । సంతసంబునఁగడువిరుల్ చల్లియలర॥ ౩౨.

చ॥ మునుకొనిసత్యభామనుసముజ్జ్వలగాత్రినిఁబెండ్లియాడియా।
వనితమనోరథంబుఁబరిపాలనసేయఁగలంచిదేవనా।
ఘనిసబలుంజయించిహరిదోర్బలముల్లసిలంగఁగల్పశా।
ఖనిఁబనవిష్కుటంబునసశ్రీప్రతతుల్ గననిల్పెవేడుకన్॥ ౩౩.

ఉ॥ అందముమీఱఁబోపాండుతనయా పరితంబగు రాజసూయమున్।
బొందుగనిర్వహించిమహిఁబొల్పగుఖాండవమున్ దహించిసం।
క్రందనుపొంగణంచివనిఁగవ్వడితోవిహరించుచున్ మహా।
నందమునన్ మురారిరవినందనఁబెండిలియయ్యెఁగూరిమిన్॥ ౩౪.

క॥ విందానువిందులను గో । విందుఁడునిర్జించిజగతివిశ్రుతకీర్తిన్।
బృందారకులగ్గింపఁగ । నందంబునమిత్రవిందనటుపెండ్లాడెన్॥ ౩౫.

వ॥ ఇవ్విధంబున సతులతో రతులవిలసిల్లుచున్న వెన్నుని సౌందర్యాతిశయంబు వర్ణించెద వినుము. ౩౬.

క॥ హాటకరుచిరమణిమయకి । రీటముహరిశిరమునస్నకీచులఁదనరెన్।
గాటుకగుబ్బలికొప్పనఁ । బాటిలురవిబింబమనఁగఁబొటవమెసఁగన్॥ ౩౭.

క॥ మృగమదతిలకమునగధరు । నగగుల్కునళికమునందువాసిగమెఱసెన్।
సొగసైననగుమొగంబునఁ । బొగయనిపైప్రవాలుచిన్నితుమ్మెదయనఁగన్॥ ౩౮.

గీ॥ లలితచికురాళులధరహల్లకముపైని । ప్రవాలునిభీతినయ్యంతరాళమునను।
నిశితశరకార్ముకంబులనిలిపెననఁగ । నరయఁగన్నులుఁగనుబొమ్మలలరెహరికి॥ ౩౯.

గీ॥ తనరుమీసమ్ములనుమిళిందములుదమిని । గన్నుఁదమ్ములపైదుముకందలంప।
బమ్మవిలుకాఁడునడుమసంపంగిములికిఁ । గూర్చెననఁనాససోగయైగులికెహరికి॥ ౪౦.

గీ॥ బవిరిగడ్డంబుమీసంబుఁబరిఢవిల్ల । శౌరివదనంబువిలసిల్లెసరిసముగను।
మబ్బుతునియలమాటునమసలుచుండి । పెంబుమీఱినచంద్రబింబంబుపగిది॥ ౪౧,

సీ॥ శ్రీకారములతీరుచెలువొందుఁజెవులందుఁజెక్కుటద్దములేచెక్కులందు।
బింబరాగంబుచేపంబుమీఱును మోవిరదనముల్ రాజీవరాగమణులు।
చిఱునవ్వుచంద్రికసిరులచేవిలసిల్లుఁబరసుందరతచేతఁదనరుగళము।
ఆజానులంబిబాహాదండములుమత్తవేదండతుండోరమోదియములు।
కాంతవనమాలికాకౌస్తుభాంతరాళ । వాసలక్ష్మీపయోధరభాసమాన।
మృగమదోపమలాంఛనమిళితమగుచు । వక్షమమరెనుబుండరీకాక్షునకును॥ ౪౨.

సీ॥ నిఖిలవిశ్వభవాండనీసమానపరంబుగగనంబుకానుసోయగముఁజూపెఁ।
వరనాభికంజంబుపైవ్రాలుతుమ్మెదబారుచెన్నలరారునానుహారోయలు।
కరితుండములఁగేరుకనదూరువులతీరుకమఠంబులఁబ్రపదములుదనరు।
ఘనజంఘలలనిషంగములునావిలసిల్లుహల్లకఛదనంబులంగుళములు।
దరరథాంగవరాంకుశధ్వజసరోజ । కులిశహలముఖ్యరేఖలఁజెలువునొంది।
సరసిజారుణకోమలగరిమసలరి । చరణయుగళంబుతనరారుమురహరునకు॥ ౪౩.

గీ॥ నల్లనిబలాహకములీలనుల్లసిల్లు । మేనఁజప్పనిపలిపెంబుమెఱుపుఁదీఁగె।
కరణిమెప్పారునెఱ్ఱనికలపమరుణ । కిరణఘృణికాంతియనఁగనాదగధరునకు॥ ౪౪.

గీ॥ పంచశిఖములవిలసిల్లుపన్నగముల । మాడ్కిరాజిల్లెభుజములుమధుహరునకు।
మాళుల దునవెలుఁగొందుమణులకరణి । నంగుళంబులఁజెలువొందెనుంగరములు॥ ౪౫.

గీ॥ గళభుజభూకటులతోడఁగదరియెదురు । కొనిననవిబల్మిచేఁబట్టికొనెననంగ।
నంచితపరారిముఖ్యసంచాయుగములఁ । గరముఁగనరారుశ్రీహరికరములేలమి॥ ౪౬.

గీ॥ తనరెనిరుపమనంతాసితవిబుధుండు । ఘనతులోచ్చావినీపభావనలనను చు।
మనుజులెన్నంగగోపకుమారుఁడెలమి । శ్రవణసంగతమకరాంకసహితుఁడయ్యె॥ ౪౭.

ఉ॥ మణికనకప్రభాకలితమంజులభూషణదీధితుల్ మహా।
ఘననిభశౌరిదేహమునఁగ్రమ్మికొనన్ విలసిల్లుచుండెనం।
జనధరణీధరంబునవిసారివిభావసుపాటలీభవ।
ద్ఘృణిగణదీప్తులోయనఁగఁదేజమునొందుచుమాటిమాటికిన్॥ ౪౮.

సీ॥ శౌరిప్రతాపతేజోరాశియెదుటఖద్యోతబింబంబుఖద్యోతమయ్యె।
హరియశోరాశిముందరఁజంద్రబింబంబుతారకాకాంతికాధారమయ్యె।

వసుదేవసుతదయాసారసుధావృష్టి చేఁదనరెలోకములౌషధములకరణి।
గోవిందకళ్యాణగుణకల్పశాఖికి సురలు కోరికములసొంపు నొందెఁ।
బత్రిహాయుచిత్రనాటకసూత్రము నకు । బొంగిరము రీతి విశ్వంబు పొరలి తిరిగ।
నట్టి శౌరిని నెన్నంగ నలవియగునె । నలువకైనను నేనోళ్ల చిలువకైన॥ ౪౯.

సీ॥ సూనబాణుని తండ్రి యైనగోపాలుని యందలి సౌందర్య మడుగ నేల।
పుండరీకాక్షుఁడై పాలుపు నొందినవాని యువయువాతిశయంబు లడుగ నేల।
లక్ష్మీసమాశ్లేషలసమానుఁడౌ వాని యైశ్వర్య సంతతు లడుగ నేల।
వాసుదేవాఖ్య చేవన్నె మీఱినవాని యఖిలాధిపత్యంబు నడుగ నేల।
విశ్వసృష్ట్యాదికర్తయై వెలయువాని । యందు లీలాతిశయములనడుగ నేల।
సచ్చిదానందమయుఁడైన శార్ఙ్గపాణి । యమితకళ్యాణగుణముల నడుగ నేల॥ ౫౦.

సీ॥ రుక్మిణీకమనీయ లోచనోత్పలపూర్ణ రాకాసుధాకర రమ్యవక్త్రు।
జాంబవతీవక్త్ర జలజాంచితమరందలోలుపమను కరీలోలనేత్రు।
సత్యభామాసతీసౌదామనీలసన్నీలనీరదరమాశాలిగాత్రు।
మిత్రవిందామిత్రపుత్రీ ప్రియమయూరీవినోదగర్జితతుల్య నాదపాత్రు।
మదనశతకోటిలావణ్య మఘువరాతి । దివిజగణనీయగుణగణ్యు భవశరణ్యు।
దివ్యచారిత్రు దేవకీదేవిపుత్రు । నెన్నశక్యంబె జగమందు నెవరికైన॥ ౫౧.

గీ॥ ఆమనోహరసౌందర్య మావిచిత్ర । చరితమారూపయౌవనసంపదయును।
నామహౌదార్యగుణగణమామహాప । రాక్రమముఁ జూచి నెవరియందైనఁ గలదె॥ ౫౨.

క॥ అనియనిమిషముని తెల్పిన । వినిహరికథమను జవిభుఁడు వేడుకతోనా।
మునిచంద్రుని వినుతించుచు । ననుపమముగఁ బూజఁజేసె నతిహర్షమునన్॥ ౫౩.

వ॥ అంతనారదుండు శ్రీకృష్ణలీలావిశేషవర్ణనంబువలన సృష్టిజనుల నభినందింపంజేసి నగ్నిజిద్వల్లభునాజ్ఞవడసి బదరకాశ్రమంబునకుం జనియె నక్కోసలధరారమణుండును శౌరిచరిత్రశ్రవణకుతూహలితాంతరంగుండై కొలువుడిగ్గి శుద్ధాంతంబునకుంజనిన యనంతరంబ॥ ౫౪.

గీ॥ శౌరిసౌందర్యసద్గుణసరసచరిత । ములివ్విని తలంచుచున్ సత్య మోహజలధి।
మగ్నయై చేడియలతో ప్రమరలిదివ్య । భవనమునసూనశయ్యపైఁ బవ్వళించి॥ ౫౫.

వ॥ ఇట్లని వితర్కించె. ౫౬.

ఉ॥ నారదమౌనియే లనరనాథునిఁ జేరఁగ వచ్చె వచ్చినన్।
నీరజనాభుదివ్యకథ నేర్పున నేటికిఁ దెల్పెఁ దెల్పినన్।
గూరిమి మీఱఁ దద్గరిమఁ గోరిక నేటికి వింటి విన్నన।

స్మారునిబారికేలసను మాన్పఁజేసెను దైవమక్కటా॥ ౫౭.

ఉ॥ వెన్నెలరాయనిం దెగడు వెన్నునిముద్దులుగుల్కు మోము నా।
కన్నులపల్లఁగా నెపుడుకన్గొనఁగల్గునొ వానికౌఁగిటన్।
బన్నుగఁజేర్చి మోవిమువిసంటఁజూఱుక్కన నొక్కుటెన్నఁడో।
క్రొన్ననవిల్తుకేళులనుగూరిమిమీఱ సుఖించుటెట్లొకో॥ ౫౮.

గీ॥ నందనందనుఁడీపట్టణమునకేల । వచ్చునచ్చినఁగిబ్బలయెన్నొయంచి।
యలరిననుఁగౌఁగిటనుజేర్చునను మఁగోంలె । నేపుచింతించిమానిలు నేడు నిలుచునో॥ ౫౯.

మ॥ తమకంబగ్గలమాయెడెందమున నేఁ దాళంగలేనే మపా।
యమునాకెవ్వనిక్కుతాఁ సమునదేహంబేమిగానున్నదో।
కమలాలోలునిచెంతకేగియెవరేకాంతంబునం దెల్పియో।
శ్రమఁదీర్పన్ దమకింతురంబుజనిభూనసంకల్పమెట్లున్నదో॥ ౬౦.

గీ॥ తల్లిదండ్రులతోఁ జనితలఁపుఁదెలుప । వలెన టంచుఁగలంచియాపలను జూడ।
సిగ్గునోరెత్తనియదేమిసేయుదాన । గన్నెలొగి మనాటువారిలుగా రేపు నే॥ ౬౧.

గీ॥ నెలమిచేమంచిచెట్టిలు దెలుపలును మనఁ । దగినవారనినమ్మి చెప్పఁగఁదలఁతు।
నేనివికవికలాడుటే కానిపనులు । చక్కసేయంగ నేర్తురేనిక్కముగను॥ ౬౨.

వ॥ అనివితర్కించుసమయంబున। ౬౩.

ఆ,వె॥ మన్ననముననెచ్చిమా యింటఁ బన్నని । వింటపేరిన నారి నేగి నెక్కు।
బెట్టిబెట్టింపంబు నెట్టిగోలలఁగూర్చి । తెగిచియేచుఱుక్కనఁగ దెగిగెన్ని॥ ౬౪.

క॥ మరుశరములునతిసరుసున । గిరులపుల నప్పుడేదిశగిరియోగమునన్।
బరగెన్ శ్రమఁబలసన్నము । నునసెన్నిట్టూర్పుగాడ్పు సబ్బునపీడెన్॥ ౬౫.

సీ॥ చంద్రాననకుఁబూర్ణచంద్రాతపము మహాఘుణ్ణ కరగ కాంతికరణిఁదోఁచె।
మృగరాజమధ్యకుమృగనాభికలితమాకలసమ్ముపసనాభిసలెనుదోఁచె।
బల్లవాధరకుమేల్ వల్లవితెమ్మెరల్ పస్రజాంపురమ్ములగిదిఁదోఁచె।
జలజాయతాక్షికుజ్జ్వలసూనజాలముల్ పటుసూచికాతతి భంగిఁదోఁచె।
గుటిలచికురకుశుకపికాళ్ళటులురుంతు । దములు గాఁదోఁచెఁజెలులవాక్యములుపీను।
లకువసహ్యములయ్యె బాలికకు యోగ । విప్రలంభంబునలనన వేళలందు॥ ౬౬.

చ॥ చిలుకలరావముల్ నెలికిఁజొల్కులుగాఁగనిపించెన త్తఱిన్।
మలయసగాశుగమ్ములటుమానినికొప్పెశిలొశుగంబులై।
లలితసుగంధచందనశరమ్ములు చూడశరంబులయ్యెన।
య్యలికులవేణికి స్మరశరావళిఁగాఁజగమెల్లఁదోఁచెఁగన్॥ ౬౭.

వ॥ ఆసమయంబున. ౧౮.

చ॥ పిలువకమున్నె తాఁబలుకుబేలతనంబునమాటలాడుచున్।
గలఁచుచుఁగల్వరించుఁగడుఁగౌఁగిటఁజేర్చుబయల్దనంత నే।
కులుకుచునవ్వుసొమ్మసిలుఁగూరిమిచేఁదలయూచునల్కన।
వ్వలమురిదాల్పుపైవలపువాసిగనిల్పులతాంగివింతగన్॥ ౧౯.

గీ॥ చెలులనరమాపులనఁచూచిచెలిమిమాని । చిమ్మికొనగోటఁగన్నీరుఁదమ్మికంటి।
నేల్పుమదిఁదల్చి నేమఱు వెలఁదిమిఁగుల । వగలఁబొగులుచుమరుబారిఁదగిలియుండె॥ ౨౦.

క॥ లీలావతులాలీలను । బాలామణిచెందుచున్న పరితాపముఁదా।
రాలోకించుచుగములై । యాలోచనచేసిపల్కి రాసమయమునన్॥ ౨౧.

చ॥ కిసలయపాణి నేడుకనుగీరముపిల్చినఁబల్కవేమినీ।
దెసవిలసిల్లునెచ్చెలులఁదేరికనుంగొనవేలకొమ్మయీ।
పసగలగంధమీవు మెయిపాటిలఁజేయవదేమికోమలీ।
కుసుమసరమ్ములందిననుగొప్పునఁగూర్పవదేమి నెచ్చెలీ॥ ౨౨.

సీ॥ సొంపొందుబత్తేటిగుంపులౌతగుకురులింపుగాఁగొప్పుఁగావింపవేల।
నుదుటఁగస్తురిబొట్టుఁగదియించిమేననందమ్ముగాసొమ్ములుదాల్పవేలఁ।
దళుక్కుచెక్కులనుగంధముఁబూసి నెఱతావివిరిసరుల్ నేడుకఁదురుమవేల।
కన్నుఁదమ్ములఁగాటుక నొసంగియడుగుకెందమ్ములలత్తుకఁదాల్పవేల।
గుల్కుకపురంపుఁబల్కులుబల్కవేల । కోర్కిదీరంగనన్నంబుఁగుడువవేల।
విడెముపుక్కిటనింపఁగావింపవేల । తెలవనీకేటికీలాటి తెలఁగుచెపుమ॥ ౨౩.

ఉ॥ కోమలియేమెనీచెలిమిఁగూడినవారముగామమాపయిన్।
ప్రేమయొకింతలేకయిటుభేదమొనర్చదవేలనేమఱున్।
గామునిపువ్వుటమ్ములకుఁగందెఁగదేమృదువైనమేనునీ।
కేమనుజేంద్రుపైనిపలపింతటనైనను దెల్పవేసఖీ॥ ౨౪.

గీ॥ వెలఁదినీచనుబంతులుద్వేలమదన । తాపమునుజెందికనుగందెఁదలిరుటాకు।
కాదనన్ జాలిరంజిల్లునీదుమోవి । వేఁడినిట్టూర్పుపైసోఁకివాడెనమ్మ॥ ౨౫.

ఉ॥ పున్నమనాఁటిచందురునిబోలెడినీదుమొగంబునందు లే।
వెన్నెలవంటినవ్వుకడునేడుకమీఱఁగఁగానరాదయో।
కన్నియనీదుచెక్కులవికాసమువీడెనువెంటవెంటనే।
కన్నులనీరునిండిననుకాటుకజాఱెనిదేమెకోమలీ॥ ౨౬.

గీ॥ ఈవిధంబునఁజేడియలింపుమీఱఁ । బలుకరింపఁగఁగోసలపతితనూజ।
భావమునమీఱుభావజుబాధఁజెలుల । తోడఁసిగ్గునమెల్లనఁదొడరిపల్కె॥ ౭౭.

ఉ॥ దేవమునీంద్రుఁడిచ్చటికిఁదేజముమీఱఁగవచ్చికొల్వునన్।
భావజుతండ్రిదివ్యకథభాసిలఁజెల్పిననాఁటనుండితా।
నావిభుపైనినాదుహృదయంబునిరూఢిగనాటియున్నదిం।
కేవిధినైనవానిమదికింపుగఁజేడియలారకూర్పరే॥ ౭౮.

క॥ కన్నియలారమనోవ్యథ । పన్నుగఁదెల్పెదనుదాఁపఁబనియేమిఁకనే।
విన్నదిమొదలుగవెన్నుఁడు । కన్నులఁగట్టినవిధంబుగాఁగనుపట్టెన్॥ ౭౯.

గీ॥ హరిమనోహరరూపంబుసరసచరిత । మమితకల్యాణగుణములునపుడుదేవ।
మౌనితెల్పినవిధమెల్లమదినినాటె । మగపురాదేమిసేయుదుమగువలార॥ ౮౦.

గీ॥ చిన్ననాఁటనుండిచెలఁగియేమొనరించు । నేస్తమొప్పఁదలంచినేర్పుమీఱ।
నాదుకోర్కిదీర్చినన్నుపాలింపరే । మీకృతింబుమఱువమొలఁతలార॥ ౮౧.

క॥ అనిపల్కుపణఁతిమఱువే । డనచేఁబొగలుచునుమిగులఁదల్లడపడ న।
వ్వనితలుగముల్లైమానినిఁ । గనుఁగొనియీగతిహితముగాఁబల్కిరొగిన్॥ ౮౨.

క॥ నీవెన్నఁడైనఁబన్నుగ । నావెన్నునిమున్నుకన్నులారఁగఁగంటే।
నీవింతపగలఁబొగిలెదు । పీవింతలున్నపతివిన్నమేమనుమొనుమీ॥ ౮౩.

క॥ పాయనుబరితాపంబును । పాయముఁజింతింపవమ్మపణఁతులకెపుడున్।
బాయముపరకింపఁగనను । పాయముకాదమ్మకొమ్మపంగరుబొమ్మా॥ ౮౪.

గీ॥ బోటిరోనీవుపెద్దలనాటురాన । వాటపాటలుమానియీనాఁటికిటుల।
హాటకాంబరుపైబుద్ధినాటఁజేయ । సాటివారలునగరెయోపాటలోష్ఠి॥ ౮౫.

వ॥ ఇవ్విధంబునఁ బల్కునెపె నక్కాంతారత్నంబు రతికాంతజనక స్మరణసంజాత వేదనాతి రేకచలితస్వాంతయైకుసుమకోదండనిష్యందామందమరందబిందుసందోహానందితమిళింద శింజినీమంజుఝుంకారటంకారసంకలితకందర్పశరాసారంబువలన నరుంతుద శుకపికశారి కానికరారావంబువలన నప్పల్లవాధర డిల్లఁబోయియున్న సమయంబునఁ జెలులన్నెలఁ తం గనుంగొని దురంతచింతాక్రాంతలై యుపవనాంతరసంచారంబువలన సంతాపంబు విశ్రాంతింజెందునని భ్రాంతింబొందించి బలాత్కారంబున నయ్యింతిం దోడ్కొని యా రామంబునకుం జని యచ్చట హంసకారండవ చక్రవాకాది విహగకూజితాక్రాంతవికచ కమలకల్హారపరిమళ ఘుమఘుమితశీతల సలిలపూరితసరస్తీరవిరాజమానసుధామయ సౌధ పరిసరంబునవిచికలనిచయమంజుకుంజాయతవితానంబుదిగువ శశికాంతమణికీలితవిదర్భికో పరిభాగంబునఁ గిసలయవిరచితశయ్యపై నక్కోమలినునిచి నెలరాల గిన్నెలచలువలూరు

పన్నీటమేలందిన కలపమ్ము వలుదగుబ్బల నల్లన నలఁదుచు, నలరుననఁటులవలన జాఱిన కప్పు రంపు రజంబు పయిం జల్లుచు, సరసపరిమళసుమసముదయాన్విత వ్యజనంబులఁ జల్లగా విసరుచు, లలితశైత్యోపచారంబులు నేర్పుమీఱ సలుపుచున్న సమయంబున. ౮౬.

క॥ సూనశరాహతి నొగిలిన । చాన వెతల్ గానలేక జాతినపగిదిన్ ।
భానుఁడు గ్రుంకెను సపయుల్ । మానవతీపరిభవంబు మహిఁ జూతురొకో॥ ౮౭.

వ॥ అప్పుడు. ౮౮.

గీ॥ ద్యుమణిరథనేమిహారిఖురోద్ధూతచరమ । శైలగైరికరేణువుల్ చదలుగప్పె ।
ననఁగఁ బడమరఁ బద్మరాగాతిశాయి । యంబరంబైనసాంధ్యరాగంబు పొడమె॥ ౮౯.

గీ॥ వెలఁదిరొపనూఁడువిరహాగ్ని విపులధూమ । మడరెనిట్టూర్పులననంగ నమరెఁ దమము ।
కణఁగియెగసినవిస్ఫులింగములకరణి । మెఱుచు తారకలంతసంతతను దోఁచె॥ ౯౦.

ఉ॥ మారుఁడు పూలగోలలను మాటికి మాటికి నేయసాగినన్ ।
హారకకన్నుఁ బమ్మితరిపాంశిని గ్రుంచునటం మదోద్ధముగా ।
నీరజవైరి పొల్చి కడునింగిఁ జెలంగినతీవిలాసమున్ ।
గూరిమిఁ గాంచిన వ్వనసఁ గొన్నెల వెన్నెల నించెన త్తఱిన్॥ ౯౧.

క॥ చెలియెడఁ బొల్చిన విరహా । నలమను చెలువుని విలోకనము చేయుటకై ।
నెలరేఁగి వచ్చెనో యన । మలయానిలుఁ బొలసుఁ బొదలమరువునవీనెన్॥ ౯౨.

ఉ॥ అంతఁ గొఱంతలేక జగమంతయు వెన్నెల నిండియుండఁగా ।
వింతగఁ జల్వ తెమ్మెరలు వీవఁగఁ గోకిలకీరశారికల్ ।
సంతమెలర్పఁగా నయమనుప్పులు ఝుమ్మని మ్రోయుచుండఁగా ।
గంతుఁడు చిల్కనెక్కి సుమకార్ముకమున్ ధరియించి నెమ్మదిన్॥ ౯౩.

గీ॥ గండుతుమ్మెదగొనయంబు మెండుమీఱఁ । బెట్టి కట్టల్కఁ గోలలఁ బెట్టి దుముగ ।
దిగిచి చేకోలఁ దిమురుండు మగువపన్నుఁ । గనఁడుమనసిడా సిసఁగలికియులికి॥ ౯౪.

గీ॥ కమ్మవిలుకాని నెఱపుఱ్ఱ వ్వట్టముల్లెడను । గ్రమ్ముకొని చిమ్మగను గొమ్మ సొమ్మసిలుచు ।
మూర్ఛనొందినఁ గనుఁగొని ముదితలపుడు । నేస్తతోఁ జికయిఁకకర్జమే రియనుచు॥ ౯౫.

వ॥ ఇత్తెఱంగునఁ జింతాక్రాంతలై యవ్వలంతులు కంతుం గొలువకున్న నిన్నెలంతకు సంతాపంబు విశ్రాంతి నొందదని తలంచుచు వెండియు. ౯౬.

సీ॥ గంధంబు పన్నీటఁ గలిపియంతట నల్కఁ నెఱుసుకంబంబులు చెలువుమీఱ ।
విరిజాజిగొజ్జంగివిరులు పందిలి వైచి కప్పు గ్రముగ్గులగ్గలికఁ బెట్టి ।
పరువంపుఁ బూలతో మరునింపు దడిగట్టి పాలుపైసవగగుల్కఁ దలువజగతి ।
పైనఁ గెందమ్మి చప్పరము వన్నెనమర్చి యగరుధూపములిచ్చి మృగమదమున ।

మదనురతియుక్తునిఁగఁ జేసియెదుట మెట్ట । తామరపుగద్దెపై నిల్పి తరుణులెలమి।
గంధమాల్యాక్షతలు పూజగా నొసంగి । యొప్పఁగాను పహారమ్ములొసఁగియపుడు॥ ౯౭.

క॥ పుట్టితివిందిరకడుపునఁ । బట్టితివిసుమాయుధంబుఁ బ్రమథాధిపునిన్।
గొట్టితివి యశముజగమునఁ । జుట్టితివిసురల్ నుతింపసొంపునమదనా॥ ౯౮.

గీ॥ శంకరవిరించిహరులు నిశ్శంకముగను । జంపలాక్షీదృగంచలచలితమాన।
సొంచితులుగారె నీదుమాహాత్మ్యమునను । బంచశరమారిచిల్క బాబావజీర॥ ౯౯.

గీ॥ చందురుఁడు మేనమామ వసంతమలయు । మారుతంబులు మిత్రులు మాతలక్ష్మి।
తండ్రిహరిగాన నీకీవిధమున మేము । సోదరులమయ్యు మముదయఁ జూడవయ్య॥ ౧౦౦.

వ॥ ఇత్తెఱంగున వినుతించుచుఁ గంతునివలన నావంతైన సంతసంబు చేకూరమికి నవ్వేలంతులు వింతనొందుచు నవ్వసంతసఖు సపరివారంబుగా నుద్దేశించి మఱియు నిట్లనిరి. ౧౦౧.

సీ॥ అందమా యేచుటమందమా యతమామిళిందమా పున్నమచందమామ।
వైరమామాతో మయూరమావా చాలకీరమాతిగునె నీమేరమాన।
కోపమాలేకమా పాపమా హరభృత్యలాపమా మీకుఁ బలాపమాన।
వింతమా చెలితోడఁ బంతమా తగునా వసంతమా కరుణార్ద్రచింతమాన।
మదనసుపతులచెంత నాకదనగరిమ । పదరఁబరపవిశరములఁ బొదవితయయొ।
మదనగోపాలుఁగను గూడి ముదితనీదు । మదమణంగించుఁబాలు నెమ్మదిఁ జెలంగి॥ ౧౦౨.

గీ॥ పాలమున్నీటిలోపల బాడబాగ్ని । కరణి జగదీశుకడుపునఁ బరిఢవిల్లి।
మగిడి హరుకంటిమంటలమండిపడియుఁ । బఱఁతులనలంచెదవు నీవు పంచబాణ॥ ౧౦౩.

ఉ॥ తియ్యనివిల్లుఁ గాల్చికడు తేనియలీనెడుపువ్వుటమ్ములన్।
జయ్యనఁ బూని మేటిబలశాలి వజీరుఁడనంచుఁ జిల్కపై।
నెయ్యము మీఱ నుల్లసిలు నీమనమెంతయుఁ గ్రూరమయ్యె నీ।
కయ్యమునన్ విషాగఫలకల్పుఁడవైతివి మాడమన్మథా॥ ౧౦౪.

గీ॥ మంచివాఁడవటంచుఁ బ్రపంచమునను । నిన్నుఁ గొల్చెదరింతులు నేర్పులేక।
తేనెబూసినతరవారితీక్ష్ణధార । కరణి విలసిల్లు నీచిత్తసరణి మదన॥ ౧౦౫.

గీ॥ లేరెమా చెలిసాటిచెల్లెండ్రు నీకు । నింతదుష్టాలియేలెద వేలసయయొ।
సోదరీగేహశోషణ సోద్యముగను । జేయు నీకిది చిత్రంబె శీతకిరణ॥ ౧౦౬.

క॥ పన్నగము నిన్నుఁ గఱచినఁ । బన్నగఁ బ్రతికిసవిధంబు పరికింపఁగనా।
పన్నసతీదుష్కృతమని । పన్నగపతినైనఁ గేలఁ బట్టెదఁ బవనా॥ ౧౦౭.

గీ॥ పాలుఁబోసి త్రాఁచుపాములఁ బెంచిన । పగిది మిమ్ము నిలిపి పంజరములఁ।
బెంచినందులకిటు వంచింపఁదగునశా । రికలఁ గూడి హంసశుకములార॥ ౧౦౮.

ఉ॥ నల్లనివాఁడవైయుఁ గులచానల నేఁచెద వేలచంద్రదనీ।
వల్లనవీవ మేను మలయానిలతాపము నొందెఁ గీరమా।
మెల్లన నీవు గూయఁ జెలి మిక్కిలి సొక్కెను జూడఁగా రతీ।
వల్లభుతోడఁ జేయుసహవాసమునన్ ఖలులైతిరక్కటా॥ ౧౦౯.

వ॥ అని కందర్పచంద్ర మందమారుతమిళింద శుకపికశారికాదుల నిందించి యమ్మందయానలు మగిడి మగువ నుద్దేశించి యిట్లనిరి. ౧౧౦.

చ॥ అలసుఁడు దక్షిణానిలుఁ డనంగుఁడు రాజు మయూరకోకిలల్।
చిలుకలు పుట్టుగుడ్డు మధుసేవప్రమత్తములా ద్విరేఫముల్।
చలువలఁ జేఁడు నిష్కళుఁడు జాలవసంతుఁడు మీఱుఁగాన నా।
కులతను వీరికై యడలి కొమ్మ మనోవ్యథఁ జెందు టొప్పునే॥ ౧౧౧.

వ॥ అని చతురవచనంబులఁ బలుకుచున్న సమయంబున. ౧౧౨.

గీ॥ అరుణకిరణుఁడు పద్మినీవరణమునకు । వచ్చు నేఁ గాలమని యెడు బాణకారి।
తొగకామంపులము సేయఁ దనరెననఁగ । జక్కఁగాఁ దూర్పు నను వేగుఁజుక్క వొడమె॥ ౧౧౩.

గీ॥ అత్తటి విరాళి నొందు నయ్యతివ వెతలఁ । గాంచి తిన్ప్రేయసి ప్రతీచికంతుబాధ।
నిక్కరణిఁ జెందు ననితోఁచి వెక్కసముగ । నస్తగిరిచాటునకు నేగె నమృతకరుఁడు॥ ౧౧౪.

చ॥ కలువలఁ జేఁడు రేయి నిజకంజని పైనిక ప్రసారమున్।
బలిమి నిజేసి పర్వనిభానుఁడు రోషకషాయితాంగుఁడై।
యలరుచు వచ్చె నోయసఁగ సంబుజరాగసరాగదీధితుల్।
బలపరిపంథిదిక్ప్రబభాతిమునన్ బభవించె నత్తఱిన్॥ ౧౧౫.

క॥ భ్రమరావళి సరసిజనీ । రమణికి ఝుంకారమిషను రవినాధాభ్యా।
గమముఁ దెలుపునద్దూతిక । క్రమముగఁ గాసారదీర్ఘికలఁ భాసిల్లెన్॥ ౧౧౬.

క॥ జక్కవలు గతికి డాసెను । జిక్కలగమి మినుసిమినూనె జేపులుఁగులకున్।
మిక్కవలువాసెఁ జీకటి । దిక్కులకుం దూసెఁ దొగలు తెలివిన్ బాసెన్॥ ౧౧౭.

ఉ॥ భానుఁడు పూర్వభూధరము పైవిలసిల్లఁ గదమ్మయూఖముల్।
మానవతీకచాగ్రకుచమండలకర్ణకరాంతరంబులన్।
మానుగ హల్లకస్పదనమంజులకుంకుమపంకపల్లవ।
శీనలినాయితంబులయి చెన్నలరారుచునుండెనత్తఱిన్॥ ౧౧౮.

వ॥ అప్పుడు. ౧౧౯.

గీ॥ చెలులు సత్యను మేల్కొల్పి తలిరుజొంప । ములఁ గుసుమమాలఁ దద్దయుఁ బోలుపు మీఱ।
పొదలనడుమను మెల్లన బోటితోడ । నొనుచుఁ జను నెడ నిల్చి రక్కలను జెంత॥ ౧౨౦.

వ॥ అంతట. ౧౨౧.

గీ॥ సరససారసమైనయాసరసిరస । మెలఁతన త్తన్వి నిలిపిన మేని సెగను।
నీండ్లు సలసలమని కాఁగ నీరజములు । స్రుక్కె నచ్చటి మధుపమ్ము లెక్కె దిశల॥ ౧౨౨.

వ॥ ఇవ్విధంబున నెన్నరాని మనోజపరితాపమ్మునఁ బొగలుచుఁ దిరుగుచున్న నయ్యింతికిఁ బడంతులు శిశిరోపశాంతికరోపచారంబులు సలుపుచు మోహాపగస సరసవచనంబుల నూరడించుచున్న సమయంబున. ౧౨౩.

సీ॥ ద్వారకాపురవరోద్యానవాటిక దివ్యకమలకల్హారాదికలితమైన।
కాసారమున నిత్యవాసియైన మరాళరాజంబు దనరమ్యరమణితోడ।
సరసంబుగా మానససరంబు మొదలైన కొలఁకుల విహరించి కోర్కె మీఱ।
మరలి వచ్చి నపుడా సరసీవరంబున వాలి వారిజగంధవాసితంబుఁ।
గ్రోలి విశ్రాంతి నొందిసరోజనాళ । ములు నిజప్రియురాలితో సలలితముగ।
ననుభవించుచునన్నిటి నతిశయములు । గని యువిహరించుచుండెఁగాఁ గౌతుకమున॥ ౧౨౪.

వ॥ ఆసమయంబున. ౧౨౫.

సీ॥ మరులుమన్నగ దువ్వికొప్పఁ బెట్టక పూలసరులు సడలించి సరభసమున।
శ్రమవారిశీకరసందోహకలితమై వాడిన నెమ్మోము వంచి వగల।
చెక్కుఁ జేయిఁ జేర్చి చిన్నఁబోయి మనోజవేదన నొందుచు వెచ్చనైన।
నిట్టూర్పు వేమఱు నిగుడించి నెచ్చెలుల్ల ల్పడియుచితోపచారములను।
మనసు గొలుపక దైవమాయను చుఁగన్నుఁ । దమ్మి గవనీరుఁ గొనగోటఁ జిమ్మికొనుచు।
మారుఁడను బోయవలలోనఁ జేరియున్న । మృగియనాఁ దల్లడిల్లు నమ్మగువఁ గాంచి॥ ౧౨౬.

వ॥ ఇత్తెఱంగున ననంగవేదనను మెలంగుచున్న నక్కురంగనయనం గాంచి మరాళాంగన మనంబునఁ గటకటంబడి తనవిభునితో నిట్లనియె. ౧౨౭

క॥ అక్కట యీవనితామణి । చక్కఁదనమున మనము తిరుగు జగమందున మీ।
రెక్కడనేనియుఁ గంటిరె । మక్కువ నీరంగఁ జూడ మనసై చెలఁగున్॥ ౧౨౮.

క॥ కిన్నరలలనామణియో । కొన్నన విలుకాని ముద్దుగుమ్మయొ మఱియున్।
పన్నగరమణియొ నగపతి । కన్నెయొ యొన్నంగఁ గమలగర్భునివశమే॥ ౧౨౯.

వ॥ అయినను. ౧౩౦.

క॥ నీరజనాభునికరుణన్ । మీరలెఱుంగ నిదికల దె మేదినిలోనీ।
చారుతరగాత్రి విపులవి । చారము నొందుటకు నేమిసంగతి కనుఁడీ॥ ౧౩౧.

చ॥ అనినమరాళరాజము నిజాంగనతో నిటుపల్కెఁ గల్కిరో।
వినుమిది సన్నజిద్విభుని విశ్రుతనిష్కుటసీమ మాపనీ।

వనితన్నుపాలపుత్రిమఱుబాధలఁజెందినరీతిఁదోఁచుని।
వనరుహనేత్రలంగనినవాసిగివీరలనర్యఁజూచినన్॥ ౧౩౨.

వ॥ అనిన హంసాంగన యిట్లనియె. ౧౩౩.

గీ॥ లలితకోమలపల్లవకలితమైన। పువ్వుఁదీఁగవాడఁగినయీపువ్వుఁబోఁణి।
మేనువిరహానలంబునఁగ్లానిఁజెంద। నకటదైవముజేయుమానజూనకైన॥ ౧౩౪.

వ॥ అని వెండియు. ౧౩౫.

క॥ ఈకాంతామణిమదిలో। నేకాంతునిపైనమోహమిడిపాగిలునో నే।
నేకాంతంబునఁదెలిసెద। నీకాంతలవలననను చు నేగెనచటికిన్॥ ౧౩౬.

క॥ కలహంసాష్టవరిటయా। కలవాణులనెంత కేగికలరివములన।
క్కలకంఠివార్తనడిగినఁ। గలకలవాక్కులను దెలుపఁగఁగిరివెలియాల్ ౧౩౭.

సీ॥ వినవమ్మరాయంచ వెలఁదిరోయీకొమ్మకోసలధరణీశుకూర్మిబిడ్డ।
సత్యయనెడిపేరసతులలోఁజెలువొందిసౌందర్యమునకల్మిసతినిమించి।
తనరుసందనఁగాంచితంౘడియీజగమందుఁడగినయల్లునిజూడఁదలఁచునంతఁ।
దనదుమందిదురాసదితనేఁడుగిబ్బలు వెలయంగనెవ్వండువీనిఁబొడవి।
పట్టికట్టునొవానికిపడఁతినిత్తు। నని ప్రతిజ్ఞనొనర్చినవెనుకనొక్క।
నాఁడునరపతిచెలులతో వేడుకలర। సంతిపురిఁగోల్వుదీర్చునయ్యవసరమున॥ ౧౩౮.

గీ॥ నారదుఁడువచ్చినీరజనాభుకథలఁ। దెలిపెనవివిన్నగోలెని త్తైఱవమిగుల।
నతనుతాపమ్మునందినులతికప్రసుక్కఁ। జేయుచున్నదిమేమేమిసేయఁగలము ౧౩౯.

ఉ॥ నిన్నఁడుమాపురంబునకునేఁడుకమీఱఁగవచ్చియున్నఁడో।
పన్నుగఁబంతగించినృపభర్మకరంబులఁగట్టియున్నఁడో।
కన్నియకోర్కెదీరనలకాస్తుభధారినిగూడుచున్నఁడో।
కన్నులకర్వుదీరనిఁకఁగౌఁతుకమేమికగాంచుచున్నఁడో ౧౪౦.

క॥ అనిచెలులుచెప్పసత్యం। గనుగొని రాయంచచానకరుణన్ బలికెన్।
వినవమ్మనీదుకోరికెఁ। దనరఁగ నేఁదీర్చ నేస్తుఁడిక్షణముకొమ్మా॥ ౧౪౧.

వ॥ అది యెట్లంటేని. ౧౪౨.

చ॥ వనజదళాయతాక్షివినువారకద్వారకవాసభూషమా।
కనికమునందనందనునియంచిలమేముధరాతలంబునన్।
చనరువివిచిత్రముల్ గనిముదంబునవచ్చుచువద్దమీఱని।
వనమునవిన్నఁజూచితిమివానిరినీకథవింటిమంతయున్॥ ౧౪౩.

క॥ ఓచెలినీచక్కఁదనం । బీచక్కెరవింటివానియెగుపుగా నడిమిన్ ।
ఆచుక్కలదొరపోడిమి । నాచక్రధరునకుఁ దెల్పియనువుగఁ దెత్తున్ ॥ ౧౪౪.

క॥ కనవమ్మనన్నుఁ గన్నుల । వినవమ్మానాదుమనవి వేడుక మీఱన్ ।
మనవమ్మకొమ్మ నెమ్మదిఁ । జనవమ్మా సౌధమునకుఁ జక్కని బొమ్మా ॥ ౧౪౫.

వ॥ అనిపలుకుచున్న నమ్మరాళాంగన పలుకులు చెవులకుఁ గప్పురంపుఁబలుకులై గులుకు నక్కలికి చెలుకువిలుకానిములుకులవలననులుకక రాయంచకలికి నుద్దేశించి యిట్లనియె. ౧౪౬.

గీ॥ ప్రాణదానంబు కన్న నుబ్బబలమైన । దానమిట లేదుటందురు ధన్యులకట ।
నందనందనుఁ దోడ్తెచ్చియందముగను । నన్నుఁ బ్రతికింపుము మరాళి సన్నుతాంగి ౧౪౭.

గీ॥ వెన్నుఁడిటకునచ్చి వేష్కనీశుల్కంబు । నిర్వహించిమించి నేర్పుమీఱ ।
నన్నుఁ గౌఁగలించినా వెతఁదీర్చునా । బమ్మవారువంపు ప్రసంగంధి ॥ ౧౪౮.

వ॥ అనిపలికి బాష్పపూరితనేత్రయైన నయ్యంతింగాంచి హంసాంగన యిట్లనియె. ౧౪౯.

క॥ మాటికిమాటికిమఱినా । మాటలువినివచ్చివృషభమణులఁదిగిచిము ।
మ్మాటికిబంధిం మెనువల । మాటునమ్మృగములనుబట్టుమాడ్కిం జెలియా ॥ ౧౫౦.

చ॥ కలికిరొ మేరమీఱుమరుకమ్మనితేనియలొల్కుముల్కులన్ ।
జిలుకలగుల్కుపల్కులశశిద్యుతికాకలగాలిధాకలన్ ।
దలఁకకుమమ్మ నిన్ను హరితెద్దియుఁ గౌఁగిటఁ జేర్చునమ్మ నా ।
పలుకు నిజమ్ము కొమ్మ రొ శుభమ్మొనఁగూడును నమ్ము నెమ్మదిన్ ॥ ౧౫౧.

వ॥ ఇవ్విధంబున నమ్మధురాధరనూరడించి యమ్మరాళమిథునంబు ఖేచరమార్గంబున ద్వారకానగరంబునకుం జనియె. అంతట సత్యయుఁ జెలులం గూడి మరాళీవచనంబులఁ గించిదాగతధృతియై సౌధాంతరంబునకుం జని చిత్తంబు కాంచనాంబరాయత్తంబు గావున జిత్తజవేదనాక్రాంతయై యున్న కూఁతుం గని తల్లిదండ్రులు విషాదపంచహ్యమానహృదయులై యిది యేమని తొయ్యలులనడిగిన నచ్చెలియలధీరచిత్తలై తద్వృత్తాంతంబంతయు నుడివిన నా రాజమహిషి యొయ్యనఁ దనయనుద్దేశించి యిట్లనియె. ౧౫౨.

గీ॥ అందరానిపండ్లకాసించు తెలియని । వారపగదిఁ గంసవైరికొఱకుఁ ।
జింతనొందియిటులుకంతువేదనఁ జెంద । నాయమట వెనీకునలిన నేత్ర ॥ ౧౫౩.

వ॥ అనుతల్లిపలుకులకు నప్పల్లవాధర డిల్లఁబోయిన నవ్వసుమతీ వల్లభుండు గాంచి యిట్లనియె.

గీ॥ తల్లినీహృదయంబంత దల్లడిల్ల । నేటికమ్మము రాంతకుండిటకు వచ్చి ।
ముదముమీఱ స్వయంవరమునను నిన్నుఁ । బెండ్లియాడు విధంబు నేఁ బ్రేమఁదలఁతు ॥ ౧౫౫.

క॥ ఈవిధమునఁ గోసలధర । ణీవల్లభుఁడూరడించి నేర్పునఁ గూఁతున్ ।
శ్రీవిభుసందర్శనమును । భావింపుచునుండె జనకపరిబృఢుపగిదిన్ ॥ ౧౫౬.

వ॥ అంత. ౧౪౭.

గీ॥ రాజహంసలు స్వారికా రాజధానిఁ । జేరినగమీఁటిమురవైరిచెన్నుమీఱు।
నిష్కుటాభ్యంతరాంచితపుష్కరిణుల । నిండువేడ్కనువిహరించుచుండెనంత॥ ౧౪౮.

క॥ అప్పుడు గ్రీష్మసమాగమ । ము ప్పెనుజగమ్ముదువ నెండలుప్పతిలంగా।
నప్పతిదిగ్వాతంబులు । నుప్పనవీవంగ నగ్వగులుతల్లడిలన్॥ ౧౪౯.

వ॥ మఱియును. ౧౫౦.

ఉ॥ న్యాసములయ్యె యామినులనూనములయ్యెఁ బగళ్లు తాపసం।
ధానములయ్యె నెండలతిదారుణశీలములయ్యె గాడుపుల్।
మ్లానములయ్యె జంతువులుమల్లెలుజాజులుకొల్లలయ్యెను।
న్యాసములన్ బ్రపాంచితములయ్యెను రాజపథంబుల త్తతిన్ ౧౫౧.

క॥ బాడబవహ్ని జ్వాలల । వేఁడిమి చేజడత నుండి వేసవితఱినిన్।
గాడినియుపరపయోనిధి । వీడినవిట్టూర్పులనఁగ వెలసెన్ గాడ్పుల్। ౧౫౨.

క॥ బలిమిని బశ్చిమవాతం । బులకు నెదుకొనుచుఁ జనెడి ప్రొద్దుహయంబుల్।
అలసట చేనల్లనఁ జన । నలసములై యహములవారెనాసమయమునన్॥ ౧౫౩.

మ॥ సిరిసరిణంబులొత్తఁగను సింసువులింపుగ జోలఁబాడఁగా।
ఎరుసను వేదముల్ విభవవర్ణన సేయఁగ నేత్రపాళులున్।
బరుపడిసద్గుసద్దనుచుభాసిలుచుండఁగ శార్ఙ్గి క్షీరసా।
గరహితశేషతల్పమునఁ గామ్యమునన్ బవళించెన త్తతిన్॥ ౧౫౪.

వ॥ వెండియు. ౧౫౫.

మ॥ కులుకుచుఁ జల్వపందిరులఁ గొమ్మలు పాంథులకున్ బ్రియంబుగా।
విలసదుసీరవాసనలవిశ్రుతశీతలతోయధారలన్।
సలికుచనాగిరాలవణసారమనోహరగోరసంబులన్।
సలలితశర్కరాంబువులసౌఖ్యముఁ జేయుచునుందు రెప్పుడున్॥ ౧౫౬.

వ॥ అట్టిసమయంబున. ౧౫౭.

ఉ॥ సారసకేళులన్ గులుకుసన్నపుఁజేలములన్ మనోజ్ఞపా।
టీరజలంబులన్ రుచిఘటించుసుభోజ్యములన్ విడెమ్ములన్।
సారసరమ్యపేయములసారసశయ్యలసాంద్రచంద్రికా।
సారములన్ బ్రియంబెసఁగ శౌరి సుఖించుచునుండెనయ్యెడన్॥ ౧౫౮.

వ॥ ఇవ్విధంబున భీష్మంబైన గ్రీష్మంబున విలసిల్లుచు వెండియు. ౧౫౯.

సీ॥ నందనవనమునఁ జొక్క నాఁడుక స్వేడఁ గూడియా రామవిహరణం బాచరించి।
కాసారకేళిసౌఖ్యంబు గాఁగావించి వలి పెంపుఁ బచ్చని వలువఁ దాల్చి।
నుదుటఁ గస్తురిబొట్టుఁ గదియించి నెమ్మేనఁ బన్నీరు పాటీరపంకమలఁది।
విరిజాజిగొజ్జంగివిరులసందిరుల చేమరువంపుదళ్లి చే నొఱపు విూఱు।
పారిజాతమహీరుహపరిసరమున । రత్నకాంతులవిలసిల్లురమ్యభిత్తి।
వేదికోపరితలమున సాదరమున । వలరుచుండెను సుఖాసీనుఁ డగుచుఁ బేర్మి॥ ౧౭౦.

క॥ సరిధరుఁడు నరునితోసా । దరముగఁ బరిహాసములను దనరారుచు సుం।
దరవదనేందుమాధ్యస్మిత । దరస్ఫురదిక వెలుఁగు విూఱఁ దత్సమయమునన్॥ ౧౭౧.

క॥ ఆరాజహంసి మెల్లన । శ్రీరాజీవాయతాక్షుచెంతకుఁ జని లక్ష్మీ।
రాజమానవిజయమ । హారాజ యటంచుఁ బల్కి యవనతతనువై॥ ౧౭౨.

ససమయూరవృత్తము.

పన్నగశయ్యాసనపట్టణములెల్లన్ । బన్నుగఁ గనుంగొనుచు వచ్చు నెడలీలన్।
గన్నుఁగవ చల్లగనుగన్న విధమెల్లన్ । విన్నపము సేయుమిము నేఁడెదనుజ్ఞన్॥ ౧౭౩.

వ. అని రాయంచమించుబోణి విన్నవించిన వెన్నుండు సంతసించుచు వెండియు. ౧౭౪.

క. రమ్మని హంసాంగనను గ । రమ్మున మైనిమిరి సాదరమ్ముగఁ గనితో।
రమ్ముగఁ దెల్పుమనఁగనుగ । నమ్మాహారితోడ నమ్మురాళి ముపల్కెన్॥ ౧౭౫.

మత్తకోకిల॥ దేవదేవ జగంబునందొగిఁ దేజరిల్లువినోదముల్।
భావముల్లసిలంగఁ జూచుచు మిభాసురంబుగఁ గోసల।
క్ష్మావిభుప్రముఖావనంబున సంచరించుచు నొక్కచో।
భావజాతుఁగ సమ్మితాంగని భామనొక్కతెఁ గాంచితిన్॥ ౧౭౬.

వ. ఆచెలియ చెలువమునఁ జెలువపారకైనఁ దలుపఁ బలవిగాదనను నాతెలిసినవిధంబున వర్ణించెద
వినుము. ౧౭౭.

క నీలమ్ములు లలితాంబుజ । నీలమ్ములు నెలఁతకురులు నిరుపమ దమనీ।
వాలమ్ములు మరుకైదువ । వాలమ్ములు తలఁచి చూడ నను దేవసుతా॥ ౧౭౮.

క॥ ఎన్నదురు హరాయలుపలుకుచుగి । నెన్నదురంపలుగ్ధరన్ పరేందువుపగిదిన్।
బన్నుగ బొమలుధనుస్సం । పన్నములై తనరు నతికిఁ బంకజనయనా॥ ౧౭౯.

క నమ్ములు గగనమ్ములు మద । నమ్ములు నీలాబ్జపిలసనమ్ములు ఘనవిూ।
నమ్ములు తెఱవవిపులనయ । నమ్ములు నమ్ముము నిజమ్ము నలినదళాక్షా॥ ౧౮౦.

క॥ అక్కపలయమలాదసనమునఁ । జెక్కులు మరునద్దములను జెక్కులు పట్టున్।
జక్కనిసంపెఁగ మొక్కప । ముక్కనవిలసిల్లు నాపముద్దియకు హరీ॥ ౧౮౧.

క॥ పగడాలతోడ నెపుడుం । జగడాలాడించు మోవి జగదాకారా।
మగరాలను గలుగన్నిగ । నిగరాలుగఁజేయునౌర నెలఁతరదనముల్॥ ౧౮౨.

క॥ అమ్మగువతళ్కు గుల్కెడు నెమ్మొగము హసోయల్ పదింప నేఁదగుదు నెపాం।
దమ్ములబృందమ్ములచం । దమ్ములఁగ నియపహసించు గానవమ ఘనా॥ ౧౮౩.

సీ॥ కలవాణివగగుల్కు గళదరమ్మునకు మంగళరేఖలపసంజికల్లు గాఁగ।
లసమానమృదుబాహుబిసనాళములకును బసఁబూనికరములబ్జములు గాఁగ।
బంగారుపలిగుబ్బబొంగరమ్ములకు నాప్పైమొనల్ మొల్కు లసగిరిగాఁగ।
నలరారునూగారుకలువతీఁగెకు నాభిగంభీరమైన పుష్కరిణి గాఁగ।
లలితలావణ్యలహరికి వళులుపేరుదు । రూర్మిసైకతములు గాఁగ నువిదమేని
లతకు వయసు వసంతకాలంబుగాఁగఁ । దెలుపశక్యంబె యా చెలి చెలువమహహ॥ ౧౮౪.

క॥ కలమవి శేషోదరములు । గలను హిమతిరస్కరించు కౌతుకమునఁబి।
క్కులరిమవివరింపఁగఁ । నాక్కులచహినిరసింపఁజాలుఁగళికినఖంబుల్॥ ౧౮౫.

క॥ ఆజడనల రెడుసోయగ । మాజిగి కెమ్మోవిసొగసు నాకౌనుహసోయల్।
ఆజిగిబిగి చన్గవ నాలు । గాంజనరాల్ రతనమా దయచ్యుతకటికే॥ ౧౮౬.

సీ॥ పగడాలజగడాలజగడాలగెల్చునాపగదీవికెమ్మోవి చిగురుఠీవి।
అళిగుంపు బలుసొంపుఁదులకింపు చెలువంపు గురువంపు విరులింపు కురులపెంపు
నెలబాలు మైమేలు గలజాలు నగఁజాలునును సొగసు నుమీఱు నుదురుతీరు।
అలకుండములవంటి యులఁగిందు గాఁజేయు బలువాణిగు చిపాళి చెలిగవాళి।
అద్దములనిద్దపునిగలురద్దు పఱుచు । నక్కువలగూఁడితినును పెక్కు చెక్కు టెక్కు।
జక్కవల చక్కఁదన మెల్లఁజిక్కుపఱుచు । నిబ్బరంబగు పిబ్బెంబు గుబ్బలోయ॥ ౧౮౭.

తే॥ కలువలగుంపు చేఁగనముక స్బొమలంగిజ కార్ముకంబులఁ।
నళినదళంబులఁ గనులు నాసిక కాంచనసూనలక్ష్మిచేఁ।
గులుకుకుచంబులఁ గుసుమగుచ్ఛములఁ బులినంబుచేఁగటిఁ।
దలిరులఁబోణి పాదములుతన్వికిఁజే సెవిధాత నేర్పునఁ॥ ౧౮౮.

క॥ ఘనసారసఘనమాటను । ఘనసారసఘనత నెందె కామినికదముఁ।
ఘనసారసహితములగుచు । ఘనసారసహితములయ్యెఁగామినికునముల్॥ ౧౮౯.

క॥ దరమాకౌనుసుధాసో । దరమా కెమ్మోవి నాభి దరసుందరమా।
దరమాగళమిక కాకో । దరమానూగారు నెన్నఁదరమా విధికిఁ॥ ౧౯౦.

సీ॥ మృగరాజమధ్యమ మెఱుఁగు పాలిండ్లతోఁ గరికుంభయుగము రావెఱచియుండెఁ।
శుకవాణి రతనంబు సొబగు బల్ గుదురుతోఁ సరిపోరక రకబీజములు బెదరి।

తుహినాంశువదనకన్దోయితోరంబుతోఁదమ్మిరేకులుదొమ్మిదలఁచిబెదరి।
గజరాజయానపాన్గరిమశేఁదొడలతోఁకదళికల్ భీతిల్లికడినమనఁగ।
మరలియవిమార్దవమునెందెఁబోరలడాగ । జలములను గ్రుంకెమిగులచంచలములయ్యె।
నారయావిరబోణియొయ్యారమెవరి । కైనవివరించిచూడజగానఁగాను। ౧౯౧.

ఉ॥ జలమునఁగంజముల్ నిలిచిచంపకమాశ్రమవాసియైనగాం।
నలమువనుండికెంజిగురుచాలతపంబొనరించికాదెయా।
నెలఁతవిశాలరమ్యమృదునేత్రనసాధనసామ్యమొందద।
నిశ్చలనియమాభిరాములకసాధ్యములున్నవెముజ్జగంబులన్। ౧౯౨.

క॥ మిన్నగుమొగమలనెలకలి । మిన్నగునగురామొఱుంగుమెయినడుమునకున్।
మిన్నగురులెన్నఁగురులెల । మిన్నగుఁగాదనఁదగుంజుమీకదళికలన్॥ ౧౯౩.

భంగ్యంతరకల్పన.

క॥ మిన్నగుమొగముననెలకలి । మిన్నగురాదానికానుమెరుగఁబువ్వలెన్।
మిన్ననవామిన్ననవా । మిన్ననగాంజాలనేనిసుప్పానెఘరన్। ౧౯౪.

క॥ తమ్ములనెదురించునువా । దమ్ములఁగన్దోయిచెలిరదమ్ములుగనం।
దమ్ములుకుందమ్ములకుం । దమ్ములనన్ బలుకఁగాఘుసమ్మెదనెదవ్వున్. ౧౯౫.

చ॥ వదనముసోముఁగాంచిమదివారిజముం చుఁదలంచితెక్కులన్।
గదలిచిమేనువంచిదుముకందమకించిమగించిముండటన్।
గుదురగునాసికాకనకకుట్మలముల్ వెసఁగాంచినిల్చుతు।
మ్మెదలాయనంగముంగురులుమించెలతాంగిలలాటసీమపై। ౧౯౬.

క॥ శ్రీచతురతవీపమరున్ । శ్రీచతురతవీనులందుచెలువొందుకడున్।
మోచారసమమనురిమ । మోచారుతరంబుపల్కుమునితికనఁదగున్। ౧౯౭.

గీ॥ నెలఁతనిద్దంపునెమ్మోమునిందునందు । మనకునెలనవ్వువెన్నెలమచులఁదనరఁ।
గన్నుఁగల్వలువికసించివెన్నుమీఱ । లలితకర్ణంబులనుశ్రీవిలాసముమరె. ౧౯౮.

గీ॥ కలికినెమ్మేనుగ్రొమ్మించుతళుకున్న । మిన్నవన్నియకలదనియెన్నఁదగును।
మరుదివాణంబుహొయలునేమఱుఁదలంపఁ । గనకపలదళతళతళగరిమనాంచు ౧౯౯.

క॥ రాయంచనుగనుఁగొనిభళి । రాయంచనునానిసుందరపుయానమదే।
రాయెంపఁదగినసాగసరి । రాయంచపజీరుచిత్తరపుబొమ్మలలోన్॥ ౨౦౦.

గీ॥ ఇట్టినెమ్మేనిహొయలుచేనింపుమీఱి । చెలులనడుమునఁజెలువొందిచిన్నబోయి।
సూనబాణశరాహతిసోలిమిగుల । వగలఁబొగలుచునున్నయామవఁజేరి॥ ౨౦౧.

గీ॥ చూచి నానెమ్మనంబునఁ జోద్యమంది । చెలులచెంతకుఁ జని వారిఁ జెలిమిఁ జేసి।
యీనెలంతకుఁ దలిదండ్రు లెవరు మఱని । పలుకఁ బడుటకుఁ గత మేమి తెలుపుఁ డనిన॥ ౨౦౨.

వ॥ అక్కన్నియ లిట్లనిరి. ౨౦౩.

క॥ ఈకాంతామణి కోసల । భూకాంతుని తనయ దేవముని నాథుఁడుల।
శ్రీకాంతు విధముఁ దెల్పఁగ । తీకాంతు నివశము నొందిదీనతఁ జెందెన్॥ ౨౦౪.

వ॥ అని పలికి యమ్ముద్దియలు నీ వెక్కడనుండువాఁడ వీ నిష్కుటంబునకు వచ్చుటకుఁ గారణం బెయ్యది యని యడిగిన ద్వారకాపురంబున గిరిధరుని పారిజాతపరిమళలసదుపవనంబున విహరించువాఁడఁ గార్యవశంబున మానససరంబునకుఁ జని మరలి వచ్చుచు మీవనంబుఁ జేరితి నని విని యమ్మానవతీమణి నన్నుఁ జేరం బిలిచి దేవా భవదీయసౌందర్యవైభవాతిశయంబుల నావలన విని మగిడి మనోభవాక్రాంతయై చింత నొందు నక్కాంతారత్నంబు నే నూరడించినఁ గొంతదడవునకుం దెప్పిరిలి మీపైఁ బ్రేమ ముప్పిరిగొన నప్పల్లవాధర మెల్లమెల్లన నిట్లనియె. ౨౦౫.

క॥ నాజననము నాకీర్తి ర । తీజానిపరాక్రమంబు తేజము మీఱన్।
రాజీవాక్షులు తెలుపఁగ । రాజిల్లుచు వింటిఁ గాదె రాయంచచెలీ॥ ౨౦౬.

గీ॥ నందనందను పాదారవిందములకు । మ్రొక్కి నావిధ మెల్ల నుజక్కఁ దెలిపి।
మోహజలనిధిలోఁ బడి మునుఁగుచున్న । నన్ను దరిఁ జేర్పు రాయంచవన్నెలాఁడి॥ ౨౦౭.

వ॥ అని గద్గదగళయై నలినలోచన కొన్ని వాసనంబులు విన్నపంబుఁ జేయుమని పల్కె నవివిన నవధరింపుము నందనందన భవదీయకల్యాణగుణ సౌందర్యవైభవాతిశయంబులు విన్నది మొదలు జగన్మోహనకరంబైన తావకరూపంబు కన్నులఁ గట్టినవిధంబునఁ గనుపట్టియుండి డెందంబు భవత్పాదారవిందంబులయందు మిళిందాయమానమై యున్న దీపున్నమ వెన్నెలకాకకుఁ, జలునతెమ్మెరపికకు, శుకపికశారికాకేకినముదస్వనంబుల ధాటికకు, నులుకుచున్న నాపై మరుండును దండెత్తి సూనశరంబులఁ జెండాడుచున్నవాఁడు కావున యుష్మద్దర్శనం బహర్నిశంబుఁ గోరుచున్న నానేత్రచకోరంబులకు నీదు వదనేందుమండలం బాహ్లాదకరంబు గావించి స్వీయాదరపూర్వకంబుగా నామనోరథంబు సఫలంబుఁ జేసి నను౦ జేకొనంగవలయును. ౨౦౮.

మ॥ కమలాలింగితమై కడుం జెలఁగు నీగాత్రంబు నేత్రంబులన్।
భ్రమనీరం బొడఁగాంచి కౌఁగిటను సంరంభంబునం జేర్చి నీ।
కమనీయాధరబింబసంభృతసుధన్ గాంక్షించి కైకొన్న నీ।
సుమబాణంబుల వేఁడి పోడిమి యణంచున్ శూరవంశాగ్రణీ॥ ౨౦౯.

గీ॥ సదయ నాదుమనవి మది నుంచి వేంచేసి । వృషభములను గట్టి వేడుకలర।
నన్నుఁ గౌఁగిలింపకున్న బ్రాణంబులు । విడుచుదాన నిజము విమలచరిత॥ ౨౧౦.

వ॥ అని కోసలరాజనందన పుత్తెంచిన సందేశంబులు నా రాజమరాళాంగనయు నంగజజనకునకు విన్నపంబుఁ జేసియుఁ దగినయర్థం బెద్ది యది సేయ నవధరింపు మనినఁ బుండరీకాక్షుండు వెండియు. ౨౧౧.

హెచ్చగు సౌధభాగములనింతులఁ గౌఁగిటఁ గుచ్చి మెచ్చుచున్
బచ్చడములఁ సుంగునిడి భాసిలుచుండెను వెన్నుఁడయ్యెడన్॥ ౯.

ఉ॥ శ్రీహరి ధర్మహర్మ్యములఁ జెన్నలరారఁగ నయ్యెడన్బయో
వాహవినిర్గళద్గుబగుబధ్వనులన్వెఱఁగొంది భీష్మిస
మ్మోహముమీఱఁగుల్కుకుచమ్ముల్గదియించి కవుంగిలింపఁడా
నాహరిణాక్షికైకొనెనయత్న సమాగతసౌఖ్యమొందుచున్. ౧౦.

వ॥ ఇవ్విధంబునఁ గృష్ణుండు రుక్మిణీ సత్యభామాదినితంబినీమణిమనోరంజనీయచరిత్రుం డయ్యును దక్షిణనాయకుండు గావున నాగ్నజిత్తియుం దెందంబున నిలిపి తదీయ సౌందర్యాతిశయంబుఁ దలంచి వలచుచు వెండియు. ౧౧.

సీ॥ వగగుల్కు కారొగ్గు గుల్వన్నియయ్యె పెగాంచిమగువవేనలి హొయలుదలంచి
తీరైన కొమ్మించు తీవచందముఁ గాంచి మెలఁత మేనికడాని మెఱుఁపుదలఁచి
తనరారుదేవేంద్రధనువు పొందికఁ గాంచి పొలఁతుకనునుబోఁగ బొమలుదలఁచి
సరసమైచెన్నొందు కరకసందఁ గాంచి వెలఁది సన్నని నవ్వువాలు దలఁచి
చెలఁగు గేదంగిపువ్వులకలిమిఁ గాంచి తరుణి నెమ్మేయి ఘుమ్మను తావిఁదలఁచి
మదనవశగాంతరంగుఁడై మదనగోప బాలుఁ డెగ్గడి నివిరాళిఁ జాల నొంది॥ ౧౨.

వ॥ మఱియును. ౧౩.

చ॥ మదవతులీరొడన్బ్రియులమంజులకేళులఁ గూడియుండియున్
మదనశిలీముఖప్రచలమానసులౌదురయోగవిప్రలంబ
భదశను జెందికోసలన్నపాలతనూజనియాసయోదసఁ
పదఁగనితాళలేక మరుబారికి నేమనితల్చుచుండెనో॥ ౧౪.

వ॥ అని వితర్కించుచుఁ గాంచనచేలుం డారాయంచమించుబోణిని రావించి యిట్లనియె.

క॥ నీవలరుచునలకోసల భూపాలయాధిపునితనయుఁ బోడగ నిడయతో
నా వెలఁదితోడ నిట్లను మావెలివావు నపురతనమూమ్మదురవమా॥ ౧౬.

క॥ నా పైనీవలపుఁ దలఁచి నీపైదయ కిసలయింప నేర్పుదలిర్పన్
నేపైనమై చెలంగఁగ నా పైవర్గాగమంబు తద్దయు మెఱపెన్॥ ౧౭.

వ॥ అని మఱియును. ౧౮.

క॥ వచ్చుశరవాగమంబునఁ జెచ్చెరవృషభములఁ బట్టి చిదిమెదన్న ఫులన్
దెచ్చెదనిను గౌతుకమున నచ్చెరువందగను జదలనమరగణంబుల్॥ ౧౯.

వ॥ కావున. ౨౦.

గీ॥ అంతపర్యంతమీరతీకాంతు చుఱుకుఁ జిలుకులకు గాలివీకకు జిలుకకులుకు

పలుకులకునుల్కవలదు నీపల్కు నిజము । గాఁగ నమ్ముము నీరజాసక మాలనయన॥ ౨౧.

వ॥ ఇక్కరణి నక్కోమలికిఁ జెలియంబలికి పెకు తెఱంగుల నక్కులలయానయన నూఱడి ర్పుచు, నీవక్క డనుండుమని పక్కిదొరుఁ డనిపిన నమ్మురారిశాంగన తనవిభునితోఁ రంగువిూఱి కోసలనగరంబునకుం జని విపులసౌధాంతరాళంబునఁ జెలులనడుమ మురిహారునిఁదలంచి, మరుశరంబుల వెగడొంది నిశాగమనంబుఁ గోరుచున్న నచ్చెలియెదుటఁ బ్రాలినఁ జెన్నొంది గిన్న ఖేదనందంబున నత్యద్దిగ్గనలేచి హంసాంగన నెదుర్కొని, మార్గాయాసోపశాంతి కరవననరచనలఁ గుశలంబడిగి గారవించిన, నారాయంచపువ్వుబోఁడి కాంచనాంబరుం డు వివరించిన సందేశంబు విన్నవించిన, నమ్మించుబోఁడి సంతసించి ఘనాగమనంబునకుఁ జాతకంబుకరణిఁ, జంద్రోదయంబునకుఁ జకోరంబుపగిది, హృదయంబున నందనందను నాగమనంబుఁ గోరుచు, విరాళినొందుచు, మరాళవచనంబులమగిడి ధైర్యంబు నుందుచు విలసిల్లుచున్న సమయంబున. ౨౨.

క॥ శరదాగమముప్రపేమరెన్ । శరదాగమమట్లఁ గనిక్స్రిసన్నతి చెలఁగెన్।
శరఘులపలెఘూర్ణిల్లుచు । శరగులతోఁ రాజులవనిచరులై రకేసున్॥ ౨౩.

వ॥ మఱియును. ౨౪.

క॥ నవరాత్రములందునరా । సవరిపుమందిరములందునవ్యావి శేషో।
త్సవములుసలుప్రుచు నేత్రో । త్సవములవర్తంతురిపుడుతద్దయుభక్తుల్॥ ౨౫.

ఉ॥ ఆసమయంబునన్ జలరుహాక్షుఁడునిద్దుర మేలుకొల్పుపై।
ద్మాసతితోఁ బయోజలధిమధ్యమునందుఫణీంద్రశయ్యపై।
భాసిలుచున్గిరీశవిధిపాకరిపుప్రముఖామరోత్తముల్।
వాసిగనన్నుతించికొలువన్విలసిల్లుచునుండెవేడుకన్॥ ౨౬.

క॥ పద్మాకరములువిలస । త్పద్మాకరతన్వహించితనరెనుచారా।
సద్మాభ్రముశుభ్రచికా । సద్మాభ్రంబై చెలంగ శరసతపు గులన్॥ ౨౭.

క॥ పులినములు మెల్ల మెల్లన । పాలుపునఁగాన్పించెనదులఁబోలఁతులుమరుకే।
ళులఁబ్రియులఁగూడిపిగ్గున । నలరఁగ జఘనములకరణి నాసమయమునన్॥ ౨౮.

క॥ అంబుజలోచనుఁడాసమ । యంబునఁగోసలతనూజపతిముదమునఁజి।
త్తంబునదలఁచికిరీటివి । తంబునఁబరిజనముతోడఁడెనరుచు వెడలెన్॥ ౨౯.

సీ॥ కాంచనమకుటసంఘటితరత్నచ్ఛాయపవికోటికాంతిఁదిరస్కరింపఁ।
గస్తూరికాతిలకప్రభాస్యముసాంకచంద్రబింబస్ఫూర్తిఁజౌకళింపఁ।
బీతాంబరప్రభావృతశరీరద్యుతివిద్యుదంచితమేఘువిధముఁజూప।
రమణీయచందనరాగంబుసెప్పెనఁజదలసంధ్యారాగసరణిఁదోఁప।

క॥ సెలయేరులమడువులఁగని । పలుపోఁగ్గుచు గాలములనువడిగానిడుచున్ ।
చెలరేఁగుచుఁగొందఱుమీ । నులఁబట్టిరిజలజలోచనుఁడుచూడంగన్ ॥ ౫౭.

వ॥ వెండియు. ౫౮.

గీ॥ బైరిడేగలకొంగలబలమునించి । జేసిడేగలకాఁజులబీరమునించి ।
మఱియుసాయినిడేగలసురెపములను । జూపుచుండిరికొందఱుత్సాద్యముగను ॥ ౫౯.

వ॥ ఆసమయంబున. ౬౦.

క॥ అటఁజనిశాశాధ్వుఁడుది । క్కటములవరబెదరిపనమృగగణములుమహా ।
త్కటముగఁబరవపముత్కట । పటహములనుసుక్కమాటువడిఁజరిపించెన్ ॥ ౬౧.

వ॥ అప్పుడు. ౬౨.

క॥ గిరిదరులవలనవెడలిన । గిరులంగనిజాగిలములఁగేరుచుమాయన్ ।
గరమరుదుగనవినవిసూ । కరములమర్త్యులఁబట్టికఱచినెలంగెన్ ॥ ౬౩.

క॥ కిటియొకటివెఱవనిలునిలు । మిటుతిరుగుమటంచుఁబలికియెదిరినదానిన్ ।
దిటముగఁగనిసందీశెను । నిటలమ్మునఁబొడిచెనొకఁడునేరుపుమీఱన్ ॥ ౬౪.

క॥ ఒక్కపులిపైనిదుముకఁగఁ । జెక్కుచెదరకనుదుపాకిఁజేఁబూనికడున్ ।
గ్రక్కునసేయఁగఁబడెనది । డొక్కలవియనెంతశూరుఁడోవాఁడకటా ॥ ౬౫.

వ॥ ఇవ్విధంబున మృగయు ఉల్లసిల్లుసమయంబున. ౬౬.

సీ॥ వాలమ్ములఁజమూరువాలమ్ములను ద్రుంచికోలమ్ములవధించికోలములను ।
ఆశుగణమ్ములనాశుగమ్ముల నేసిశరభమ్ములకుఁజూపిశరభయములు ।
కరులసాయకభిన్నకరులుగాఁగావించిభల్లూకములముంచిభల్లములను ।
నమ్ములవనలులాయమ్ములహింసించిమార్గణమ్ములనెంచిమార్గగతుల ।
మఱియుశార్దూలశల్యచమరీతరక్షు । శంబరవృకాదిజంబుకశశకముఖ్య ।
మృగసమూహమునస్ఫటిఖగచయంబు । సంహరించుచువేఁటాడెశౌరియపుడు ॥ ౬౭.

క॥ ఇవ్విధమునఁగవ్వడితో । నవ్వనమునవేఁటలాడిహర్షముమీఱన్ ।
నివ్వటిలిదళముగొలువఁగ । నవ్వలమురిదాల్పుమరలెనటుబహలికతోన్ ॥ ౬౮.

గీ॥ వెన్నుఁడల్లనవల్లనమున్నదిగిన । పటకుటీరంబులకువచ్చిపార్థుతోడఁ ।
బొల్పుమీఱంగమజ్జనభోజనములు । చేసియారాత్రినచ్చటఁజెన్నుమీఱి ॥ ౬౯.

వ॥ ఇత్తెఱంగున నగధరుండు విచిత్రలీలలనలరారుచు మఱునాఁడుసేనాసమేతంబుగాఁ గోనల నగరంబునకుం జనిన హరిరాక ఫణిహారులవలన నగ్నజిద్ధరారమణుండువిని నగరంబు నలంకరింప నుద్యోగించి చతురంగబలంబుతో నెదుర్కొని యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యిట్లని నుతియించె. ౭౦.

దండకము॥ శ్రీమానినీరాజ మానాసునాసీర కార్తస్వరాకార కోటీరకోట్యంఘ్రినానర్ఘ్య శ్రీ
రత్నప్రభాపుంజ రాగాజదంభోజపాదా భవద్దివ్యచారిత్రమెన్నంగ నేనెంతవాఁడన్
హాళీమున్నుదైనందినంబైన సంవర్తకాలంబునం దీజగంబెల్ల నేకార్ణవంబౌచు వర్తింపఁగా
మత్స్యరూపంబుఁ దోరంబుగాఁబూని పాథోధిమధ్యంబునన్ సోమకున్ వ్రచ్చి వేదం
బులం దెచ్చి యీబ్రహ్మకిచ్చి మన్నింపవే! నాఁడు దేవాసురుల్గూడి పీయూష్యాపలాభాభి
లాషంబునన్ వారిధిన్ మందరాగంబుఁ గవ్వంబుగాఁజేసి త్రచ్చంగ నీవద్రిభారంబుఁ
గూర్మంబవై తాల్చి పాలింపవే! దేవకోలాఖ్య చేతన్ హిరణ్యాక్షునిం ద్రుంచి దంష్ట్రాగ్రనా
శంబునన్ భూమిగోళంబుఁ బంకేజకోశంబుగా మోచి లోకంబులన్ గావవే! చిత్రచారిత్ర
నీభక్తవాత్సల్యమెన్నంగ నాపన్నగాధీశుఁడైనన్ సమర్థుండె! ప్రహ్లాదసంరక్షణాయత్త
చిత్తుండవై యుక్కుకంబంబునన్ బుట్టి శ్రీనారసింహాకృతిన్ రాక్షసేంద్రదేహమున్ జీల్చి
బ్రహ్మాదులగ్గింపవర్తింపవే! వామనత్వంబునన్ బూని వైరోచనిం బట్టి వంచించి లోకంబుఁ
దైవిక్రమస్ఫూర్తిచే వాసవాధీనముం జేసి మోదంబుఁగావింపవే! భార్గవాభిఖ్యతన్
గార్తవీర్యార్జునున్ గూల్చి లోకంబు నిక్షత్రముం జేసి యీమేదినిం గశ్యపాధీనముం
జేయవే! రామరూపంబునన్ వార్ధి బంధించి లంఘించి పౌలస్త్యు హింసించి వైదేహినిం
గూడి పట్టాభిషిక్తుండవై పృథ్విపాలింపవే! భూమిభారంబు వారింప బ్రహ్మేంద్రరుద్రా
దులున్ నిన్ను బ్రార్థింపఁగా వాసుదేవుండవై కంససాల్వాదులం గూల్చి లీలాకృతిన్
దాల్చి యీరీతి వర్తించు మీదివ్యకళ్యాణచారిత్రమున్ దెల్పశక్యంబె బ్రహ్మాండభాండం
బునం దేరికైనన్! ననున్ నీకృపావృష్టికిన్ బాత్రునింగాఁ గటాక్షింపవే శ్రీరమా
లింగితాంగా సురారాతిభంగా విహంగేట్తురంగా నమస్తే నమస్తే నమస్తే నమస్తే॥ ౨౧.

చ॥ అనియను రాగపూర్వముగ నాహరి నివ్వినుతించి కోసలా।
వనిపతి తూర్యనాదములు వందిజయధ్వనులుల్లసిల్లఁగా।
మనుజులు సంతసిల్లఁ బురమానవతుల్విరులాలిఁ జల్లఁగా।
ఘనమగు రాజమార్గమునఁ గౌతుకమేర్పడఁ దోడితెచ్చుచున్॥ ౨౨.

క॥ కాంచనమణిమయఘనసౌ। ధాంచలమందిరములందుహర్షముమీఱన్।
గాంచనచేలునినునిచిను। భాంచితచేతస్కుఁడయ్యె నావిభుఁడెలమిన్॥ ౨౩.

వ॥ ఇత్తెఱంగున రమాకాంతుండు నగ్నజిద్ధరణీకాంతపూజితుండై విడిదిఁ బ్రవేశించి విలసిల్లు
చుండె నంత నెలంతలు సుదంతపాలికిం జని చతురవచనంబుల నిట్లనిరి. ౨౪.

క॥ చెలిచెలువంబుగఁ గలుముల। చెలిచెలువుండిటకు వచ్చెఁ జెలిమిదలిర్పన్।
వలరాయని ధాటకుఁగలు। వలరాయని కాకకులుక వలదిఁక [illegible]॥ ౨౫.

క॥ నమ్ముము లెమ్మిఁక లేవచ । నమ్ములు వగగుల్కు భూషణమ్ములు వేడ్కన్
గొమ్మా తాల్పుము మైఁగై । కొమ్మా కలకమ్మునలఁదుకొమ్మా యటులన్॥ ౮౬.

క॥ అనిచిగురుబోణు లిత్తెఱఁ । గునఁబలుకుచు నుండు వేళఁ గోమలికిన్నె
మ్మనమున సిగ్గును సంతస । మును విరహంబును గరంబు ముప్పిరిగొనియెన్॥ ౮౭.

వ॥ అంత హంసాంగన యంతరంగంబున సత్యాంగనారత్నంబుతో నిట్లనియె. ౮౮.

క॥ హరిదర్శనమున కేగెద । హరిణాక్షి నీకటాక్షమలరఁగ సుమ్మున్
గరుణింపుమింక మీకిం । కరులమనన్ గల్కిపల్కెఁ గౌతుక మొదవన్॥ ౮౯.

క॥ నీరక్షీరవివేకము । నారూఢిగఁజేయుమీరలా హరితోనే
తీరునఁ దెల్పెదరో మరు । నారసములకడిమి నణఁచినను దయఁగొనఁగన్॥ ౯౦.

వ॥ అనిన హంసవిలాసిని యాపల్కులాకర్ణించి మన్నించి తనవిభునిన్గూడి నగధరుని పాలికిం జని నాగ్నజితీసందేశంబు విశదంబుగాఁ దెల్పుచు నిట్లనియె. ౯౧.

సీ॥ మున్ను నీచరితంబు విన్నది మొదలుగాఁ బడఁతికి మానసమ్బద్ధముగఁదోఁచె
వలపు మీఱఁగ నిన్నుఁ దలఁచినదాదిగాఁ గలికికి దినము సకృద్రణిదోఁచె
నరయ నీదరికి నన్నంపినదాదిగా వెలఁదికి జాములవ్వేధిగఁదోఁచె
వెలయ నీరాక సేఁ దెలిపినదాదిగా లేమకు గడియలా రీతిఁదోఁచె
నీవు చతురంగసేనతో నేర్పు మీఱ । రాజమార్గంబునను నీపురంబుఁ జేరి
తేజరిల్లంగ వినుమయా తెఱవ కిప్పుడు । నిముసమాజామగాఁదోఁచె నీరజాక్ష॥ ౯౨.

క॥ కావున నావిన్నపమిఁక । భావంబున నునిచి కరుణఁ భావింపుచు నీ
వా వెలఁదికోర్కి సఫలముఁ । గావింపుము వేగ మునను గమలాధ్యక్షా॥ ౯౩.

వ॥ అను మరాళాంగనపల్కు లాకర్ణించి వెన్నుండు మనంబున వివరించి పార్థుని రావించి యిట్లనియె. ౯౪.

క॥ కోసలధరణీవిభుని ని । వాసంబున కేగి సరసవచనరచనలన్
వాసిగ సత్యను మాకై । భాసురముగ నడిగి రమ్ము పాండుతనూజా॥ ౯౫.

వ॥ అని వెన్నుండు పుత్తెంచిన ఫల్గునుండు గర్గానుమతంబున నగ్నజిదాలోకనంబుఁ గావించి పల్లువచనంబుల నిట్లనియె. ౯౬.

క॥ విష్ణుపరాక్రముఁడౌ మా । కృష్ణునకు న్నీదుతనయఁ గీర్తితనయరో
చిష్ణుశరీర నొసఁగి వ । ర్ధిష్ణుఁడవై చెలఁగు వసుమతీపతితిలకా॥ ౯౭.

క॥ యదువీరుఁడు కన్యాశు । ల్కదుఁడని మదిలోనఁ దలఁపకము రాగికిస
మ్మదమున రేపటి విదియ నె । తదియ నొ నీతనయ నొసఁగు ధరణీరమణా॥ ౯౮.

వ॥ అని విజయుండు తెల్పిన వచనంబులకుఁ గోసలనగరవల్లభుండు సంతసిల్లుచు నిట్లనియె.

ఉ॥ తామరసాక్షుఁడచ్యుతుఁడు వారియశోనిధిసర్వదేవతా ।
కామితభోగదాయిమధుకైటభదారణుఁడవ్యయుండుల ।
క్ష్మీమదిరేక్షణావిభుఁడు చెన్నలరారుచునల్లుఁడైనను ।
ద్దామతనెందు నాదుసుకృతంబుకరంబుగఁబొండునందినా ౯౦.

క॥ జన్యావారితునకుసా । జన్యాదిగుణాంచితునకుజగదాత్మునకున్ ।
గన్యాదానముఁజేసిన । ధన్యంబైనాదుయశముతిద్దియు వెలయున్ ॥ ౯౧.

వ॥ అయిన నొక్కసందేశంబు విన్నవించెద నాకర్ణింపుము. మున్ను లక్ష్మీకటాక్షంబున మత్కుమారీరత్నం బుదయించి దినదినప్రవర్ధమానయై విలసిల్లుసమయంబున నిక్కన్యకుఁ దగినవరుండెవ్వండని యాత్తిగతంబున విచారించువేళ నామందను కైలాసశిఖరాకృతిఁ దనరుచు నేడాఁబోతులుద్భవించి బలంబుగనతిశయించి కాపరులనతిక్రమించి పౌరుల బాధింప బలాధ్యక్షులవలన నావృషభంబుల నొక్కప్రదేశంబుఁ బ్రవేశంబుజేయించి రాజన్యులలో నెవ్వండేని వీనిబంధించిన నతనికి నానందన నొసంగెదనని చాటించిన ధరారమణులువచ్చి యా గోవృషంబులఁ జూడంజాలక చనిరిగావున నీజనార్దనుండును బెబ్బులులపగిది నబ్బురంబుగి జొబ్బిలుచున్న నాగిబ్బలయుబ్బణంచి వీర్యశుల్కయగు నానందనన్బరిగ్రహించి నన్నానందింపంజేయవలయునని నతిండునవ్వృత్తాంతంబంతయు శౌరికివిన్నవించి తదభిమతంబు రాజునకుందెల్పిన నతండాభీరులఁబిల్వంబంచి యా వృషభంబులం దెప్పించి నందనందనుని సపరివారంబుగా నచ్చటికిరావించి నగ్నజిద్భూవల్లభుండు శౌరినుద్దేశించి యిట్లనియె. ౯౨.

గీ॥ శౌర్యముంపుమగాఁజేసిశౌరివీనిఁ । బట్టికట్టితివేని నాపట్టినిపుడు ।
నీకొసఁగి పెండ్లిచేసెదనిక్కమనఁగ । నగధరుఁడునవ్వి కాంచెగోనగములపుడు ॥ ౯౩.

క॥ కాంచిననయ్యాఁబోతులు । కాంచనపటధారిపైకిఁగాల్ద్రవ్వుచువీ ।
క్షాంచలములఁజూచుచురో । షాంచితముగఁఱంకెలిడుచు నాడుచునుంటన్ ॥ ౯౪.

మ॥ అతిరూక్షేక్షణుఁడైయదుప్రవరుఁడుక్షాధ్యక్షుగోత్రంబులన్ ।
శతధారాయితబాహుదండములనిచ్చన్బట్టిథట్టింపఁగాఁ ।
గుతలంబల్లలనాడెఁజుక్కలురలెన్గొండల్దలంకెన్సుర ।
ప్రతతుల్పుష్కరవీథినుండియుపరిత్రస్తంబులయ్యెంగడున్ ॥ ౯౫.

వ॥ వెండియు. ౯౬.

గీ॥ అన్నిఁటికినన్నిరూపులై వెన్నుఁడలరి । యాలబోతులపైబాలకేళిలీల ।
నలుపనవివానికొమ్ములశౌరియొదను । బోడిచిగెలిచినవానినమ్మురహరుండు ॥ ౯౭.

గీ॥ బెట్టిదంబుగఁ గొమ్ములఁ బట్టి నెట్టి । ముట్టెలవియంగఁ గొట్టుచు మదిట్టముగను।
దొడరి పిడికిటి పోటుల మెడలు తొడలు । నడుములదరంగఁ బొడుచుచు నడఁచి పట్టి॥ ౯౮.

గీ॥ పగ్గములవానిఁ గట్టిన పద్మనాభు । పైవిరులవానగురిసె నప్సరసలాడి।
రాదరంబున ఫల్గునుండపుడు హరిని । గౌఁగిలింపుచుఁ దనరారెఁ గౌతుకమున॥ ౯౯.

గీ॥ శౌరివిక్రమసౌందర్యసరసచరిత । రూపయౌవనసద్గుణాటోపములను।
గాంచి కోసలవిభుఁడు వాఁ గౌతుకమునఁ । గోర్కెదీరంగఁ బల్కె ను గోపసుతుని॥ ౧౦౦.

క॥ సత్యం బిది ముమ్మాటికి । సత్యను నీకే నొసంగి సంక్రందనసం।
స్తుత్యయశోలంకృతకృతి । కృత్యతఁ బాటింతు నింకఁ గేశవ కృష్ణా। ౧౦౧.

వ॥ అని పల్కి విజయునిం జూచి "శుభస్య శీఘ్రం" బన్న విధంబున నిక్కార్యంబున కాలస్యంబు సేయుక వాసుదేవుని పెండ్లికుమారునిం జేయవలయునని సూచన యొనర్చిన నతండును నృపపుంగవునకు హృదయంగమంబుగా సమంచితభాషణంబుల మంచిదె సంతోషమాయె నని పలికి గోవిందుని నిజమందిరమునకుఁ దోడ్కొనిచని మంగళస్నానం బొనరించి యలంకరింప నుద్యోగించె నంత ౧౦౨.

క॥ దువ్వె నలఁగురులు నున్నఁగ । దువ్వియొయ్యారముగ వైచు తోరపుసిగలై।
క్రొవ్విరిసరు లారంపుగ నిడి । రవ్వలముఱిదాల్పుచిత్తమలరఁగ నింతుల్ ౧౦౩.

వ॥ మఱియును. ౧౦౪.

గీ॥ మంజులకిరీటమలరంగ మకరకుండ । లములు చెలువొంద హేమచేలములు మెఱయఁ।
బునుఁగుజవ్వాజితావులుబుగులుకొనెడు । గంధమలదంగఁ జెన్నొందెఁ గంసవైరి॥ ౧౦౫.

వ॥ వెండియు ౧౦౬.

గీ॥ నిలువుటద్దంబు ముందర నెలకొనంగఁ । దిలకమలికమ్మునను వుంగఁగులుకు దీర్చి।
శివుఁడు రేవెల్గు రేఖఁ దాల్చిన విధాన । భాసిలఁగఁ గట్టి ముత్యాలబాసికంబు॥ ౧౦౭.

క॥ ఈవిధమునఁ గౌంతేయుఁడు । గోవిందునిఁ గూర్మి పెండ్లికొమరుని గాసం।
భావించిన వినికోసల । భూవిభుఁ డాసమయమున ముదమెద నొదవన్॥ ౧౦౮.

క॥ బంగారుగోడలందున । రంగగు లత్తుకనమర్చి రహితోరణముల్।
ముంగిళ్ల నిడి హారంగుగ । శృంగారింపఁగఁ బురంబు సిరి చెలువొందెన్॥ ౧౦౯.

క॥ చెలువలంగనిమను సత్యం । జెలువొంద నలంకరింపఁ జేయుఁడని వన।
ర్వెలఁదులు వల్లెయని । వెలయఁగఁ జనిమగువఁ గాంచి వేడుక మీఱన్॥ ౧౧౦.

గీ॥ మానికపుబొమ్మకొమ్మరమ్మా బిరానఁ । గోర్కెలీడేరె హరి పెండ్లికొమరుఁడయ్యె।
ననుచు వ్రీడావనతముఖి నలిననపుడు । సాంపెసఁగఁ గద్దెపై వసియింపఁ జేసి॥ ౧౧౧.

గీ॥ అప్పుడుముత్తైదువలుశోభనాత్మతలను । దలనుగీలించిదీవించిసలలితముగ।
వేడుకలుమీఱఁబాటలుబాడునంతఁ । జానయొక్కతెసంపంగినూనెఁదెచ్చి॥ ౧౧౨.

గీ॥ కుంతలమ్ములుగదలఁజెక్కులుసెమర్పఁ । గౌనువణఁకంగహారముల్కదునటింప।
ఘల్లుఘల్లనబంగారుగాజులులియ । సలలితంబుగఁదలయంటిసంభ్రమమున॥ ౧౧౩.

సీ॥ కొనగోళ్లదువ్వుచుఁగురులచిక్కెడలించినెఱజాజిగొజ్జంగినీరుఁబోసి।
వడినీరుపాయఁగాఁబిడిచిగొబ్బునవిప్పికదలించినెమ్మేనఁగమ్మపిండి।
యలఁదిపన్నీటనుజలకమార్చిమడుంగువలువచేఁదడియొత్తివన్నెమీఱ।
వలిపెమ్ముఁగట్టిమైఁగలపమ్ముఁబూసిమంజులమైనకంచెలనలరఁదొడిగి।
కీలుజడవైచిపూసరాల్గీలుకొలిపి । లలితభూషణమణిహారముల నొసంగి।
లలనలీరీతిసత్యనలంకరింప । మదనసామ్రాజ్యలక్ష్మినామగువదనరె॥ ౧౧౪.

వ॥ ఇత్తెఱంగున నగరంబునలంకరించి తనకుమారిం బెండ్లికూఁతుంగావించి యజ్జగతీరమణుండు సుముహూర్తంబాసన్నంబయ్యె నాలస్యంబుసేయక విచ్చేయవలయునని తన మంత్రులఁ బార్థుపాలికింబనిచిన నతండును బుండరీకాక్షుని వేదండసమారూఢుంజేసి.

సీ॥ పంచవాద్యంబులుపరిఢవిల్లఁగభూరిభేరికానాదముల్బోరుకొనఁగ।
సరసంపుబిరుదధ్వజంబులుచెలగంగవందిమాగధులుకైవారమొసఁగ।
నాగరుల్పానముల్నయమొప్పఁజల్లంగమహాతాపుదీధితుల్రహివెలుంగఁ।
జందనాగరుదివ్యసాంబ్రాణిధూపితంబై రాజమార్గంబునలరఁద్రోవ।
రానిబలగంబుతోడననూనలీల । వచ్చినగరంబుసొచ్చియవ్వారణంబు।
డిగ్గినెలకొనిరాశౌరిమొగ్గరముగ । నెదురుకొనెరాజునెమ్మదిముదముమీఱ॥ ౧౧౫.

వ॥ అంత. ౧౧౬.

క॥ అడుగులకుమడుపులొసఁగుచు । నెడనెడనప్పఁడమిఁడుదునింపుదలిర్పన్।
గడువేడ్కశౌరిఁదోడ్కొని । తడవునరఁగఁబెండ్లిచవికెదరికిన్జనుచున్॥ ౧౧౭.

గీ॥ గులుకుమగరాలతళ్కుబోదెలనుగప్ప । రాలకంబములనుగెంపురాలపట్టి।
యలకలికిపచ్చరాలతల్పులునుగల్గి । పరిఢవిల్లెడుగొప్పయుప్పరిగనడుమ॥ ౧౧౮.

గీ॥ పలునిగారింపుపనులపచ్చరముక్రింద । నొఱపుమీఱెడుయపరంజియరుగుమీఁద।
నలరుమణిపీఠముననుశ్రీహరివసింపఁ । జేసెనక్కోసలేంద్రుండుచెన్నుమీఱ॥ ౧౨౦.

వ॥ ఇత్తెఱంగున ధరారమణుండు రథాంగధరునినునిచి తనకుమారికను దోడితెమ్మని మించుబోణులంబనిచిన నవ్వేలంతులుసంతసిల్లుచుంజని తల్లిచెంగటమెఱుంగుటీఁగెపగిదివెలుంగుచున్న కురంగనయనంగని బంగరుబొమ్మ వెన్నునకు నిన్నుఁగన్యాదానంబుసేయఁదలంచి

మీతండ్రి నిన్నుఁ బిలుచుకొని రమ్మని మమ్మునని పెననిపలుక సిగ్గును జెలువమ్ము నొంగ
బునఁజెలంగ నక్కన్నియ చెలులవడుమ విలసిల్లుచుపచ్చుసమయంబున. ౧౨౧.

సీ॥ లేఁగొను పైనొక్కలేమ కేల్గీలించి చేడియనల్లనఁదోడి తేఁగ।
కలికియొక్కతె చనుంగవపైనియించుక జారుపైటనమర్చి సరవిరాఁగ।
మగువయొక్కతె కాంతవగగుల్కు మోమునసమరులేఁజెమట చేలమునఁదుడువ।
లలితాంగియొక్కతె లలనకీల్జడఁజారు నేదంగి తీపులఁగీలుకొలుపఁ।
గువలయ శ్రీలవిలసిల్లు కొమ్మచూపు । లంఘ్రులన్నవనీలంపుటంచలనఁగ।
వెలయు సిగ్గును హర్షంబు ప్రేమమాన । సముననెనఁగసతి పెండ్లిచవికిఁజేరె॥ ౧౨౨.

వ॥ ఇత్తెఱంగున నక్కురంగనయనను నంగనామణులు దోడితెచ్చి రథాంగధరుని చెంగట
నిలిపిన. ౧౨౩.

గీ॥ మించు క్రొమ్మించుతీవనుమించు మొయిలు । లీలఁ జనితోడవిలసిల్లు నీలవర్ణుఁ।
గాంచి భూసుర కామినులొత్తుకమునఁ । దగును వీరలకనిమదిఁదలఁచి రెలమి॥ ౧౨౪.

వ॥ అప్పుడు. ౧౨౫.

క॥ కరములఁ గంకణములున । య్యిరువురకున్ బూన్చి పెద్దలింపుగ దీక్షా।
కరులంగావించిరి శ్రీ । కరమని తాపసులు పలుకఁగా మోదమునన్॥ ౧౨౬.

వ॥ అంతఁ గోసలనగరీ కాంతుండు కాంతాసమేతంబుగా శ్రీకాంతు వెంతకుం జని. ౧౨౭.

క॥ గర్గాద్యాది పురోహిత । వర్గము దెమముహూర్తమనుచు వాసిగఁ బలుకన్।
భర్గాదిసర్వసుమన । స్సర్గాంచితు నెదుటనునిచి సత్యను వేడ్కన్॥ ౧౨౮.

గీ॥ లలితకాంచనభృంగారు జలముతనదు । వనితలార్పఁగ హరిపాదవారిజములు।
కనకపుంబళ్లెరంబునఁ గడిగి వేడ్క । గంధమాల్యాదులొసఁగుచుఁ గౌతుకమున॥ ౧౨౯.

వ॥ మఱియును. ౧౩౦.

క॥ మధుసూదనునకొసంగెన్ । మధుపర్కము దివ్యరత్నమయహారములన్।
ప్రథితముగ గోత్రనామము । లుధరావిబుధుల్ పఠింపలోలతనపుడున్॥ ౧౩౧.

క॥ వసురుద్రాదులుగొలువఁగ । వసుదేవునిసుతునికొసఁగె వాసిగఁదనయన్।
వసుధామరులకునభిమత । వసువులునిడిన్నృపతియలరె వాంఛదలిర్పన్॥ ౧౩౨.

క॥ పరిజనులంతఁ బ్రమదసం । భరితులగుచుదంపతులకుఁ బరికింపఁగనీ।
తెరచాలదనుచునవ్వుచుఁ । దెరయొనిచిరి నెలఁతసిగ్గుఁదీరిచెలంగన్॥ ౧౩౩.

క॥ పంచశరుండానడుమను । పొంచికయనఁ ధమ్మికలు వననులు ...
...మించెనసఁజూఱుకుఁజూపులు । మించెనునిరువురిపయిన్ప్రమింపఁగమనముల్॥ ౧౩౪.

క॥ కల్యాణమునరపతిసా । కల్య మెసఁగఁజేయుచుండఁగాఁగామినులా।
కల్యాణంబుగలక్ష్మి । కల్యాణముఁబాడిరపుడుకౌతుకమొదవన్॥ ౧౩౫.

క॥ మంగళతూర్యరవంబుజె । లంగఁగఁసత్యాసతీగళంబునవేడ్కన్।
మంగళసూత్రముఁగట్టుచు । నంగజగురువలరెహృదయమానందింపన్॥ ౧౩౬.

గీ॥ అమరదుందుభిరవగర్జితములతోడ । సురలుసుమవృష్టిఁగురియనప్సరసలాడ।
సరసగాంధర్వగానవిస్ఫురణమెసఁగ । నారదుండాడెమింటవిన్నాణముగను॥ ౧౩౭.

క॥ బంగారుపళ్లెరంబుల । రంగుగముత్తియఁపుఁబ్రాలురహినించిసతుల్ ।
పొంగుచునిరుగెడలందన । రంగస్వారిఁబ్రాలుచెలిశిరంబుననుంచెన్॥ ౧౩౮.

వ॥ అప్పుడు. ౧౩౯.

గీ॥ వనితసరసంపునెఱిగుంపువలనఁజారి । వెలయుతలఁబ్రాలువగఁజూపవింతయయ్యె:
మొయిలుగడనింగివిలసిల్లిముత్తియములు । కుప్పకుప్పలుగావానఁగురియుకరణి॥ ౧౪౦.

పృథ్వీవృత్తము॥ పొలంతులువలంతులైపాదవిసేసలందివ్యఁగా।
వెలందివెఱఁగొందుచున్విభునిమాళిపైనించకెం।
పులంగదిమిరంగునన్బ్రాలుపుమీఱుచున్జారుచున్ ;
జెలంగెఁదనుసంగతిన్నిరులనింద్రనీలాలనన్॥ ౧౪౧.

వ॥ అంత. ౧౪౨.

క॥ హరిహరిణాక్షికరమ్మున్ । గరమునఁగీల్కొలిపిచెలఁగికరమరుదుగబం।
గరుపెండ్లిపీటపైసుం । దరముగవసియించిమురమెదందలికొత్తన్॥ ౧౪౩.

వ॥ అప్పుడు. ౧౪౪.

గీ॥ పడఁతులయ్యెడశుభవేదినిడినపావ । కంబునను వేష్ట్రలాజహోమంబొనర్చి।
రంగలరుకొంగుముడ్లమరంగసప్త । పదములను మెల్లమెల్లనఁగదలినడిచి॥ ౧౪౫.

వ॥ మఱియును. ౧౪౬.

క॥ బంధువులుదెల్పనప్పుడ । రుంధతిదర్శనముఁజేసిరుచిరాకృతియౌ।
గంధేభయానతోడను । సింధురవరదుండుదనరెసిరిచెలువొందన్॥ ౧౪౭.

వ॥ అప్పుడు. ౧౪౮.

మత్తకోకిల॥ రంగుమీఱిమెఱుంగుమించుజెలంగుమేఘముకైవడిన్।
బొంగుచున్హరిపెండ్లిపీటనుబొల్తితోవసియింపఁగా।
మంగళంజయమంగళంశుభమంగళంబనిమానినుల్।
మంగళారతులిచ్చిపాడిరిమత్తకోకిలకీతులన్॥ ౧౪౯.

వ॥ ఇంతియు. ౧౫౦.

గీ॥ వేడుకలరంగమునవైరివిభక్ష్య । చోష్యపానీయభోజ్యవస్తువులఁదనరు।
భోజనమొనర్చెఁగాంచనభాజనముల । బాంధవజ్ఞాతిసహజసంపన్నుఁడగుచు॥ ౧౫౧.

క॥ ఈరీతినాల్గుదినములు । కూరిమిమీఱంగసల్పికువలయవిభుఁడుఀ।
వారకనైదువరాతిరి । నారూఢిగనాగవల్లినటుగావించెఀ॥ ౧౫౨.

వ॥ ఇత్తెఱంగున నగ్నిజిద్ధరాధరముఖుండు సాకల్యంబుగాఁ గళ్యాణంబొనరించి సంతసించి యప్పిరించిజనకునకుఁ గిరీటమకరకుండలగ్రైవేయక హారకేయూరాది భూషణంబులును నానావిధ శస్త్రాస్త్రంబులును మఱియు వినోదోచితవస్తువులనొసంగి తమకు వందనం బొనరించినిలిచిన నందనకుఁ బత్నీసమేతుండై నవరత్నంపుటొడిబియ్యంబునించి పరసాం బరాభరణంబులును గ్రామంబులును నాలమందలును దాసీజనంబులును మఱియు మనో హరవస్తువులు నరణంబుగానొసంగి యాదువృష్ణిభోజాగ్రగణ్యులను సముచితంబుగా సత్క రించి తక్కినపరిజనుల మనోరథంబు సఫలంబుగావించి తననందన నందనంబుగా గోవిం దునికరంబుననునిచి కరుణార్ద్రచేతస్కుఁడై పరికించి యాఘ్రాణించి వెలువొంది వందిమా గధకైవారంబులును భేరీభాంకారరావంబులు నుల్లసిల్ల బంధుసహితంబుగా గోవిందుని ననతిదూరంబుగాననిచి మరలి నిజమందిరంబుఁజేరి దారపుత్రాదియుతంబుగా నానందిం చుచు సకలభోగంబు లనుభవించుచు రాజ్యంబుఁ బరిపాలనంబుసేయుచు సుఖంబున నుండె నంతటవాసుదేవుండు నాగ్నజితిన్బెండ్లియాడి తోడ్కొని చతురంగబలంబుతోఁ గదలి ద్వారకానగరంబునకుఁజేరు నభ్యంతరంబున. ౧౫౩.

గీ॥ మున్నుసత్యాస్వయంవరమునకువచ్చి । బలిమిననిసల్పియాలబోతులకునోడి।
నట్టిరాజన్యవీరులయ్యంబుజాక్షు । విక్రమంబెల్లవినిమదివెఱఁగునొంది॥ ౧౫౪.

వ॥ మఱియును. ౧౫౫.

క॥ తమతమబలములతోడఀ । సమరోత్సాహమునన్నృపతిసముదయములున।
క్కమలాక్షువాహినికిన । డ్డమువచ్చిరిభేరికాదిఢాంకృతులలరఀ॥ ౧౫౬.

వ॥ వెండియు. ౧౫౭.

క॥ వచ్చిబలమ్ములుగదిమిన । యచ్చరులత్యంతవిస్మయమునొందితముఀ।
మెచ్చఁగఁబటుభల్లంబులఁ । గ్రుచ్చియదూత్తములన్నృపులుగ్రుమ్మిరిపెలుచఀ॥ ౧౫౮.

వ॥ అప్పుడు. ౧౫౯.

క॥ బెబ్బులులపగిదియాదవు । లబ్బలుయూథపులఁగదిసియహమహమికలా।
గుబ్బుగసంగ్రామంబుఀ । నిబ్బరముగసల్పిరపుడునేర్పుదలిర్పఀ॥ ౧౬౦.

క॥ ఇరువురబలమ్ములితత్తఱి । శరశస్త్రాస్త్రములరణముసల్పుచునుభయం।
కరనాదమేదురములగు । శరధులవలెఁగలసెనమరసంఘముపొగడఀ॥ ౧౬౧.

వ॥ అట్టిసమయంబున. ౧౬౨.

క॥ కేకయసృంజయశకబాం । హ్లీకాదిధరాధినాథులేకంజయ్యా।
భీకరయాదవసైన్యము । ప్రాకటముగఁజుట్టుముట్టిపైకొనిరి వెసన్॥ ౧౬౩.

క॥ భీకరశరవృష్టిన్నా । ర్వీకృతరణితములఁగటకవిద్యుత్ప్రిభలన్।
స్వీకృతకల్పాంబుధరో । గ్రాకృతులై విమతనృపతులలరఁగఁగడిమిన్॥ ౧౬౪.

వ॥ అప్పట్టున. ౧౬౫.

ఉ॥ పాండుతనూభవుండుతనబాంధవులత్తతిసంతసిల్లఁగా।
గాండివమెత్తరద్దిగిచికల్పకృశానుసమానుఁడైలస।
త్కాండములన్నిగిడ్చినృపకాండములద్దెగటార్చి పేర్చిత।
త్కాండమునన్మదంబెసఁగఁదద్దయునెత్తెను దేవదత్తమున్॥ ౧౬౬.

వ॥ ఇవ్విధంబున విజయునివలన రణంబునఁ బరాజయంబునొంది విమతజగతీరమణులు కాం దిశీకులైనంగని నందనందనుండు పాండునందనుపరాక్రమంబభినందించి సేనాసమేతం బుగాఁజని మధ్యందినంబున నెక్క నదీతీర విరాజమానరమణీయారామశోభితంబగు ప్రదేశంబున వసియించి విలసిల్లుసమయంబున. ౧౬౭.

ఉ॥ ఆలలితాటవీస్థలినహార్యసమీపవిరాజనాపగా।
కూలమునందుఁగ్రమ్మికొనిఘుమ్మనితావులెసంగఁబొంగుహిం।
తాళవిశాలతాళమధుధారలఁగాంచితగీయసేవనా।
లోలతనొందిరాదధికులున్బ్రమదాంచితచిత్తవృత్తులై॥ ౧౬౮.

వ॥ మఱియును. ౧౬౯.

క॥ యదువీరులుమధుసేవను । మదవిహ్వలచిత్తులగుచుమధుసూదనుసం।
పదనెన్నుచునాడుచున । మ్మదమొందుచుగంతులిడిప్రమాదమెనయుచున్॥ ౧౭౦.

వ॥ వెండియు. ౧౭౧.

గీ॥ అక్రమాలాపధావనహాసనగాన । నర్తనవిహారపాతననమనవారి।
కేళులనుబాలలీలలఁగెరలిమిగుల । సంతతానందసంభృతస్వాంతులైరి॥ ౧౭౨.

వ॥ ఇవ్విధంబున నయ్యనీకాగ్రణులు మధుపానసంజాతచేష్టావిశేషంబుల నర్ణవంబులకరణి ఘూర్ణిల్లుచుఁ దౌర్యత్రికాదివినోదంబుల నారాత్రి నచటనివసించి మఱునాడు మురవైరిననుసరించి ద్వారకానగరోపకంఠవిరాజమానోద్యానవనసమీపంబునకుఁ జనుసమయంబున. ౧౭౩.

ఉ॥ కోసలకన్యనచ్యుతుఁడుకూరిమిమీఱఁగఁబెండ్లియాడియు।
ల్లాసమెలర్పవచ్చెననిలగ్గుగఁజారులుదెల్పసజ్జనా।

వాసముద్వారకాపురమువన్నియలూరనలంకరించితా।
భాసురలీలరాముఁడుసబాంధవుఁడైయెదురేగెన త్తఱిన్॥ ౧౨౪.

వ॥ అప్పట్టున. ౧౨౫.

క॥ తనకెదురుగవచ్చినరా। మునిపాదమ్ములకుఁ మ్రొక్కి మురహరుఁడప్పుడా।
వనితామణితోఁగానీ। వనభూందెసేశ్వబాంధుసర్గంబలరన్॥ ౧౨౬.

వ॥ వెండియు. ౧౨౭.

క॥ అటఁగృష్ణుండును బహితో। త్కటఢక్కాపటహాభేరికాతౌర్యగవా।
గ్భటులున్నలుదిక్కులఁబి। క్కటిలన్నిజపురముఁజేరెఁగౌతుకమొదవన్॥ ౧౨౮.

క॥ రగమునఁదనసతినిమకొని। మధుసూదనుఁడెరుగదేగమానినులుమనో।
రిథములుదీరఁగహరిపైఁ। బ్రధుసుమవర్షంబుగరిసిరింపుదలిర్పన్॥ ౧౨౯.

క॥ ఈతెఱఁగునఁబౌరజన। వ్రాతంబుకడుంజెలంగివసుదేవసుతుం।
డాతెఱవతోడసతత। శీతతమగునంతిపురముఁజేరెముదమునన్॥ ౧౩౦.

క॥ భూసురకాంతలానంగెడు। భాసురనీరాజనములుపరికింపుచున।
కోసలనందనతోడ। న్వాసిల్లెన్నరిరసానుబంధమెలర్పన్॥ ౧౩౧.

వ॥ అప్పుడు. ౧౩౨.

క॥ దేవకికిన్వసుదేవున। కావనజాక్షుండుమ్రొక్కినంగినతోడన్।
దీవనలొసంగివారువ। సూవరులసెకండుసేయఁదొడెంగినంతిన్॥ ౧౩౩.

గీ॥ సూర్యుఁడస్తాద్రిజేరెనవాస్యతమము। నిండెబ్రహ్మాండమునరాజమండలంబు।
నుదయమయ్యెనుజంద్రికలొదవెదిశల। మదనుఁడలరెనుసామ్రాజ్యపదమునొంది॥౧౩౪.

వ॥ ఆసమయంబున. ౧౩౫.

ఉ॥ హరిజలకంబొనర్చిహృదయంబిగురొత్తఁగగంధమాలికా।
సురుచిరభూషణంబులనుశోభనచేలములన్ధరించికాం।
తరసమనోజ్ఞపాయసఘృతప్లుతిభక్ష్యఫలేష్టశాకభో।
జ్యరసములన్భుజించిమధురాంబువుఁగ్రోలిసుఖంబునొందు మన్॥ ౧౩౬.

సీ॥ మంజులస్తంభాగ్రరంజితమాణిక్యకాంతులుదీపాధికతభజింప।
శృంగారమైనమెఱుంగుబంగరుకీలుబొమ్మలుకొమ్మలపోల్కిఁదనర।
సోరణగండ్లనుసోఁకెడుతెమ్మెరల్చామరవిక్షేపసరణివెలయఁ।
బొలుపొందపంజరములఁజిల్కపల్కులుశృంగారగాథలైచెన్నుమీఱఁ।
బద్మరాగప్రవాళసోపాననీల। మణికవాటప్రపధితవజ్రమహితకుడ్య।
మరకతాంచితవేదికాస్ఫురణమమరు। చారుతరమైనకేళికాసౌధమునను॥ ౧౩౭.

సీ॥ పగడాలకోండ్లబల్మగరాలపట్టెలచంద్రదంపుపట్టెడజిగిఁజెలంగు।
హంసతూలంబుచేనలరెడిముకమాలుపాన్పుననించినసారెజాతి।
సుమజాలములపైనిసొంపుగాఁగప్పినసన్నంపువలిపెమ్ముచెన్నుమీఱ।
బాలీసులెక్కలబంగారుకాంతులెసంగుసింగారంపుశయ్యపైనఁ।
బవ్వళించినకంసారిభావమెఱిఁగి । పువ్వుఁబోఁణులుసత్యాన్బ్రిభూతగత్న।
లసితభూషణరాజినలంకరింపఁ । దొణఁగిరప్పుడువేడుకల్గడలుకొనఁగ॥ ౧౭౭.

చ॥ సురుచిరశీతలాంబువులసుందరికింజలకంబులార్చిమేల్।
సరసపురంగుపావడమొసంగిచొకాటఁపుచీరఁగట్టిసుం।
దరరుచిమించుకంచెలఁబదంపడిసంతనచేసితావులన్।
గరమరుదైనహొయల్గులుకుగందమలందిసరుల్ఘటింపుచున్॥ ౧౭౮.

వ॥ మఱియును. ౧౮౦.

ఉ॥ అందముగుల్కుకుందనపుహారములున్నశిపువ్వుపైఁడిబా।
జ్బందులుసందిదండెలునుబాపటిబిందులుముద్దుటుంగరా।
లందెలుకమ్మలుంమురువులాదిగమిక్కుటమైనసొమ్ములం।
దందనలంకరించిరిభయానలుకస్తురిబొట్టుమున్నుగాన్॥ ౧౮౧.

గీ॥ ఈగతినలంకరించియయ్యిగురుబోండ్లు । నిలువుటద్దంబుఁగడుమోలనిలిపిపలికి।
రతివరోనీవువిభునికిహర్షమొదవఁ । జేయనిఁకఁజనుమనఁజెలిసిగ్గునొందె॥ ౧౮౨.

వ॥ వెండియు. ౧౮౩.

గీ॥ తమ్మునరచూపులనుజూచిదంభలీల । బొమలుముడివైచిచిఱినవ్వుమోమునందు।
మొలకలెత్తంగనెమ్మేనఁబులకలొదవు । పొలఁతిభావంబుఁబొడఁగనివెలఁదులపుడు॥ ౧౮౪.

క॥ వలమురిపాలుపుపైమును । వలపునబెగ్గడిలునీకువనితాసిగ్గే।
వలనుండివచ్చినేఁడ । వ్వలరాయనితంత్రడిమనసువలపించుటకున్॥ ౧౮౫.

గీ॥ పతిసమీపమునకుఁబనిచినదనుకనే । పడఁతులకునుసిగ్గుబొడముచుండుఁ।
బిదపఁబ్రియునకెంతముదమొదవింతురో । యెవరుజూతుగమ్మయిందువదన॥ ౧౮౬.

వ॥ అయిననువినుము. ౧౮౭.

గీ॥ ముదితరమ్మనిపిలువకమున్నెమగనిఁ । బొదువఁదగదమ్మవగకాఁడుపొలుపుమీఱి।
సకియదరిఁజేరవెన్కకుఁజనియదేమొ । విసమొసంగినఁగొనవమ్మవేడ్కఁగొమ్మ॥ ౧౮౮

వ॥ మఱియును. ౧౮౯.

చ॥ చెలువుఁడునీదుచన్గవనుజెక్కులగంధమలందఁబ్రేమతోఁ।
గులుకుచుఁగౌఁగిటన్బొదువుకొమ్మమకుందుఁడునీదుమోవితో।

భ్రిలుమధువానియయ్యలరువిల్తుని కేళి నెనర్చ నేర్పనన్।
దలఁగకవానితోఁ బెనఁగితద్దయుఁగూడుముకొమ్మనెమ్మదిన్॥ ౨౦౦.

గీ॥ అనుచుఁజేడియలిత్తెఱంగుననుసత్య । నల్లనల్లనగేళికాహర్మ్యమునను।
హంసతూలికశయ్యపైనలరుశౌరి । సొగసునకన్నిమరలిరిసంతసమున॥ ౨౦౧.

క॥ అంతరమాకాంతుఁడుదన । చెంతన్గొమ్మించుతీవెచెలఁగుకయివడిన్।
వింతగవిలసిల్లెడున । య్యింతిఁగనుంగొనియొవేడ్కలింపుదలిర్పన్॥ ౨౦౨.

వ॥ మఱియును. ౨౦౩.

క॥ కుందనపుపైఁటచెఱఁగుము । కుందుఁడుచేఁబూనితిగిచికోమలియిఁకనీ।
కుందగుసిగ్గరమ్మని । కుందరదనడదనుజేర్చుకొనియిటుపలికెన్॥ ౨౦౪.

చ॥ కలువలఁ బోనందగు మొగంబిటుత్రిప్పుము చూడుకన్నులన్।
లలితమృణాలబాహులతలంబిగియారఁగఁగౌఁగిలించినీ।
కులుకుకుచద్వయంబులనుగోమలినాయెదఁజేర్చి మోవితే।
నెలుచవిఁజూడనిమ్ముదయనివ్వటిలన్ననునేలుకోమలీ॥ ౨౦౫.

వ॥ వెండియు. ౨౦౬.

సీ॥ కొమ్మనీకెమ్మోవికమ్మతేనియలానఁగల్గకుండినసుధాకాంక్షజనునె।
కలికినీగులుకుచన్గవనంటకుండినదుర్గాధిపత్యంబుదొరకు టెట్లు।
చెలియనీశ్రోణిపైఁజెయ్యాడకుండినఁజక్రవర్తిత్వమేసరణినడుచు।
నింతినీయూరుపయింబరుండకయున్న ఫణిశాయిభావమేపగిదిఁజెల్లు।
వెలఁది! గళముననఖపత్త్రినిలుపకున్నఁ । బాంచజన్యధరత్వంబుపరగు టెట్లు।
కాంతనినుఁగౌఁగిటనుజేర్పఁగలుగకున్న । బాహుచతురాకృతిత్వమేభంగినలరు॥ ౨౦౭.

వ॥ మఱియును. ౨౦౮.

గీ॥ కలికిరోకౌతుకమునలేఁగొనునంద । గులుకుపుక్కిటఁబిరుదులఁగోర్కెదీరఁ।
గరముకరమూనకున్ననుగలదెనాకుఁ । దలఁపభువనత్రయాధిపత్యమ్ముమృగాక్షి॥ ౨౦౯.

గీ॥ అనుచుఁదద్దయుచేళించిహొళినించి । తమికటాక్షించివలపించుదయితునెదుటఁ।
గాంచిచన్నులుగల్లఁగాఁగౌతుకమునఁ । గౌఁగిటనుజేర్చిగులుకుచుఁగలసెఁగలికి॥ ౨౧౦.

మ॥ అసకృచ్చుంబనదంతదంశనఖవ్యాపారసంశ్లేషన।
ర్మసుధాపూరవచోవిశేషమృదుమర్మస్పర్శసంజాతమో।
హసముల్లాసకుమాస్త్రకేళులను బ్రహ్మానందభూయిష్ఠమా।
నసులై సౌఖ్యముచునుండిరయ్యిరువురున్నవ్యానురాగంబులన్॥ ౨౧౧.

వ॥ వెండియు నివ్విధంబున నవ్వధూవరులు విలసిల్లుచున్న సమయంబున యౌగపద్యంబితరే
తరమంజులతాంబూల సుగంధబంధురాధరాభిరామంబై, యనురాగాతిశయసాంగత్యా
కుంచితపరస్పరకంఠవలయోక్తిల దవ్యక్తమనురిమాంచత్కపోలారవంబై, సమకాలప్రవృ
త్తాన్యోన్యసంపిష్టమనోజ్ఞావయవంబై, సహనట న్నిధువనిధువనసమయచటులమణితరణి
తవిలసితంబై, సుఖాకరంబైన సురతంబు ప్రవర్తించునెడ మదనజనకుండు మెండుమీఱి
హృదయంబుగదియించి ధైర్యంబుగలంగించి డంబుమీరు దన్నవఁ గొనగోటమీటుచు
మాటిమాటికి నూరూరఁజేయుచు, నారడిబెట్టు కెమ్మోవి మునిపంట నొక్కుచు, మరుని
ముకురంబులపగిదిఁగొసురుమీరు చెక్కులఁజపేటంబులనుంచుచుఁ, గ్రొమ్మించుతీవెకరణి
మెఱయు నప్పువ్వుబోణి మనోహరంబైనశరీరంబుఁ దనబాహాంతరాళంబునబంధించి
జయించినంగాంచి యమ్మించుబోణి మదనకదనంబున నప్పరిభవంబుసహింపక రతిరహ
రాద్ధాంతరహస్యవేదినిగావున రసవశంబునఁ బురుషాయమాణయై శౌరినిదిరస్కరించి
పెనంగిన నయ్యిరువురు ననంగక్రీడావిశేషంబులఁజెలంగుచు సమాకాలస్ఖలనశమితమదన
కదనసన్నాహులై సుక్కుచు శయ్యపై వ్రాలియు ననవవ్రాన్ముఖంబైన ప్రేమాతిరేకం
బున నన్యోన్యవ్యాపృతైకైకబాహాలింగిత పులకితగాత్రులై తత్కాలోచిత మనురా
లాపజల్పనాశీలురై యున్నసమయంబున. ౨౧౨.

క॥ తూరుపు తెమ్మెర మొలకలు । తోరంబుగవీచిమించెదోరపుకాంతుల్ ।
వారకతిమిరమణఁగెఁగా । కూరుతమలుకుక్కుటములుకూయఁగఁదొణఁగెన్ ॥ ౨౧౩.

వ॥ అట్టియెడ. ౨౧౪.

క॥ మంగళతూర్యరవంబుజె । లంగవిహంగములుపంజరస్థులఘనసా ।
రంగవరదమేల్కొమ్ముకు । రంగనయనతోడననుచురహిఁబలుకంగెన్ ॥ ౨౧౫.

వ॥ అప్పుడు. ౨౧౬.

సీ॥ అతివచన్నంతులనల రారుకస్తూరియురముపై శ్రీవత్ససరణి మెఱయ ।
సురతజాగరముచేసాక్కినకన్దోయివారిజాకృతి నొందివన్నెకెక్కఁ ।
గల్కిపన్నొనలచేఁగందినకెమ్మోవిబింబఫలస్ఫూర్తి డంబుమీఱఁ ।
గాంతకస్తూరితిలకంబంటియాననంబేణాంకతులితమైయింపుమీఱ ।
సెలఁతమణిహారముల నొక్కలెలమిమేన । లలితవనమాలికాచిహ్నములనవెలయఁ ।
గాంతపైమోహసంభృతస్వాంతుఁడగుచుఁ । గేళిసదనంబువెడలెగోపాలమౌళి ॥ ౨౧౭.

వ॥ వెండియు. ౨౧౮.

గీ॥ స్నానసంధ్యాద్యనుష్ఠానదానములను । సముచితంబుగసల్పుచుశౌరివిజయు ।
తోడనిష్టానులాపములాడికొనుచు । నివ్వటిల్లుచునుండెనుసేర్పుమీఱ ॥ ౨౧౯.

వ॥ అంతట. ౨౨౦.

ఉ॥ వాడినపూలదండలును వాతెరనంటినపంటిగంటులన్।
వీడిచెలంగుపెన్నెరులవేకువనిద్దురఁదేరుకన్నులన్।
బ్రోడజెలంగిమన్మథునిపోరునడస్సినరీతిఁదెల్పుచున్।
జేడియయంసభాగములఁజేతులువైచుచువచ్చెసొక్కుచున్॥ ౨౨౧.

క॥ కాంతలుసంతసమునశ్రీ। కాంతునితోరతులఁదేలిక్లాంతాననన।
క్కాంతనుగద్దియనిడియే। కాంతంబునఁజెలులుచుట్టుగ్రమ్ముచునేడ్కన్॥ ౨౨౨.

గీ॥ ముకురమెదుటనిల్పిముదితలుకొందఱు। చికురములనుదువ్విచిక్కువడిన।
హారములుసడల్చిహాసువిూఱఁగఁబైటఁ। జక్కగానుసరిదిముక్కునలక॥ ౨౨౩.

వ॥ వెండియు. ౨౨౪.

ఉ॥ కన్నులుచల్లఁగాఁగనిమొగంబునమోములనంగఁజేర్చియా।
వెన్నునిఁగౌఁగిలించిముదివేడుకదీరఁగముచ్చటాడిసం।
పన్నతనొందికోసలన్నృపాలతనూజమనోజవేదనా।
పన్నతదీరమోవిసుధపానమొనర్చిసుఖంబునొందితే॥ ౨౨౫.

గీ॥ కమ్మవిలుకానినెఱపువ్వుటమ్ములకును। సొమ్మసిలిమునుజెందిననుమ్మలికము।
దీరవేడ్కముకుందునిజేరిమదన। కేళులనుసొక్కఁగలిగెనేకీరవాణి॥ ౨౨౬.

గీ॥ కులుకుపన్నీటమెలఁదినకలపమునను। మేదురంబైనవనమాలిమేనుఁగౌఁగ।
లింపఁగల్గెనెవానితోసొంపుమిూఱ। మరునికేళులమెలఁగితేమంజువాణి॥ ౨౨౭.

క॥ అనినెచ్చెలియలుబలుకున। చనములువీనులకువిందుసల్పఁగఁజెలిసి।
గ్గునుజిత్తినవ్వునుపన మొ। మునఁబెనఁగొనసఖులతోఁ బెముఱియుచునుండెన్॥ ౨౨౮.

వ॥ వెండియు. ౨౨౯.

క॥ హాటకచేలునితోస। య్యాటలఁబాటలనురతులనలరుచునెపుడున్।
బాటలగంధిముదంబునఁ। బాటిలుచుండెనలకలికిభామినిపగిదిన్॥ ౨౩౦.

క॥ అంతటహేమంతమువడ। దంతావళకుంభసన్నిభస్తనదయితా।
ధ్వంతరహితకాముకకా। లాంతకసమమైచెలంగెనాసమయమునన్॥ ౧౩౧.

సీ॥ కందర్పమాతంగకరపుష్కరోద్దీర్ణశీకరోపమహిమానీకమగుచుఁ।
గాంతాకుచాభోగగహ్వరగరదుర్గభాగలీననిధానభావమగుచుఁ।
గాదంబనికురంబమోదాపనోదకసారసోల్లసితకాసారమగుచుఁ।
గహ్లారకచకోరకాళికాసలిభయంకరదివాకరదివ్యకిరణమగుచు।

గళితయౌవనవేశ్యాంగతులితశీత । లలితసౌభాగ్యసత్ప్రిపాకలితమగుచుఁ
గాంతనవతాలవృంతవిభ్రాంతమగుచు । నపుడువిలసిల్లెఁదత్సమయాగమంబు॥ ౨౩౨.

వ॥ మఱియును. ౨౩౩.

క॥ కాంతలుతతవిరహాగ్ని । క్లాంతలగుచుమోహజలధిఘనతరవేలా
ప్రాంతముతద్రజనీవే । లాంతముగనలేకయుండిరాసమయమునన్॥ ౨౩౪.

చ॥ దివములుసన్నగించెఁగడుదీర్ఘములై కనిపించెరాత్రులున్।
దవమునటించెదీనతనుదద్దయుమించెహిమాంబుధారలీ।
యవనియుఁబాడిపంటలసమంచితమైరహిమించెశీతమున్।
భువనమునాక్రమించెయదుపుంగవురీతివహించియుత్తరిన్॥ ౨౩౫.

వ॥ వెండియు. ౨౩౬.

క॥ వడవడవడఁకుచునూష్మ్యఁడు । తడవ్వెనరింపకపరాద్రిదరిఁజేరియుఁగా।
వెడలఁడుచలికులికియనన్ । బుడమిన్నిశౌర్త్తియొరులఁబొదువుటయరుదే॥ ౨౩౭.

వ॥ ఆసమయంబున. ౨౩౮.

గీ॥ సరసకమలాకరవిహారచందనాను । లేపవాతాయనాప్తిచంద్రోపలస్థ।
లీనివేశనచంద్రశాలానివాస । ములనిరాదరుఁడైయుండిమురహరుండు॥ ౨౩౯.

చ॥ సరసకదుష్ణనీరములస్నానమొనర్చికటూష్ణభోజ్యముల్।
కరముభుజించితౌనగరుగంధముఁబూసిలవంగజాతిభా।
సురమగుహీస్యమందిచలిసోకనిసౌధమునన్వసించిసా।
దరముగహంసతూలయుతతల్పముపైఁబవళించియంతటన్॥ ౨౪౦.

క॥ చలిచలియనుచురమాధవుఁ । డలచెలిచనుగవనుడాగియానందమునన్।
జెలఁగుచుపలరాయని । కళలన్విలసిల్లిప్రొద్దుగడుపుచునుండెన్॥ ౨౪౧.

వ॥ ఈతీరు నాగ్నజితితో దనరారుచు ననంతరంబ. ౨౪౨.

క॥ శ్రుతకీర్త్తితనూజన్విఁ । శ్రుతకీర్త్తిన్భద్రకన్యసుచరితధన్యన్।
గ్రతుభుగ్వరులెన్నఁగఁడా । సతివేడ్కనుబెండ్లియాడెనచ్యుతుఁడంతన్॥ ౨౪౩.

వ॥ మఱియును. ౨౪౪.

క॥ పక్షీంద్రుఁడుమున్నమరుల । శిక్షించియమృతముఁదెచ్చిచెలఁగినపగిదిన్।
గుక్షిలిపులఁగదివిఁహరివి । లక్షణముగఁబెండ్లియాడెలక్షణనపుడున్॥ ౨౪౫.

వ॥ వెండియు. ౨౪౬.

గీ॥ భైష్మియునుజాంబవతిసత్యభామమిత్ర । విందకాళిందికోసలవిభుతనూజ।
భద్రలక్షణలాదిగాభామలోలయుఁ । బరిఢవిల్లుచునుండెగోపాలమౌళి॥ ౨౪౭.

వ॥ ఇవ్విధంబున లీలాగృహీతశరీరుండైన మదనగోపాలవల్లభుండు విలాసినీసహస్రంబులతోఁ గందర్పకేళుల విలసిల్లుచు మన్మథానిరుద్ధాది పుత్రపౌత్రకోటితో నానందించుచు దుష్ట నిగ్రహపూర్వకంబుగా శిష్టపరిపాలనం బొనరించుచు ద్వారకానగరంబున సుఖంబున నుండెనని సూతుండు శౌనకాదులకుం దెలిపిన నమ్మునీంద్రు లమందానందమకరందసందోహ హృదయారవిందులై యతని నభినందించిరి. ౨౪౮.

గీ॥ వల్లీపల్లవోల్లాసముల్లసమున । వినినఁ జదివిన వ్రాసినజనులకెపుడు।
మదనగోపాలమౌళిసమ్ముదముతోడ । సకలసంపదలొసఁగును సంతతంబు॥ ౨౪౯.

మా॥ శ్రీకమనీయరూపతులసీదళగుంభితదివ్యమాలికా।
స్వీకరణానురూపకవిశేఖరదత్తరసోల్లసత్పదా।
ర్ధాకృతికోపహారనికరాకలనోపచితస్వరూపభ।
ద్రాకరశోభనాద్రిశిఖరాంచితదీపఘునద్వనీపకా॥ ౨౫౦.

స్రగ్విణి॥ ఇందిరాదృక్చకోరేందుబింబన్ముఖా । వందినీతామితౌవార్యసంపత్సుఖా।
నిందితహ్రాదినీనీతిభాస్వన్నఖా । నందితాగేంద్రకన్యావచస్త్రీసఖా॥ ౨౫౧.

గద్య॥ ఇది శ్రీమాడభూషికులపయోవారాశిసుధాకర వేదాంతాచార్యతనూభవ వైనతేయ కటాక్షలబ్ధ విద్వత్కవిరాజమనోరంజక సంగీతసాహిత్యకవిత్వచతుర నరసింహాచార్య ప్రణీతంబైన వల్లీపల్లవోల్లాసంబను సత్యాపరిణయాఖ్యానప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.



# SREE-VYJAYANTI.

*Rates of subscription (inclusive of postage).*

| | | | | |
|---|---|---|---|---|
| **For One year (in advance)** | **Rs** | **2** | **8** | **0** |
| **For six months.** ,, .. | **,,** | **1** | **8** | **0** |
| **Single copy.** . | **,,** | **0** | **6** | **0** |

శ్రీ వైజయంతీకార్యస్థానమున వెలకు దొరుకు గ్రంథములు:—

| | | వెల. | | | వైజయంతి చందాదారులకు | | |
|---|---|---|---|---|---|---|---|
| **చమత్కారతరంగిణి—** | | | | | | | |
| No 1 ఖేచరోల్లాసము<br>ప శ్రీనివాసాచార్య (బి ఏ,) విరచితము | Rs | 0 | 2 | 0 | 0 | 1 | 6 |
| No 2 మంజువాణీవిజయము.<br>రాయబహదురు ప అనంతాచార్యవిరచితము | ,, | 0 | 4 | 0 | 0 | 3 | 0 |
| No 3. మదనమోహనచరిత్ర<br>మాడభూషి వేంకటాచార్య విరచితము | ,, | 0 | 4 | 0 | 0 | 3 | 0 |
| No 4 సోమశర్మాభ్యుదయము<br>కొమాండూరు అనంతాచార్యవిరచితము | ,, | 0 | 6 | 0 | 0 | 5 | 0 |
| **కృతితరంగిణి—** | | | | | | | |
| No 1 రుక్మిణీపరిణయము కూచిమంచి తిమ్మకవి ప్రణీతము | ,, | 1 | 0 | 0 | 0 | 12 | 0 |
| No 2. జూలూరి అప్పయ్యపంతులు గారి (1) శ్రీనివాసతారావళి (2) రామపంచాశత్కందములు (3) యదువంశభూషణ శతకము | ,, | 0 | 4 | 0 | 0 | 3 | 0 |
| No 3 శకుంతలాపరిణయము కృష్ణకవిప్రణీతము | ,, | 1 | 0 | 0 | 0 | 12 | 0 |
| No 4. ధనంజయవిజయము<br>కొక్కొండ వేంకటరత్నము పంతులుగారిచే రచితము | ,, | 0 | 4 | 0 | 0 | 3 | 0 |
| భరతాభ్యుదయము: విద్వానభినవపండితరాయ మాడభూషి వేంకటాచార్య ప్రణీతము. | ,, | 1 | 0 | 0 | 0 | 12 | 0 |

**[illegible]వారు వైజయంతీపత్రికాధిపతులకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.**

శ్రీరస్తు.

మనువసుచరిత్రాద్యనేకగ్రంథార్థనిబోధనచాతుర్యులగు

జూలూరి - అప్పయ్యపంతులుగారిచే

రచింపఁబడిన

# శ్రీనివాస తారావళి,
# రామపంచావింశత్కందములు,
# యదువంశభూషణ శతకము.

అనుగ్రంథములు.



ఇవి

పనప్పాకము - శ్రీనివాసాచార్యులు (బి. ఏ.,) గారిచేఁ

పరిశీలింపఁబడి



ఊః - పుష్పరథసెట్టి అండు కంపెనీయొక్క

కళారత్నాకరముద్రాక్షరశాలయందు

ముద్రితమయి

ప్రకటింపఁబడియె.

1893.

## EDITOR'S NOTE.

Juluri Appiah Pantulu Garu is the author of the three sets of verses which I have much pleasure in printing in the following pages. Apart from their merit, which is considerable, I have thought this homage to be due to a Scholar, who, as the primier commentator on such Telugu classical works as the Manu Charitra and Vasu Charitra, has placed lovers and readers of Telugu Literature under a lasting obligation by helping Mr. C. P. Brown, the most renowned friend of that Literature in modern times, in bringing to light valuable writings from unmerited obscurity and neglect.

P. SREENIVASA CHARLU.

EGMORE,<br>
*August* 1893.



శ్రీరస్తు.

# శ్రీనివాసతారావళి.

సీ॥ శ్రీకరపద్మావతీకుచాశ్లిష్టభుజాంతరుండు విభానిరంతరుండు।
సారయశోజితతారహారపటీరనారదుండు కృపావిశారదుండు।
నిజపదానతభక్తనివహదుర్భవబంధమోచనుండు సరోజలోచనుండు।
కాంచనరత్నమయాంచితభూషావిచక్షణుండిభరాజరక్షణుండు।
మహితభువనత్రయీలసన్మంగళప్ర। దాయకుండును నాప్రాణనాయకుండు।
కాంత శ్రీవేంకటాద్రినిశాంతుఁడైన। శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౧॥

సీ॥ అలభామకుచసీమ నలఁదిన శ్రీచందనంబు చే నొప్పు వక్షంబుతోడ।
వెస దానిపస మేనిపసు పానిరాణించు నీటు దుప్పటివల్లెవాటుతోడ।
నాభోటి కొనగోటి చేఁబాటిలెడు నాఁటులమరిన చెక్కుటద్దములతోడ।
నాధీరపదసారసాలక్తకలితమైకనుపట్టు ఫాలభాగంబుతోడ।
వన్నె గుల్కుచు రాఁగనీ చిన్నె లేడ। వన్నమాత్ర నెయలిగి రాకున్నవాఁడు।
కాంత శ్రీవేంకటాద్రినిశాంతుఁడైన। శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౨॥

సీ॥ పండువెన్నెలలోన నిండారఁబూచిన యెలమావితోఁటలోనలరుమేటి।
పటికమెట్టికలనురుటమైన చెంగల్వకొలని చెంగటమందమలయపవన।
మొలయంగ లలితమౌచలువఱాతిన్నెనలువొందఁగమ్మతావులు ఘటించు।
నరవిరిపాన్పుపైన దిమి కౌఁగిటఁ జేర్చి చిలుకసామ్రాణివజీరుకేళి।
కలసుదనియించి వలపించి వలచినట్టి। చెలువుఁడెడఁబాయ నే నోర్వఁగలనటమ్మ।
కాంత శ్రీవేంకటాద్రినిశాంతుఁడైన। శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ 3॥

సీ॥ కురులు చక్కఁగ దువ్వి గొప్పకొప్పమరించి సొబగైన విరిసరుల్ చుట్టునమ్మ।
చొక్కమౌ కమ్మకస్తూరి చేనీటుగాఁ దిలకంబు నుదుటిపై దిద్దునమ్మ।
కొమరైన చెక్కుటద్దములపైఁ గొనగోటఁ దీరుగా మకరికల్ దీర్చునమ్మ।
కురుకుంజి ముత్తెంపుసరుల చిక్కెడలించి వలుదగుబ్బల గంధములఁ మనమ్మ।
యిటులు నను గారవించు ప్రాణేశుఁడకట। రాకయున్నాఁడు నేఁడు నిరాకరించి।
కాంత శ్రీవేంకటాద్రినిశాంతుఁడైన। శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౪॥

సీ॥ చెలువునిముఖచంద్రకళలు గాంచినఁ గాక లలిమోహతమ మెట్లు తొలఁగునమ్మ।
ప్రియుని కెమ్మోవి తేనియలు గ్రోలినఁ గాక మారవిదాహ మెట్లాఱునమ్మ।
రమణుని వెడఁదయురమ్ము గ్రుమ్మినఁ గాక గుబ్బలపొగ రెట్లుకుందునమ్మ।
పతికరుణారసామృతముఁ జిల్కినఁ గాక విరహతాపం బెట్లు విరియునమ్మ।
కొమ్మ నేఁ దాళలేనమ్మ యెమ్మెకాని। కిమ్ముగా నాదువిరహభరమ్ముఁ దెలిపి।
కాంత శ్రీ వేంకటాద్రినిశాంతుఁ డైన। శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౫॥

సీ॥ వానివా తెర తేనెలాని సొలుట లేమిటారికి నేఁడు చేకూరెనెకొ।
కళలూరు వాని చెక్కిలి ముద్దుఁగొనుట లేజలజపాణికి నేఁడు కలిగెనెకొ।
గుబ్బచన్నులవానిఁ గ్రుమ్ముట లేరాజవదనకు నేఁడు చేపడియెనెకొ।
వానిఁ బైకొని వింతవగలచేఁ గూడుటే తెఱవకు నేఁడు సిద్ధించెనెకొ।
బాలయీలీల నే జవరాలిపాల। మేలువాఁ డయ్యెనో యింతజాలమేల।
కాంత శ్రీ వేంకటాద్రినిశాంతుఁ డైన। శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౬॥

సీ॥ అతివరో దయవాఁ డటంచు నెంచితిఁ గాని యతినిర్దయుం డటంచు మతి నెఱుంగ।
ననుఁ బాయకుండు నంచని నమ్మితిని గాని మోమైనఁ జూచుట లేమి నెఱుఁగఁ।
బ్రియముతో నన్నాదరించునంచుండితిఁ గాని నాపైఁ గూర్మి మాను టెఱుఁగ।
సరసులలో మేటి సరసుఁ డంచని కోరితిని గాని మూఢచిత్తునిఁగ నెఱుఁగ।
నిట్టివానికి నామాన మెల్లఁ జూఱ। వచ్చి తెలియక నే మోసపోతినమ్మ।
కాంత శ్రీ వేంకటాద్రినిశాంతుఁ డైన। శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౭॥

సీ॥ మదిలోన నామీఁద మమత లేకున్నఁ బ్రస్తావంబుగా నైనఁ దలఁచరాదె।
యిటు నన్నుఁ బాయకుండుట కిచ్చ లేకున్న రారాదె యొకసారి యూరకైన।
నాసక్తి మీఱఁగ న్నారఁ జూచుట మానుకొన్నఁ గ్రేఁగంటఁ గన్గొనఁగ రాదె।
యనురాగమున ముచ్చటాడ నెల్లకయున్నఁ బల్లెత్తి నాతోడఁ బల్కరాదె।
యిట్టినిర్దయఁ బూనుట కేమి యెగ్గు। చేసితినొ కానివాని కే చెల్లెనకట।
కాంత శ్రీ వేంకటాద్రినిశాంతుఁ డైన। శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౮॥

సీ॥ మదినెంతయల్క నాకొదవినఁ దన మది చిటులు నోయని బయల్ సేయ వెఱతు।
నాపయి నొకవేళఁ గోపంబు చేసున్నఁ జనవు చేసుకయి దేమనఁగ వెఱతు।
మృదుభావమని యెంచి మేలంబుగా నైనఁ బదరి వానికి మాఱుపల్క వెఱతు।
మనసు రానుపచార మొనరించు నెడ నేదివేళకే మోయని చాల వెఱతు।
నిటుల నే నెంత తన చిత్త మెఱిఁగి నడచు। కొన్న దయమాలి నన్నేలుకొన కెడాయెఁ।
గాంత శ్రీ వేంకటాద్రినిశాంతుఁ డైన। శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౯॥

సీ॥ మదినింత నిర్దయఁ గుదురుకొల్పినవాని నెదఁ గోరఁదగదని యెంచుకొంటి।
వలపుఁ జెందని వాని చెలిమి కాసయొనర్ప నేమి ఫలంబని యెంచుకొంటిఁ।
గన్నెత్తి చూడకయున్నట్టి వానిపై నేటికీ మరులని యెంచుకొంటిఁ।
దోడిచేడెలలోన నాడికలాయెఁ గాయిదియె చాలునటంచు నెంచుకొంటి।
నెన్ని విధముల నే నెంచుకొన్న వాని । యెడవిరక్తి జనింపదే నేమి నేతుఁ।
గాంత శ్రీ వెంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౧౦॥

సీ॥ ముద్దియ తిలకంబుఁ దిద్దుచో నా చెక్కుటద్దంబుఁ జూచునె యారితనము।
మగువ నే కౌఁగిటికిచ్చు మడుపందుకొను వేళ నును మోవి మొనపంటనొక్కు హొయలు।
నెలనాగ నే గంధమలఁదుచో నా చన్నుగుబ్బలపై వ్రాలు గబ్బి వలపు।
నింతి నే మోడి వహించినప్పుడు నన్ను సరసతఁ బలికించు జాణతనముఁ।
దలఁచుకొన్నను నా మది తత్తఱించు । నట్టి ప్రియుఁ డెంత నిర్దయుండాయె నమ్మ।
కాంత శ్రీ వేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేగఁదే చిగురుఁబోణి॥ ౧౧॥

సీ॥ కెంపు రాజిగి చెక్కడంపు నిద్దాకుందనంపుఁ బసిండి యందంపుఁ దళుకు।
మేడలోపల రతిమీనాంక విజయముల్ వ్రాసిన మేల్చందువా పటంబు।
క్రిందఁ బచ్చల కోళ్ల కీలు జాల్వాపట్టె మంచముపై మించు నంచ గఱుల।
పానుపునందు నొప్పైన సూరెపుటంబు తలగడలా నిచిత్తములు పల్ల।
వింప నేనును నా ప్రాణవిభుఁడు జోడు । గూడియుండుట లెపుడు చేకూడు నమ్మ।
కాంత శ్రీ వేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౧౨॥

సీ॥ తెలివైన పన్నీట జలకమాడి సునేరిబస్మా సొబరంగు తాబందు గట్టి।
కళగుల్కు జిల్గు చెంగావిచీర ధరించి రంగైన పైఠిణీ అవికఁ దొడిగి।
తివిరి గోరోచనా తిలకంబు దిద్ది గుబ్బలపై నికుంకుమ పంకములఁది।
జాలుకొప్పునఁ బూలసరులు నిండఁగఁ జుట్టి నవ్యరత్న విభూషణములు దాల్చి।
వింతగా నిట్లు కైసేసి చెంతఁ జేరు । వేళ ననుఁ గాంచి తమి మించి సోలు నమ్మ।
కాంత శ్రీ వేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౧3॥

సీ॥ చాన వే పూదెనె సోన వే నీదయ నాన వే యిఁక లతకూన యనుచు।
నింతి వే కంతు చాదంతి వే మల్లెపూబంతి వే యేటికీ పంతమనుచుఁ।
గల్కి వే మదను పూముల్కి వే నాతోడఁ బల్కవే చిల్కలకొల్కి యనుచుఁ।
బ్రోడవే కన్నెత్తి చూడవే యీ మోడి వీడవే నేను నీవాఁడ ననుచు।
మొల్లమగు ప్రేమ నా మదిఁ జల్ల నేయుఁ । జెల్లఁబోయిట్లు నే నల్కఁ జెందువేళఁ।
గాంత శ్రీ వేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౧౪॥

సీ॥ తళుకుఁజూపులవానిఁ దిలకింపవలదఁటే కలికి యీ కన్నులుగలఫలంబు।
అలవానితో మేలమాడంగవలదఁటే చెలియ యీ సరసోక్తిగలఫలంబు।
ఉబ్బి కౌఁగిటవాని నొత్తంగవలదఁటే నెలఁత యీ గుబ్బలుగలఫలంబు।
మేటి రతులవాని మెప్పింపవలదఁటే లలితాంగి యీ మేనుగలఫలంబు।
సుదతి ప్రియుఁ బాసియున్న యీ సొబగులెల్ల । నడవిఁ గాసిన వెన్నెలలౌఁగదమ్మ।
కాంత శ్రీవేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోఁడి॥ ౧౫॥

సీ॥ సుదతిరో నినుఁ బ్రాణపదముగా మది నెంతునిదిని జంబను మాట లెడనెనేమొ।
తానె నా పాలిటి దైవంబుగా నెంచియుండుట మదిఁ దోఁచకుండెనేమొ।
నమ్మిన చెలి నేఁచ న్యాయంబుగాదని యక్కటా తెలియలేఁడాయెనేమొ।
తనువుగలన్నాళ్లు నినుఁ బాయనని నాకొసంగిన బాసఁ దొలంగెనేమొ।
యింత నీవైన నీమాట లెఱుకపఱిచి । వరుసఁ దమిరేఁచి నాపైనిఁ గరుణఁ బూని।
కాంత శ్రీవేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోఁడి॥ ౧౬॥

సీ॥ పొత్తున నేకాని భుజియింపనొల్లని వానికి నేఁగాని దాననైతి।
మునిపంటమడుపొసంగినఁగాని యొల్లని వానికి నేఁగాని దాననైతిఁ।
బయ్యెదపైఁగాని పవళింపనొల్లని వానికి నేఁగాని దాననైతి।
నిండుకౌఁగిటఁగాని నిదురింపనొల్లని వానికి నేఁగాని దాననైతి।
నిటులు తనకూర్మిఁ గనఁజేసి కుటిలుఁడగుచు।వంచనమొనర్ప నెల్లుసహించుదానఁ।
కాంత శ్రీవేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోఁడి॥ ౧౭॥

సీ॥ కొమ్మ నీయధరామృతమ్మానకున్నచోఁ గమ్మవిల్తుని సెకల్గుమ్మరించు।
బాల నీ మృదువచోలీలఁ గాంచకయున్నఁ గేళిశుకాళి విరాళిఁగొల్పు।
సుదతి నీ కీల్జడఁ జుట్టిపట్టకయున్నఁ గోదమతుమ్మెదరొదల్మదిఁగలంచుఁ।
చెలియ నీయూర్పు మైఁబొలయకయున్న నీ చలువతెమ్మెర డాకనిలుపరాద।
టంచు నర్మోక్తులాడుచు సనఁగి పెనఁగి । మనసుఁ గరఁగించి దక్కించుకొనుఁగదమ్మ।
కాంత శ్రీవేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోఁడి॥ ౧౮॥

సీ॥ అలదాని ముందుమాయలకులో నాయెఁగా నాయింటిచాయ రాఁడాయెనమ్మ।
నామగనాలల్ల దేమిబోధించెనో కలనైన నాపేరుఁ దలఁచఁడమ్మ।
తగులాటమైన యా తాటోటువగలాఁడి వలఁ జిక్కి దానిల్లు వదలఁడమ్మ।
కాఁపురంబుల గుత్తకత్తెయై పాపజాతి గయాళి చలము సాధించెనమ్మ।
దానినన నేమి పనికొఱగానిమోడి । పూని యిటు రాని పతి ననఁబోలుఁగాని।
కాంత శ్రీవేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోఁడి॥ ౧౯॥

సీ॥ కదిసి మోమున మోముఁ గదియించి కదియించి పదరి పెన్నెఱికొప్పుఁ బట్టి పట్టి।
గుత్తంపుఁ గౌఁగిటఁ గుదియించి కుదియించి కొదమగుబ్బలు గోరఁ జిదిమి చిదిమి।
నిద్దంపుఁ జెక్కిళ్లు ముద్దాడి ముద్దాడి యధరసుధారస మాని యాని।
కళలయిక్కువలంటి కరఁగించి కరఁగించి నెమ్మిఁ గళధ్వనుల్ నెఱపి నెఱపి।
జాణతన మొప్ప సమరతి సలిపి సలిపి । యిచ్చ నిచ్చలు ననుఁ గూడి మెచ్చునమ్మ।
కాంత శ్రీవేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౨౦॥

సీ॥ తుమ్మెదయెలగోలు గమ్మ వుప్పొడి దుమారమ్ము రేఁపుచు హోర్ద్దామ్మి కెక్క।
నిమ్మలమదకోకిలమ్ము సిద్దిల్లుమ్మరమ్ముగఁ గోలాహలమ్ము నర్వ।
హుమ్మని కెంపు మొగమ్ము తేజీనెక్కి కమ్మవిల్లాడు పాతమ్మి దాయ।
దెమ్మెర సరదార్లు నెమ్మితో నుభయపార్శ్వమ్ములఁ గొలువఁ దేజమ్ము తోడ।
నమ్మ నేఁ జెల్ల విరహిజనమ్ము మీఁదఁ । గ్రమ్ముచును దాడి వెట్టెఁ బంతమ్ము మీఱఁ।
గాంత శ్రీవేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౨౧॥

సీ॥ వలరాజు తురువు కావాదీఱినట్టి రాచిల్క తేజీనెక్కి చికిలి గేదఁ।
గితుపాకిడా కేలఁ గీలించి వుప్పొడి ముందుగట్టన చేసి కుల్లె మొగ్గ।
గుండమురించి నెక్కొను కమ్మకస్తూరి రంజకమ్ము ఘటించి కొంజకెఱ్ఱ।
గన్నేరు విరినిప్పుగాఁ జెక్కి తన పెన్నురమ్మున కెత్తి ధాంథమ్మటంచు।
మ్రోయ నా చన్నుఁగవ నాఁట నేయసాఁగె। జాలిఁగొని యింక నేఁ దాళఁజాలనమ్మ।
కాంత శ్రీవెంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగ[illegible] ౨౨॥

సీ॥ మదనసౌందర్యైకసదన మా సారసవదనఁ గాఱింప నీకదన యనుచు।
సోమభాసురకళాస్తోమ మోమోట లేదా మానకేచెదు లేమ ననుచుఁ।
బవనచాలితపురోపవనమా యువిద పైఁ బవనాన దీనఁ బెంపవు నయనుచు।
శుకమ యాస్యజితకింశుకమ శుకోక్తి నూరక ముచ్చరించి పల్కకుమ యనుచు।
నెంత మీర నన్నుఁ బూఁదూపు లేయఁ గాయ । వీవరొద నేయసాఁగి రీవిధ మెఱింగి।
కాంత శ్రీవేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౨౩॥

సీ॥ నినుఁ బాసి నేనెక్క నిముసమైనను దాళఁ జాలనీ వేళ నన్నేలుకోర।
పతి విడనాడిన సతి బ్రతుకేమని సాటిబోటులు నవ్వఁ జొఁగరటర।
చెలిమియొనర్చిన చెలి నింత నగుఁబాటు సేయఁబూనిన దైవసాయమటర।
తనువు నీసొమ్ము నీదాన నాపై నింత చలమేల రార నా సామి లేర।
యనుచు నే విన్నవించిన యటుల వాని । మనసు గరఁగెడునట్లుగా మనవి చేసి।
కాంత శ్రీవేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౨౪॥

సీ॥ రాచిల్కనంపి తేరమ్మని యోష్ఠబింబముఁ జెందిపిల్వఁదామఱచునేమొ।
తేఁటెనచ్చటికంపి తేప్రియ మోముఁదామరఁ జేరిపిల్వఁదామఱచునేమొ।
కేకినంపిన నాథు మైకాంతిఘనమని మరులొందిపిల్వఁదామఱచునేమొ।
యలచకోరికనంపనతని హాసజ్యోత్స్న దొరలినఁబిల్వఁదామఱచునేమొ।
యిటులు గావున నామనోహరుని నన్నుఁ । గూర్చునుపకృతికై వేఱె మేకొనఁగదమ్మ।
కాంతశ్రీవేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౨౫॥

సీ॥ కరుణతో నాకన్నెకముగ వాఁడిటవచ్చి సొలయుచు నా చెంత నిలిచినట్లు।
నిలిచికొంకుచు నేమిపలుక నేరకయున్నఁ బ్రేమ నేనయి పల్కరించినట్లు।
పల్కరించినయంత బాళితో నన్నూఱడించి ముచ్చటలఁ దేలించినట్లు।
తేలించి నాచింత దీఱఁగాఁగటఁ జేర్చి యెలమితో రతులనన్నేలినట్లు।
ఇటులు మటుమాయకలఁ గాంచియించు విల్తు। పటుశరజ్వాలికలకులోఁబడితి మిగులఁ।
గాంతశ్రీవేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౨౬॥

సీ॥ వెలఁదినీతో విన్నవించిన వేళావిశేషమో లేక నేఁ జేయు పుణ్య
ఫలములీడేఱెనో తెలియంగరాదు నే నిన్న రాతిరిఁ గలఁగన్నయట్లు।
నావిభుఁడిలు సేరె నాచింత లిఁకదీఱె కోరికల్ చేకూఱెఁ గూర్మి మీఱెఁ।
గరుణజూలార్యప్పకవి నేలు నాప్రాణలోలునితో సుఖలీలఁ గూడి।
మెలఁగు భాగ్యంబుఁ గంటినిమ్మొయినిమీఁద । నెన్నటికినైన దయలేక యెడసెనేనిఁ।
గాంతశ్రీవేంకటాద్రినిశాంతుఁడైన । శ్రీనివాసునిఁ దేఁగదే చిగురుఁబోణి॥ ౨౭॥

సంపూర్ణము.



శ్రీరస్తు.

# రామపంచాశత్కందములు.



క॥ శ్రీకరసుగుణాకరరిపు । భీకరరుచిహానితనముచిభిన్నగిఘృణినా।
శ్రీకోద్భవపాకారిపి । నాకధరాభినుతలోకనాయకరామా॥ ౧॥

క॥ శ్రీమహిజాకామఘన । శ్యామమునిస్తోమవినుతజన్యామరజి।
ద్భీమార్యలలామాఘవి । రామాతిఘ్నాణాభిరామరఘువరరామా॥ ౨॥

క॥ భూరిదయాసారదర । స్మేరదరత్కమలనయనమిహికాంశుశర।
న్నీరదదరనారదశర । పారదపాండురయశోవిభాసురరామా॥ ౩॥

క॥ భీషణఖరదూషణమద । శోషణప్రణతార్తిహరణసురుచిరమణిమ।
ద్భూషణమృదుభాషణబుధ । పోషణచణతరణివంశభూషణరామా॥ ౪॥

క॥ భూసురహితభాసురచరి । తాసురసంత్రాసకరశరాసనబలవ।
ద్వాసవతనయాసుమరు । ద్గ్రాసలసత్ప్వదరభోగిగణవరరామా॥ ౫॥

క॥ కరుణారసవరుణాలయ । తరుణారుణకమలచరణదానవహరణా।
శరణాగతభరణాతివి । తరణైకాభరణభవవిదారణరామా॥ ౬॥

క॥ కుండలయుగమండితమృదు । గండస్థలచండదనుజఖండనపటుదో।
ర్దండాశ్రితషండావన । శౌండాండజకాండకాండజనయనరామా॥ ౭॥

క॥ వందనముసనందనముని । వందితచరణారవిందవైకుంఠదశ।
స్యందనవరనందనబుధ । చందనతనులిప్తసురభిచందనరామా॥ ౮॥

క॥ దీనపరాధీనపరా । హీనవిహంగమకులీనహీనాత్ముడనా।
నేనాత్వదనూనగుణా । ధ్యానముసేయఁదగువాఁడహరిహరిరామా॥ ౯॥

క॥ రామాయనివేమాఱొక । భామామణిచిలుకఁబెంచిపలికించినయా।
లేమకుఁగడుప్రేమఁబరమ । ధామముసంగితివిగాదెతడయకరామా॥ ౧౦॥

క॥ కొంచకనువిరించినిగిక । రించిత్రిషుతుల్గాన్నరేయిద్రిమ్మరిమిన్నం।
బించంబడఁగించుటకును । దంచితమీనంబవైతివాభళిరామా॥ ౧౧॥

క॥ కమఠాకృతినమరాసురు । లమృతాబ్ధినిద్రచ్చువేళనడుగంటినమం।
థమహీధ్రముసమధికస । త్వముచేఁదేల్చితివియద్భుతంబుగరామా॥ ౧౨॥

క॥ ధరఁబుట్టుకశరనిధిలోఁ । జొరఁబాఱుకడానికంటిసోఁకుడు తేనిం।
బరిమార్చుటకరుదారఁగఁ । గిరివై తివిగాదెయశముగీల్కొన రామా॥ ౧౩॥

క॥ దంభోళిధరాంభోరుహ । సంభవభవముఖ్యులక్కజంబందసభా।
స్తంభంబున డింభద్రో । హింభంజించుటకుఁ బొడమితెలమిని రామా॥ ౧౪॥

క॥ వడుగనఁదగి వుడమినిమా । డడుగులు బలినడుగనిడి నడరుచుమహిమా।
ధ్యుఁడవై కడువడిఁ జేకొని । తెడనూపకముజ్జగంబు లెంతయు రామా॥ ౧౫॥

క॥ ఖ్యాతిగభృగుజాతుఁడవై । నీతనయోర్వ్వతలాధినేతలనుధరి।
త్రీతలమున శాతకుతా । రాతతహతిఁద్రుంచిమించితౌనా రామా॥ ౧౬॥

క॥ దశముఖముఖపిశితాశవ । రశతంబులఁద్రుంచిసురలరక్షించుటకై।
దశరథగర్భశరధిపూ । ర్ణశరద్విధుఁడనజనించినాఁడవు రామా॥ ౧౭॥

క॥ హలివై దోర్బలివై భూ । స్థలిపై బలరాముఁడనఁగజనియించిమదాం।
ధులనెల్లనుబొలియించితి । తలభారంబుడిపితౌఁబదంపడి రామా॥ ౧౮॥

క॥ బుద్ధతనుబ్రసిద్ధుఁడవై । శుద్ధమతింద్రిపురసురనిషూదనకాంతా।
బద్ధవ్రతరుద్ధమునుస । మిద్ధగతింజేసితౌమహీవర రామా॥ ౧౯॥

క॥ కలిగర్వముఁదొలఁగించఁగ । నలగాటపుతేజినెక్కియడిదముకేలం।
దులకింపఁగఁగలికియనఁ । ఖలషండముఁద్రుంచితీవకావే రామా॥ ౨౦॥

క॥ సేవకజనశేవధివని । ప్రావీణ్యముతోడబుధులుపలికినపలుకుల్।
సేవినినినుసేవించితి । నావలనీచిత్తమెట్టులట్లగు రామా॥ ౨౧॥

క॥ అక్కటయనిమక్కువఁగని । గ్రక్కుననను్ఁబ్రోవకున్నఁగావఁగవేఱే।
దిక్కెవ్వరునెక్కొనువగ । లెక్కరణింబాయఁదెల్పవేదయ రామా॥ ౨౨॥

క॥ నీవారమునావారల । దేవారక్షింతుననుటదృఢమగునేనిన్।
నీవాఁడనిదేవీడకు । నేవేగననేరసారెనిజముగ రామా॥ ౨౩॥

క॥ అప్పానినుదెప్పితినని । తప్పుగనీవెన్నఁబోకుదయతోనీవా।
చొప్పనమునుజెప్పితివను । టొప్పగవినుచుంటనంటినోడక రామా॥ ౨౪॥

క॥ మీపదరజమాపదలను । బాపఁదగుందొల్లిశాపభరమునశిలయా।
తాపసకులరూపవతి । న్నేపరముపవిత్రఁజేసివెలయవె రామా॥ ౨౫॥

క॥ నమ్మిననినునమ్మఁగవలె । నమ్మంగాఁదగనివారినమ్మఁగనేలా।
నమ్మినరేద్రిమ్మరిదొర । తమ్మునిదయఁబ్రోచితివికదామును రామా॥ ౨౬॥

క॥ నేనన్నిటహీనాత్ముఁడ । నైనభవత్కరుణఁ జెందనంతసుజనుఁడం।
గానామా నేనానీ । తోనావెతలుగ్గడించదూఱక రామా॥ ౨౭॥

క॥ నీదాసుఁడనై దీనత । నోదేవర పొట్టకొఱకు నొరులను వేఁడన్।
రాదుగదా నీదెకదా । వాదుమదార్తినిహరింపవలదా రామా॥ ౨౮॥

క॥ మున్నిట్టివిపన్నులకుఁ బ్ర । సన్నుఁడవై ప్రోచినట్టిసదయాత్ముఁడవీ।
వన్నందుకు నన్నిప్పుడు । మన్నించుట సాక్షిగాదె మహిలో రామా॥ ౨౯॥

క॥ కనకాంబర సనకస్తుత । జనకసుతారమణ నీదుశరణొందియు నేం।
దనుకను నేఁగొనకొనినన్ । వెనుకొను కర్మములననుభవింతును రామా॥ ౩౦॥

క॥ ఘోరంబు నసారంబును । దారంబగు భవపయోధిఁ దల్లడపడుచున్।
బారముగన నేరసుదరిఁ । జేరుప భారకుఁడవీ వెసిద్ధము రామా॥ ౩౧॥

క॥ పరధనములఁ బరకాంతలఁ । బొరిఁబొరిఁ గని మోహతాపమునఁ బొరలుదుమీఁ।
దరయక దేవర యిఁక నా । దొరయొకఁడాదుకొనవే ఱెదొరకునె రామా॥ ౩౨॥

క॥ ప్రాయము చెడిపోయెఁ బశు । ప్రాయుఁడనై నేయరాని పాపములెప్పుడున్।
జేయుదు మదిరోయక సదు । పాయంబిఁక నెద్ది తెలియఁబల్కవె రామా॥ ౩౩॥

క॥ జడమతినై చెడుత్రోవలఁ । బడితిన యానీవు పతితపావనబిరుదాం।
కుఁడవై సదయుఁడవై నను । బడవైవఁగఁదగదు యముని బారిని రామా॥ ౩౪॥

క॥ కాయంబనపాయంబగు । నేయంబుజభవునకైన నిముసంబునకే।
మాయనితలపోయుచు మదిఁ । బాయక నినుఁగొల్చువారె ప్రాజ్ఞులు రామా॥ ౩౫॥

క॥ ఎన్నఁడు నాకన్నుంగవ । కున్నతిఁ గావించుతావకోజ్జ్వలరూపం।
బన్నిటవినియున్నాఁడఁగ । దన్నా సౌందర్యనిధివటంచును రామా॥ ౩౬॥

క॥ బాధితరిపుయోధసుధా । మాధుర్యము చిలుక నొక్క మాటాడఁగదే।
శ్రీధాత్రీనాథాసుజ । నాధారక చెవులపండువయ్యెడు రామా॥ ౩౭॥

క॥ ఏలాకరు లేలాహరు । లేలాతరుణీలలాము లే పారఁగమీ।
లీలాగుణజాలానుభ । వాలోలత లేనివానికరయఁగ రామా॥ ౩౮॥

క॥ అపరాధిని జపలుండను । గపటాత్ముఁడ నన్ను నెట్లుగాచెదవో నీ।
కృపవడయఁగ జపతపములు । నుపవాసము లేమిసలుప నోపను రామా॥ ౩౯॥

క॥ ఉల్లము రంజిల్లఁగఁ బద । పల్లవముల సేవచేసి భవదీయుఁడనై।
యుల్లసిలఁగ నెల్లనహో । కల్లరిసంసారసుఖముఁ గైకొని రామా॥ ౪౦॥

క॥ ఏరీతిని దూఱుదు న । న్నారూఢిగఁ బ్రోవవైతివనుచు మదీయ।
ప్రారబ్ధము ఘోరంబై । గారింపఁగ నేమి సేయఁగానగు రామా॥ ౪౧॥

క॥ వేమఱు నిటు నే మొఱలిడఁ । గా మఱుమాటాడవేమి కారణ మకటా।
పామరుఁడని యేమఱితివొ । తామరసదళాక్ష నీకు ధర్మమె రామా॥ ౪౨॥

క॥ అందేనియు నిందేనియు । నెందేనియు నీవ ప్రోవ నీశ్వరుఁడవు నా।
డెందము తిర మొందఁగఁ జే । యందగు నభయప్రదాతవగుచును రామా॥ ౪౩॥

క॥ నీవే దీనావనుఁడవు । నావిని కాదే మహాత్మ నను బ్రోచుటకై।
వేవిధముల నే వేఁడుట । నా విన్నప మేల చెవిని నాఁటదు రామా॥ ౪౪॥

క॥ తోఁచక యిటు వాచఱచెద । నా చందము టుండనిమ్ము నన్నిఁక నైనన్।
బ్రోచెదఁ బోఁ ద్రోచెదనని । దాఁచక నీ వానతిమ్ము దయతో రామా॥ ౪౫॥

క॥ నీకర్మము నీకయ్యెడు । నాకేమి కొఱంత దీన నన్నన కుము నే।
వో కాళ్ళం దాఁకిన లత । వీఁకం దెగఁజూడ నెందు విహితమె రామా॥ ౪౬॥

క॥ నీవార్తజనావనుఁడవు । గావా నే నార్తివశుఁడ గానా మఱియే।
భావంబున బ్రోవక ననుఁ । జేవదలఁగఁజూచెదవు వచింపవె రామా॥ ౪౭॥

క॥ చానలపై సూనులపై । మేనులపై మమతవిడిచి నీపదకమల।
ధ్యానామృతపానరతి । న్మానుగ మనువారె భువనమాన్యులు రామా॥ ౪౮॥

క॥ దెప్పరములఁ దప్పించుచు । నెప్పగ శేషాచలేశు నోజను జూలా।
ర్యప్పని సిరులొప్పఁగ దయ । నెప్పుడుఁ బోషించువాఁడవీవే రామా॥ ౪౯॥

క॥ ఎందును గవిబృందములను । మొందఁగఁ బంచాశదాఖ్య నొనరించితినీ।
కందమ్ముల నందమ్ముగ । పొందమ్ములు గాఁగఁగొనుము పొందుగ రామా॥ ౫౦॥

సమాప్తము.

---

శ్రీరస్తు.

# యదువంశభూషణశతకము.



ఉ॥ శ్రీకర యోగిమానసవశీకర కంసముఖాసురేంద్రహృ
ద్భీకర చంద్రశేఖరవిధిస్వరధీశ్వరవంద్యరత్నచా
మీకరభూషణాకర సమిద్ధకృపాకర కాళియాహ్వద
ర్వీకరగర్వనాశకర కృష్ణహరీ యదువంశభూషణా॥ ౧॥

ఉ॥ బాలతమాలనీల పరిపాలితసర్వసుపర్వజాలగో
పాలవిలాసినీహృదయపంకజరాజమరాళ దుష్టభూ
పాలకజాలశైల సురపాలక కళిందసుతాతటీలస
త్ఖేల సదానుకూలబల కృష్ణహరీ యదువంశభూషణా॥ ౨॥

ఉ॥ శ్రీతరుణీసమేత నిజసేవకచాతకజాతనీలజీ
మూత బలానుజాత సురముఖ్యజనూత విధూతపాతక
వ్రాత భవాబ్ధిపోత మునివందిత పజ్జలజాత సామసం
గీతవిలోలతామహిత కృష్ణహరీ యదువంశభూషణా॥ ౩॥

ఉ॥ తారపటీరహీరవిధిదారసుధారజతాగకీర్తివి
స్తార పృథాకుమారసముదారతరార్తివిదార దీనమం
దార సుమేరుధీర వరధర్మవిచార విపన్నివారయ
ర్వీరమణీభరాపహర కృష్ణహరీ యదువంశభూషణా॥ ౪॥

ఉ॥ ఈశముఖాబ్జనిర్జితనిశేశదినేశసహస్రకోటిసం
కాశ పలాశనాశరణకర్కశ షోడశకామినీసహ
స్రేశ రమేశ కేశవ పరేశ వికుంఠనివేశ శ్రీహృషీ
కేశ సుధాశనాధివశ కృష్ణహరీ యదువంశభూషణా॥ ౫॥

ఉ॥ వాణినుతించి మద్గురులవర్ణనచేసి కవీంద్రకోటికిం
బాణియుగంబు మోడ్చి రసబంధురవాక్ప్రసవాళిచే జగ
త్త్రాణధురీణ పద్యశతదామకముల్ రచియించి భక్తిపా
రీణత నిత్తుఁ గైకొనుము కృష్ణహరీ యదువంశభూషణా॥ ౬॥

చ॥ తలఁపఁగ సాహితీచతురతాలవలేశము లేదు లక్షణం
బుల తెఱఁగెట్టిదో తెలియఁబోలదు పూర్వకవిప్రయోగవా
గ్విలసనమా యెఱుంగను గవిత్వము చెప్పఁగఁబూని నాఁడన
న్నెలమిఁ గృతార్థుఁ జేయఁదగుఁ గృష్ణహరీ యదువంశభూషణా॥ ౭॥

చ॥ సనకసనందనాదులు వెసన్నిగమోక్తులఁ బ్రస్తుతింపఁజా
లనిమిము మూఢవాక్యములలజ్జ దొఱంగి నుతింపఁజూతు నే
పునగజరాజబృందములు పోనొకఁగూడని నీటఁ జీమ పే
ర్చినతమి నేఁగఁజూచుగతిఁ గృష్ణహరీ యదువంశభూషణా॥ ౮॥

చ॥ అనఘ భవద్గుణానుభవ మబ్బినమాత్రమె చాలు మత్పురా
తనఘనసంచితోద్వృజినతండముఁ గండడఁగింప నెట్లు నా
ననలకణంబు చాలదె యనల్పనగోపమ తూలరాశిపై
నెనయుచు వేదహించుటకుఁ గృష్ణహరీ యదువంశభూషణా॥ ౯॥

ఉ॥ మీచరణారవిందముల మీఁదఁ దలంపిడు బుద్ధి తోఁచ నే
తోఁచదు తోఁచె నా మెఱుఁగు దోఁచియడంగిన భంగి నంతలో
నే చపలత్వమందు నిదినిక్కము నాదగు కర్మ మెట్టిదో
ఖేచరలోకపాలనుత కృష్ణహరీ యదువంశభూషణా॥ ౧౦॥

ఉ॥ మీకథ లాలకించుచును మిమ్ము నుతించుచు మీకు మ్రొక్కుచు
న్మీకమనీయమూర్తి నెలమిం గనుఁగొంచు సదాత్వదీయులై
జోకదలిర్చు సజ్జనులశోభనపాదరజంబు నాదలన్
శ్రీకరమంచుఁ దాల్చెదను గృష్ణహరీ యదువంశభూషణా॥ ౧౧॥

చ॥ అరయ జగత్కుటుంబివయి నందునదుర్జనుఁ డంచు నీవున
న్విరసతఁ జూడఁగూడదని వేకవుఁ బుత్రులఁ దల్లిదండ్రు లే
కరుణ దొఱంగి పోనడువఁ గల్గుదురే యొరులాదరింపఁగా
గిరిధర నీవెఱుంగనిదె కృష్ణహరీ యదువంశభూషణా॥ ౧౨॥

చ॥ పతితులలోన నెన్నికకుఁ బాత్రుఁడ నౌనను సత్పవిత్రుఁ గా
నతులకృపామతిన్ మనుప నాముమునున్నటు నేయకున్న చోఁ
బతగతురంగ నీపతితపావననామము చెల్లుటెట్టులా
శ్రితులెవరైన నమ్ముదురె కృష్ణహరీ యదువంశభూషణా॥ ౧౩॥

ఉ॥ నెమ్మిఁ గమూద్యశాశ్రితుల నేకులు మీకు భవాద్యశుండని
క్కమ్మిఁ గమమ్ముఁ బ్రోవమటిఁ గల్గఁడు వేఱొకఁ డెట్టు నంజకో
రమ్ములు పెక్కు రాజునకు రాజ్యకరుం డెకదయ్యపోషకుం
డిమ్ముగఁ దద్ద్విజావళికిఁ గృష్ణహరీ యదువంశభూషణా॥ ౧౪॥

చ॥ వెలయఁగ ముంగిటన్నిలుచు వేలుపుటావుఁ దొంగిగొడ్డుటా
ఫులఁ బిదుకంగ ఁ గంగుగతిఁ బొల్పుగ సర్వఫలప్రదాతవై
యల రెడు నిన్నుఁ గొల్వక యనార్యులు కొంచెపు వేల్పులందుమి
క్కిలి భ్రమఁ జెంది కొల్చెదరు కృష్ణహరీ యదువంశభూషణా॥ ౧౫॥

ఉ॥ తావకసేవఁ బాసి వనితాసుతగేహయుతాజవంజవ
వ్యావృతులై తదీయసుఖ మక్కట చక్కనగాఁ గణింతురెం
తే వివరించి చూడ నది తేనియఁ బూసిన కత్తిచందమై
శ్రీవర చేటొనర్చుఁ దుదిఁ గృష్ణహరీ యదువంశభూషణా॥ ౧౬॥

ఉ॥ కానక తామె యంతటికిఁ గర్తలమందురు స్వల్పవిపుణా
నూనులు దల్లి యారు జలసోలుచుఁ ద్రెళ్లెడు వారి వైద్యుఁడు
న్మానుగ వార్ధిలో మునుఁగు నావను బేరగు కర్ణధారుఁడుం
శ్రీనిధి ప్రోవఁ జాలిరొకొ కృష్ణహరీ యదువంశభూషణా॥ ౧౭॥

చ॥ తనువు నిమేషభంగురము తథ్యము సంపద లింద్రజాలము
ల్తనయులు నాండ్రుఁ జుట్టములుఁ దల్పఁగ నప్పులవారటంచుఁ జ
య్యన మది రోసి మీభజన మేతరి నూఁదక యున్న జన్మవా
ర్థిని దరియింప నెట్లగును గృష్ణహరీ యదువంశభూషణా॥ ౧౮॥

చ॥ వ్యయమున కోర్చి తాననుభవంబు గిఁ జేయక యర్థకోటికిం
బ్రియమున నియ్యలేక మదిఁ బేర్చు దురాశను జుంటియీఁగ తే
నియఁ గడుఁ గూడఁబెట్టు గతి నిచ్చలు లోభిధనంబుఁ గూర్పన
ప్రియతఁ బరుల్ గ్రహింతురది కృష్ణహరీ యదువంశభూషణా॥ ౧౯॥

చ॥ సిరిగలవాని యాచకులు సేరినచోఁ ధనిలోభి యాచనా
దరణ మొనర్పఁ దద్ధన తెతక్కువయా మదగంధకాంతుచే
నరుగు మధుప్రతాళి శ్రవణాహతిఁ దోలు గజాస్యమండనం
బిరుదెస మానిపోవు గతిఁ గృష్ణహరీ యదువంశభూషణా॥ ౨౦॥

చ॥ సరసుఁడుగానిమానవునిసంపదకాసయొనర్చుటెల్లబం।
ధురఫలభారనమ్రమగుతోరపుబూరుగుఁజేరియాశుకో।
త్కరములుగాంక్ష చేసినవిధంబగుఁగాదెతలంచిచూచినన్।
గిరివరజాధినాథసఖకృష్ణహరీయదువంశభూషణా॥ ౨౧॥

చ॥ కులబలరూపసంపదలకుంఠితవైభవమెంతగల్గినన్।
వెలయనపండితుండయినవిశ్రుతగంధవిహీనకింశుకో।
జ్జ్వలకుసుమంబు చాడ్పుననువానికి నెక్కుడుధాత్రిలో సదో।
ర్జ్వలసితశార్ఙ్గచాపవరకృష్ణహరీయదువంశభూషణా॥ ౨౨॥

ఉ॥ ధాతనుమోసపుచ్చివిబుధద్విషదగ్రణియైనసోమకా।
ఖ్యాతుఁడు వేదముల్గొనిరయంబుననంబుధిలోఁజొరంగఁబ్ర।
స్ఫీతఝషాకృతిందనుజుఁబీఁచమడంచిశ్రుతుల్ పతత్రిరా।
ట్కేతనధాతకీవెమునుగృష్ణహరీయదువంశభూషణా॥ ౨౩॥

ఉ॥ తొల్లిసురాసురుల్దివిరిదుగ్ధపయోధిమథించువేళశో।
భిల్లుకుభృద్వతంసముగుభిల్లునఁగ్రుంగఁగఁగచ్ఛపాకృతిం।
బెల్లుగశైలమెత్తిసుధవెల్వడునంతసురాళికిచ్చివ।
ర్థిల్లఁగఁజేసితీవెకదకృష్ణహరీయదువంశభూషణా॥ ౨౪॥

ఉ॥ ధారుణిఁజుట్టచుట్టుకొనిధైర్యముతోడహిరణ్యనేత్రుఁడ।
వ్వారిధిలోనికేగిననవారితతేజముతోడఘోణివై।
యారజనీచరేంద్రునరుదారవిదారితుఁజేసికోఱచేఁ।
గేరుచుధాత్రినెత్తితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౨౫॥

చ॥ చటులతరాట్టహాసమునసారెకునబ్జభవాండభాండముల్।
పెటిలిపడంగఁగంబమునభీకరమొప్పఁగనుప్పతిల్లియా।
దటఁదనుజాపరాధియగుదైత్యునిఁద్రుంచితదీయపుత్రునిం।
గిటుకెడనేసిప్రోచితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౨౬॥

చ॥ ప్రతిగనరానితేజమునఁబ్రొథతవామనవర్ణివైవదా।
న్యతవిలసిల్లునాబలినినల్లనఁజేరిపదత్రయంబువి।
శ్రుతవసుధాతలంబడుగస్రుక్కకయిచ్చినయంతవిష్టప।
త్రితయమునాక్రమించితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౨౭॥

ఉ॥ వీతనునీతులైనపృథివీతలనేతలజాముదగ్న్యతఁ।
శాతకుఠారధారను(దిసప్తకవారములద్భుతంబుగా।
ఘాతమొనర్చితద్రుధిరకాండముచేఁబితృతర్పణంబుసం।
(ప్రీతిదలిర్పఁజేసితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౨౮॥

చ॥ జనకునియాజ్ఞచేవనికిజానకితోఁజనిమాయలేఁడినిం।
గొనకొనిత్రుంచిభూమిజనుగోల్పడిభానుజుఁగూడివాలిను।
ర్దనమొనరించికంధిఁగటుదాఁటిదశాస్యువధించినీతతో।
నెనయవెరామమూర్తివయికృష్ణహరీయదువంశభూషణా॥ ౨౯॥

చ॥ బలముననెక్కుడౌటబలభద్రుఁడనన్వెలసిల్లిపేర్మితో।
హలముఖసాధనంబులరుదారఁగఁదాల్చిప్రలంబముఖ్యులం।
దలపడికూల్చిహస్తిపురిఁదద్దయునొడ్డగిలంగనెత్తవే।
కెలనమహాద్భుతంబనఁగఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౩౦॥

ఉ॥ వాసవశత్రుతౌత్రిపురవాసులుభాసురశౌర్యవైభవో।
ద్భాసితులై మెలంగఁగెఱుపందలపోయుచుబుద్ధమూర్తివై।
చేసినయట్టికృత్యములుచెప్పఁగఁజోద్యములౌఁగదాబుధా।
గ్రేసరపూజితాంఘ్రియుగకృష్ణహరీయదువంశభూషణా॥ ౩౧॥

చ॥ అతికలుషాత్ములైకలియుగాంతమునందుఁజరించుదుష్క్రియా।
రతులవధింపనుత్తమతురంగమునెక్కిశితాసిఁబూనిత।
త్ప్రతితులసంహారించికృతధర్మునిల్పెదుకల్కివీవెకా।
కితరులుగల్గఁబోలుదురెకృష్ణహరీయదువంశభూషణా॥ ౩౨॥

చ॥ అరిదరశార్ఙ్గనందకముఖాయుధహస్తచతుష్టయంబుతో।
నురుచిరశక్రనీలరుచిశోభితమంగళవిగ్రహంబుతో।
స్థిరకగుత్రేఁగువాపుటకు దేవకికింజనియించితౌసన।
ద్గిరిశముఖామరుల్పొగడఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౩౩॥

చ॥ ఉదితుఁడవౌతఱిందగుమహోజ్జ్వలరూపముదక్కివిస్మయా।
స్పదముగమానవార్భకునిభంగిమెలంగియశోదపెంపఁబెం।
పొదవుటకై తదీయగృహమొయ్యనఁజేర్పుమునాథవద్గరుం।
డెదముదమొందిచేర్చెఁదగఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౩౪॥

ఉ॥ పాతకియైనకంసుఁడనుపన్విషయుక్కుచయుగ్మభారయై।
పూతనవచ్చిచన్గుడుపఁబుట్టియుఁబుట్టకమున్నెయట్టిదు।
ర్జాతినిభూతకోటులలరంబరిమార్చితివెట్టిచిత్రమో।
శ్రీతులసీస్రగాభరణకృష్ణహరీయదువంశభూషణా॥ ౩౫॥

చ॥ అసదృశముల్భవన్మహిమలారయనేరికిశక్యముయ్యాపా।
ల్పెసఁగఁగనయ్యశోదరచియించినపొత్తులఁబండిబండిర।
క్కసునికుసూత్రమాత్మఁగనిగ్రక్కునవెత్తురుగ్రక్కఁదన్నవే।
కిసలయసన్నిభాంఘ్రులనుగృష్ణహరీయదువంశభూషణా॥ ౩౬॥

ఉ॥ నందవధూటియేవ్రతమొనర్చెనొపూర్వభవంబునన్శతా।
నందునిఁగన్ననిన్నుఁదననందనుఁడంచునుజుంచుదువ్వియా।
నందమెలర్పఁజన్గుడిపినందునిచేతికొసంగిపొంగఁగ।
ల్గెందగనవ్వధూమణికిఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౩౭॥

ఉ॥ కెంపులబావిలీలుదులకింపఁగమౌక్తికహారవల్లరుల్।
తుంపెసలాడఁగుంగురులుదూఁగఁగుచద్వయముల్నటింపనిన్।
సొంపుగనూఁచిపాడువ్రజసుందరులంగనినవ్వునాడువీ।
క్షింపఁగనైతినీసొబగుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౩౮॥

చ॥ అడరెడుకిన్కభోజకులజాధముఁడాసుడిగాలినల్లద్రా।
గుడుగమి కానిఁబంపనినుఁగొంచువిహాయసవీధికేగున।
య్యెడమెడవట్టివానిఁదిగనీడిచికూల్చవెబోరతోనఁబ్రాఁ।
కెడుకడుచిన్నిప్రాయమునఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౩౯॥

ఉ॥ చక్కనిముద్దుసెమ్మొగముచక్కెరలొల్కెడుదొక్కుఁబల్కులున్।
ముక్కునఁజొక్కమైతనరుముత్తియముంజిగినల్లగల్వడాల్।
చిక్కనితేజముంగలిగిచెన్నలరారిననీదురూపమే।
నెక్కుడుమక్కువందలఁతుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౪౦॥

చ॥ అనిశముమంత్రపూతహవిరాజ్యసమన్వితయాగభోక్తవై।
తనరెడునీవుగోపికలదల్పఁగ్రుముచ్చిలిపాలువెన్నలుం।
గొనుటదియేమికారణమొకోయనినామదినెంతునెవ్వడుం।
గినియకతెల్పుమువ్విధముఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౪౧॥

ఉ॥ మన్నుఁదినంగఁ బాడియె కుమారక మృషావచనుండు గాని మీ।
యన్నయె తెల్పె నన్నుఁ దగదమ్మ తదుక్తులు నమ్మ మోమునీ।
కన్నులఁ జూడవమ్మ యని క్రన్నన నఁ దల్లికి ముజ్జగంబు లీ।
వెన్నిక మీఱఁ జూపితవుఁ గృష్ణహరీ యదువంశభూషణా॥ ౪౨॥

చ॥ బలువడిఁ ద్రచ్చుచున్న దధిభాండము బ్రద్దలు చేసితంచుఁ దా।
నలిగి యశోద నిన్ను బెదరంటఁ గరోటను గట్టి వేయ వి।
చ్చలవిడి నీడ్చి కొంచరిగి చయ్యన మద్దులసందు దూఱితె।
గ్గిలక యకూలఁ ద్రోచితవుఁ గృష్ణహరీ యదువంశభూషణా॥ ౪౩॥

ఉ॥ గోపకుమారవర్గములఁ గూడి కళిందజపాంతఁ గ్రేపుల।
న్మేపుచుఁ గ్రేపురూపమున మెల్కువతోడఁ జరించు దైత్యునిం।
బాపురె మంచిలేఁగ యని పట్టుక చెట్టునఁ బెట్టి కొట్టవే।
క్రేపుల కాపరుల్ పొగడఁ గృష్ణహరీ యదువంశభూషణా॥ ౪౪॥

చ॥ ప్రకటితవజ్రనిర్దళితపాండురభూధరకూటసన్నిభాం।
గుఁడు బకాసురుండు నిను గ్రద్దన మ్రింగి సహింపలేక కు।
త్తుక వెడలింప నత్తులువ తోరపుఁ జంచులు పట్టి రెండుచీ।
రికలుగఁ జేసి చంపితవుఁ గృష్ణహరీ యదువంశభూషణా॥ ౪౫॥

చ॥ అరుదగు పెంపుతో నజగరాకృతిఁ బొల్చు నఘాసురాస్యగ।
హ్వరమునఁ జొచ్చు గోపసుతవత్సములం గని నీవు వెంటనే।
పరువడిఁ జొచ్చి తద్గళము బ్రద్దలు వాపి వెడల్పవే వెతం।
గెరలెడు వత్సబాలకులఁ గృష్ణహరీ యదువంశభూషణా॥ ౪౬॥

చ॥ కమలదళాంతరస్ఫురితకర్ణికఁ బోలెఁ గుమారమధ్యభా।
గమున వసించి సవ్యకరకంజములో నిడి యూరుఁగాయతో।
నమరుల నోరులూరఁ దని వారఁగఁ జల్దిభుజించునట్టి కో।
ర్కి మదికి నెందు నీకొదవెఁ గృష్ణహరీ యదువంశభూషణా॥ ౪౭॥

చ॥ నినుఁ గికురించి వత్సముల నీ చెలికాండ్ర విరించి దాఁచినం।
బనుపడఁ దత్స్వరూపములఁ బ్రౌఢతఁ దాల్చి యొకేఁడు గోపికా।
జనముల గోగణంబులను సంతసమొందఁగఁ జేసినట్టి నీ।
కెనఁగనఁ బోలు నే భువిని గృష్ణహరీ యదువంశభూషణా॥ ౪౮॥

ఉ॥ దానవభర్త ధేనుకుఁడు దాళవనంబున బంధుయుక్తుఁడై।
మానవులం గ్రసింపన సమానబలంబునఁ జొచ్చి తద్వన।
గ్లాని యొనర్చి యమ్మనుజఘస్మరు నీరివధింపఁగాఁ ద్రిలో।
కీనుత సంతసించితవుఁ గృష్ణ హరీ యదువంశభూషణా॥ ౪౯॥

ఉ॥ సంగడికాండ్రు గోగణము చయ్యన నయ్యమునా సరిత్పయ।
స్సంగతలేలిహానవిషజాలముఁ గ్రోలి విపత్తిఁ దూలి కూ।
లంగఁ గటాక్షవీక్షణములం దిలకించి సజీవులౌచుఁ బే।
ర్మిం గనఁ జేసితీ వెకద కృష్ణ హరీ యదువంశభూషణా॥ ౫౦॥

చ॥ అనుపమ కాళియోరగవిషానలతప్తకళిందకన్యకా।
వనమును జీవనం బగుచు వానికి నెక్కఁగఁ జేతు నంచహీం।
ద్రుని పయి నెక్కి దుర్మదము దూలఁగఁ ద్రొక్కి తదంగనాళి మ్రొ।
క్కఁ గరుణించి పుచ్చితపుఁ గృష్ణ హరీ యదువంశభూషణా॥ ౫౧॥

ఉ॥ వారక చుట్టుముట్టు దవవహ్ని నడంపుము కృష్ణ కృష్ణ య।
స్భీరుల గోపగోపికలభీతిలఁ బోఁడఁటంచు మించుత।
ద్ఘోరదవానలార్చులను గ్రోలితి దాప్తులఁ బ్రోచితుల్లస।
ద్ధీరమణీమయాభరణ కృష్ణ హరీ యదువంశభూషణా॥ ౫౨॥

చ॥ విలసదపాంగదృష్టులను వేమఱు గన్గొని నొక్కగోపికా।
లలనలు మోహ మొందఁగ శిలల్గరఁగన్స్మెరటుల్చి గుర్వభా।
నిలుచును గర్ణరంజనము నేయు భవన్మురళీరవామృతం।
బెలమి మదిష్ట మీవుతను గృష్ణ హరీ యదువంశభూషణా॥ ౫౩॥

చ॥ జలముల నాడుచున్న వ్రజసారసగంధులచీర లెల్ల ద్రుము।
చ్చిలి యల కామినీమణుల చేతను మ్రొక్కులు గాంచి యిచ్చుట।
ల్వెలయఁగ లీల సల్పుటకొ లేక మనంబున వారు గోరు కో।
ర్కెలు ఫలియింపఁ జేయుటకొ కృష్ణ హరీ యదువంశభూషణా॥ ౫౪॥

ఉ॥ సారససంభవాదికృత సర్వమఖంబుల సర్వభోక్తవై।
యారయఁ దృప్తిఁ గాంచని మహాత్ముఁడ వీవు మహీసురాంగనా।
వారసమర్పితాన్నమని వారిత కాంక్ష భుజించి తృప్తిమైఁ।
గేరితి వెంత వింతయిది కృష్ణ హరీ యదువంశభూషణా॥ ౫౫॥

ఉ॥ వల్లవులుత్సవంబడఁచివైచిరహాయని వారలక్షశచీ।
వల్లభుఁడశ్మవృష్టిఁబొదువంగనగంబొకకేలఛత్రమై।
యుల్లసిలంగఁదాలిచియథోచితసౌఖ్యముఁగాంచివారువ।
ర్తిల్లఁగఁజేసితీవెకదకృష్ణహరీయదువంశభూషణా॥ ౫౬॥

చ॥ వనినొకనాడునందుఁడుపవాసముచేసినిశింగృతావగా।
హనుఁగనుఁడుంజలేశభటుఁడాయనవేగొనిపోవఁదోడనే।
చనిమకరాళ్వచేవినయసత్కృతిఁగాంచిప్రభావమొప్పఁదం।
డ్రినివరలంగఁదెచ్చితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౫౭॥

చ॥ వరుణునిప్రోలికింజనిభవజ్జనకుంగొనివచ్చినట్టినిన్।
గరమనురక్తినీశ్వరునిఁగామదిగోపకులుగ్గడించుచుమే।
లరసిపొసంగవారలకునాత్మపదంబునుబ్రహ్మలోకమున్।
గిరిధరచూపవేదయనుగృష్ణహరీయదువంశభూషణా॥ ౫౮॥

చ॥ ఒకముకురాస్యముద్దుగొనియొక్కలతాంగినిఁగౌఁగిలించివే।
ఱొకమధురాధరాధరరసోర్మ్ములనానుచునిట్లుగోపికా।
ప్రకరమనోహరస్థితినిరాసమునన్విహరించునిన్నుసా।
రెకుమదిలోభజించెదనుగృష్ణహరీయదువంశభూషణా॥ ౫౯॥

ఉ॥ ఒక్కెడనందగోపముఖులాయ్యనయ్యభవున్భజించుపె।
న్మక్కువనేగియున్నతఱినందునిఁబట్టుకక్రమింగఁబూనునా।
పిక్కలిచిల్వఁద్రొక్కివిడిపింపఁగఁవత్ఫణిదివ్యుఁడై చని।
న్నెక్కుడుభక్తినెంచెఁగదకృష్ణహరీయమువంశభూషణా॥ ౬౦॥

చ॥ వనమునననిస్మెఱింగివ్రజవారిజనేత్రలశంఖచూడుఁడన్।
ధనదభటుండుగొంచరుగఁదద్దయుఁగిన్కనువెంటనంటియా।
వనితలడించిపాఱెడునవజ్ఞునిఁబట్టివధించిమౌళిఁగ।
ల్గినఘనరత్నముంగొనవెకృష్ణహరీయదువంశభూషణా॥ ౬౧॥

ఉ॥ మత్తతనావృషాసురుఁడుమందనుగొందలమందఁజేయఁగా।
నత్తఱివానితోఁదొడరియాగ్రహమొప్పఁగఁబోరొనర్చుచుం।
గుత్తుకఁబట్టినేలఁబడఁగూలిచికొమ్ముపెకల్చిమొత్తియొ।
క్కొత్తునఁజంపితీవెకదకృష్ణహరీయదువంశభూషణా॥ ౬౨॥

ఉ॥ అప్పుశతాశకేశతురగాకృతి డాసినవానినీవు వే।
ద్రిప్పి గిరాలు నవ్వయివఁ దెప్పిటిపైఁ జనుదేర నూరకే।
లాప్వఁగఁ జొన్పి పెంపఁదగ నూపిరిసల్పక మేను వ్రయ్యలై।
రిప్పన నేలఁగూలెఁగద కృష్ణహరీయదువంశభూషణా॥ ౬౩॥

ఉ॥ వ్యోముఁడను నాఁ బ్రసిద్ధుఁడగు నెక్కును రాంతకుఁ డాటలోనను।
ద్దాముత ముచ్ఛన బరఁగి తద్దయుఁ జౌతురిమిఁజ బాలక।
స్తోమము నెక్కొండగు హఁ... న్పబళీయని వానిఁ ద్రుంచిదయా।
గీ మెడలించి కౌసఖులఁ గృష్ణహరీయదువంశభూషణా॥ ౬౪॥

ఉ॥ క్రూరతఁ గంసుఁ డంపఁ గనకుం ...తభక్తి ని వచ్చి మిమ్ముఁ న।
క్రూరుఁడు దోడు కొంచరుగు తోవ పలంబుల నాఁ ... బోవనా।
ధీరుఁ నకంబు మధ్యమునఁ దేజముతో మెఱిలింటరూపు ధా।
శ్రీరమణీశ చూపితవుఁ గృష్ణహరీయదువంశభూషణా॥ ౬౫॥

చ॥ అటమధురాపురిన్ రజకు నాదలఁ గొట్టి పటాళిఁ గట్టియు।
త్కటమతి వాయసుండును సుదాముఁడుఁ గుబ్జయు నిచ్చినట్టి స।
త్పటమణి భూషణ ప్రసవ దామ విలేపము లిచ్చఁ బట్టి పే।
ర్చటి కృప వారిఁ ప్రోచితవుఁ గృష్ణహరీయదువంశభూషణా॥ ౬౬॥

చ॥ గొనకొను కంసవీరభటకోటులచేఁ బరిరక్షితంబులై।
యనిమిష రాజచాపనిభమైన శరాసన మిక్షుదండమో।
యన్నఁ గలబంబు ద్రుంచెదు ... యిందుని యుంచి యుఁ దద్భటాళిపైఁ।
గినిసి వధించితీ వెకద కృష్ణహరీయదువంశభూషణా॥ ౬౭॥

ఉ॥ బంధురగంధసింధురము పైఁబడ నట్లుని పాదిపోలఁగా।
సింధుగభీరముష్టిహతిచే గజశీర్షము వ్రచ్చి కంసుగ।
ర్వాంధత వీటివోవఁగ బలారిమహీధరమాళిఁ గూల్చుమా।
డింధరఁ గూల్చితౌ కరిని గృష్ణహరీయదువంశభూషణా॥ ౬౮॥

ఉ॥ అల్లన మల్లరంగము రుదారఁ గఁ జొచ్చి ప్రసిద్ధులైనయా।
మల్లులతోడఁ బోరి పరిమారిచి మంచమునందుఁ గంసభూ।
వల్లభుఁ డాగ్రహింపఁ దిగువం బడనీడిచి చావఁ జేసితౌ।
నెల్లరు నుల్లసిల్లఁగను గృష్ణహరీయదువంశభూషణా॥ ౬౯॥

ఉ॥ పాపపుఁగంసుఁజంపిపిదపందలిదండ్రులగారవించని।
ప్పావునినుగ్రసేనునిఁబొసంగధరాధిపుఁజేసినందుసం।
తాపముదీఱఁబల్కప్రమదస్థితిమీరుపనీతులైధరి।
త్రీపరిరక్షచేసితిరికృష్ణహరీయదువంశభూషణా॥ ౭౦॥

ఉ॥ ఏపడరంగనుత్కటమనీషనశేషకళాచయంబుసాం।
దీపునియొద్దనేర్చిగురునిష్ఠనుపన్మృతపుత్రునంతక।
ప్రాపితుఁడైనవానిఁగొనివచ్చిబుధేంద్రునకిచ్చిచిత్తవి।
శేషముమాన్చితీవెకదకృష్ణహరీయదువంశభూషణా॥ ౭౧॥

ఉ॥ నిన్నెడఁబాసికుందువ్రజనీరజనేత్రలనూఱడింపరా।
గోన్నతినుద్ధవుంబనిచియొయ్యనవారలఁబ్రేమఁగాంచియు।
న్నన్నవిధంబునంగలపమర్పణచేసినయట్టియాత్మలా।
త్మిన్నెఱిమీఱఁగూడితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౭౨॥

ఉ॥ బంధురవాహినీపటలభాసురశౌర్యవిభాసినాజరా।
సంధుననేకవారములుసంగరభూమిజయించిదుష్టద।
ర్పాంధతమించుకాలయవనాభిధునమ్ముచికుందువేఁడిచూ।
డ్కింధరఁగూలఁజేసితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౭౩॥

ఉ॥ ద్వారకనేలిసవ్యవిభవంబులఁదేలివిదర్భరాజక।
న్యారుచిరస్వయంవరమునందుఁదలంపడుచైద్యముఖ్యులం।
బాఱఁగఁదోలియవ్వికచపంకజలోచనఁబెండ్లియాడితౌ।
శ్రీరమఁబోలిచెల్వమరఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౭౪॥

చ॥ మణిఁగొనెఁగృష్ణుఁడన్నసడిమాన్పఁగొనంజనిజాంబవంతుతో।
రణమొనరించితత్సుతనురత్నముఁగైకొనిసత్యతండ్రిక।
మ్మణియొసఁగంగనాతఁడునుమెచ్చికనిచ్చినసత్యభామరు।
క్మిణికెనగావరించితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౭౫॥

ఉ॥ చెందినవేడ్కనర్జునవిశిష్టుఁడవౌచునువేఁటఁబోయిపెం।
పొందఁగళిందజావిలసదూర్మిఁజరించుసరోజనేత్రఁగా।
ళిందిఁబరిగ్రహించియవలీలఖాండవముందహింపన।
గ్నిందొడరించితీవెకదకృష్ణహరీయదువంశభూషణా॥ ౭౬॥

ఉ॥ వినుమువివేకశూన్యనకువిందుఁడునయ్యనువిందుఁడు౯ సుయో|
ధనునకుమిత్రులౌచుఁబ్రమదంబునసోదరియైనమిత్రవిం|
దనుగడుఁగార్మినీఁదలఁచినందదవజ్ఞలగెల్చియాశుభాం|
గనివరియించితెచ్చితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౭౭॥

ఉ॥ భాసురలీలమత్తవృషభంబులనేడిటిఁగట్టియాడ్చినం|
గోసలభర్తనీకుఁదనకూరిమిపట్టిని నాసుదంతను|
న్వాసవనీలకుంతలనివాహమొనర్పసహింపనట్టివా|
రీసునఁబార్థుచేఁబడరెకృష్ణహరీయదువంశభూషణా॥ ౭౮॥

చ॥ మదగజయానఁగేకయకుమారిమనోహరగాత్రినీలనీ|
రదనిభవేణిసుందరదరస్మితమేనమఱందలిన్మదిన్|
ముదమొదవంగసద్గుణసముద్రనుభద్రనుబెండ్లియాడితౌఁ|
గదుకకశత్రులంపటిమికృష్ణహరీయదువంశభూషణా॥ ౭౯॥

చ॥ ఇలఁగలరాజవర్యులకునేయఁగరాకవిహాయసంబున౯|
విలసిలుమత్స్యయంత్రముభువింబడనేసియుమద్రకన్యక౯|
సలలితభవ్యలక్షణవిచక్షణలక్షణశత్రుకోటులం|
గెలిచిపరిగ్రహించితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౮౦॥

చ॥ రయమునసత్యతోఁజనిదురమ్మునసమ్మురదైత్యుఁజంపిదు|
ర్నయునరకాసురుందునిమిరక్కసుచేఁజెఱనున్నరాచక|
న్నియలఁబదాఱువేలనినునెమ్మదిసమ్మతిఁగోరువారలం|
బ్రియమునఁబెండ్లియాడితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౮౧॥

చ॥ త్రిదశపురంబుసొచ్చిమణిదీప్తివిభాసితకుండలంబుల|
య్యదితికినిచ్చినాకవిభుఁడర్చనలిచ్చినమెచ్చిసత్యకు|
న్ముదముగఁబారిజాతతరుముఖ్యముశక్రసమేతులైనయా|
త్రిదశులనోర్చితెచ్చితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౮౨॥

చ॥ మహిఁబదియాఱువేలయెనమండ్రులతాంగులకన్నిరూపముల్|
రహిమెఱయంగఁదాల్చిసుకరంబుగసౌఖ్యరసాబ్ధిఁదేల్చియా|
మహిళలయందుఁబెక్కురఁగుమారులఁగాంచియునందురుక్మిణీ|
గృహిణికిఁజాలదక్కితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౮౩॥

ఉ॥ బాణుఁడుదత్సుతామణి నెపంబుననయ్యనిరుద్ధుబద్ధుఁగా।
శోణపురంబునందునుపశుంభదహంకృతి నేగి బాణుఁడా।
స్థాణునిఁగూడి తాఁకినను దర్పమెలర్ప జయించితత్కరా।
శ్రేణులఁద్రుంచిమించితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౮౪॥

ఉ॥ తావకలాంఛనాఖ్యలనుదాలిచి పౌండ్రకుఁడాప్తయుక్తుఁడై।
చేవ నెదుర్పఁ జక్రహతిచే మృతుఁ జేసితదాప్తుఁడైన కా।
శీవిభుశీర్షము స్త్రితతిచేనతిశీఘ్రతవానిప్రోలికిం।
గ్రేవఁబడంగమీటితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౮౫॥

చ॥ జనకుని చావుకై వగచి శర్వునిఁగొల్చి సుదక్షిణాఖ్యుఁడా।
యననియమింపఁగాననలముందున వేల్వ జనించినట్టికృ।
త్యను వెస నీపయింబనుప నవ్వడచక్రముచే మరల్చినం।
గినుకని జేశుఁ జంపెఁగదకృష్ణహరీయదువంశభూషణా॥ ౮౬॥

ఉ॥ ఒక్కరుఁడయ్యుఁబెక్కుగుపయోజదళాక్షులఁ గారవింపఁబెం।
పెక్కుతదీయవైభవనిరీక్షణముందగునంచునారదుం।
డెక్కుడుభక్తిఁగన్గొనఁగ నెల్లగృహంబులఁగానిపించితా।
దృక్కులకక్కజంబెసఁగఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౮౭॥

ఉ॥ నారదసూక్తిఁ బేర్చిలలనాసుతవర్గముతోడ నేగిచె।
న్నారఁబృథాకుమారకులనారసి మారుతిచే జరాసుతుం।
బోరను నీల్గఁ జేసియటఁబోక్కుచుఁగారలనున్నయాధర।
త్రీరమణాళిఁ బ్రోచితవుఁగృష్టహరీయదువంశభూషణా॥ ౮౮॥

చ॥ తనరఁగరాజసూయముయథావిధిఁజల్పియుధిష్ఠిరుండము।
న్మనునినుఁబూజచేసినఁగనుంగొనఁజాలకదుర్నయోక్తులా।
డినశిశుపాలుఁగన్గొనివడిన్నిశితోజ్జ్వలచక్రధారచేఁ।
గినుకశిరంబుఁద్రుంచితవుఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౮౯॥

ఉ॥ మాయలవిజ్జివీఁగెడుసమంచితసౌంభవిమానగామియై।
పాయకపోరుసాల్వశిశుపాలసఖుండెగటార్చియంతటన్।
ద్రోయకదంతవక్త్రునివిదూరకుఁబోరవధించితౌజయ।
శ్రీయుతమూర్తివీవనఁగఁగృష్ణహరీయదువంశభూషణా॥ ౯౦॥

ఉ॥ పేదటికంబుచేఁ దనదుప్రేయసి తెల్పఁ గుచేలుఁ డాత్మస।
మ్మోదమెలర్ప మీ చరణముల్గనవచ్చినఁ బూజచేసియా।
త్మోదివిజుండు దెచ్చుపృథుకంబులుగొన్ని గ్రసించి శాశ్వత।
శ్రీదనరారఁ జేసితవుఁ గృష్ణ హరీ యదువంశభూషణా॥ ౯౧॥

చ॥ మృతులగు నార్వురాత్మజుల మీవలనం గనఁబోలు నంచుము।
న్మృతగురుపుత్రదాన మొనరించిన మిమ్ము నువేఁడు దేవకీ।
సతిపలుకాదరించి బలిసద్మమునం గలతత్కుమారులన్।
హితమతిఁదెచ్చి చూపితవుఁ గృష్ణ హరీ యదువంశభూషణా॥ ౯౨॥

చ॥ పొలిసిన విప్రనందనులఁ బూనికఁదెత్తు నటంచుఁ ద్రిప్పటన్।
సొలని కిరీటి వహ్నిఁబడఁ జూచిన వల్దని మాన్పి పార్థుతో।
నలరుచు నేగి పూర్వభవదాకృతిఁ గన్గొని తెచ్చి తండువ।
ర్తిలెడు మహీసురార్భకులఁ గృష్ణ హరీ యదువంశభూషణా॥ ౯౩॥

చ॥ తనచెయి సోఁకినట్టి తలదక్కక వ్రక్కలువాయు నట్లు శం।
భునికృపచే వరంబుఁగొని పూని తదీయశిరంబుపైఁ గరం।
బునుపవృకుండు వెన్దగుల నెక్కడవానిన మోసపుచ్చి ఛెం।
పెనసిన మూర్తివీవెకద కృష్ణ హరీ యదువంశభూషణా॥ ౯౪॥

చ॥ మునివరులెల్లఁ గూడుకొని మువ్వురుమూర్తులలోన సాత్వికా।
ధ్యునిఁ గనిరమ్మటన్న భృగుఁ డొయ్యన రాజసతామసంబులం।
దనరు విరించి శంకరులఁ దాఁ గని పిమ్మట వచ్చి తన్నినం।
గినియనివాఁడవీవెకద కృష్ణ హరీ యదువంశభూషణా॥ ౯౫॥

ఉ॥ వారిజనాభ నినలఁచువారల కాపదలొంద నేర్చునే।
ద్వారకలోననుండియును ద్రౌపదిచీరలఁ గ్రూరకర్ములై।
కౌరవులూల్వ నక్షయము గాఁగరుణింప వెనిద్దలంచినన్।
శ్రీరమణీమనోరమణ కృష్ణ హరీ యదువంశభూషణా॥ ౯౬॥

ఉ॥ ఎల్లజగంబులోలిస్సృజయింపఁగఁ బెంపన డంపఁగర్తవై।
యెల్లెడ నామరూపముల నేకములై తగుభూతకోటిలో।
వల్లభ తన్బ్రికాశిలి ధ్రువంబుగ నంతకు రాజవాచువ।
ర్తిల్లెడు నీకు మ్రొక్కెదను కృష్ణ హరీ యదువంశభూషణా॥ ౯౭॥

చ॥ అధికతరత్వదీయసుగుణావళు లెన్నెడువారిలోన నే।
నధముఁడఁ గాన నావినుతు లాదరణీయము లౌనె యెంచు నే।
వ్యథఁబడ నేల పిన్నకొడుకాడెడు వెక్కురుమాటలైననున్।
వృథ యగునయ్య తండ్రికడఁ గృష్ణహరీ యదువంశభూషణా॥ ౯౮॥

ఉ॥ శ్రీలలరంగ శేషశిఖరిన్విహరించి నిజాముపేటగో।
పాలుఁడ నంగభక్తపరిపాలన సేయుమహాత్మ నీకు నే।
వేళ శుభంబె కావలయు వేడుక మీఱఁగ నామనంబులోఁ।
గేళిఁ జరింపు మెల్లపుడుఁ గృష్ణహరీ యదువంశభూషణా॥ ౯౯॥

ఉ॥ ఉన్నతి మీఱఁ జూలురికులోదధిపూర్ణసుధాంశుఁడైన పా।
పన్నకు నల్లచల్లమకు నంచితపుత్రుఁడ నప్పయాఖ్యుఁడన్।
గ్రన్ననమీకు నర్పణముగా భువి నీశతకంబుఁ జెప్పితిం।
కెన్నిక కెక్కఁ జేయఁదగుఁ గృష్ణహరీ యదువంశభూషణా॥ ౧౦౦॥

సమాప్తము,



VYJAYANTI SERIES No. 3.

SREE

# GANGA LAHARI




THE SANSCRIT TEXT

OF

JAGANNADHA PANDITA RAYA

AND

TELUGU METRICAL VERSION

BY

A. VYASAMURTI SASTRULU GARU

*Sanscrit Pandit, Normal College, Rajamandri.*

REPRINT FROM

SREE VYJAYANTI.

PRINTED BY

G RAMASAWMY CHETTY & Co,

MADRAS.

1895.

*Price 3 Annas.*] 

శ్రీ

# గంగాలహరి



జగన్నాథపండితరాయల సంస్కృతశ్లోకంబులును,

బ్రహ్మశ్రీ

ఆకుండి - వ్యాసమూర్తి శాస్త్రులవారి

యాంధ్రీకృత పద్యంబులును.



శ్రీ వైజయంతినుండి

పునర్ముద్రితము.




చెన్నపురి:

జి. రామస్వామిసెట్టి అండు కంపెనివారిచే

ముద్రితము.



౧౮౯౫.

భవ, భవదీయమూర్తిమదవాంతరతాపముఁగాయవాజ్ఞసూ।
భవమగుపాపమున్శిథిలభావముఁజెందఁగఁజేయుఁగావుతన్॥ ౫.

శ్లో॥ అపిప్రాజ్యం రాజ్యంతృణమివ పరిత్యజ్య సహసా విలోలద్వానీరంతవ జననితీరం శ్రితవతామ్। సుధాతస్స్వాదీయస్సలిలభరమాతృప్తిపిబతాం జనానామానందః పరిహసతినిర్వాణపదవీమ్॥

మ॥ పరివర్జించుచుఁబ్రాజ్యముందృణకణప్రాయంబుగా రాజ్యముం,।
ద్వరనీతీరమొహోమదంబవిచలద్వానీరముంజేరి, మా।
ధురిదేవాన్నముకంటె నెక్కుడగునీతోయంబుసంతృప్తియా।
వఱిమున్దాఁ గ్రోలెడువారిసంతసమునిర్వాణమ్మునీవెంతనున్॥ ౬.

శ్లో॥ ప్రభాతేస్నాతీనాంనృపతిరమణీనాంకుచతటీ గతోయావన్మాతర్మిళతితవతోయైర్మృగమదః। మృగాస్తావద్వైమానికశతసహస్రైః పరివృతావిశంతి స్వచ్ఛందంవిమలవపుషోనందనవనమ్॥

మ॥ తొలుసంజన్మునఁగన్ధరాజసుతులయింతు,ల్వారిపాలింద్లయం।
దలికస్తూరిభవజ్జలంబులను జెంద స్నేలనం,బామెక।
మ్ములునోయమ్మ! విమానిలక్షలనుసమ్ముంజుట్టుకో, మేలిమే।
నులతోనిచ్చవిహారముల్సలుపఁ, బొందున్నందనోద్యానమున్॥ ౭.

శ్లో॥ స్మృతంసద్యస్స్వాన్తం విరచయతిశాన్తం సకృదపిప్రగీతం యత్పాపంఝడితిభవతాపంచహరతి। ఇదంతద్గంగేతి శ్రవణరమణీయం ఖలుపదంమమప్రాణప్రాంతేవదనకమలాంతర్విలసతు॥

మ॥ తలఁపందత్క్షణమంతరంగముపశాంతంబౌ; సకృద్గానము।
న్సలుపన్గొబ్బునమాపుఁబాపమునుసంసారంపుఁదాఘంబు; వీ।
నులకున్విందొనరించుగంగయనియొందున్విశ్రుతంబీపదం।
బలరుంగాతముఖాబ్జమధ్యమునమత్ప్రాణాంతకాలంబునన్॥ ౮.

శ్లో॥ యదంతఃఖేలంతో బహుళతరసంతోషభరితానకాకా నాకాధీశ్వరనగరసాకాంక్షమనసః। నివాసాల్లోకానాం జనిమరణశోకాపహరణం తదేతత్తేతీరం శ్రమశమనధీరం భవతునః॥

మ॥ దరినెందున్భవదీయమందువిహృతిందన్పొందు కాకంబులున్
సురలోకేశునివీడుపట్టుపయిఁ గ్రచ్చున్నీవిడుడెందంబునన్।
హరియించున్జనిమృత్యుశోకములనోయంబానివాసంబెటన్;।
బరిహారంబొనరింపనద్దిబలమున్ప్రాపించుమాత్రాఁతికిన్॥ ౯.

శ్లో॥ నయత్నాత్సాధ్వైరపి గళితభేదై రవసితంన యస్మిన్జీవానాం ప్రసరతిమనోవాగవసరః। నిరాకారంనిత్యం నిజమహిమ నిర్వాసితతమోవిశుద్ధం యత్తత్వం సురతటినితత్త్వంనవిషయః॥

మ॥ ఎదినిర్భేదములైనవేదములునీదృక్షంబుగాఁ దెల్పలే।
వెదిజీవాళిమనోవచఃప్రసరణాతీతంబు, నీరూపమె।
య్యదినిత్యంబునిజానుభావమతమంబధ్వంబుతత్త్వంబె, ద।
య్యదినీవౌదువుగావుగోచరవుదివ్యాంభోధిసీమంతినీ॥ ౧౦.

శ్లో॥ మహాదానైర్ధ్యానైర్బహువిధవితానైరపిచయన్నలభ్యంఘోరాభిస్సువిమలతపోరాశిభిరపి। అచింత్యంతద్విష్ణోః పదమఖిల సాధారణతయా దదానాకే నాసిత్వమిహతులనీయాకథయనః॥

శా॥ ధ్యానమ్ముల్వివిధాధ్వరమ్ములుమహాదానమ్ములుద్ఘోరని।
ష్ఠానూనాచ్ఛతపఃక్రతానములచింత్యమ్మియ్యవేవైష్ణవ।
స్థానమ్మందఁ కున్నమమ్ముగఁ బ్రసాదమ్మారగల్గించుని।
న్నేనేవారికిఁబోల్పఁబోలెడినిదల్లీనీవెబోధింపుమా॥ ౧౧.

శ్లో॥ నృణామీక్షామాత్రాదపి పరిహరంత్యాభవభయం శివాయాస్తేమూర్తేః కఇహమహిమానంనిగదతు। అమర్షమ్లానాయాః పరమమనురోధం గిరిభువోవిహాయ శ్రీకణ్ఠశ్శిరసినియతంధారయతియామ్॥

మ॥ కనుఁగొన్నంతనమర్త్యులన్భవభయాక్రాంతిందొలంగించునీ।
యనుభావంబెటఁడిందువర్ణనముసేయంజాలు, నీమూర్తిభ।
వ్యనుబూనుందలఁగాలకంధరుఁడమర్షాపేతహర్షాద్రిజా।
ఘనకోపంబునకుంపలంక కనిరాఘాటంబుగానెప్పుడున్॥ ౧౨.

శ్లో॥వినింద్యాన్యున్మత్తై రపిచపరిహార్యాణిపతితై రవాచ్యానివ్రాత్యైస్స
పులకమపాస్యానిపిశునైః । హరంతీలోకానామనవరతమేనాం సికియ
తాంకదాప్యశ్రాంతాత్వంజగతిపునరేకావిజయసే॥

మ॥ కడుమాలింజలచిత్తులు.న్బతితులు న్గావింపనూరంబు,వా।
యువుగన్వ్రాత్యులుఁగొండెకాండ్రునుసరోమోద్భేదులై వీడఁ,జా।
ల్పడుదుష్కృత్యములెఫ్ఘనెంచఁజుపాప,న్సోమలేకెన్నఁడున్।
న్బడమింబొల్చెదవెల్లవారలఘసంప్రాప్తంబు త్వన్నెస్వర్ణదీ॥ ౧౩.

శ్లో॥స్ఖలంతీస్వర్లోకా దవనితలశోకాపహృతయే జటాజూటగ్రంథౌ యద
సివినిబద్ధాపురభిదా । అయేనిర్లోభానామపిమనసిమోహం జనయతాం
గుణానామేవాయంతవజననిదోషఃపరిణతః॥

మ॥ సురలోకంబుననుండిడిగ్గి ధరణీశోకాపహారంబుకై,।
పురనిర్మంథనుచేఁగపర్దమునడిన్బొంకంపుగట్టొందవే;।
పరిణామంబిదినీగుణంబులకులోభస్వాంతులున్మోహసం।
భరితుల్గాసెదరింతమోసముకసన్మ్రొక్కెల్లభాగీరథీ॥ ౧౪.

శ్లో॥జడానంధాన్పంగూ న్ప్రకృతిబధిరానుక్తివికలాన్ గ్రహగ్రస్తానస్తాఖిల
దురితనిస్తారసరణీన్ । నిలింపైర్నిర్ముక్తా నపిచనిరయాంతర్నిపతతో
నరానంబత్రాతుం త్వమిహపరమం భేషజమసి॥

మ॥ ప్రకృతిన్మూఢులుగ్రుడ్డివారుఁజెవుడుల్పంగుల్గ్రహగ్రస్తులె।
ల్లకొలంద్లాఁటెడువార్లుగానక,సురల్గావింపఁజాగంబునా।
రకమధ్యంబునఁగూలుమానవులకున్ద్రాణంబుసేయంగనీ।
వెకవాతల్లిపొగడ్తయొందుఁగనుమందేకాలమందిందులన్॥ ౧౫.

శ్లో॥స్వభావస్వచ్ఛానాంసహజశిశిరాణామయమపామపారస్తేమాతర్జయతి
మహిమాకోపిజగతి । ముదాయంగాయంతి ద్యుతలమన వద్యద్యుతి
భృతసమాసాద్యాద్యాపిస్ఫుటపులకసాంద్రాస్సగరజాః॥

మ॥ అనవద్యద్యుతిమంతమైసగరపుత్రౌఘమ్ముప్రాపించియిం।
ద్రునిమాగాణము,పాడునేఁడునెసఁగన్సోమాంచమింపొందియో।

జననీ! దేని; నెదోనిసర్గశిశిరాచ్ఛస్వాదువౌనీజల
మ్మునమాహాత్మ్యమనంతమద్దిసకలమ్ము న్నించు లోకమ్మునన్। ౧౨.

శ్లో॥కృతక్షుద్రైనస్యానఘురఘుడితి సంతర్పమనసస్సముద్ధర్తుంసంతి త్రిభువన తలేతీర్థనివహాః । అపిప్రాయశ్చిత్త ప్రసరణపథాతీతచరితా న్నవాన్ దూరీకర్తుం త్వామివజననిత్వాంవిజయసే॥

ఉ॥ ఉన్నవిముజ్జగమ్ములసముద్ధగణమ్మునరింపదీర్థముల్।
చిన్నవెచేసిపాపములుశీఘ్రముతోపముఁజెందువాగలన్;।
నిన్నమ! నీవెపోలుదువు నేర్పుటఁగావఁగఁబాపితాపుతే।
న్నెన్నఁగరానిపెద్దగొలలౌన్నొయొనర్చినక్రొత్తవారలన్। ౧౩.

శ్లో॥నిధానంధర్మాణాంకిమపిచ విధానంనవముదాంప్రధానంతీర్థానామమల పరిధానంత్రిజగతః। సమాధానంబుద్ధేరథఖలుతిరోధానమధియాంశ్రి యామాధానంనః పరిహరతుతాపంతవవపుః॥

చ॥ ఎదోనవముద్విధానము,సుకృత్యనిధానము,లోకరాజికే
య్యదిపరిధానమద్ది,మిగలందుఁబ్రధాన,మధీనిరోధనం,।
బెదిహృదయప్రసాదన,మహీనపులక్ష్ములకున్నిదాన,మ।
య్యదిజననీభవత్తనువుహర్షముమాకిడుఁదాపశోషముల్॥ ౧౪.

శ్లో॥పురోధావంధావంద్రవిణమదిరాఘూర్ణితదృశాంమహీపానాం నానా తరుణతరఖేదస్యనియతమ్। ముమైవాయంమంతుస్స్వహితశతహంతు ర్జడధియోవియోగస్తేమాతర్యదిహకరుణాతఃక్షణమపి॥

చ॥ ధనమదిరంగనుద్దిరుగుధారుణినాథులప్రోలఁబన్నుతే।
దినమునుబెట్టిపెట్టి,నినుతిన్నలువంతలఁజెంది,మందబు।
ద్ధినిజహితంబులెన్నొకనతేర్చెడునాయదెనేరమమ్మని।
న్నెనయమి,నీదయన్నిమునమేనిపుడేనినుఁగొల్చుసౌఖ్యముల్॥ ౧౫.

శ్లో॥మరుల్లీలాలోలల్లహరిలులితాంభోజపటలీస్ఖలత్పాంసువ్రాత చ్ఛురణ విసరత్కౌంకుమరుచి। సురస్త్రీవక్షోజక్షరదగరుజంబాలజటిలంజలంతే జంబాలంమమజననజాలంజరయతు॥

మ॥ అనిలాందోళితవీచిసంచలితపద్మాళీగలద్ధూళిమే।
ళనసంపాదితకుంకుమద్యుతివహోల్లాసద్యులోకాంగనా।
స్తనలిప్తాగరుపంకసంకలితముం గల్లీ! భవన్నీరమా
ర్చునుమజ్జన్నరసంపరాభిధపుత్రాచ్ఛన్నచ్ఛిన్నపాపంబులన్॥ ౨౦.

శ్లో॥ సముత్పత్తిః పద్మారమణపద పద్మామలనఖాన్నివాసఃకందర్పప్రతిభట
జటాజూటభవనే। అథాయంవ్యాసంగోహతపతితనిస్తారణవిధౌనకస్మా
దుత్కృష్టస్తవజననిజాగర్తిజగతః॥

మ॥ జననంబాదినివిష్ణుదివ్యపదపద్మజ్ఞాతంబునద్వ్యాంపుగో।
ట; నివాసంబొనరింతుకామరిపుజూటాజూటగేహంబునం।
దు; నతిప్రీతివినష్టపాతకిజనస్తోమాపదున్మోచన।
మ్మున; నీపెంపుజగంబునన్జననీ! యేమూలలంబునఁబోలవో॥ ౨౧.

శ్లో॥ నగేభ్యోయాంతీనాం కథయతటినీనాం కతమయాపురాణాంసంహర్తు
స్సురధునికపర్దోధిరురుహే। కయాచశ్రీభర్తుఃపదకమలమక్షాలిసలిలై
స్తులాలేశోయస్యాంతవజననిదీయేతకవిభిః॥

శా॥ ఇందుంగొండలనుండిపాఱునదులందెక్కొండుఁబోరద్విడ్జటా।
సందోహంబెవి; భార్గవీపతిపదాబ్జక్షాళనంబేదిచే।
సెంపల్లీ! పలుకంవగు; న్గవులుగించిత్తైననీచందముఞ్।
సందర్శించెదరెండుడెందముననిస్సందేహులైజాహ్నవీ॥ ౨౨.

శ్లో॥ విధత్తాంనిశ్శంకంనిరవధిసమాధిం విధిరహోసుఖం శేషే శేతాంహరి
రవిరతంనృత్యతుహరః। కృతంప్రాయశ్చిత్తైరలమథతపోదానయజనై
స్సవిత్రీకామానాంయదిభవతిజాగర్తిభవతీ॥

శా॥ చేయుంగాతవిధాతకోరికఁదవిచ్ఛిన్నంబుగాధ్యానముఞ్।
మాయుంగావుతగన్నువెన్నుఁడుసుఖమ్ముంగోరిశేషాహిపై;।
వేయున్గంతులుకంతువైరియెప్పుడు; న్వేదోక్తసత్కర్మముల్।
ప్రాయశ్చిత్తములేలనీవుగలుగన్భక్తేష్టసంధాయినీ॥ ౨౩.

శ్లో॥అనాథస్స్నేహార్ద్రాంవిగళితగతిఃపుణ్యగతిదాంపతన్విశ్వోద్ధర్త్రీం గద
విగళితస్సిద్ధభిషజమ్ । సుధాసింధుంతృష్ణాకులితహృదయోమాతరమ
యంశిశుస్సంప్రాప్తస్త్వామహమిహవిదధ్యాస్సముచితమ్॥

మ॥ అగతిన్,బుణ్యగతిప్రదాయినివి; నాథాపేతుఁడన్,బ్రేమపా।
రగ; వేఁగూలెద,లేవనెత్తెదవుసర్వంబు;న్గదార్తుండ, మే।
లగదంకారివి; దప్పిఁగుందెద; సురాహారప్రవాహంబవీ;।
వసుఁబ్రోవందగువేళతల్లి! యిదిసంప్రాప్తుండనేబిడ్డఁడన్॥ ౨౮.

శ్లో॥విలీనోవై వస్వతనగరకోలాహలభరో గతాదూతాదూరంక్వచిదపిప
రేతాన్మృగయితుమ్ । విమానానాంవ్రాతో విదళయతివీథీర్దివిషదాం
కథాతేకల్యాణీయదవధిమహీమండలమగాత్॥

ఉ॥ మేలఁగునీకథామృతముమేదినిఁజెందినవేళయే మొదల్।
ల్గాలునిపురంబునంగలకలంబడఁగెన్; జనిరెందొదూతలు।
న్దాలఁబరేతులన్వెదక; దైవతపఙ్క్తులఁబ్రీల్చెడున్విమా।
నావళులోజగజ్జనమహాఘవినాశనిహర్షదాయినీ॥ ౨౯.

శ్లో॥స్ఫురత్కామక్రోధప్రబలతరసంజాతజటిలజ్వరజ్వాలాజాలజ్వలితవపు
షాంనఃప్రతిదినమ్ । హరంతాంసంతాపంకమపిమరుదుల్లాసలహరీచ్ఛ
టాశ్చంచత్పాథఃకణసరణయోదివ్యసరితః॥

మ॥ హరియించున్బ్రతివాసరంబుగురురాగామర్షసంజాతసం।
జ్వరవైశ్వానరహేతిమూర్ఛితమనోస్మత్ప్రసంతాపము।
న్మరుదుచ్చాలితవీచినిర్ధుతపృషన్మల్లీసుమస్తోమభా।
స్వరముల్నిర్మలశీతలామృతరసస్వర్వాహినీపూరముల్॥ ౩౦.

శ్లో॥ఇదంహిబ్రహ్మాండసకలభువనాభోగభవనంతరంగైర్యస్యాంతర్లుఠతి
పరితస్తిందుకమివ । సఏషశ్రీకంఠప్రవితతజటాజూటజటిలోజలానాం
సంఘాతస్తవజననితాపంహరతునః॥

మ॥ హరలుందుమ్మికిపండువోలెభువనాభోగైకభాండంబుపు।
ష్కరజాండంబిదిదేనిలోననలువంకంబొందరంగంబులన్।

హరియించున్నరకంబవిస్తృతకపర్దాత్యంతసాంద్రంబుళం।
బర్దనంఘాతమునీదియద్దినిఖిలాంబా! మాపరితాపముల్॥ ౨౭.

శ్లో॥ త్రపంతే తీర్థానిత్వరితమిహయస్యోద్ధృతివిధౌకరం కర్ణేకుర్వంత్యపికిలకపాలిప్రభృతయః। ఇమంతంమామంబత్వమియమనుకంపార్ద్రహృదయేపునానాసర్వేషామఘమథనదర్పందళయసి॥

మ॥ త్రపఁజెందున్వడిఁబ్రోవనింగెవనిఁదీర్థంబు; లెవ్వుల్మాసికొం।
ద్రుపురార్యాదులు; నిట్టినన్నుబవిత్రుంజేయడెందంబునం।
గృపసారస్యముఁబొందుమోజనని! నీవేయెల్ల జేజేలపా।
పపరీహారమహామదంబడఁతువంబా! దేవతావాహినీ॥ ౨౮.

శ్లో॥ శ్వపాకానాంవ్రాతైరమితవిచికిత్సావిచలితైర్విముక్తానామేకంకిలసదనమేనఃపరిషదామ్। అహోమాముద్ధర్తుంజనని ఘటయంత్యాఃపరికరంతవశ్లాఘాంకర్తుంకథమివసమర్థోనరపశుః॥

మ॥ మాలలు నెంతోశంకపడిమానెడిపాపపుగుంపులుండఁగా।
మేలిలునన్నునారవడిమేకొనికావఁగమన్యఘట్టము।
న్మైలధరించునిన్నునుతియింపఁగనెట్లిరుగారియెద్దులుం।
జాలెదరమ్మ! భక్తజనసౌఖ్యవిధాయినిహర్షదాయినీ॥ ౨౯.

శ్లో॥ నకోప్యేతావంతం ఖలుసమయమారభ్యమిళితో యదుద్ధారాదారాద్భవతిజగతోవిస్మయభరః। ఇతీమామీహాంతేమనసిచిరకాలంస్థితవతీమయంసంప్రాప్తోహంసఫల ఇతుమంబప్రణయనః॥

మ॥ కడునాశ్చర్యముగల్గులోకమునకుస్నాపాడనెవ్వానినె।
ట్టిఁడెవండున్ననరాఁడునేటికనినీడెందంబునంబుట్టియె।
ప్పుడునున్నట్టితలంపువీఁడుసఫలమ్ముంజేయనే తెంచినీ।
యడుగుల్పట్టెను; నన్నుఁబ్రోవఁగదవమ్మా! తాళకేతుప్రసూ॥ ౩౦.

శ్లో॥ శ్వవృత్తివ్యాసంగోనియతమథమిథ్యాప్రలపనంకుతర్కేష్వభ్యాసస్సతతపరపైశున్యమననమ్। అపిశ్రావంశ్రావంమమతుపునరేవంగుణగణాన్ఋతేత్వత్కోనామక్షణమపినిరీక్షేతవదనమ్॥

మ॥ కొలువన్నీ చులఁగోర్కి యెప్పుడును,డక్కుంభల్కులుం,జెడ్డయు।
క్తులయభ్యాసము,సంతతంబొరులకున్గొండెంబుచింతించుట।
న్బలునాదుర్గుణముల్వినన్విసఁగశర్వ ప్రేయసీ! తల్లి! భూ।
వలయంబందునిమేషమేనెరుఁడునావక్త్రంబువీక్షించునే॥ ౩౧.

శ్లో॥విశాలాభ్యామాభ్యాంకిమిహనయనాభ్యాం ఖలుఫలంనయాభ్యామా లీఢాపరమరమణీయాతవతనుః । అయంహిన్యక్కారోజననిమనుజస్య శ్రవణయోర్యయోర్నాతర్యాత స్తవలహరిలీలాకలకలః॥

చ॥ జనులకునేలకన్నులువిశాలములిం,దలిసుందరంబునీ।
తనుసుధగ్రోలుపున్నెమునుదాల్పకపోయిన;నౌపరాభవ।
మ్మునిదెమనుష్యువీనులకుఁబొందకపోవుటనీప్రవాహసం।
జనితతరంగలీలలనుజానగుపెన్నెనుదజహ్నునందనీ॥ ౩౨.

శ్లో॥విమానైస్స్వచ్ఛందం సురపురమయంతే సుకృతినఃపతన్తిద్రాక్పాపా జనని నరకాంతః పరవశాః । విభాగోయంత స్మిన్నశుభమయమూర్తౌ జనపదేనయత్రత్వంలీలాదలితమనుజాశేపకలుషా॥

మ॥ అతిపుణ్యుండునిజేచ్ఛనేగునువిమానారూఢుఁడైవేల్పుప్రోఁ।
ల్కృతపాపుండువడింబడున్నరకమందిచ్ఛాప్రతీపంబుగాఁ;।
గతియిట్లౌనువిభక్తమోగగనగంగా! నీవులేవెందునా।
శితమర్త్యాఖిలపాపవాయశుభరాశిస్ఫీతదేశంబునన్॥ ౩౩.

శ్లో॥అపిఘ్నంతో విప్రానవిరతముశంతో గురుసతీః పిబంతో మైరేయంపు నరపిహరంతశ్చకనకమ్ । విహాయత్వయ్యన్తేతనుమతనుదానాధ్వర జుషామపర్యంబ క్రీడంత్యఖిలసురసంభావితపదాః॥

మ॥ ధరణీదైవతహంతలున్గురుకళత్రగాహులున్మద్యపా।
నరతుల్బంగరుదొంగిలించునరులున్దల్లీ! తుదన్నీదరిం।
దనుసంత్యాగముచేతఁజేసతనుదానమ్ముల్మహాయజ్ఞము।
ల్పొనరంజేసినవారిపైనమరసంపూజ్యాంఘ్రులైయాడరే॥ ౩౪.

శ్లో॥ అలభ్యంసౌరభ్యం హరతిసతతంయస్సుమనసాంక్షణాదేవప్రాణానపి విరహశస్త్రక్షతభృతామ్ । త్వదీయానాంలీలాచలితలహరీణాంవ్యతికరాత్పునీతేసోఽపిద్రాగహహాపవమానస్త్రిభువనమ్ ॥

మ॥ సుమనస్సంతతిసౌరభంబుహరియించుందుర్లభంబెప్డుఁ బ్రా।
ణములన్బాపెడువేర్పడిన్విరహబాణచ్ఛిన్నులన్బాయు; వై।
నమరుల్లీలఁజలద్భవల్లహరిసంధానంబునన్మాడులో।
కములుంజేయుఁబవిత్రముల్దివిజగంగా! నీమహత్త్వంబహా॥ ౩౧.

శ్లో॥ కియంతస్సంత్యేకే నియతమిహలోకార్థఘటకాః పరేపూతాత్మానఃకతిచపరలోకప్రణయినః । సుఖంశేతేమాతస్తవఖలుకృపాతః పునరయంజగన్నాథశ్శశ్వత్త్వయినిహితలోకద్వయభరః॥

మ॥ కలరెందెందఱొమర్త్యలోకసుఖముల్గాంక్షించిసాధించువా।
రలుపూతాత్మకులెందఱోపరసుఖప్రార్థుల్పరుల్లల్లి? ని।
చ్చలునీయందిడిలోకయుగ్మభరమిచ్చన్నీదయంగూర్కు ని।
మ్ములనీపండితరాజునాఁగడుయశమ్ముంగన్జగన్నాథుఁడే॥ ౩౨.

శ్లో॥ భవత్యాహివ్రాత్యాధమపతితయా ఖండపరిషత్పరిత్రాణ స్నేహశ్శ్లథయితుమశక్యఃఖలుయథా । మమాప్యేవం ప్రేమాదురితనివహేష్వంబజగతి స్వభావోఽయంసర్వైరపిఖలుయతోదుష్పరిహరః॥

మ॥ సడలంజేయఁగఁజాలవీవెటులుఁబాషండాధమవ్రాత్యులం।
గడుఁబాపాత్ములఁగావనెయ్యమునుగంగా! నేనునట్లేరుచి।
న్విడువంజాలనుపాపసంఘములుఁగావింప; న్నిసర్గంబిదే।
ప్పుడునెవ్వారికినేనివీడనగునేభూమిన్నభోవాహినీ॥ ౩౩.

శ్లో॥ ప్రదోషాంతర్నృత్యత్పురమథనలీలోద్ధృతజటాతటాభోగప్రేంఖల్లహరిభుజసంతానవిధుతిః । బిలక్రోడక్రీడజ్జలడమరుటంకారసుభగస్తిరోధత్తాంతాపంత్రిదశతటినీతాండవవిధిః॥

మ॥ కడసంజంబుర వై రినట్టువలు ద్రాక్ష నీలిఁగంపించు పెన్।
జడలంబా లెడు వెల్లి చేతులపరిస్పందంబునన్లాఁగలోఁ।
గడబాన్కీ టిడమాయిటంకృతి నిబొంకంబైనమిన్నేటిసం।
దడిన్ను త్తంబ డఁగించు నీక్షణము, సంతాపంపుసందోహముల్॥ ౩౮.

శ్లో॥ సదైవత్వయ్యేవార్పిత కుశలచింతా భరమిమంయదిత్వామాంబత్యజసిసమయే స్మిన్సువిషమే । తదావిశ్వాసోయం త్రిభువనతలాద స్తమయతే నిరాధారాచేయంభవతిఖలునిర్వ్యాజకరుణా॥

శా॥ నీయందేయిడమే ల్తలంపుబరువు న్నీవెఁ డెప్పుడు, నీవె డితే।
నీయత్యంతపుఁగష్టకాలమునదల్లీనన్ను, విశ్వాసమే।
మాయున్నుజ్జగముం, దథామమగునిర్వ్యాయంపుఁగారుణ్యము।
న్నాయమ్మా! నగ రాత్తజ త్రిదివసంప్రాప్త్యైకనిశ్రేణికా॥ ౩౯.

శ్లో॥ కపర్దాదుల్లస్య ప్రణయమిళదర్ధాంగయువతేః పురారేః ప్రేంఖంత్యో మృదుళతరశీమంతసరణౌ । భవాన్యాసాపత్న్యస్ఫురితనయనంకోమలరుచా కరేణా క్షిప్తా స్తేజననివిజయంతాంలహరయః॥

చ॥ చనవుననాము మేన సెఱజవ్వనిఁగూడుపు రారి పెన్జటా।
వనమునఁబొంగి, నుస్నెనఁగుపాపట తెన్నునఁబాఱు చద్రినం।
దనిసవతాలికిన్కనయనస్ఫురణమ్మునఁ బన్ను సైనచే।
తనువిదిలించు నీలహరి తండము మించెడునమ్మ సర్వముల్॥ ౪౦.

శ్లో॥ ప్రపద్యంతేలోకాః కతినభవతీమత్రభవతీముపాధిస్తత్రాయంస్ఫురతి యదభీష్టంవితరసి । శపేతుభ్యంమాతర్మమతుపునరాత్మాసురధునిస్వభావా దేవత్వయ్యమితమనురాగంవిధృతవాన్॥

శా॥ మానావ్రమ్మన్నినుఁ జెందఁ బోలువరే మర్త్యుల్లనంగారణం।
బానందున్నమకూర్తు వీప్సితములం; టాలింపు; నీతోడుసు।
మ్మా నెన్నామది, యా! నిసర్గమున నెంతో కూర్మి నీపైగిరీ।
ట్రిస్రీ! నారాయణపాదపంకజమధుశ్రీ! శంతనుశ్రీకరీ॥ ౪౧.

శ్లో॥ లలాటేయాలోకైరిహఖలుసలీలంతిలకితాతమోహంతుంధ త్తేతరుణత
రమార్తండతులనామ్। విలుంపంతీసద్యోవిధిలిఖితమర్వర్ణసరణిం త్వ
దీయాసామృత్స్నామమహరతుకృత్స్నామపిశుచమ్॥

మ॥ నరులిందుద్దిలకంబిడన్నదుటవిన్యాణంబుగానేది, యు।
త్తరుణాదిత్యసమానతందమమువిధ్వంసించు; నప్డుాడుచున్।
సరసీజప్రభవుండువ్రాయుచెడువర్ణశ్రేణి; నాగంగమన్।
హరియించున్సకలంబుమానగపుబాహ్యాంబాంతరంబుల్వడిన్॥ ౪౨.

శ్లో॥ నరాన్మూఢాంస్తత్తజ్జనపదసమాసక్తమనసోహసంతస్సోల్లాసం వికచకు
సుమవ్రాతమిషతః। పునానాస్సౌరభ్యైస్సతతమళినోనిత్యమలినాన్
సఖాయోనస్సంతుత్రిదశతటినీతీరతరవః॥

మ॥ నరులన్మూఢులగాఢరక్తమతులందిత్తత్ప్రదేశంబుల।
న్వరిపూగుంపునెసమ్మునన్నగుమ; నేనేళిన్సముల్లాసిత।
న్వరగంధంబుల, నిత్యమున్మలినభావంబందుమత్తాళులం।
బరిశోధించెడిగంగతీరతరువుల్మాకుంజెలుల్గావుతన్॥ ౪౩.

శ్లో॥ యజంత్యేకేదేవాన్కఠిన తరసేవాంస్తదపరేవితానవ్యాసక్తాయమని
యమరక్తాఃకతిపయే। అహంతుత్వన్నామస్మరణభృతకామస్త్రిపథగే
జగజ్జాలంజానేజననితృణజాలేనసదృశమ్॥

మ॥ గురుకష్టంబునఁగొందఱిందుసురలంగొల్తు; ర్వితానక్రియా।
పరులన్యు; ల్యమముక్యరక్తులౌరులున్భావింపముత్తోత్రివద్రి।
మ్మరి; నీపేరెతలంచుటన్నెరయఁగామమ్ముల్జగజ్జాలము౦।
బరిభావించెదబల్బడోపమమసామాన్యప్రభావా! ప్రసూ! ౪౪.

శ్లో॥ అవిశ్రాంతంజన్మావధిసుకృత జన్మార్జనకృతాంసతాం శ్రేయఃకర్తుంకతిన
కృతినస్సంతివిబుధాః। నిరస్తాలంబానామకృతసుకృతానాంతుభవతీం
వినాముష్మిల్లోకేనపరమవలోకేహితకరమ్॥

ఉ॥ పుట్టుకఁదొట్టియెప్పుడునుబున్నెముసేయుసదాళిఁగావఁగా।
దిట్టలులేరె! వేల్పులునదీమణి! యొందఱొపుణ్యహీనతన్।

పెట్టనదిక్కు శేనిమము నేర్పెనలారఁగఁబట్టి ; గట్టు రా।
పట్టి ! హితంబు సేయు నెరుపాలకు, నివ్విడనందుఁగందు మే॥ ౪౫.

శ్లో॥పయఃపీత్వామాత స్తవసపదియాతస్సహచరై ర్వియూాడై స్సరంతుంక్వ చిదపిచవిశ్రాంతిమగమమ్ । ఇదానీముత్సంగేమృదుపవనసంచారశిశి రేచిరాదున్నిద్రంమాంసదయహృదయేశాయయచిరమ్॥

శా॥ అమ్మా ! నీపయసాని, యాక్షణమ నేనజ్ఞానపున్మిత్రబృం।
దమ్ముల్గూడుక, యాడనెందొచనియత్యంత శ్రమంబందితిఁ।
గమ్మన్మెల్లనిగాలిచల్లనగునంకమ్మందుఁబన్నుండఁగా।
నిమ్మానన్నుఁజిరమ్మనిద్రుడఁదడవు త్వేంఖద్దయార్ద్రాంతరా॥ ౪౬.

శ్లో॥బధానద్రాగేవద్రఢిమరమణీయంపరికరంకిరీటేబాలేందుం నియమయ పునఃపన్నగగణైః । నకుర్యాస్త్వం హేలామితరజనసాధారణతయా జ గన్నాథస్యాయంసురధునిసముద్ధారసమయః॥

ఉ॥ కట్టుము వేగ మేదిటము గానడికట్టును ; బాఁసపిండుతోఁ।
జుట్టుము మాళిలే నెలను ; జూడకు మేలిగనన్ను మోఱకుం।
జట్టులయట్టు భోసురలజక్కర ! వేళసముద్ధరింపఁగాఁ।
గట్టుపకాసుఁబండితుజగత్పదపూర్వ నినాథునియ్యదే॥ ౪౭.

శ్లో॥శరచ్చంద్ర శ్వేతాంశశిశకల శ్వేతాలముకుటాంకరైః కుంభాంభోజేవర భయనిరాసౌచదధతీమ్ । సుధాధారాకారాభరణవసనాంశుభ్రమకర స్థితాంత్వాంయేధ్యాయంత్యుదయతినతేషాంపరిభవః॥

ఉ॥ శారదచంద్రపాండుర, నిశాకరఖండసుశీతమాళి, సం।
భోరుడభీతికుంభవరభూషితహస్తచతుష్క, నిర్జ రా।
హారఝరీసరూపవసనాభరణ, న్మకరాచ్ఛవాహ, నే।
వారుదలంత్రు, వారలకెవండుపరాభవకారియాగయన్॥ ౪౮.

శ్లో॥దరస్మితసముల్లస ద్వదనకాంతిపూరామృతై ర్భవజ్వలనభర్జితాన నిశ మూర్జయన్తీనరాఁ । చిదేకమయచంద్రికాచయచమత్కృతింతన్వతీ తనోతు మమశంతనోస్సపదిశంతనూరంగనా॥

మ॥ దరహాసోల్లసదాస్యకాంత్యమృతవార్ధారాళి సంసారసం
జ్వరసంభర్జితగాత్రులన్నరుల జీవత్ప్రాప్తులం జేయుచు,
న్నిరతంబేకచిరాత్మచంద్రరుచిసంనిష్యచ్ఛమత్కారవి
స్తరణాపాదినిశాంతనుప్రియవపుస్సాఖ్యంబె సంగించెదున్॥ ౪౯.

శ్లో॥మంత్రైర్మీలితమౌషధైర్ముకుళితంత్రస్తంసురాణాంగణై స్స్రస్తంసాంద్రసుధారసైర్విదళితంగారుత్మతైర్గ్రావభిః। వీచీక్షాళితకాళియాహితపదేస్వర్లోకకల్లోలినిత్వంతాపంతిరయాధునామమభవజ్వాలావలీఢాత్మనః॥

మ॥ కనియెన్నిద్దురమంత్రము; ల్మొగిడెనిక్కంబెల్ల మందుల్, భయ
మ్మును జెందెన్దివిషత్కదంబ; మమృతంపుంజాలు పోంగున్న సెన్ ;
వినతానందనరత్నముల్వగిలె; నీ వేళన్భవజ్వాలల
న్ననుదప్తాంగుని గాలియారిపడ జన్నా? చల్లజేయంగదే॥ ౫౦.

శ్లో॥ద్యూతేనాగేంద్రకృత్తిప్రమథగణమణీశ్రేణినందీందుముఖ్యం సర్వస్వంహారయిత్వాస్వమథపురభిదిద్రాక్ప్రవేష్టుకామే। సాకూతంహైమవత్యామృదులహసితయావీక్షితాయాస్తవాంబ వ్యాలోలోల్లాసివల్గల్లహరినటఘటీతాండవంనఃపునాతు॥

మ॥ ప్రమథేభాజిననందిచంద్రఫణివర్గప్రష్ఠముస్సర్వవి
త్తము జూదంబున నోడి, రోయిసఁగదన్దల్పంబురధ్వంసి, యా
హిమవన్నందనియుల్లసన్నవ్వుచు నినున్ వీక్షింపసాకూతము
ద్భ్రమదుల్లాసితరంగతాండవము మాతాపంబులం బాపెడున్॥ ౫౧.

శ్లో॥విభూషితానంగరిపూత్తమాంగాసద్యఃకృతానేకజనార్తిభంగా।
మనోహరోత్తుంగచలత్తరంగాగంగామమాంగాన్యమలీకరోతు॥

ఉ॥ పొంగుచుఁగొల్వఁజేరు నరపుంగవకోట్లయ మంగళంబులన్।
దొంగిలఁజాల నేర్పుగల తుంగతరంగములన్విభూషితా।
నంగరిపూత్తమాంగ, సరథాంగకరాంఘ్రిసరోజజన్మయా।
గంగ మదంగపాళికిఁ దగం గనొసంగుత నిర్మలత్వమున్॥ ౫౨.

శ్లో॥ఇమాంపీయూషలహరీంజగన్నాథేననిర్మితామ్।
యఃపఠేత్తస్యసర్వస్యజాయన్తేసుఖసంపదః॥



సీ॥ రాజమహేంద్రవరపురబోధనకళాశాలసంస్కృతభాషసదువువారి।
కౌజ్ఞతనంబునుమద్యోగమమరినయాకుండివంశముక్తాకలాప।
తరళవేంకటబుధతనుజుఁడుఁగేసినకుర్తిఁబరాశరుకొడుకుబత్తి।
నిలిపినశివలింగమిలువేలుఁగలరంగనిదిజగన్నాధవిద్వదధిపకృత।

తే,గీ॥యురుకలుషకరులహారి, పీయూషలహరి। యిదువరులకెల్లసౌఖ్యసంపదలుబ్రదలఁ
దెలుఁగుఁజేసితివైజయంతీపతిసుతు। ముదలగొని, మోదమునవ్యాసమూర్తిశాస్త్రి।



# గంగాలహరి, శుద్ధపత్రిక.

| పుటసంఖ్య. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 13 | శేగు. | శేఁగు. |
| 4 | 16 | చింత్య. | చిన్త్య. |
| ,, | 19 | మోక్ష. | మోక్షా. |
| 5 | 24 | భృతస. | భృతస్స. |
| 7 | 9 | రివు. | రిపు. |
| ,, | 14 | యస్యాం. | యస్యాం. |
| ,, | 18 | రెండు. | రెఁడు. |
| 8 | 20 | పుష. | పృష. |
| ,, | 22 | బ్రంహాండ. | బ్రహ్మాండం. |
| 9 | 15 | సెట్లిరుగారి. | సెట్లిరుగాలి. |
| ,, | 24 | మిత్థ్యా. | మిథ్యా. |
| 10 | 14 | మనుజావేష. | మనుజాశేష. |
| 11 | 6 | రుల్లిలఁజల. | హెల్లాసచర. |
| 12 | 5 | యదిత్వా. | యద్విత. |
| 13 | 16 | త్వంనామ. | త్వన్నామ. |
| ,, | 19 | ల్యమముర్య. | ల్యమముఖ్య. |
| 14 | 3 | ర్వమూర్దైస్స. | ర్వమూర్ధైస్సం. |
| ,, | 24 | దరస్మిత.. భర్జితా. | దరస్మిత... భర్జితా. |
| 15 | 13 | మణిశ్రేణి. | ఫణిశ్రేణి. |

SREE

# KALINDEE PARINAYAM

BY


S. BHADRADRIRAMA SASTRULU GARU,

OF PITTAPURAM.




A REPRINT FROM

SREE VYJAYANTI.


MADRAS:

PRINTED AT THE VYJAYANTI PRESS,

*Lakeside, Egmore.*

1896.

**Price 4 Annas.**



# కాళిందీ పరిణయము.

ఇది

పీఠికాపురవాసులైన

బ్రహ్మశ్రీ

శొంఠి. భద్రాద్రిరామశాస్త్రులుగారిచే

రచితమైన మహాప్రబంధము.

శ్రీవైజయంతీ పత్రికనుండి

పునర్ముద్రితమైనది.

చెన్నపురి.

వైజయంతీముద్రాశాలలో ముద్రింపఁబడినది.

వెల ౮ అణాలు.

శ్రీరస్తు.

# కాళిందీపరిణయము

## ప్రథమాశ్వాసము.

ఉ॥ శ్రీమదుమాఘనాటిమదిసిబ్బితిచేఁదలవంచియాత్మకం।
ఠామలహారనాయకమునందునిజేశునిఁజూచిమోహముం।
బ్రేమయునూన్కొనంగశశిబింబముగెల్చెడియాస్యమెత్తఁగా।
నామెనుజూచినవ్వుసరసాగ్రణిశంభునిఁగొల్తునిచ్చలున్॥ ౧.

క॥ గీర్వాణాంబురుహాక్షుల । ఖర్వప్రమదంబుతోడగములైకొలువన్ ।
శర్వాంకపీఠగతయగు । పర్వతరాట్పుత్రినధికభక్తింగొలుతున్॥ ౨.

చ॥ వనరుహతుల్యనేత్రుననివారితవిక్రమపాత్రునుల్లస।
ద్ఘననిభనీలగాత్రుభవతారణకారణదివ్యగోత్రునిన్।
గనకపిశంగనేత్రుమనుకైటభజైత్రుసుజితేంద్రశత్రునిన్।
వనధిసుతాకళత్రుమదివాంఛలుమీఱఁగఁజేరికొల్చెదన్॥ ౩.

సీ॥ క్షీరవారాశికేనీరజలోచనకోర్కెమీఱఁగముద్దుకూఁతురయ్యె।
సకలలోకానందకకళాంచితుండైనచంద్రునకేకొమ్మసహజయయ్యె।
దంతావళేంద్రదుఃఖాంతకారణునకేకాంతలలామశుద్ధాంతమయ్యె।
వనరుహసంజాతవనరుహాస్త్రులకునేవనరుహాయతనేత్రజననియయ్యె।
నట్టిదశశతలోచనాద్యమరమంద । గామినీకేశపాశసంకలితకుసుమ।
పూజితాంఘ్రిసరోరుహపుణ్యచరిత । వనధితనుజాతమముదయమనుచుఁగాత॥ ౪.

క॥ వితతామరతతివినతుఁడు । సతతశ్రుతిపాఠశుద్ధచతురాస్యుఁడునౌ।
చతురాస్యుఁడొసఁగుతనుమా । కతులితగుణగణమునాయువైశ్వర్యంబున్॥ ౫.

సీ॥ శింజితమంజీరమంజులారావముల్వాహనంబునకుసుస్వరముఁదెల్పఁ।
బాణిపద్మనిషక్తవీణానినాదముల్స్వీయవాక్తతితోడవియ్యమంద।
నమృతధారావృష్టినలరించువాక్యముల్క్రీడాశుకంబులనోడఁబుచ్చఁ।
గరపల్లవోల్లసత్కంకణరవములుకాంచీస్వనముతోడఁగలియుచుండఁ।
దమ్మిచూలికివామపార్శ్వమ్మునందుఁ । దమ్మిగద్దియఁగూర్చున్నకొమ్మమాకు।
సమ్మదముతోడసరసవాక్యమ్ములిచ్చి । నెమ్మినటియించురసనాగ్రమ్మునందు॥ ౬.

మ॥ శివునంక స్థలినాటలాడుచునుదచ్ఛీర్షంబుపైనుండున।
న్నవశీతాంశుమయూఖముల్గనిమదిన్బాలీకనాళభ్రమన్।
జవమొప్పారగ్రహింపఁదుండమటకున్సారించుచున్నట్టిదం।
తివరాస్యుండుదొలంగఁజేయుతమరుద్దేయుండువిఘ్నంబులన్॥ ౭.

క॥ ఇనశశికుజగురుబుధకవి । శనిరాహుధ్వజులహరికృశానుసవితృభూ।
దనుజేశవరుణమారుత । ధనదేశానులమహాత్మ్యదలఁచెదనెపుడున్॥ ౮.

శా॥ శ్రీరామామలపాదవారిరుహసంసేవాపరున్నిర్మలా।
చారాసక్తునివేదశాస్త్రకవితాసంపూర్ణసాహిత్యవి।
ద్యోర్యుర్ఘజ్ఞునిసత్పరాశరసగోత్రోద్భూతునిన్మద్గురున్।
సూరస్తుత్యునిసద్గుణాఢ్యుఁగొలుతున్సూర్యప్రకాశాహ్వయున్॥ ౯.

శా॥ గంగారామమనీషిమజ్జనకుసత్కార్యాభిలాషున్సదా।
నంగారాతిపదాంబుజాతయుగసేవాసక్తునిన్వేదవే।
దాంగోరుప్రతిభాన్వితుంబుధజనాహ్లాదప్రదున్భూరిస।
త్సంగాసక్తమనస్కుగౌతమసగోత్రశ్రేష్ఠుసేవించెదన్॥ ౧౦.

క॥ కామాంబనుమజ్జననీస । తీమండలవిలసదమలతిలకాయితపు।
ణ్యామితగుణమణిభూషిత । నేమారుమహాత్మలోనవినుతింతుఁదగన్॥ ౧౧.

క॥ భవ్యులజ్యేష్ఠకనిష్ఠపి । తృవ్యులమదిఁదలఁతునచ్యుతేశ్వరసోమా।
ఖ్యావ్యమలధైర్యతేజుల । నవ్యకళాపారగతులనయగుణయుతులన్॥ ౧౨.

సీ॥ పాత్రువిశ్వామిత్రగోత్రునాపస్తంబసూత్రుసత్ప్రతివాదిజైత్రుసుగుణ।
రాశినిర్మలవారణాశివంశక్షీరరాశిరాకాయామినీశితకుచి।
భాషుసత్కవితావిశేషువిద్యావరభూషుసత్కర్మనిష్ఠుసుమతి।
శాలిబంధుపయోజపాళివికాసనహేళిబ్రాహ్మణకులమౌళిసతత।
భూసుతావరపాదాబ్జభాసమాన । హృదయరోలంబులోకైకవిదితచరతు।
విమలులక్ష్మణసమభిఖ్యవెలయునాదు । మాతృజనకునిసతతంబుమదిఁదలంతు॥ ౧౩.

ఉ॥ లక్ష్మణపూర్వజాంఘ్రికమలప్రతిసక్తమతింబయోజభూ।
పక్ష్మలలోచనాకులకృపాయుతుభూపతిదత్తహారవ।
స్త్రక్ష్మనివారణాశికుసాగరపూర్ణసుధాకరుంగళా।
లక్ష్మునినాదుమాతులుఁదలంచెదనెప్పుడువేంకటేశ్వరున్॥ ౧౪.

క॥ రాఘవపాండవభగవద । మోఘకథావిరచనాతిపూతాత్మకులౌ।
నాఘనులమునులవిబుధ । శ్లాఘితుఁడగుకాళిదాసుసద్గుణవాసున్॥ ౧౫.

సీ॥ విగతరాడ్జితయశశ్శ్రీహర్షుశ్రీహర్షురాజితసన్ముఖాంభోజుభోజు।
సకలసజ్జనలోకశంకరుశంకరుఁజండజనశ్రేణిదండిదండి।
నవకవితారసభవభూతిభవభూతిమధురవాగ్జల్లికామాఘుమాఘు।
నురకువాదాహిమయూరుమయూరునివైరిమానుషగర్వచోరుఁజోరు।
నన్నపార్యుఁదిక్కనసమాహ్వయునిఁబెద్ద । నార్యు రామభద్రునమలుభాస్క-
రాఖ్యుసోముభీమునలయెఱ్ఱప్రగ్గడ । మఱియుముఖ్యకవులమదిఁదలంతు॥ ౧౬.

ఉ॥ బాలుఁడనీమహాకృతికిఁబాల్పడితిన్రచియింపఁజక్కఁగాఁ।
జాలనెకోయటంచుమదిసందియమందఁగ నేలసత్కవుల్।
లాలసులైకృపావశతలాలనసేయుదురంచు నెంచెదన్।
బాలునిపల్కు పెద్దలకుబంధురమోదముఁబెంచకుండునే॥ ౧౭.

క॥ కుకవులకు న్సత్కృతిచం । పకసంతతిమధుపములకుబలెమోదముఁబెం।
పకయుంటకొఱఁతగాదిది । సకలామోదంబుఁజేయఁజాలుటచేతన్॥ ౧౮.

వ॥ ఇట్లూహితకార్యప్రత్యూహ ప్రశమనపటిష్ఠవిశిష్ట మదిష్టదేవతావందనంబును, హృదయకమలవికాస కారణగురుచరణధ్యానంబును, సకలశ్రేయస్సంధానబంధురంబగు పితృవందనంబును, మఱియు సదసత్కవి నమస్కార తిరస్కారంబులు నొనర్చి కరిష్యమాణకృతిప్రతిష్ఠాహేతుతమంబగు మద్వంశక్రమంబభివర్ణించెద॥ ౧౯.

సీ॥ క్షీరవారాశిలో శేషాంకశయ్యపైఁబవళించియున్నతప్రభలునిగుడఁ।
గడలికూఁతురుదనతొడలపైనిడుకొనిపాదపద్మంబులుబట్టుచుండ।
సనకాదిమునివరులనిశంబుఁదనకథల్వీనులవిందుగావినుతిసేయ।
నురమునభాసిల్లువరకౌస్తుభద్యుతుల్శేషఫణామణిశ్రీలఁదెగడ।
సకలలోకైకరక్షణచతురుఁడమలుఁ । డాదిమధ్యాంతరహితుఁడువేదవేద్యుఁ।
డమరవినుతుండుమాధవుండసురహరుఁడు । చాలదయమీఱలోకంబులేలుచుండు॥ ౨౦.

క॥ సకలజగన్నిర్మాణ । ప్రకటితబుధవినుతశక్తిపాత్రుఁడుభాషా।
చకితదృశావల్లభుఁడగు । నకలంకుండుద్భవించెనాహరినాభిన్॥ ౨౧.

ఉ॥ ఎవ్వనిచేతగౌతమిమహీస్థలికల్లనవచ్చిసత్తధా।
యవ్వనరాశిలోఁగలసెనాతఁడుసంయమిశేఖరుండువా।
క్రువ్వనశక్యమామహిమరూఢివహించినయట్టిగౌతముం।
డవ్వనజాతసంభవునకాత్మజుఁడైయుదయించెఁబ్రోడయై॥ ౨౨.

క॥ ఆమునిమణిగోత్రాబ్ధికి । సోముండఖిలారిగర్వచోరుఁడువిబుధ।
స్తోమామోదకరుండగు । సోమాహ్వయసూరిగల్గెసుగుణాకరుఁడై॥ ౨౩.

గీ॥ ఆకళానంతునకుమువ్వు రాత్మజనులు । దేశభట్టుబుధుండమలాశయుండు।
పద్మనాభాఖ్య సౌమ్యుండువరుఁడు వేంక । టాఖ్యకవిహితుఁడునుభువినలరిరందు॥ ౨౪.

మ॥ ముదమొప్పారఁగబద్మనాభకృతికిన్మన్నీటికిన్ రేయి టేఁ।
డుదయంబందినమాడ్కి సత్పథవిహారోద్యోగుఁడంచత్కళా।
విదితుండాశ్రితసద్విజప్రకరతృప్తిప్రాభవాధాయకుం।
డుదయించెందగనయ్యాసూరిసమభిఖ్యోర్వీసురేంద్రుండిలన్॥ ౨౫.

సీ॥ రాజత్స్వధర్ములౌ రాజులార్గురుతమ చక్రవర్తిత్వముఁజాలరోసి।
బలితమాతపముచేఁదొలిమేనుదిగనాడిమాఱుపుట్టునద్విజన్మత్వమొంది।
చయ్యనఁదొలివిరాజత్వంబునొందకకవిరాజులై రధికత్వమొంది।
యనఁబొగడొందువారవనీసురేంద్రులాయయ్యసూరికిబుచ్ఛ్రయాహ్వయుండు।
నమరు రామసూరియచ్యుతసూరియు । సుజనవినుతుఁడైనసోమసూరి।
పద్మనాభసూరివరకృష్ణసూరియు । ననజనించిరార్గురాత్మజనులు॥ ౨౬.

వ॥ ఇట్లఖండపాండితీయశోమండలాపూరితాజాండులగు నప్పండితాఖండలులలోన. ౨౭.

క॥ ప్రతివాదిగర్వహరణా । చ్యుతుఁడౌటందనదుపేరునుచితార్థముతో।
జతపఱిచినకోవిదుఁడ । చ్యుతసంజ్ఞుండలరెఁబండితోత్తమనుతుఁడై॥ ౨౭.

క॥ ఆయచ్యుతసూరికిబుధ । గేయుండగుపద్మనాభకృతివర్యుండున్।
ధీయుతుఁడు వేంకటాఖ్యుం । డాయతగుణులుద్భవించిరతులితమతులై॥ ౨౮.

ఉ॥ అచ్యుతసూనులారయశివాపకృతిందమయుత్తమాంగముల్।
ప్రచ్యుతిఁజెందియుండఁగధరాస్థలిఁజెందిరనంగవిశ్రుతిన్।
వాచ్యముగల్గదేయనిశివప్రతిభోన్నమితోత్తమాంగులై।
య్యచ్యుతసూనులవ్విధనినంగజునెంతురుసాంగవిశ్రుతుల్॥ ౨౯.

వ॥ అందు. ౩౦.

సీ॥ వరశుచిధర్ములై ప్రబలువారగుటచేనరయనగ్నిత్రయంబనఁగవచ్చు।
విబుధజనామోదవీక్షణులౌటచేహరునినేత్రత్రయంబనఁగవచ్చు।
వివిధోపదేశములెవ్వేళఁజేయుటఁగనఁగవేదత్రయంబనఁగవచ్చు।
సుమనోనుకూలురై శోభిల్లుచుండువారగుటరామత్రయంబనఁగవచ్చు।
ననఁగఁబొగడొందిపద్మనాభాఖ్యసుమతి । కచ్యుతార్యుండుమద్వప్తయైనగంగ।
రామసమభిఖ్యసూరియుసోమసూరి । యనఁగమువ్వురుజనియించిరనఘమతులు॥ ౩౧.

క॥ ఆమువ్వురిలోఁగంగా । రామాఖ్యమనీషికెలమిరామపదాంభో।
జామోదులమగుసుందర । రామాఖ్యుఁడు వేంకటేశ్వరసమాఖ్యుండున్॥ ౩౨.

గీ॥ ఈకృతియొసర్పఁబూనినయేను రామ । యాఖ్యుఁడనుగూడముఖ్యరమఖిలసుమతి।
సద్దయావాప్తికౌతుకసంయుతులము । గర్గినారముమాలోనఘనతరునకు॥ ౩౩.

క॥ సుందరరామునకాదిమ । నందనుఁడుపయించెసజ్జనదయావాప్తా।
నందుఁడుమజ్జనకాఖ్యం । జెందిప్రేమినెల్లసుఖముజెందుచునుండున్॥ ౩౪.

క॥ సామకపిత్రసోదరునకు । సోమసమాఖ్యునకునొక్కసూనుఁడుగల్గెన్।
ధీమహితుఁడైనవేంకట । నామప్రథితుండుసుజనప్రమతిసుండున్॥ ౩౫.

క॥ ఇటులస్మత్సద్వంశము । పటుమహిమయొసఁగిచంద్రభాన్వక్షములై।
ప్పటిదనుకనుంప్రభుమిః । ప్పటిదనుకనువృద్ధిఁజెందిభాసిలుగాతన్॥ ౩౬.

క॥ ఆతతమతి రామాఖ్యుఁడ । గౌతమగోత్రోద్భవుండనగంగా రామ।
ఖ్యాతమనీషితనూజుఁడ । సీతాపతిపాదలగ్నచేతస్కుండన్॥ ౩౭.

క॥ శ్రీలలనాప్రియుఁడగుగో । పాలప్రభుచరితమువిహపరసౌఖ్యంబుల్।
దేలించుఁగానసరసతఁ । గాళిందీపరిణయంబుఁగావించుమదిన్॥ ౩౮.

క॥ నేనీకృతి కెవ్వరిమతి । గానొప్పుదుగొ యటంచుమగతిచిద్దినముల్।
మానితుసీతా రామున్ । మానసమునదెలసుసంస్కరిమహిమదల్పిగన్॥ ౩౯.

సీ॥ ఋతుమానికమలజశ్రుతిసంఖ్యకలియుగవత్సరభావాఖ్యవర్షమందు।
వైశాఖసితపక్షభాసురైకాదశియందిందువాసరదినాంతమందుఁ।
బాదిగయామలవారిసాంధ్యక్రియల్సల్పిపరామయుధస్వామికెరఁగి।
పరిస్ఫురమతితోడబహువిధసన్నుతుల్సల్పుచునుసృష్టిసమయమందు।
నీవుదలఁచినయదివామానునివతమతిని । గృతియొనఁగుమన్నపలుకుపశ్రుతియుఁబోలె।
వినఁబడఁగనేఁగిబాలకితతనుఁగనుచు । శ్లోకమొకటియొసర్చితిసుందరముగ॥ ౪౦.

శ్లో॥ దోషవ్రాతమహాటవీంమునిజనాంభోజాకరంపార్వతీ।
నేత్రేందీవరయుగ్మమగ్నిదినకృత్తారాధిపత్వాత్మకైః।
సర్వ్యాంతఃనయనైస్త్రిభిఃపురహరంపీఠీపురాధీశ్వరం।
వందేజిష్ణుముఖాదితేయవినుతంపాదాయుధేశంసదా॥ ౪౧.

వ॥ అని యిట్లు వినుతించి యది తదాజ్ఞగా భావించుకొని యమ్మహామహునకుం గృతి యొ
సంగందలంచి షష్ఠ్యంత స్తవంబాచరించెద. ౪౨.

## షష్ఠ్యంతములు.

క॥ శ్రీమదుమాపదకుంభయు । గామలకాశ్మీరసంభవాంచితవక్షో।
ధామాపహ్నవహృద్గత । కోమలభక్తానురాగగురుతరమతికిన్॥ ౪౩.

ఉ॥ పొట్టకుఁబట్టెడన్నమునుబుట్టకయొల్లెఁసత్రభుక్తినే।
పట్టుననిద్రలేకయొకపట్టునులేకచరించునట్టియా।
దిట్టరిమూకకున్ క్షయనిదిక్తటులందుఁబ్రసిద్ధిఁజెందియుం।
బెట్టెఘనత్వమంచునగునింద్రపురంబునుదత్పురంబొగిన్॥ ౫౪.

శా॥ ప్రాకారస్థగితేందుకాంతశశకల్పవ్రాతద్యుతుల్గాంచితా।
మాకాశాపగయంచునెంచియనిమేషాళ్యాతపప్రేక్షణాల్।
నీకన్వారివిహారసక్తమతులైనిచ్చేసినీరంబటన్।
లేకుంట న్వెరఁగందిసిగ్గుగదురన్వీక్షింతురిట్టాయలన్॥ ౫౫.

సీ॥ భుజగేంద్రుడికన్యకల్ని జగూఁముచకాష్ఠ గర్వించిమాభోంఛ్లగలదెభువిని।
అనియెంచియున్వీటసలరాయిమిన్నట్టిపరిఖాముఖంబునఁబయలువెడలి।
వెడవింటికోరచేనెనఁలించునవ్వీటిమించుఁబోడులచెలువెంచిమాంపి।
యహాహాయికన్నెలయందంబువదియింపశక్యమానేమనసామికైన।
పిరిచెలునేడపనమేడపిరిఁబోల। నేరమదియుంచినిష్మటునిగ్గదేరు।
రోమునస్త్రీసిఁబోలంగిలేమటంచు। సరగవచ్చినప్రతోవనెనవెడగఁదు॥ ౫౬.

గీ॥ అమృతవిదితిప్రసవ్యమంతానతినచ్చు। శాస్త్రకామలనేమగఁజాలునేను।
పీటసంపూర్ణకళలచేవెలుఁగునొందు। కాంతియుఖచంద్రులుందునరసీతమునను॥ ౫౭.

ఉ॥ అన్నగరీలలామమునహర్మ్యతలాగ్రములెక్కియాడురా।
కన్నెలుచంద్రుఁబట్టిముఖకాంతిహరింపఁగవచ్చినట్టియా।
కన్నపుదొంగఁజూడుఁడనికౌతుకఁజెప్పముగానలందఱుం।
కెన్నమునిట్టురాకుమనిహేళిఁచేయుచునుందురెప్పుడున్॥ ౫౮.

ఉ॥ వారిజసంభవుండెనటిబ్రాహ్మణవర్యులతోడనీడుగా।
నేరకతన్నుఁదెల్పుటకునిక్కముదారిటకేగుదెంచురా।
చారయుచుండునద్దెసలహార్మ్యశిరోముల్లనుఁగన్నయట్టియం।
భోరుహమందుదానునిదిచెల్వుగఁదెల్పుఁదకాన్యపీఠముల్॥ ౫౯.

గీ॥ తేజమునుకీర్తిధైర్యగాంభీర్యశౌర్య। గరిమనిప్పక్షపాతతల్లలిగియుంట।
నరయనద్రీశతత్పుతులైనఁగాని। పోలరిప్పీటిబాహుజపుంగవులను॥ ౬౦.

ఉ॥ ప్రాకటవార్ధిమధ్యగిరిభాసురమయ్యెడునప్పురిన్లస।
చ్ఛ్రీకులువైశ్యరత్నములుచెన్నుగనంగడులందమేయశో।
ధాకలితాచ్ఛరత్నములపారముగానిడియమ్ముచుండరే।
త్నాకరసంజ్ఞయుద్ధ్యదధికఖ్యనుగాదెమహీతలంబునన్॥ ౬౧.

వ॥ మఱియు నచ్చటి ముచ్చట లుచ్చరింప నచ్చెరువు నానందంబునుం బెచ్చు పెరుఁగు నచ్చం
బుగ రూపంబున నచ్చరలం బునికిపుచ్చుకొను మచ్చెకంటులు పచ్చవిల్తుని హెచ్చుగు
రూపంబునకు నచ్చుఁజూపు రూపాదవిన తగుమగలంగూడి నిగనిగలెగయు మగరాల
మేడలపైఁ దొగరేని జిగినగు నగుమొగంబులఁ జిఱునగవు లెగయ సొగసుకాండ్రు వల్కు
పరిహాస వచనంబులకుం దమ ముగుదతనం బేర్పడ మెల్లమెల్లన నిడు ప్రతివచనంబులచే
నుల్లంబులు పల్లవింపం బల్లవు లుల్లాసంబునం దగ్గరిల్లి యప్పలుకు లగ్గించుచు నిగ్గుదేరు
మోమెత్తి మంతనంబునం గంతుకేళులు సంతసంబున వేఁడ నంతకంతకు హెచ్చుమోహం
బునం బంతంబుదక్కి రతికేళిం దేలి నిశాంతరతాంతనితాంతశ్రాంతలైనకాంతాలలామం
బుల కత్యంతానందంబు నొసంగుచుం గబ్బిగుబ్బలపై నుబ్బుస్వేదబిందుసందోహంబు డిం
దింపంజాలి యరవిందమకరందబిందుబృందగంధబంధురంబును, మదవదిందిందిరామంద
మధురనినాదసంయుతంబునగు మందగంధవహంబును, గంధవహానీతమృదుగంధసంభూత
పరగజశంకాతిరోషభీషణగంధసింధురఘటాఘీంకారాతిభీతదిగ్గజంబులును, దిగ్గజంబు
లైనం గరంబునం గరంబుపట్టి కరంబు విక్రమంబేర్పడ నాకర్షింపంజాలు ప్రతియోధులకుం
బిఱుదీక విజయాభిలాషంబున నంతకంతకుఁ బంతంబునం బురిగొను బలంబును, బలంబు
నుంగలిగి యాలంబులం దమోఘవిజయంబులం జెందు యోధనిచయంబును, యోధనిచయం
బేయు సాయకంబులచే సంగంబులు తెగిపడినం బసక మారుతాతీతరయంబు గల్గు
హయంబులును, హయంబులఁ బూన్చుట యాభరణమాత్రం బివితమంతటన పరిగిడనో
ప్పునని చూపఱులచేఁ బొగడొందు మేరుమహీధరశృంగంబులం బోలు శతాంగంబులును,
గల్గి జిష్ణురుచి సమవర్తిపుణ్యజనప్రచేత స్సదాగతి ధనదేశ్వరసంయుతంబై యష్టదిక్పాల
పురంబులం బోలు; నమితగంధర్వాకరంబై యమరావతిం బోలు; సకలశివాకరంబై కైలా
సశైలంబుం బోలు; బహులక్షపాభిరామంబయ్యుఁ దమోగుణశూన్యంబై, బహుకళాపూ
ర్ణ ద్విజరాజభాసురంబయ్యు నకళంకాత్మసంయుతంబై, యొప్పు నప్పురంబు నిఖిలజగ
త్సారంబై యొసంగెడు. ౧౯.

సీ॥ ఏమహాదేవునికోమలగుణగణంబామ్నాయపంక్తికి నాభరణము।
ఏమహోరస్ఫురన్నిభూమవక్షస్థలంబిందిరాదేవికిమందిరంబు।
ఏదయావంతునిసాదరాలోకంబుభక్తిలోకములకుఁబారిజాత।
మేసుందరాంగునిభాసురరూపంబుగోపీకుచాంతరగోపనీల।

మతులితానంతసద్గుణయుతుఁడుమాని । హృదయరాజీవనిలయుండుసదయమూర్తి।
ఏమహామహుఁడట్టిశ్రీకృష్ణదేవుఁ । డప్పురంబునకధిపుఁడైయలరుచుండు॥ ౨౦.

క॥ శ్రీకృష్ణునిశుభచరితము । లేకముఖంబునవచింపనెంతటివాఁడన్।
వీకవచింపఁగనోపక । కాకోదరవరుఁడుశయ్యగానుండంగన్॥ ౨౧.

మ॥ అకలంకంబగుతత్పరాక్రమములోకాతీతతేజంబుతోఁ।
గకుబంతంబులకేగిశత్రుజయముంగావించితత్కీర్తివా।
మకకన్యామణులన్వరించియచటన్మవ్వంపుఁదేజంబుఁబా।
వకుఁగాఁజేసెవివాహమయ్యెనతులప్రాగల్భ్యయుక్తంబుగాన్॥ ౨౨.

గీ॥ కువలయేశుండుతత్కీర్తినివహమందు । మగ్నుఁడైకానఁబడకుంటమానసంబు।
నందుఁజింతించియక్కమలాసనుండు । చిహ్నమును భేదమేర్పడఁజేసెఁగాదె॥ ౨౩.

సీ॥ పుడమిపైనడుగిడనడలించెద్విజవర్యునాకళానిధిజిక్కునట్లుచేసె।
ముక్తావళులరంధ్రయుక్తముల్గాఁజేసెనలగోత్రనాథునిశ్చలునిఁజేసెఁ।
బరఁగసత్సంతతిబయలూనఁగాఁజేసెఁబరమహంసలభీతిఁబొఱఁజేసె।
ఘనసారబృందంబుఖండంబుగాఁజేసెఁసానివర్యునిదిగంతమునకనిచె।
నౌరయిూరీతిఁబనులెల్లనాచిరించి । చిత్రమొప్పఁగఁదత్కీర్తిచిరతరంబు।
వృద్ధిఁజెందుచుఁగాంతిసమృద్ధితోడ । హరునితోఁజెలిమికెంతయునమరియుండె॥ ౨౪.

ఉ॥ పున్నమరేయితేనిసిరిఁబోలెడువక్త్రసరోజకాంతిచేఁ।
గన్నెలకెల్లగాఢతరకామతమోవృతిఁజేసితన్నతుల్।
చెన్నుగదొంగలించునికఁజెప్పఁగనేమిదియిట్టులుండఁగా।
వెన్నెలదొంగయాటపదువీరునిచర్యలలోనఁజిత్రమే॥ ౨౫.

సీ॥ తనయశస్ఫురణంబుతనయశస్ఫురణంబువలెహారిదంతప్రవర్తిగాఁగఁ।
దనచంద్రహాసంబుతనచంద్రహాసమట్లతిపుణ్యజనసంఘహారిగాఁగ।
దనధర్మభరణంబుతనధర్మభరణంబుఁబోలెసన్మార్గణపాలిగాఁగ।
దనబంధురాగంబుతనబంధురాగంబుకరణిగోపానందకరముగాఁగ।
దనదువానవిచక్షణత్వంబు దెలియ । భూరిబుధమోదకరదానవారిపగుచు।
నతనిగుణములతోసాటియతనిగుణము । లనఁగఁదగియుండువసుదేవునాత్మజుండు॥ ౨౬.

సీ॥ ఒకశుకవాణితోనొనరసంభాషించురామనొక్కతెఁజూచుఁగామమెసఁగ।
నొకవిలాసినితోడనెకసక్కెమాడునుబాలనొక్కతెఁగంతుకేళివేఁడు।
మదురోష్ఠినొక్కతెనధరామృతంబానుముకురాస్యనొక్కతెముద్దువెట్టుఁ।
గామినినొక్కతెఁగాముకేళులఁదేల్చుఁగనకాంగినొక్కతెఁగౌఁగలించు।
హంసగతినోర్తునిటులరమ్మనుచుఁబిలుచుఁ । దత్తదనురూపచర్యావిధాననిపుణుఁ।
డగుచునిట్టులనచ్చటియలరుఁబోండ్ల । యుల్లమలరించువల్లవీవల్లభుండు॥ ౨౭.

సీ॥ వానిసౌందర్యంబువర్ణింపఁగా నేలనాత్మసంభవనామమందియుండ।
ముఖపద్మకాంతి నిమ్మొనసిచెప్పఁగ నేలవిధుఁడను పేరటవెలయుచుండ।
జికురబృందముసౌరుఁబ్రకటింపఁగా నేలజనులెల్ల కేశవుండనుచుఁబల్క।
వానినెన్నడుమునువాక్రువ్వఁగా నేలహరిసమాహ్వయమునఁబరఁగియుండఁ।
బుండరీకాక్షుఁడనుటకతం డెయుచితుఁ। డగ్గుఁడాతఁడెపురుషోత్తమాహ్వయమున।
కతఁడెతగియుండుభూమిశ్వరాంకితమున । కిలఁగలఁడెవండువానికిఁదులయొకండు॥ ౨౮.

శా॥ ఇంద్రాదిక్రతుభుక్కిరీటవిలసద్దివ్యప్రభాదీపని।
స్తంద్రభ్రాజితపాదపద్ముఁడగునాదైత్యారికింబాధ్గులం।
సాంద్రీభూతమహాయశస్కులఁగనన్ రాగంబుచేనొక్కనాఁ।
డింద్రప్రస్థపురీప్రయాణకుతుకంబేపారనున్నంతలోన్॥ ౨౯.

ఉ॥ వానిమతంబెఱింగియొకపార్శ్వచరుండురయంబుమీఱఁగా।
భానుసహస్రమండలవిభావిభవానుభవంబొనర్చున।
న్యూనమణిప్రభావళిమనోహరమామకుటంబుఁదెచ్చెన।
న్యానుమతజ్ఞుఁడౌమనుజుఁడన్యులప్రేరణఁగోరుచుండునే॥ ౩౦.

క॥ తెచ్చినఁగృష్ణుఁడువాలిచె । నచ్చెరువుగఁబూర్ణచంద్రునబ్జాతహితుం।
దెచ్చియొకచోటనిడుతెఱఁ । గచ్చుపడంబోల్చెమౌళియాస్యముచెంతన్॥ ౩౧.

మ॥ నిజభృత్యుండొకఁడిచ్చుకుండలములన్వీరుండువాల్పంగఁగా।
యజునాస్థానపుమంటపంబగుతదీయానూనవక్షస్థలిన్।
భుజదండోపరిభాగభాసితములౌభూరిప్రభాచేలస।
ద్విజయాంచన్మకరధ్వజంబులక్రియన్దీపించెనెంతేనియున్॥ ౩౨.

క॥ ఛాయాప్రియసంకాశ । చ్ఛాయాచ్ఛాదితతదీయసర్వాంగంబున్।
మాయూరపింఛధారికిఁ । గేయూరయుగంబునొక్కకింకరుఁడిచ్చెన్॥ ౩౩.

క॥ రంగదనేకవిధచ్ఛవి । నంగదయుగళంబుఁదాల్చియమరేష్వాసా।
భంగరుచిశోభితాంబుద । శృంగారంబడఁచియపుడుశ్రీధవుఁడొప్పెన్॥ ౩౪.

శా॥ దాసుండొక్కఁడువైళముల్లసితకుందప్రస్ఫురన్మౌక్తిక।
శ్రీసంభాసితమైనహారమిడెనాశ్రీసుందరీనాథుఁడున్।
హాసభ్రాజితకాంతిచేతనలముక్తాంతావకాశంబులన్।
వాసింబూర్ణతనొందఁజేయుచునుమవ్వంబొప్పఁగాఁదాలిచెన్॥ ౩౫.

ఉ॥ తారకలంబుదాంతరితధామములైయతిరోచవృత్తిచే।
నీరదపఙ్క్తికడ్డముగనిల్వఁదలంచితదీయకాంతియా।

శౌరియురంబునం గలుగఁ జయ్యనహారమిషంబుచేనటం।
జేరెనుకాకముత్తెములఁ జెప్పఁగ నేటికిఁ దారకాభిధ౯॥ ౨౬.

మ॥ తపనీయాంచితకాంతిశోభితములై తళ్కొత్తుచున్నట్టివ।
జ్రపుటుంగ్రంబులు గాంచె నంగనవికంసద్వేషి హాల్పంగఁద।
ద్విపుల శ్రీవృతహస్తపద్మమ మరెన్విస్ఫూర్తి మత్పుష్పబృం।
దపరీతాత్మలతాంతసంభరితమై తా పించగుచ్ఛంబన౯॥ ౨౭.

వ॥ అప్పుడు. ౨౮.

ఉ॥ మేలిపసిండిచుట్టుపనిమించెడు దర్పణమొక్కదాసుఁడా।
నీలపయోదగాత్రు దరిని ల్వె సరోరుహిణీప్రియుండు గో।
పాలకమౌళికిచ్చె దనుబాలికనంచును బంపినట్టిబల్।
మేలగునంచులంబనపు మేదిన శోభనరేఖయోయన౯॥ ౨౯.

ఉ॥ నిల్పఁగ దాని లోఁ దనదు నీటగు రూపముఁ జూచి మోసముం।
గల్పకకోరకావళిసఖంబగు నాత్మనఖాంకురాళిఁగీ।
ల్కొల్పయొకింత దిద్దుమను గోరిక మీఱఁగ మారుతాశరా।
ట్తల్పకుఁ డాత్మరూపమును దాఁగని సంతసమందె నాత్మలో౯॥ ౩౦.

వ॥ ఇట్లఖిలాంగభూషితభూషణుండై యరిభీషణుండైన యాభీరకులభూషణుండు ప్రస్థానవేషణుండై యున్నసమయంబున. ౩౧.

సీ॥ తగ హేళిజిగిఁ జాలనగఁ జాలి యున్నట్టి కెంపుల చేఁదుల కింపుదానిఁ।
గనఁ జందురుని యందమును గ్రిందుపడ జేయు మగమానికములచే నెగడుదాని।
విరిముల్కి దొరచిల్క సిరి కుల్కుచున్నట్టి పచ్చలచే సిరి హెచ్చుదాని।
దొలిమొయిల్బలు హొయల్లలి బయల్పడఁ జేయు నీలంపు గమిచేత నెగడుదాని।
రహి నిదన పేరఁ బరఁగెడు రతనములను। గాను వచ్చె నెకో యనఁగ ఱుము మెరయు।
పులుఁగు దొర కేతనంబుఁ దగలుగుదాని। బొలుపు పుత్తడి గుబ్బలిఁ బోలుదాని॥ ౩౨.

క॥ స్వర్ణాత్మప్రాసంగో। దీర్ణాణివరూథరుచులఁ దేరెడు దానిం।
దూర్ణత్వవిజితవాయును। పర్ణములగు హరుల చేత భాసిలుదాని౯॥ ౩౩.

క॥ దారకుఁ డొకయరదము బృం। దారకులగ్గింపనిఖిలదానవపటలీ।
దారకునకు వసుదేవుని। దారకునకు మాతలిసురథారేయుసకు౯॥ ౩౪.

క॥ తెచ్చిన రీతిం దేఁగని। యచ్చిత్రస్యందనంబు నారోహించెం।
బచ్చగుజాలవజీరుం। డుచ్చంబగు నుదయశైలమొందిన రీతి౯॥ ౩౫.

క॥ ఆలోహించిరమేశుఁడు । దారకుఁజూపంగనతఁడుదరిరోయుటచేఁ
దేరుదరలించెమెల్లనఁ। బౌరులుదన్నాత్మలోనబహుమతిసేయన్॥ ౯౬.

శా॥ ఏకీనాసరివారుచూచెదనుగాకీలోతమందెల్లఁగం।
జాకీనాదులుద్రోవఁదప్పుదురుగాకజ్ఞాతజాతాదులౌ।
వాకీనాస్థితిమెచ్చుచుండననుచుంబంతంబుఁగావించెనా।
భేకీనాదముపిక్కటిల్లెనుదిశాబ్జంగాంతరాళంబునన్॥ ౯౭.

శా॥ సర్వాశాపరిపూర్ణమాననిఖిలాశాస్యామిత్రీయుతా।
నిర్వాద్యక్రమవిక్రమానుగపరశ్లోనిధ్యానమాత్రోన్నతా।
ఖర్వాశ్చర్యభయావిచేష్టనిఖిలాంగవ్రాతశత్రువ్రజా।
దుర్వారోర్వ్యజయాతీందిరేశయనితోత్సోమాగధుల్వ్వల్కఁగన్॥ ౯౮.

మత్తకోకిల॥ ఇమ్ములంబలుకంగనేటికినిందిరేశ్వరమామదుల్।
నిమ్ములంబుగనిల్చెనీయినిశ్చయంబిదియంచుడీ।
పమ్ములంగొనిబాసఁజేసినభంగిదోఁపఁగనత్తతిం।
గొమ్మలందునివాశిఖాసఁగిరికోరికస్ఫురిత్తఁగన్॥ ౯౯.

క॥ ఎడనెడఁబడఁతులుతడఁబడి । వడివడిఁగడుదోపరయిడునివాశిలఁగొనుచుం।
బడిబడికడమొకయునుబిడి। యుడియుడినడఁడునుకిడెసుమొనప్పలఁగొనుచున్॥ ౧౦౦.

వ॥ ఇనిఇనియుందు. ౧౦౧.

క॥ వారిధిదరిఁబౌరులనుం। ద్వారకకేగంగరథముఁనడిఁదోలుట్నకే।
సారధికిందనతోఁజను । దేరఁగసాత్యకికినాజ్ఞదితిజారియిడెన్॥ ౧౦౨.

ఉ॥ యోజనమొక్కసంఖ్యగనుసొక్కటిరెండనిలెక్కసేయఁగా.
యోజనఁజేసియప్పుడుపయోజభవాదులనన్యచిత్తులై।
యోజమెలర్పఁగాఁబదియుసొక్కటిగావచియింపనోపరై।
రాజవమాశతాంగవరమాహయములుల్లపంగనెట్టిరౌ॥ ౧౦౩.

సీ। కంజాక్షుఁడవిలీనఘనమోహమునవిపఁజాలకవెనువెంటజరుగువారు।
వారిధిచెంతఁగంసారియానతిఁజెందిద్వారకాపురికినేతేరువారు।
గుట్టలుమెట్టలుకోటకొమ్మలునెక్కియరదమేగెడుమార్గమరయువారు।
మగలియెన్నడువచ్చుమధుమదనుంపెనిగుంపుగుంపులుగూడుకొనెడువారు।
నైరియత్తతినప్పరివారలెల్ల । నహహవారికిమాధవునందుఁగల్గు।
నట్టియనురాగమదియింతయంతయనఁగఁ । దరమెకనుఁగొనువారికిఁదనివిగాక॥ ౧౦౪.

ఉ॥ కొండలరణ్యముల్నదులుకోనలుపల్లెలుపట్టణంబులున్।
మెండుగఁజూచిసాత్యకినిమిత్రసమూహముగారవించియా।
ఖండలముఖ్యసన్నుతుఁడుగాఢమనోరథసక్తచిత్తుఁడై।
పాండురశోభిదంతరుచివక్త్రముఁగ్రమ్మఁగఁబల్కెవారితోన్॥ ౧౦౫.

సీ॥ మునుసప్తహయమార్గమునుగబళించినప్పృథుబలావంధ్యమువింధ్యమిదియొ।
జనులకానందంబుసంధింపఁజేసెడిచాలపేలవమగుమాలవమిదె।
కువలయప్రియునకుఁగూతురైయొసఁగిననతలోకశర్మదనర్మదయిదె।
అలవిక్రమాదిత్యుఁడధిపుఁడుగాఁగలసకలసజ్జయినియుజ్జయినియిదియొ।
పుష్పఫలమంజరీపుంజభూషితంబు । లీవనంబులుభూలోకపావనంబు।
లఖిలసౌందర్యసంపాతికాటపట్టు । లీపురంబులునిర్జితగోపురములు॥ ౧౦౬.

శా॥ నాచేచాయనెచూడుఁడల్లదెయనూనస్వప్సరోజాతమున్।
నీచాగమ్యఫలంబుభూరిసుమనోనిత్యార్ఘ్యమచ్ఛామృతం।
బైచెన్నొందుచుస్వర్గలోకమువసంతారామముంబోలెడున్।
వాచాగోచరమైనయప్సరమణిన్వారాణసింగంటిరే॥ ౧౦౭.

గీ॥ అరయనప్సరమణికాశియాటఁజేసి । కాశసమభిఖ్యతోనురగేశుఁడలరి।
కానిఁగూడుటకేతెంచెఁదమిననంగ । భాసిలుచునుండుగంగాప్రవాహమచట॥ ౧౦౮.

గీ॥ యమునఁజూడుఁడియల్లదెప్రమదమెసఁగ । గంగతోనీతరంగిణిగలయుచోట।
లీలనేగుచునొండొరుకేలువట్టు । సన్నద్ధగజశోభలమరపియుండు॥ ౧౦౯.

వ॥ ఇట్లువర్ణించుచుం జనునక్కమలలోచను నక్కదనంబు మక్కువతోఁజూచి మార్గ
మధ్యంబునం బురీజనపదంబులనుండు వేదండయాన లొండొరు లిట్లనిరి. ౧౧౦.

సీ॥ విసపుఁబాలిడినట్టిదొసఁగుఱక్కసిచేడెఁబంచినాఁడఁటజముభవనమునకు।
మామనారాక్షసభామకుఁదోడుగాఁజేసినాఁడఁటతనవాసిమెఱయ।
శకటమైవచ్చినవికటరాక్షసవీరుఁద్రొక్కినాఁడఁటముక్కముక్కలుగను।
గఠినవదావానలగాసిదప్పటకునైమీటినాఁడఁటకొండగోటితుదను।
గోపికలయిండ్లలోబహురూపుఁడగుచుఁ । బాలుపెరుఁగులుముచ్చిలుబంటరియఁట
కాపురంబైతెయలద్వారకాపురమఁట । చూడరేవీనిముదమారసుదతులార॥ ౧౧౧.

చ॥ నయనములంబుజాతములనందగువక్త్రముచంద్రబింబమున్।
భయపడఁజేయువక్షముకవాటమువాటముమీటుగేశసం।
శయముజయింపఁజాలుఁదమసంబునగంబుఁబుకంఠమానుగో।
ల్లయలరుఁబోండ్లమున్నుకమలాపతికైతపమెంతసేసిరో॥ ౧౧౨.

యంబోజరాజవాహనునకక్కురువంశవిభూషణుండువా।
క్పాండితివిస్తరిల్లనిటుపల్కఁదొడంగెనుసంగ్రహంబుగ౯॥ ౧౨౧.

గీ॥ బావభావత్కపట్టణప్రజలకెల్ల । సేమమేమాకునిచ్చటసేమమీవు।
గలుగ నేరికిసేమంబుగలుగకుండు । నడుగననతిజ్ఞతయబయలాటగాక॥ ౧౨౨.

ఉ॥ బంధుఁడననన్నుపానమముబాలననేయఁగవచ్చునద్దయా।
సింధుఁడవీవు శ్రీహరివిచెప్పఁగనేటికిమాకునీదునం।
బంధముగల్గుటారయఁగమానుషమాత్రుఁడొకండునీట్కై।
యంధువుద్రవ్వఁగానమృతమబ్ధినకీతిగనుండెమాధవా॥ ౧౨౩.

వ॥ దేవా భవదీయసామర్థ్యంబు వర్ణింప బ్రహ్మాదులకశక్యంబు. నీవు లీలాగృహీతశరీరుండవై చతుర్దశభువనంబులు కుక్షిమధ్యంబుననిల్పి మాదృశప్రాకృతరక్షాదీక్షావిచక్షణుండవై జనించిన యాదిపూరుషుండవు. నీకుసంబంధిబాంధవ సుఖదుఃఖాదులు శైలూషునకుంబోలె విలాసాసాదితంబు లట్టిమహామహుండవు వీవుబంధుత్వవిషయంబున మమ్ముం బ్రసాదింపంగోరి మదగారంబుఁజెందుట మరుభూమిం జాహ్నవిప్రవహించినట్లుతోఁచె నని మఱియు నిట్లనియె. ౧౨౪.

శా॥ నీసాహాయ్యముగల్గియుండుటఁజుమీనిక్కంబుమేమెల్లడ౯।
వాసింజెందుటయెల్ల ...టులబలావంధ్యత్వముంబూనుట౯।
నీసాహాయ్యముగల్గియుంపఁగఁగానీరాటపుంతంబుదో।
పాసారంబుదలిర్పఁబోనడచియాచంద్రాననంగొంటయు౯॥ ౧౨౫.

క॥ ఇట్టులుతామొనరించిన। దెట్టిఁపుంజేతవానివినుతించెదులా।
గుట్టుపడునట్టుపలుకఁగ । నెట్టనహరివల్కెవానినేర్పుఁదలఁచుచు౯॥ ౧౨౬.

ఉ॥ ఓకురువంశముఖ్యజనులోకైకకృత్యమొనర్చిచక్కఁగాఁ।
జేకుఱెనేనిమేమిటులుచేసితిమంచుఁదలంతురెంతయుం।
జేకుఱకున్నదైవమిలుచేసెనటంచుఁదలంతురట్టుగాఁ।
గాకసమస్తమీవువిధికారణమంచుఁదలంతువెప్పుడు౯॥ ౧౨౭.

గీ॥ మనవిజయుఁడెంతపనికైనఘనుఁడెసుమ్ము । పురహరుఁడుగానియప్సరందరుఁడుగాని।
కలననెవిరినఃగలఁగలఁతిపఱుచు। నట్టివానికిజలచరమనఁగనెంత॥ ౧౨౮.

వ॥ అని యిట్లు వ... తసుందరవదనారవిందుండై పలుకుచున్నముకుందు నయ్యాదువంశమండనుండు శు... ...ునకుందోడ్కొని చంద్రకాంత సౌధాంతరాళంబున నెుక్కకనకమ... ...భద్రాసనంబ... ...ముఖులకర్హాసనంబులొసంగ నాశ్రీకృష్ణుండయ్యాసనంబు నారోహించి మేరు... కమల... పె సారజలధరంబుంబోసె భాసిల్లె నయ్యవసరంబున.

సీ॥ కుచభారముసహింపక చమత్క్రియారూఢిఁబచరించునవలగ్నముచలియింప।
గురురుచిహంసలవెఱఁగుపుచ్చెడుగతిఁగరమందియలుఘల్లుఘల్లుమనఁగ।
బాదంబుపుడమిపైనూదినయటునాపాదించిగబ్బిగుబ్బలునటింప।
వడినేగుచోఁగాల్లఁబడినటించెడుకీలుజడజడగతికిబల్లడిమనిడఁగ।
గొంకుచునుగ్రొత్తపెండిలికూఁతురౌట। మోముదమ్మినినునుసిగ్గుమొలకలెత్త।
నరగఁబాంచాలికనకపాంచాలికయన। వచ్చిశ్రీహరికొనరించెవందనంబు॥ ౧౩౦.

ఉ॥ మ్రొక్కఁగశౌరియాద్రుపదుముద్దులపట్టికిదీవనల్ గరం।
బెక్కుడుకూర్మితో నొసఁగెనింతటఁగుంతియునేగుదేరఁగా।
గ్రక్కునలేచియామెకొఱగంబడివందనమాచరించివే।
యొక్కసువర్ణపీఠిపయినుండఁగఁబల్కి వచించెనిట్టులన్॥ ౧౩౧.

క॥ అత్తాకుశలమెమీకిటఁ। దత్తాదృగనుగ్రహాప్తివలనస్మాకుం।
జిత్తానందముగలదని। యుత్తరముంబయునిచ్చెసూరకయుండెన్॥ ౧౩౨.

గీ॥ అన్న నీవారలకుఁగల్గకున్నె మాకుఁ। గుశలమనిపల్కి మఱియునక్కుంతితమకు।
ధార్తరాష్ట్రిలొనర్చినతగులములను। జెప్పెనన్నియునద్దయాసింధువునకు॥ ౧౩౩.

వ॥ తదనంతరంబ. ౧౩౪.

సీ॥ ఒకవేళసదరాళచికురాళసద్గీతవిద్యలనింపుగావినుచునుండు।
నొకనాఁడుబలువేడుకకుజోడుగాఁగూడివిజయునితోడుత వేఁటకరుగు।
నొకసందునరవిందులకుసందుఁగనరానిఘనపుష్పఫలయుతవనులకరుగు।
నొకతూరిమదిఁగేరిశుకశారికాహంసనంచయంబులగృతిఁబెంచుచుండు।
మఱియునొకనాఁడుమృదుకథామహిమజరుపు। నచటివారికినొసఁగుచునతిముదంబుఁ।
బాంచవాగ్రజుండుప్రార్థింపవేడుక। నిలిచెనచటశౌరినెలలుకొన్ని॥ ౧౩౫.

ఉ॥ శుక్తిపుటాంతరాళమునసోఁకినవర్షపయఃకణంబున।
న్మౌక్తికమైవిశేషగతిమన్ననఁజెందినరీతినప్పురి।
సక్తజనంబుపార్థముఖసంగతిఁగల్గుటచేతనుల్లస।
ద్భక్తిదలిర్పశౌరిగుణభాసురుఁజూడఁగఁజెందెనర్హతన్॥ ౧౩౬.

చ॥ సమధికభక్తితోమునులుసంతతముండమమానసంబులన్।
నెమకఁగఁగానరానిరజనీదయితాననుఁజెప్పకీనరో।
త్తములకునప్రయత్నముగదర్శనమిచ్చుటెకాకవారివి।
త్రముపలెనుండెశౌరియవహాతకటాక్షమకారణంబహా॥ ౧౩౭.

క॥ అనియిటు చెప్పఁగ మానులు । వినిసూతునితోడననిరి వేడుక మీఱన్।
మునివరయవ్వలికథయును । వినిపింపుముమాకువినఁగ వేఁడెదమనుచున్॥ ౧౩౮.

గీ॥ కాలకాలనీలకంధరకంధర । వాసవాసస్వీయదాసదాస।
శరధిశరధినిహతసారంగసారంగ । భూషభూషసరవిశేషశేష॥ ౧౩౯.

క॥ హరగరధరధరధరధర । శరధరవరశరణశరజశరహరలసద।
ధ్వరహరనరవరవరకర । గరధరఖరకరజజయసకలఖచరనతా॥ ౧౪౦.

మాలిని॥ రజతగిరినివాసారా-జితాశేషదాసా । విజితసుమశరాసావిశ్వసంధాత్రహాసా।
రుజితపురవికాసారుక్షభూభృచ్ఛరాసా । భజితశుభవిభాసాపద్గయాతీరవాసా॥

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షవీక్షణసంలబ్ధ సంస్కృతాంధ్ర కవితా ధోరణీమాధురీధురీణ సకలసుకవిజనదయాపాత్ర గౌతమగోత్రపవిత్ర గంగారామకృతి పుత్ర సూర్యప్రకాశసూరిచ్ఛాత్ర రామయాఖ్యప్రణీతంబైన కాళిందీపరిణయంబను మహా ప్రబంధంబునం బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# కాళిందీపరిణయము.

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీమద్భూమీధరక । న్యాముఖనాళీకగంధనందితహృదయా।
సోమాలంకృతమాళీ । కోమలకనకనగచాపకుక్కుటరూపా॥ ౧.

గీ॥ అవధరింపుముశౌనకాద్యఖిలమునులు । కనియెనిటులరోమహర్షణతనయుఁడటుల।
ముదమెసంగఁగనప్పురముఖ్యమందు । బలరిపునసుంగుదమ్ముఁడునిలిచియుండె॥ ౨.

సీ॥ శిశిరాపగమవికసితశతశతపత్త్రరాజిశ్వేతాతపత్త్రమ్ముగాఁగ।
ఫుల్లపుష్పోల్లసన్మల్లీగుళుచ్ఛముల్ గమనీయసితచామరములుగాఁగ।
జాతిపల్లవభక్షణాతిమాత్త్రస్వనత్కలకంఠతతులుమాగధులుగాఁగ।
క్షితిరుహచ్యవమానజీర్ణపర్ణధ్వనుల్ ప్రస్థానభేరికారవముగాఁగ।
బల్లవాంతరవాహనభాసమానుఁ । డెగుచుఁబాంథనిచయువిజయాభిలాష।
మనమునందునమప్పురిగొనససంతుఁ । డరుగుదెంచెమహామోదమతిశయిల్ల॥ ౩.

గీ॥ పటుపలాశాళిహరమునుపర్ణవృద్ధి । పరముదోషాధికక్షీణకరముకామ।
కరముసుమనోవరామోదభరముదీపి । తాగమమునయ్యెనమ్మాధవాగమంబు॥ ౪.

మ॥ క్షితిజాతంబులతిప్రఫుల్లసుమనస్థేమంబులైయుంటచే।
జతనంబెల్లనుజేయుమంచునుమనోజాతుండుబంపంగనా।
యుతవేగంబునవచ్చిచైత్రుఁడుతదీయాస్త్రంబులన్ నిల్పఁడ।
ప్వ్రతసద్ధస్తినఖంబులన్నగతినెప్పెంబాంథులంగ్రాచుచున్॥ ౫.

చ॥ అరుణుఁడుపూర్వపశ్చిమదిగంతములాత్మవశంబులౌటచే।
నెఱపుచుస్వాధికారమునునిత్యముదక్షిణదిక్కుగెల్చియ।
ద్ధరకధిరాజుగానుతునుదారతఁజేసియటుండితల్లియు।
త్తరదిశకేగెనచ్చటఁబ్రతాపముఁజూపఁదలంచియుత్తఱిన్॥ ౬.

గీ॥ నావలెననంతచారియౌనలినమిత్త్రుఁ । డుత్తరంబునకేగుచునుండెనేను।
నట్లచనుదెంతుననునాశయమునననఁగ । మలయమారుతమొలసెనుమందగతిని॥ ౭.

మ॥ లతికాకాంతలుదమ్ముఁగూడుటకులోలత్వంబునన్వచ్చునా।
తతరాగప్రతిసక్తులౌవిటపులందప్పెన్నచుంబుష్పసం।
గతలైనారముమమ్మునిష్టగలియంగారాదటంచున్ సదా।
గతిలోలన్నిజపల్లవాళికరసంజ్ఞంజూపివారించెడిన్॥ ౮.

క॥ అత్తఱిఁ బువ్వులు విరిసెను । నెత్తావులు గ్రమ్మె రజము నిండెను దేఁటుల్ ।
మత్తిల్లి రొదలు సేసెను । క్రొత్తలుగా నుండె నెల్ల కొమ్మలు మాడ్కిన్ ॥ ౯.

గీ॥ చిగిరించిన మావి మ్రాకుల మొగసాలందు । షట్పదము లొప్పె వనలక్ష్మి చైత్రుఁ డపుడు ।
పెండ్లియాడంగ నగ్ని పై పృథులలాజ । హోమ సద్యో వినిర్గత ధూమ మనఁగ ॥ ౧౦.

గీ॥ తొల్లి యుష్ణతఁ గొఱకు వధూకుచముల । విటక సేవించువార దివి స్తరిల్లఁ ।
గౌఁగలించుటకును నరుగ రతిపరిచ । యాదవజ్ఞయ నెడుమాట వ్యర్థమగునె ॥ ౧౧.

శా॥ ఆరామంబులఁ బల్లవోరు ఫలపుష్పాభోగముల్ జాలఁ ।
శృంగార ప్రక్రియఁ దోరణంబుల క్రియం గన్పట్టఁ జైత్రోత్సవ ।
ప్రారంభంబునఁ గట్టి తోరణములాఖ్యామాత్రముం బూనెసు ।
శ్రీరమ్యత్వ మకృత్రిమంబు సగ్రిమంబునఁ గ్రియాసిద్ధంబునం దుల్యమే ॥ ౧౨.

సీ॥ మృదుతర పల్లవాస్పద మశోకంబయ్యెఁ జైత్రలక్ష్మీ పదస్పర్శ చేతఁ ।
గలితరోలంబసంఘంబయ్యెఁ దిలకంబు మాధవశ్రీ దృష్టిమహిమ వలనఁ ।
కురవకం బతిపుష్పగుచ్ఛాన్వితంబయ్యె మధురిమాశ్లేష సంభవము వలన ।
వికసితపుష్ప సంవృతము చంపకమయ్యె నలవసంత శ్రీముఖానురక్తి ।
మల్లికలు బూసె వికసించె మాధవికలు । కోకిలంబులు కలకలకూయఁ దొడఁగె ।
వఱదలై పాఱెఁ బుష్పమధురమధువులు । ఘూర్ణులై రేఁగెఁ బుప్పొడుల్ గాలి నపుడు ॥ ౧౩.

ఉ॥ అయ్యెడ నెక్కొనాఁడు విపినాంతర చారులు మోదమొప్పన ।
తియ్యమధుస్రవత్కుసుమ సంఘము పుప్పొడులన్ లతాంతముల్ ।
తియ్యనిపండ్లుఁ గస్తురియు దిద్దిన వౌపులిగోళ్లుఁ దేనియల్ ।
చయ్యనఁ గాన్కలిచ్చి సరసన్ వినయంబున నిల్చి క్రీడికిన్ ॥ ౧౪.

క॥ ఘనముగ మృగయాసక్తియుఁ । వనవిహరణ కౌతుకంబు నర్థులు నలులన్ ।
గొనకొని పక్కాణించిరి । వనపశు చిమ్మృగవృద్ధులేక వాక్యము చేతన్ ॥ ౧౫.

చ॥ నరవర యేమి చెప్పెద మనంతము లవ్వనమార్గ చిత్రముల్ ।
కురవక పుండరీకములు కోకనదంబుల మేయగంధకే ।
సరితతి కుంజరాజియును శంబర సత్పృషత ప్రభంజనో ।
త్కరకదళీ కదంబమును గాఢతమ ప్రమదావహంబులో ॥ ౧౬.

క॥ అటఁ గలకంఠీరవముల చటుల । త్వము చిత్తగింపఁ జను దెంచెదరే ।
నటులైన విశదమగుఁగా । కెటులైనం జెప్పఁగల మెయిట్టి వియనుచున్ ॥ ౧౭.

వ॥ ఇట్లారామసత్త్వ సమాచారంబు లేక వాక్యంబునం దోఁచునట్లు వారుచ్చి వేర్వేఱం జెప్పెం దలంచి యందుఁ బ్రమదారామ విభవంబుఁ దెల్ప నిట్లనిరి. ౧౮.

క॥ కానంగలచిత్రములా । కానంగలవింకఁజెప్పఁగానేమిటికిఁక।
గోనందనమవ్వనియిది । గోనందనమనఁగనొప్పుఁగురుకులముఖ్యా॥ ౧౯.

మ॥ ఒకచో శీతలవారిబిందువహవాయువ్రాతమింకొక్కచో।
శుకశారీభ్రమరీనినాదమొకచో శుంభత్కచక్రాంగచ।
క్రకలాపివ్రజమొక్కచోటను విపక్వస్వాదుతాయుక్ఫల।
ప్రకరంబొక్కెడఁబూవుఁదావియమరంబం చేంద్రియామోదముల్॥ ౨౦.

మ॥ చలదిందిందిరరావగర్జితములంచత్పుష్పమాలాఖ్యచం।
చలలుంగల్గినభోగతంబులగుభూజాతంబుల న్మేఘముల్।
విలసత్పుష్పపరాగబిందుకరకావిర్భూతియుక్తంబులై।
యలరుం దేనియవానపెల్లుగురియున్ యత్నంబుతో భూవరా॥ ౨౧.

సీ॥ ఏచోటఁజూచినవాచాలమధుపంబులే దిక్కుఁగన్ననుమ్మృగమదంబు।
లేవంకఁబోవంగఁబూవుఁదీవలతావులెత్తావులరసినఁగ్రొత్తవిరులు।
ఏకడఁజేకొన్నఁబైకనినాదంబులే చక్కిఁగన్ననుహిమజలంబు।
లేక్షితివీక్షింపద్రాక్షాలతాగుల్మమేతట్టులరసినవాతపోత।
మధపయామనిమున్నగానవ్వనంబుఁ । జొచ్చికనఁదగుసొబగుచేఁజొక్కుదాని।
హెచ్చుఁబరికించితోనుండనితరవనము । లొల్లకచ్చటవిడియించియుండఁబోలు॥ ౨౨.

వ॥ దేవా యక్కాంతారంబు చక్కదనంబులు వక్కాణింపం బెక్కులుగల వీచెప్పిన యందంబు దానికింగలదాన నెక్కదిక్కుంగా దింకొక్క యక్కజంబుగలదద్దని నం బ్రియసహచరీ సహచరకిన్నరవరనికర కరశాఖావళీ సక్రమాక్రమ వాద్యమాన విపంచికాంచిత మూర్ఛనాంతర సంభూతంబులౌ షడ్జపంచమస్వరంబులం గ్రమంబున నభ్యసింప నానందంబునంబోలెఁ దత్తదనుకారిహారిస్వర విరాజితాయత కంఠనాళోప శోభితంబులౌ కేకికోకిలకులంబుల కలకలంబులచే నాకులితంబులగు నిఖిలతలంబులు గలుగు నవ్వనీతలంబునం గుసుమకింజల్క పరాగమధుర మధుసమ్మేళన కర్దమితాలవాల మాలాకూలంబులుగల్గు కప్పురంబు విప్పటనంటిబోదుల నీడలం జోడులుగూడి వేడుకతోడం గ్రీడించు వేఁడివెలుంగులఁజెలంగు పులుంగు లెలుంగులెత్తి తత్తఱంబునం జిత్తజుం డేయువాఁడి పూములుకుల మొత్తంబులకులుకుచుఁ దమ జోడుపులుఁగుల నతిదీనాలాపంబులం బిలువ మృదుతరలతావితాన నితాంతవేల్లిత శాఖాయుతయుత శాఖిమూలాలవాల స్థగితశశికాంత శిలావితర్దికాంతరంబులనుండి మధుమాసవాసరంబుల దైర్ఘ్యంబున కింతింతయనరాని వంతలంజెందుచున్న చకోరకంబులు శిరంబులెత్తిచిత్తంబులు సమ్మోదాయత్తంబులంజేయ ద్రాక్షామల్లీప్రముఖ నిఖిల

వల్లీమతల్లీసముదయంబునకు నర్తనోపాధ్యాయుండైన బాలానిలంబుచేఁ దమలోనుండు నతిహృద్యగంధబంధురపరాగంబు వనాంతంబున వెదజల్లు నరవిందబృందంబులందు మధురతరమరందాస్వాదనాతిమాత్ర ఝుంకారకారిమదవన్నిళింద సందోహంబులరవిందంబులకు మీలనంబు శంకింపుచు గమనోద్యోగంబు సంపాదింప భిల్లపల్లవపాణులు దమకుంబల్లవులంగూడ వేళయయ్యెనని తదాగమనంబున కెదురుచూచుచు నలంక్రియా సంపాదన లాలసలైయుండఁ గామినీకాముక జననికురుంబంబుపై నేయఁదలంచి మీనాంకుండెత్తిన చక్రయంత్రంబన వాతోద్ధూతంబై వర్తులత్వంబుఁజెందిన కప్పూరంపుందుమారమ్ము లుప్పరంబునకెగయు నెడఁ దత్పరిమళాస్వాదనలాలసంబులై తోడంజను దెంచు చంచరీకంబులుగల్గి రాకాశశాంకుని బింబువిడంబించు మఱియుఁ దమతోడ నీడగు నీడుకాం(డ్ర)తోడం జోడుగూడి యాడుభిల్ల బాలకులందందమెట్టఁ దమ్ములంబుట్టుదట్టంబగు పుష్పాడిగుట్టలు గాఁబెట్టి యొకతట్టున మెట్టులుగట్టి యంబారోహణావరోహణంబులు సేయుచు నవి కనకాచలంబులనియు మలయవాతపోతమ్ముచే రిమ్మునవిరిసి దుమారమ్ములైయెగయు కప్పురమ్ములగని యహహా యీసమీరకిశోరుం డప్రయత్నంబుగ మనకు సహాయ్యంబొనర్చెంగాన వీని మనజోడుగూడనిత్తమని నైజబాల్యద్యోతకంబులౌ ముగ్ధాలాపంబులుపల్కుచు నాకప్పురంబు దిప్పలుగాఁబోసి యవి రౌప్యమహీధరంబులనియు నాడుచుందురు మఱియు నతివిశదశత్రపాకులంబై మేఘమండలంబుం బోలియుండు నవ్వనంబునంగల సత్వంబు లసత్వంబులుఁదెల్పెద మాలింపుమని యిట్లనిరి. ౨౩.

మ॥ బలభేద్యాత్మజపెక్కుదేవగకడంబాటించిపల్కంగనే।
మలఘూర్ణత్తతరక్షుసూకరహరివ్యాఘ్రర్క్షఖడ్గాదులా।
కులముంజేయునరణ్యమంతయుమహాకోలాహలవ్యాప్తిమే।
నలకోరుల్వడగ్రుచ్చి(గ్రొ)వ్వదొరఁగుశోణితంబులే దెంతయుఁ॥ ౨౪.

క॥ మృగరాజవిక్రమావిను । మృగములదాడులకునచట నెంతయుమాకుం।
బెగడుపడుమనములెల్లను । వెగటాయెనుగాపురములు వేయేమిటికిన్॥ ౨౫.

గీ॥ ఇట్లుపల్కఁగవినియపుడింద్రుఁపట్టి । మార్గమధ్యంబులనువనదుర్గములను।
బాగొనర్పింపుఁడీమీరు వేగమనుచు । నవ్వనేచరవరులకు నానతిచ్చె॥ ౨౬.

వ॥ ఇట్లాజ్ఞయిడి మృగయారామవిహారకౌతుకంబు మనంబునముమ్మడింప నక్కురుకుల శేఖరుండు యదుకులశేఖరుండౌ యంజనియిట్లనియె. ౨౭.

శా॥ బావా నేనొకవిన్నపంబువివరింపంగోరియున్నాఁడనీ।
వావిజ్ఞాపనమాలకించిసఫలంబౌనట్లు గాఁజేసినం।

భావింపందగునంచుఁదోఁచినయెడ న్మన్నింపుమాలేకనీ।
భావంబందున నెగ్గుదోఁచినయెడన్ వారింపుమీకార్యమున్॥ ౨౮.

మహాస్రగ్ధర.

ప్రమదారామోద్భయంబున్నవచరులుమృగవ్రాతసద్వైభవంబుం।
గ్రమమొప్పంజెప్పనాకుంగలిగెనుమృగయారామకేళీవినోదం।
బుమదిన్యా నేచ్ఛనీకుంబొడమినయెడసంపూర్ణసంతోషమంచు।
న్విమలుండాక్రీడిబల్కెన్వినిహరిమరలంబేర్కొనెన్వల్లెయంచున్॥ ౨౯.

ఉ॥ పిమ్మటశక్రసూతియొకభృత్యునిగన్గొనివేగమొక్కవా।
హమ్మును దెమ్మటన్న నతఁడాయతపెట్టెనువాతభాస్కరా।
శ్వమ్ములగెల్చినిత్యమునుబాఱుఁగఁజేయఁగఁదద్యశమ్ముమై।
గ్రమ్మినకీర్తిశుభ్రరుచిరాజితదేహముగల్గువాహమున్॥ ౩౦.

వ॥ దారకుఁడు నరదంబు సజ్జీకరించెనంత॥ ౩౧.

క॥ నరనారాయణులవ్వర । తురగమునరదంబునెక్కి తోడ్తోనేగం।
బురజనమునకుమహానం । దరసాంబుధినోలలాడెనయనాంబుజముల్॥ ౩౨.

ఉ॥ వేఁటలయందు నేర్పుగలవీరులుకొందఱువెండిపైఁడిక।
ట్టీలలుబంగరుంగొలుసులింపుగఁగట్టినజాగిలంబులు।
న్మేటిపసిండివిండ్లుపమింపఁగరానివలల్వరంబులున్।
వాటముమీఱఁబూనిపనవాటముఁజెందిరివారివెంబడిన్॥ ౩౩.

ఉ॥ వల్గితరేచితాదిగతిభాసురమైనకిరీటితేజిచేఁ।
బుల్గుల ఊనిఁదెమ్మెరనుబోలుచుఁబర్విడుకృష్ణుతేరిచేఁ।
గల్గుగజంబుమింటిదరిఁగానఁగనయ్యెధరిత్రివేడ్కతో।
వెల్గుల ఊనికూఁతుయదువీరునికిమ్మనిచెప్ప నేగనాన్॥ ౩౪.

శా॥ అర్కుం బంపఁగవచ్చియర్ఘ్యమునుబాద్యంబున్సమర్పించి।
లోకైకస్వామివిరిబోఁడినిచ్చెదమునీకున్రమ్మటంచున్నభో।
దర్కవ్యాహృతిఁదెల్పవచ్చెననూత్నాబ్జిందుపుష్పౌఘసం।
పర్కామోదితమౌచువీచెనెదుట న్మందానిలంబయ్యెడన్॥ ౩౫.

క॥ అదియొదవుశుభముననియతి । ముదమెదఁగదియంగగోషపుంగవుఁడుంటన్।
బదపడియంతటవలక । న్నదరెన్వాతోర్ధ్వకాహతాంబుజముక్రియన్॥ ౩౬.

ఉ॥ ఇవ్విధమానిమిత్తములనేకములుప్పతిలంగనెంచియా।
పువ్వులవిల్తుతండ్రిమదిఁబొంగుచులేనగవాననాస్థితిం।

గవ్వడికానతిచ్చియిదిగానఁగసత్ప్రియమదాప్తియానునా।
కివ్వనినంచుఁదోఁచెవిధియివ్వనిదెయ్యదిపుణ్యశాలికిన్॥ ౩౭.

వ॥ అనిచెప్పెందదనంతరంబ. ౩౮.

మ॥ నిరపాయోన్మదకోకిలోల్లసదకుంఠీభూతనాదప్లుత।
స్వరమొప్పంగనువాతపోతనటనాంచత్పల్లవశ్రీచల।
త్కరసంజ్ఞన్వనమాత్మపుష్పఫలసంఘుంబిచ్చిపూజింపన।
న్నరనారాయణులన్వరించిపిలిచెన్మన్నింపరేరార్యులన్॥ ౩౯.

క॥ ఆలోఁగృష్ణార్జునులధి। కాలోలవిలోచనాద్యులైడిగ్గిరిలో।
కాలోకనతర్పకమగు। నాలోకాద్భుతవనంబునాలోకింపన్॥ ౪౦.

సీ॥ సుమరాజికృతపదభ్రమరాళిరావాతితమరాజదురుగానసముదయంబు।
స్ఫుటవారిసంభవప్రోత్కటవాపికాళీనికటవాయూచలలతానటనయుతము।
కృతరాజసమ్మోదయుతరాజహంసకోద్ధతరావతాళసంతతరవంబు।
విషమాపతత్కాలకషమాణవిస్ఫురత్సుషమాపగానాదవిషమృదంగ।
మతులమోహనవిఖ్యాతిచతురఁడైన। చైత్రసూత్రధరుండుప్రసాధనంబు।
సేయుచుద్యానరంగంబుఁజిత్రగతిని। జూచిరాకంసరిపుసవ్యసాచులపుడు॥ ౪౧.

చ॥ వనపరిపాలకుల్గుసుమభాసురమామిడిమావిగుంపుక్రొ।
న్ననలివురెత్తుకప్పురపనంటులనంటుచుఁబాకియుల్లముల్।
గొను నెఱదావిగల్గువిరిగుత్తులమొత్తముహత్తుతీవగుం।
పెనసినపొంబొదల్పొదలనింపగుసొంపులఁజూపిరెల్లెడన్॥ ౪౨.

సీ॥ చిన్నిపూమొగడలుక్రొన్ననల్నెలకొన్నపొన్నగున్నలచెలువెన్నియున్ని।
మేనికింపౌజలంబూనిచల్వలవిడనీనికేళీకూళులానియాని।
తలిరుక్రొవ్విరిజొంపములవాలుగొమ్మలౌ నెలమావినీడలనిలిచినిలిచి।
యంటిబోదులపాదరింటిలోతావులనంటినజవ్వాజులంటియంటి।
యేచివేడుకరేయిరేరాచరియల। నిలిచిక్రీడించుజక్కవపులుఁగుగముల।
పొందికకునాత్మలోముదమందియంది। యేచిపూఁచినతీవలఁజూచిచూచి॥ ౪౩.

చ॥ బహువిధమవ్వనాంతమునఫల్గునకృష్ణులుభిల్లసత్సరో।
రుహదృశలెల్లనెండొరులురుప్రమదంబునడాయఁబోయివీ।
రహహానవీనదేహయుతులైనమనోజవసంతులంచులో।
ముహురుదితానురాగమునముస్గుచునుంపెఁజరించిరీగతిన్॥ ౪౪.

వ॥ అయ్యవసరంబున నుపవన దర్శన జనితానందుండై యింద్రనందనుండు నందనందనున కిట్లనియె. ౪౫.

ఉ॥ కంటివెకృష్ణయల్లదెయొకానొకమాగ్ధవ్యపేతాత్మచెంచువా।
ల్గంటిపలాశవృక్షముపలాశమునందుఁదదీయకుట్మలం।
బంటఁగఁగింశుకోయమనియల్లనఁబట్టఁగఁబోయిచిల్కలే।
కుంటకుగొంకెభామపలుకూరకపోదదికింశుకంబెకా॥ ౪౬.

శా॥ అంభోజాతపరాగ మొక్కదరిఁబ్రోవై యొక్కపార్శ్వంబునన్।
శుంభత్కాంతిరథాంగమింకొకయెడన్ శుభ్రాంగచక్రాంగమున్।
సంభోగస్థితినుండఁగంజహితకంజాతారులిర్వంకలన్।
సంభాసింపఁగమధ్యభాగవిలసత్స్వర్ణాగముంబోలెడిన్॥ ౪౭.

సీ॥ ఏలాలతామృదుహేలాతిగోస్తనీమాలాంతరితకాయమానమందు।
గీతప్రసవజ్జలస్రోతప్లుతేందుకాంతాతతవేదికయందుఁగల్గు।
గొజ్జంగిపువ్వులసజ్జపైఁగూర్చుండిబుజ్జగంబునఁదనబోటినొక్క।
తొడపైనివేఱొకతొడపైనివీణయునిడుకొనిముదమాత్మఁగపలుకొనఁగ।
శంకరాభరణసురాగశైలిమతివ । శంకరాభరణముచేతశైలజాతి।
గరుగునటుమేళగించియఖండవృత్తి । వీణవాయించుకిన్నరవీరుఁగంటె॥ ౪౮.

స్రగ్ధర - నాగబంధము.

సుద్దిన్నేలయ్యెఁజూడన్ సుఖములగనిగన్ జొక్కనీచుట్టుగోనన్।
మద్దుల్ విక్రాంతనానిర్మలవృతితతియైమాఘ్యసుశ్రీజిగిక్కన్।
బెద్దంచున్ గోద్రుమోర్విన్ వినమదిమఱచున్ దీనినింజూపమాట్కిన్।
ముద్దుల్ జిల్కించునిద్దంబులువెలుఁగుమహామోదతన్ గాంచుకొద్దిన్॥ ౪౯.

గీ॥ కానఁగానగురోలంబగానమూని । కోనయతితమలసితిముకుందశోభి।
నాననియెఁజక్రపాణిధనంజయునకు । నింద్రనిందవరుచిరంబిదెన్న నేల॥ ౫౦.

క॥ అనియిటులొండురుశ్లేషవ । చనరచనయొనర్చుకొనుచుసమ్మదమలరం।
గనుగనుఁగొనియుపవనము । విపినమునకుంజనిరివేఁటవేడుకమీఱన్॥ ౫౧.

క॥ వింటన్ నారింగూరిచి । మింటంబరదెంచుమేటిమేటికొడుకుబల్।
కొంటెమెకంబులఁగనివెను । వెంటంజనుదెంచెవానిబీరమడంపన్॥ ౫౨.

ఉ॥ పొంచిమృగంబునేయశరముంగొనిపానివిభీతలోలనే।
త్రొంచలదృష్టిఁగాంచుచుఁబ్రియాక్షియుగంబుఁదలంచెనంతలోఁ।

బంచశరుండుప్రేమలఁగనుపట్టెనుహస్తవికృష్టధన్వుఁడై।
స్వాంచితమిత్రమాపవనునశ్వముఁగాచుచునుండెనేమొకో॥ ౫౩.

ఉ॥ బర్హియొకండుదన్నుఁగనిపాఱకమబ్బనిలోననుబ్బుచుం।
బర్హమువిచ్చిగోండ్లిసలుపంగనియాతఁడుదానినేచఁగా।
నర్హతయంచునెంచకశరాసనమందుశరంబుఁగూర్చియున్।
నిర్హృతబాణుఁడయ్యెధరణిన్మృదుచిత్తులుసాహసింతురే॥ ౫౪.

సీ॥ పుండరీకంబులపాలుపడంగించెనామానితశశివంశమండనుండు।
గంధర్వతతివశగతముగాఁజేసెనాస్వర్గాధినాథాత్మసంభవుండు।
కదళీకదంబంబువిదళించివైచెనాసింధుకాంచీనాథసింధురుండు।
ఋక్షసంతతిరూపహీనంబుజేసెనాతరణిసంకాశప్రతాపశాలి।
శల్యములచేతసమయించెశల్యములను। ఖడ్గములచేతఖండించెఖడ్గములను।
గోలచేఁగూలనేసెనుగోలములను। నిజభుజాటోపమేర్పడవిజయుఁడపుడు॥ ౫౫.

క॥ దుష్టంబైచరియించెడి। యష్టాపదమృగచయంబునణఁగించెనుము।
న్గష్టంబుగరాముండొక। యష్టాపదమృగముఁద్రుంచుటరిదియెయనఁగన్॥ ౫౬.

ఉ॥ వాసవునాత్మసంభవుఁడువారితశూరతమీఱనత్తఱిం।
గేసరినంచయంబులనెగిస్వెనుముట్టిస్వకీయమైభువిన్।
వాసిదనర్చునర్జునతవానికిఁగల్గఁగఁగోపగించిబల్।
రోసముచేనడంచెనుబరుల్వికటించినశూరులోర్తురే॥ ౫౭.

క॥ కొట్టిరిగవయమృగంబుల। మట్టిరివాహారిపువన్యమత్తేభములం।
బట్టిరిహరిణచయంబును। బెట్టిరిగుట్టలుగవిజయభృత్యులవెల్లన్॥ ౫౮.

శా॥ భూదారంబులుకొన్నియొక్కదరిచాల్పుంగట్టియుండంగనా।
భూదారప్రవరుండడంచెనుదవాభోగంబునెక్కమ్ముచే।
భూదారాంకుననుంగుఁదమ్ముఁడనుదాఁబొ ల్పొందఁగానవ్వనీ।
భూదారప్రవిహారజశ్రమములోనుబ్బంబిపాసార్తులై॥ ౫౯.

మ॥ తమవర్ణాంబుధరోపమానరుచిసంతానంబుమున్మన్నగా।
నమలప్రక్రియగాననయ్యెవనలేఖాధీశనీలప్రభన్।
యమునాద్వీపవతింబ్రమోదమునడాయంబోయితీర్థాపగా।
హముగావించిసుధాసమానరుచితోయంబూనిరాపిమ్మటన్॥ ౬౦.

మ॥ వితతామోదవిహారశాలిమృగనాభీముక్తకస్తూరికా।
ప్రతిమాలేపనసంయుతంబునురుపుష్పశ్రీవికీర్ణంబునై।

కుతుకుల్ గోమయలేపనంబునిచి ముగ్గుల్దీర్చినట్లొప్పఁగా
మతికింజాలఁ బ్రమోదవృత్తి నొసఁగెం దత్తీరదేశంబటన్‌॥ ౬౧.

సీ॥ పరిఫుల్లహల్లకోత్పలషండగురురజఃకణఘనాసరితభూమిగలుగుచోటఁ
జందనభూరుహచ్ఛాయనీరంధ్రమైతీక్ష్ణమైనవిడువక కలుగుచోటఁ
గమలబృందవిహారకలనమత్తమరాళకలకలస్వనములుగలుగుచోట
వాతాహతోర్మికోద్ధూతకాదాచిత్కజలకణార్ద్రస్థలుల్ గలుగుచోటఁ
దటనికటజాతకల్పకవిటపివిటప । కుసుమకిసలయమంజరుల్ కురుచోట
సంకుమృగకులవిహరణాస్పదములైన । పులినశయ్యాతలంబులుగలుగుచోట॥ ౬౨.

క॥ కృత్స్నయానసహావారిస్పృ । షత్స్నపితపవనమొలయఁజందనతరుభా
స్వత్స్నిగ్ధచ్ఛాయలవీ । రుత్స్నేహముగల్గుతేంట్లరొదముదమొదవన్‌॥ ౬౩.

చ॥ పరిచరులెల్లసన్నిహితపాదపమూలములాశ్రయింపఁగా
సరసిరుహాక్షిఫల్గునులుసమ్మదమొప్పఁగఁగూరుచుండిబం
ధురమలయానిలంబుశ్రమతోయములారిచిసేదదేర్పఁగా
సరసకథానులాపములుసల్పుచునుండిరి యంతలోపలన్‌॥ ౬౪.

ఉ॥ కాయజనాటకుండనుపఁగారభసంబునవచ్చినట్టితి
న్నాయభువిన్ నటించుటకుమవ్వపునల్లతెరంగరంబులం
బాయఁగఁద్రోచినిల్చెనతిభాసురవృత్తిననంగనన్నదీ
తోయములందుశౌరియొకతోయరుహాననఁగాంచెఁగన్నులన్‌॥ ౬౫.

సీ॥ పోలికకైనమబ్బులులేనియిమ్మధువేళసాంబుపయోదమేలగల్గుఁ
గల్గుఁగాకేమియాఘనమాకసంబునఁబుట్టకపుడమికినెట్టువచ్చు
వచ్చుఁగాకేమిదివాభాగములయందువర్ధితకాంతినెబ్బంగిమెఱయు
మెఱయుఁగాకేమియామించుచంచలవృత్తిగలుగకతడవింతనిలుచునెట్లు
మాయయోకాకనామదిమఱపొ లేక । స్వప్నమునమున్నవాఁడనొ నలదుతెలియ
ననివితర్కించెయమునతోయమునమున్న । బాలనీక్షించికాంచనచేలధరుఁడు॥ ౬౬.

చ॥ తలఁపఁదలంపనాకొకవిధంబుగఁదోఁచుచునుండెనాత్మలో
నలనగరాజచాపుతలయందుపసించుశశాంకరేఖతి
జ్జ్వలనదృగంతతాపమునుసైఁపఁగనోపకచల్లనౌనదీ
జలములయందుస్నానమునుసల్పనిటంజనుదెంచెనేమొకో॥ ౬౭.

గీ॥ ఈసరిన్మార్గమునభుజగేంద్రపదము । విడిచివచ్చినచిల్వరాపడతియొక్కొ
జలకమాడంగవచ్చినస్వర్గసతియొ । యనుచుఁదలపోసిపల్కెనయ్యర్జునునకు॥ ౬౮.

మ॥ విజయా యొక్క విచిత్రరూపమదె కాన్పించెం బరీక్షించితే।
భుజగారాతిమతంగజేంద్రగతియో భోగీంద్రవామాక్షియో।
రజనీనాయకుకాంతయో సురవధూరత్నంబొ యూహింపఁగా।
నజునాకీతిలకంబొ కోతటినిమధ్యంబందుఁ గానంబడెన్॥ ౧౯.

ఉ॥ పువ్వులఁబోలు నంగములు పోలికఁ జూడఁగ వెన్నఁబోలు లేఁ।
జవ్వనమారయంగ నెఱిచక్కనిరూపము చుక్కఁబోలు నా।
కివ్విధమెల్ల నారయఁగ నెద్దియు నొండుకొ అంతగానరా।
దివ్వనితాలలామ మిపుడిచ్చట నుండఁగ హేతువేమొకో॥ ౨౦.

క॥ భగణము నఖరాంకురములు । నగమగుఁ జనుదోయి యరయ నలమాస్యంబౌ।
జగమగుఁ గటి చంద్రుని లో । సగములలాటంబు దీని సందముఁగనుమా॥ ౨౧.

క॥ ఎట్టిదొ నామం బెవ్వని । పట్టియొ యేభాగ్యశాలి భామయొ నీవా।
తట్టునకుం జనివేగమె । గుట్టెల్లం దెలిసిరమ్ము కుంతీతనయా॥ ౨౩.

వ॥ అనినం దదనంతరంబ. ౨౩.

క॥ పార్థుం డంతయు విని యా । యర్థంబరయుటకుఁ గృష్ణునాజ్ఞం గొనియ।
ప్పార్థివరుచిఁ గాంచుచుఁ । తీర్థప్రాంతమున కేగుదేరెడు వేళన్॥ ౨౪.

శా॥ కృష్ణుం డవ్విరిబోఁడిపైనయనపంకేజాతముల్ నించి క।
లోష్ణాంశూస్రసమాగమస్ఫుటసరోజోన్నిద్రనేత్రద్వయం।
జిష్ణుస్త్రీముఖకాంతలం గెలుచునాశీతాంశుబింబాననం।
దృష్ణాయత్తమనస్కుఁడై యిటుల వర్ణింపం దొడంగెన్మదిన్॥ ౨౫.

గీ॥ నలువతో నిట్టిచెలువంపుకలువకంటిఁ । జేయుటకు నెంతకష్టంబు చెందెనొక్కొ।
పట్టుబడనట్టి మెఱుములనెట్టు పట్టెఁ । బట్టి యిబ్బోటిరూపంబు నెట్టుజేసె॥ ౨౬.

చ॥ అతివసృజించువేళఁ గమలాసనుఁ డాస్యము జేసి మున్నుగా।
నతులితమాతదీయరుచి నారసి మోహవశాత్ముఁడౌటచే।
మతిచెడి చేయఁగా మఱచె మధ్యముఁ దత్సృజనార్థవస్తువా।
తతజఘనస్థలంబునను తారకుచంబులయందుఁ జేరిచెన్॥ ౨౭.

గీ॥ వెలఁదికన్నులు తమకు నుత్పలములీడ । టంచు లోకులుఁ బల్కంగ నాలకించి।
కన్నెవీనుల నుంచిన కలువలరయఁ । దలఁచి వీనులచెంతకుఁ దరలఁబోలు॥ ౨౮.

చ॥ అతివకుచద్వయంబు గనకాంచితకుంభములంచు నెంచియా।
రతిపతియన్కొకాదుఁ పసపరంజి మెఱుంగుఁ బరీక్ష సేయబ।

ల్కుతుకమునం గషోపలముఁ గూర్చి నికర్షమొనర్చుచుండెఁగా
కతుదల నైల్యముండుటకుఁ గారణమేమది దబ్బరైనచోన్॥ ౪౯.

గీ॥ కొప్పునకు లెంకయై యుంటఁ గొప్పమబ్బు। చందమామ గువకు మోము చందమామ।
వాలుగంటి మయచ్చెలి వాలుగంటి। తోడఁగా నూవు నేసవతోడకుండి॥ ౫౦.

మ॥ చెలిసౌందర్యము చేతమాత్రమునఁ దా సిగ్గొందఁగాఁ జేయలే।
దలరంభాఖ్యఁ దిలోత్తమాభిధ సుశోభాఢ్యోర్వసిన్ లీలమై।
గెలువంజాలును సొంపు పెంపెసఁగు సక్థిఘ్రాణరోమావళీ।
కలితశ్రీవిభవంబు చేమదివివేకస్ఫూర్తి నూహింపఁగన్॥ ౫౧.

చ॥ కులిశధరుండు గుబ్బలులకుంగల ఱెక్కలఁ బోనడంచెన।
న్వలుకులుకల్ల కానియెడఁ బైదలియాదల మానికంబుగు।
బ్బలను మహానగంబు లిరుపక్షము లొందిన నభఃపథంబుపై।
నిలిచి యమందవృత్తి ధరణింబడకుండుట గల్లునెట్లుగాన్॥ ౫౨.

క॥ విసమున్ మ్రింగిన నీర్ష్యన్। రసనం జీల్చుకొని శిలశిరంబున నిడ్డన్।
వెసఁ జిల్వ కారుతో సరి। హసఁగదు వక్రగతు లెట్లు బోలు దురధికున్॥ ౫౩.

గీ॥ మిన్ను చెన్నుఁ దన్నుఁ గన్నె నెన్నడుమెన్నఁ। దారతీరు మీఱు నారిగోరు।
చిల్కఁ జుల్కఁ బల్కుఁ గల్కి పల్కులఁ బోల్కి। తూపురూపుఁ జూపు బాపచూపు॥ ౫౪.

సీ॥ బాలమీగాలి నిబోలఁ దాబేలౌచుఁ గూర్మంబు తలపొట్టఁ గుక్కుకొనియెఁ।
బుష్పాళి నాతిమై పొల్పొందవచ్చిన తానవరై యంతలో నవిరిసె।
నారిజంఘలతీరుఁ గోరి బూరుగలౌచుఁ గాహళుల్లోఁ బెట్టఁగాఁ దొడంగె।
నసిలత యింతి నూగారుఁ బోలఁగలేక యొక్కైదువయ్యె యొరఁ బొదుకొనియె।
మోముసాటికి వచ్చు కెందామరలను। గన్నుఁగవ నెజ్జగాఁ జేసి కాంచుమతియుఁ।
బాణితలముల చేఁ గొట్టి పాఱఁదోలుఁ। బాదములఁ దన్ను నీస్వర్ణసోదరాంగి॥ ౫౫.

చ॥ ఘనజఘనంబు పీఠమును గౌను ప్రవాళము నారుతంత్రులిం।
పెనయు వళుల్ సుపర్వములు హెచ్చగు గుబ్బలు గుబ్బగాయలు।
న్మనసిజుఁ డుంచి చేసిన సమంచితవల్లకి చూడనొప్పెఁ దా।
న్నినదము కంఠశంఖపరినిర్గతమాటవిచిత్రమిచ్చటన్॥ ౫౬.

క॥ కుందమ్ముల చందమ్ముల। మందమ్ములఁ జేయఁజాలు మానిని రదముల్।
కెందమ్ముల యందమ్ముల। కందమ్ములు పువ్వుఁబోణి కరములు జూడన్॥ ౫౭.

చ॥ అరయఁగఁ గౌను విష్ణుపదమాటఁ దదగ్రమునందుఁ బుట్టి యా।
యూరుకుచసత్ప్రభాతటిని యూర్ధ్వముగాఁ బ్రవహించెఁ గానిచో।

వరసలిలభ్రమంబునతిభాసురవీచులఁ జక్రవాకముల్।
దరమునుదమ్మిశైవలముదాని మొదల్గొనియుండు నేఁపయిన్॥ ౭౮.

క॥ కానఁగ భ్రమరమ్ములునలి । నానన భ్రమరకములందునధికతఁగనియున్।
వేనలిఁబోలఁగవచ్చిన । వేనలిసందోహములను వేనలిజేయున్॥ ౭౯.

శా॥ భామారత్నమునాభికాహ్రదమునంబాగారసంబూనిత।
ద్రోమాళీమిషవారిదావళికుచాద్రుల్ జొచ్చివర్షింపఁగా।
నామూలంబుననూత్నదోర్లతలు పెంపైయంగుళీపల్లవ।
శ్రీమించెన్నఖపుష్పరాజివికసించెంగామముల్ పండెడున్॥ ౮౦.

చ॥ పరఁగఁగనిక్షువాతెరవవాతెరతోఁబురుడొందలేకదు।
ర్భరబహుభంగముల్ దలఁచివంతలచేనిలువెల్లనీరుగా।
మరుమరుగొందియాతఁడునుమన్ననసేయకవంచికట్టగా।
నరయుచునుండుభీతినెడలంతయుఁగన్నులుగాఁగనెప్పుడున్॥ ౮౧.

గీ॥ చెలియకర్ణములక్షరశ్రీలఁదగడు । భూరికరులనుబెందొడల్ చీరికిగొన।
వవనితలమునుగటియలక్ష్యంబుసేయు । నింతిమెయికాంచనసమృద్ధియెంతయొక్కొ॥

ఉ॥ భామినిగుబ్బచన్గవకుబంతులుదాఁకిపరాఙ్ముఖంబులై।
కోమలిహారమందమరికుత్తుకవెన్కనుడాగిభీతిచే।
నోముడుమమ్మటంచునుబయోధరసీమకుసంతతంబు।
హారామలమౌక్తికచ్ఛలసమంచితమల్లికలింపుగాన్కగాన్॥ ౮౩.

ఉ॥ అద్దిరవేయుపల్కులికనాడఁగనేటికినెంచిచూడఁగా।
ముద్దియతళ్కుఁజెక్కులకుముంగలభేదముగాంచునిచ్చచే।
నద్దమునుంచినంబలుహొయల్ గలచెక్కులలోనఁగాననౌ।
దద్దశనాళికుందములదాడిమబీజములన్ హసించెడున్॥ ౮౪.

క॥ పున్నమవెన్నెలదొరయి । కన్నియనెన్నుదురుదొగసగంబైనబొమల్।
చెన్నగుసింగిణులౌఁగాకున్నన్విరి । ముల్కులానుచుండునెయిటులన్॥ ౮౫.

సీ॥ తీరుగానవరించిదిద్దినతలకట్టుపోలుపారుసంగతిపొక్కిలియును।
ఒండొంటిగమకించియొత్తుకుచంబులువివరింపరానివట్టువపిఱుందు।
లరయువిసర్జనీయంబెలప్రాయంబుమానితగతిసున్నమధ్యమంబు।
అందంబుమీఱెడునరసున్ననఖపాళిఘనతరదీర్ఘంబుకచభరంబు।
గాఁగనిట్టిరెయొయారంబుగల్గునట్టి । బాలికామణినెత్తమ్మిచూలిప్రథమ।
సృష్టిసమయంబునందునిర్మింపఁబోలుఁ । గానిచోనెట్టులక్షణాకారమబ్బు॥ ౮౬.

క॥ ఈభామామణినవతా । శోభావలి నెందునైనఁ జూచితిమే పఁ
ద్మాభామినిజన్మాంతర । లాభోగముఁ జెంద నేనియానన వచ్చున్॥ ౯౭.

గీ॥ అంచుఁ గొమ్మింపుమించునయ్యంచుఁబోఁడి । యంచితాంగవిలాసంబు నెంచుచుండఁ
బంచశరుఁడిదిసమయమంచెంచిపొంచి । యించువిల్వంచిశరవృష్టిముంచెనపుడు॥ ౯౮.

మ॥ అటసుత్రామతనూజుఁడంతటికిమున్నాయాప్రదేశంబులా।
తటినీప్రాంతరభూమిభూమిరుహసంతానంబులా సైక।
తోత్కటతీరంబులనెల్ల వెగడచిసౌదామిన్యధిక్షేపక।
త్వటుగాత్రప్రభబాలయున్నదరికిందా నేగిలో నిట్లనున్॥ ౯౯.

సీ॥ ఈచిన్నిప్రాయంపురాచకన్నియ కునన్ జూచినమది నేమిదోఁచు నొకొ।
యేకతంబుననున్న రాకేందుముఖితోడఁబూనిపల్కఁగ వాటమౌ నొ కాదొ।
తప్పకనీస్థితిఁ జెప్పుమన్న నుసిగ్గుగప్పి వారుదవ్వఁగా నొప్పదొకొ।
మచ్చికతో మనసిచ్చిపల్కకయున్న వచ్చినరీతిఁబోవలయు నొకొ।
యైనఁగాని మ్ముశ్రీకృష్ణుఁ బంపవచ్చి । మరలియేమనిపోయెదమానిసౌచు।
ననుచుఁదలపోసియప్పుడుతనవలంతి । తనము నివ్వటిలంగనిట్లనుచుఁబల్కె॥ ౧౦౦.

శా॥ భామా యెవ్వరిదాన వీవిటకు నేభావంబునన్ వచ్చితీ।
భూమారణ్యవృతాపగాంతరమునంబూఁబోఁడి యొంటేలనీ।
నామంబెయ్యదిరూపభాగములనెన్నంజాలుదీ వారయం।
గామప్రక్రియ నేగు దెంచితను చుంగాన్పించెనాకీయెడన్॥ ౧౦౧.

సీ॥ కాపురంబుండుటకై పురంబులు లే వెయ్యరుతరవనవాటినుండ నేల।
యతులితభర్మ్యహర్మ్యతలంబులును లేవె సలిలాశయంబున నిలువ నేల।
కూడియాడుటకునైతోడిచేడెలు లేరె యొంటిగానిచ్చోటనుండ నేల।
కామితార్థములెల్లఁ గలుగక యున్న వె భోగవిహీనతఁ బొగుల నేల।
తీవజోంపంబుతోడఁబందెంబులాడు । నొడలునిడుమలపాలుగానుండ నేల।
తమ్మిగర్వమ్ముఁ జిమ్మెడు నెమ్మొగమ్ము । వింత కాకలగాచుచుఁ జింత యేల॥ ౧౦౨.

మ॥ అలివేణీమణితండ్రిపంపునవివాహార్థంబువిచ్చేసితో।
యలరుంగైదువుజోదుఁబోలు నొకపద్మాక్షున్నిరీక్షించియ।
వ్వెలసద్రూపునిభర్తగాఁదలఁచితో వేఱొండుగాంక్షించితో।
కలరూపెల్లనుజెప్పుమాయిపుడెనీకౌతూహలంబయ్యెడిన్॥ ౧౦౩.

క॥ అనవినిననబోఁడియు మె । ల్లనసెలుగిచ్చియొకకొంతలజ్జావనతా।
ననవారిజయైయప్పుడు । తనవృత్తముఁ జెప్పఁదొడఁగెధర్మానుజుతోన్॥ ౧౦౪.

ఉత్సాహము.

సకలనిగమవినుతగుణుఁడుసారసాక్షుఁడేచటమా।
సకవసించునేఘనుండనంతపక్షముఁజెందువా।
రికిఁబథంబునిఖిలలోకదృష్టితమముఁడంచునే।
ప్రకటమూర్తియట్టిసూర్యుపట్టినేనరోత్తమా॥ ౧౦౫.

మ॥ ఘననిర్వంధ్య బలాఢ్యభూవరవరాకాళిందియస్వైరుమ।
జ్జనకుండైనయహస్కరుండుననుసంచచ్చంద్రబింబాననం।
గనిసంజాతవివాహయోగ్యవయస్కంగాఁగనూహించుచుం।
దనలోఁనావివిశ్చలాత్ముఁడగుచుందర్కించెనిట్లంగిగాన్॥ ౧౦౬.

క॥ నాకౌకఃకోకకుచా । స్తోకశ్రీగర్వమడఁచుసాంపమరినయీ।
రాకేందుముఖికినీడగు । రాకోమరుండెచటనిద్ధరంగలఁడో॥ ౧౦౭.

శా॥ ఈలోకత్రయభూములందుసతతంబేమారకేనేగుచో।
నాలోకింపనిదేశముల్గలవెయాయాదేశమందెల్లనీ।
బాలారత్నముఁగూర్పఁగాఁదగినగోపాలావతంసంబునెం।
తేలావణ్యముగల్గువానిగనసైతింబూర్వకాలంబునన్॥ ౧౦౮.

సీ॥ నామదినూహింపనీమృదువాణికినసురూపుఁడొకచతురాననుండు।
ఎంచిచూడఁగనాత్మనీయబ్జపాణికిఁబుండరీకాక్షుఁడొకండుదగును।
వానిగానూహింపనీసర్వమంగళకనుగుణుండొకశివఖ్యాతమూర్తి।
తలఁపఁగనీవినిర్మలగుణరతికినిదగునొకనద్రుచిధర్మకాముఁ।
డనుచుబహువిధముగఁదనయాత్మలోనఁ । జింతచేసెడుమాతండ్రిచిత్తమెత్తిఁగి।
యంతలోడాయఁబోయిజోహారొనర్చి । వినయమునమ్రోలనిలచితిఁజనవృమీఱ॥ ౧౦౯.

వ॥ ఇట్లు నిలిచియున్ననన్నుంగాంచి మజ్జనకుండు ప్రేమరసప్రవాహవశంబున హృదయాలవాలంబున నంకురించిన సమ్మోదలతామచర్చికాగ్రంబునం బుట్టిన కుసుమమంజరియన మందహాసంబు మోమునం గనుపడ దనకరంబులననుం డాయందీసి నిజాంకంబున నిడుకొని శిరంబు మూర్కొని మదీయాశయజిజ్ఞాసుండై యిట్లనియె.

మందాక్రాంతావృత్తము శ్లోకము.

ఏలావల్లీమివసుమభరాలంకరోత్యంగయష్టిం।
కాలోయంతేకమలవదనేకౌతుకశ్రీక్రియార్హః।
హ్రీలోలత్వంనభజహృదయేతత్వమాఖ్యాహితత్వం।
భాలేకస్మిన్విమలగుణవత్యాత్మకాంతత్వమిచ్ఛేః॥ ౧౧౧.

చ॥ అనియిటుబల్కుచున్న దివసాధిపుతో డిపచింతిట్టులే।
ఘనలసమానరూపయుతుఁగన్నులకింపగువానినీవులో।
నుసిచితివో యతండెయతియోగ్యుఁడుగాకితరుల్ రుచింతురే।
ననునడుగంగనేలనయనంబవుసర్వవిధాతృసృష్టికిన్॥ ౧౧౨.

గీ॥ అనినఁదెలిసియుఁదెలియనట్లబ్జహితుఁడు। బాలనాకపనీకుసిగ్గులనుడుపఁ।
బతులవరియింపరేయిట్టిభామలెల్ల। ననినవానికిమరలనిట్లంటినేను॥ ౧౧౩.

సీ॥ గొనముల టెంకియైయనయంబువిడనట్టిసిరితోడఁజాలరంజిల్లువాఁడు।
కువలయేశాన్వవాయవతంసమగువాఁడునరసింహుఁడనభువిఁజరఁగువాఁడు।
ఆలరుకైదువుజోదుగెలుచురూపునమానివరులనైననుమోహపఱచువాఁడు।
కుధరమైననులీలగోటమీటెడువాఁడునఖిలవేదాదివిద్యాస్పదుండు।
నఖిలలోకైకసమ్మానితాచ్ఛచరితుఁ। డగుచునెల్లజగంబులుబొగడఁదగిన।
యట్టిపురుషోత్తముఁడునాకునభిమతుండు। అనఁగనగవించుకాననంబంటననియె॥

క॥ లలనాయాతండితరుల। వలెసులభుఁడుగాఁడుసుమ్ముబహుపుణ్యతపో।
బలసాధ్యుఁడుగావుననీ। వలయకసలుసంగవలయుసమలవ్రతముల్॥ ౧౧౪.

మ॥ యమునాశైవలినీజలాంతరమునందాత్మప్రభావంబుచే।
సముదీర్ణంబగునొక్కగేహమునునేఁజక్కంగనిర్మింతునీ।
వమలప్రక్రియతోడఁదావకవయస్యాయుక్తవైయాగ్రహా।
త్తమముంజెందియనూనభక్తినలపద్మాక్షుఁబూజింపుమా॥ ౧౧౫.

ఉ॥ అచ్చటికొక్కకాలముననర్జునుఁగూడిసరోరుహాక్షుఁడున్।
వచ్చెదువేడ్కతోవనవిహృత్యభిలాషమిషంబుఁజూపుచున్।
వచ్చినవచ్చినిన్గనకవైభవగాత్రినిగాంచుఁగాంచిబల్।
మచ్చికమీఱనేలుఁడనమానినిగాఁగనటంచుఁజెప్పినన్॥ ౧౧౬.

ఉ॥ వానియనుజ్ఞచేనిటకువచ్చితినెచ్చెలులెల్లవెంటరాఁ।
బూనితినొక్కసద్వ్రతముఁబుత్తడిపుట్టముఁదాల్చుసామికై।
మానవనాథనన్నతఁడమంపకృపారసపూరితాత్ముఁడై।
మానినిగాఁగఁజేకొనునొ మన్ననసేయకపోవునో యనన్॥ ౧౧౭.

శా॥ కాంతారత్నమువల్కినట్టిపలుకుల్గర్వారముంజల్లిన।
ట్లెంతేమోదమువిస్మయంబునుమదిన్హెచ్చింపనబ్బోటితో।
నింతీనీవిటుసంశయింపఁదగునేయేనే శ్రీనాధురా।
వింతుందావకరూపయౌవనకళల్ విభ్రాంతినొందింపవే॥ ౧౧౮.

చ॥ అనిదమయంతివీడ్కొని నలావనిపాలునిపాలికేగఁగాఁ।
బనివిని నట్టిహంసక్రియఁ బాండవవర్యుఁడు మిన్నుముట్టెచు।
య్యనహరి చెంత కేగె హృదయంబునఁ గల్గెడు ప్రత్తి మోమునం।
గనఁబడు నన్న రీతి నతి కౌతుకమాననసీమ దోఁపఁగన్॥ ౧౨౦.

గీ॥ వెడలియటు వేగఁ బడయక కడలియల్లు। నొడలిచూపులు గల్గిన యొడయుఁ డొడుకు।
డాసిసన్మోదరసము దట్టంపు తరఁగ। లెగచెననురీతి మెల్లన నగుచు ననియె॥ ౧౨౧.

ఏకప్రాసన్సీసము.

వనజాక్షి యాడఁబోయిన తీర్థమెదురయ్యె ననురీతి నిటఁగనుఁ గొనఁగనయ్యె।
వనజాతమిత్రుని తనయ యిక్కన్ని యనినుభర్తగాఁ గోరి తనదుతండ్రి।
యనుమతిఁగొని సఖీజనముతో నిన్నదినినశక్తి కృత గేహమున వసించి।
నినుగురించి సపర్య లెన లేని భక్తి చేనొనరించుచుండెను దినదినంబు।
కనికరంబున ననుహరిఁ గనికరంబు। మనుచునోవేలు నేయును నోయనుచుఁ గామ।
మనెడు కడలేని కడలిని మునుఁగుచుండెఁ। గనకకనకాభగాత్రి యుండెను రమేశ॥

శా॥ ఆయొయ్యారము నా విలాసగరిమం బావాక్సుధాగౌరవం।
బాయాకారము నాఁడ్రెగంచల చలద్వ్యాపారముం జెప్పరా।
దేయోషాతిలకంబు దానిసరియై యెన్నంబడుం బాపురే।
యాయిందీవరనేత్ర నీకుఁ దగు వేయాడంగ నింకేటికిన్॥ ౧౨౩.

క॥ సముఖమున రాయభారము। క్రమమూఁగ దయిప్పుడక్కురంగాక్షి హిలయల్।
గొమరుం బాయ పుసిరియను। పమములు గానీకుఁ దెల్పి పల్కుటకృష్ణా॥ ౧౨౪.

సీ॥ చక్రంబు చేఁ డమస్యయమడంచితివినీవా చెలివేణి చేనట్లొనర్చెఁ।
గొనగోటి చే నీవు కొండ దూలించితి వారామపాలిండ్లనట్లొనర్చె।
నర్ధాంగమున మృగేంద్రాకృతిఁ జూపితీ వాలేమ కౌను చే నట్లొనర్చె।
బండిగల్లడు గుచేఁబాఁఱఁదోలితివి నీవాయింతి పిఱుఁదు చే నట్లొనర్చె।
శుకవచోభంగి నీయట్ల ప్రకటయయ్యె। ఖగగతి యటంచు నీక్రియ నెగడె భువిని।
గుంపనంబున నీలంబుఁ గూర్చినట్టు। లెనయగును నీకు నబ్బాలకనకచేల॥ ౧౨౫.

గీ॥ నాఁగ నాగజవరదుండనంత మోద। పరవశుండౌట నేమియుఁ బల్కనోప।
కర్జునాత్త్రాంకురిత సంశయమున కుదయ। లీనతలఁ జేయు చేకకాలీనములుగ॥ ౧౨౬.

గీ॥ లేచినంత నెమరుఁదువిల్లాచి పట్టెఁ। దావు విడువంగ మార్చియుఁ దావు గడచె।
డగ్గరించంగ సింగిణి బిగ్గరించెఁ। జూపులొండొరు పైసోకఁ దూపుసోకె॥ ౧౨౭.

శా॥ ఆరాకేందునిభాస్యతన్నుఁ గని లజ్జావర్జితౌత్సుక్యబ్జయా।
టారాజీవదళాయతాక్షుఁ డొకలా భార్ధంబుగా నెంచెడిన్।

నీరేజాస్త్రశరత్రయంబులలనానేత్ర్యాస్యదంతావళుల్।
గారంజిల్లినతంబులౌటనిరుగోలల్ వాడులంచెంచకన్॥ ౧౨౮.

ఉ॥ అచ్చపలాక్షిదృష్టిరుషమంటకసందియమంచనిత్తఱిన్।
బచ్చనిపచ్చడంబుదొరభానురరూపరసప్రవాహమున్।
జొచ్చియతిప్రమోదమునసొక్కిత్రపావనివర్తితంబునై।
చెచ్చెఱఁదొంటిచోటికతిజృంభితవృత్తినిబోవుచుంటచేన్॥ ౧౨౯.

ఉ॥ వారిజనేత్రుహాసరుచిబాలికపైమృదులీలలంగళన్।
దేరుచుసోకునంతసుదతీమణికుంకుమగాఁగనాతఁడెం।
తేరమణీయమైనయొకనిర్మలమౌక్తికభాసమానమౌ।
హారమునిచ్చెనాఁగఁగననయ్యనుజాపులకింపుఁబెంపుచున్॥ ౧౩౦.

శా॥ ఆలావణ్యవతీలలామసకియల్ హైమాంశుకాచ్ఛాదికిం।
గేలున్నోడిచిమోచిమాత్మఁబొదలంగృష్ణాఘవత్సద్దయన్।
మేలయ్యెంచిగమామనోరథములున్ మెప్పొందెమాబోటియుం।
బాలింపన్ భువినీకుధర్మముగదా మాబోంట్లనబ్జేక్షణా॥ ౧౩౧.

ఉ॥ ఏలవిలంబమింకఁగమలేక్షణమాచెలికేలునీకుకెం।
గేలగ్రహింపుమిప్పుడలకీరహయుండొనఁగూర్చినట్టియి।
వ్వేళశుభప్రదంబనుచువింతగహస్తమురత్నకంకణో।
చ్చాలనచాకచక్యములసందడిడెంచి ముచిందువంచఁగన్॥ ౧౩౨.

చ॥ అలికులవేణియోరుతుపహారముగాఁగనొసంగినట్టిబ।
ల్వలఫులనించుపద్మమననామవిలోచనసవ్యహస్తముం।
గులుకొలయంగనీచభవఘోటకుకేలనమర్చెనవ్వచుం।
బలుకులఁకేలనట్టికనుపండువుగల్గునెమూఁడుపేళలన్॥ ౧౩౩.

ఉ॥ ఆవలపెంతవింతలదొయాఁగచొబుట్టులఁబంచిపెట్టఁగా।
నావిరియెత్తెనన్నగతియంగజుడఁగనయంగమేచుసం।
దీపరబాణపఙ్క్తియనఁదేరెనుమైఁబులకాఁకురావళుల్।
భావములోనిమోదరసవార్ధితరంగములట్లస్వేదమున్॥ ౧౩౪.

క॥ ద్వారపవరగచునయ్యెడ। నరపంబెక్కించిరొక్కహస్తముహరికుం।
దరదనయొకత్తువేఱొక। కరమవలంబనమునిచ్చెకరమనురక్తిన్॥ ౧౩౫.

సీ॥ సందసందనుఁడునిటులనాసంచిమొందె। తుందిలేందిందిరాక్షితోస్యందనమున।
నింపుమీఱమహాత్మసీసంపసానుము। మిశ్రశోభాప్రవృత్తులమించియుండె॥ ౧౩౬.

క॥ కొంపలుచాడులనందుని । నందనునినిదేశమందినగరీమణిబల్ ।
సుందరముగనలరించుట । కుందూరుపుమనియకానికొమరుండనిపెం॥ ౧౩౭.

సీ॥ లలనాముఖాంభోజకలనాధిగాసక్తిఁ గమలాకరంబులఁ గానఁడయ్యె।
నలివేణిపాలిండ్లయౌన్నత్యమెన్నుచుఁ బర్వతంబులమేలుబల్కఁడయ్యె।
విరిబోణినెమ్మేనిసిరిమెచ్చుసందడిసుమలతావళులనుజూడఁడయ్యె।
పగలాడిచూడ్కులజిగిబిగిఁ గాంచుచుమృగములబలుహాయల్ బొగడఁడయ్యె।
వెన్నవవిలినయర్జును నెన్నఁడయ్యె । భామినీసక్తచిత్తుఁడై పరఁగియుంట।
నడుగుగాఁదోఁచె శౌరికినామడయును । గామినీసక్తులకు వేఱెగలదెయొండు॥ ౧౩౮.

వ॥ ఇట్లు తులిత కుతుకంబునం బతంగవరకేతనుండు పతంగజాసంయుతుండై శతక్రతుసుతుండుఁ దోడరా నింద్రప్రస్థనగరంబ్రవేశించి సుఖంబున యుధిష్ఠిరాదులతో సిష్టకథాలాపంబులం బ్రొద్దుపుచ్చుచుం గతిచిద్వాసరంబులు ప్రమదాయత్తమనస్కుండై యుండెనచ్చట. ౧౩౯.

గీ॥ గురుతరవ్రతమాహాత్మ్యఁ గోరిచేయ । నన్యదురవాపుఁడగుశౌరియబ్బెఁగాన।
నరయఁగష్టీఫలీయనునట్టిలోక । వాదమవ్యభిచారియై ప్రబలుచుండు॥ ౧౪౦.

ఉ॥ ఎచ్చటిద్వారకానగరమెచ్చటిదాయమునాథునీవరం।
బెచ్చటినుండియెచ్చటికి నేగెనొ యేగిగమాధినాయకం।
డచ్చపలాక్షి నెట్లుగనె నౌరసదీజలమధ్యదేశమం।
దచ్చరుపంపనేలగమలాసనుచేతలుపవ్వనెంచునే॥ ౧౪౧.

క॥ అస్త్రీకృతకనకాంబర । వస్త్రీకృతగగనభృత్యవాఁతుసురయు।
గ్ధస్త్రీకృతశుభరూపా । నిస్త్రాసితసర్వమిత్రనిర్మలగాత్రా॥ ౧౪౨.

చక్రబంధము. శా॥ యక్షేశప్రియరాజశేఖరప్రజేశామర్త్యదేవస్తుతా।
యుక్షార్వప్రదమత్తకుంజరహరోయోక్తిసంశోభితా।
జక్షాదేవసునాథకంధరలసత్కాంలిప్రజాభద్రదా।
దాక్షిణ్యాయతతాయుతాసపయసంతాపార్థతాపన్నదా॥ ౧౪౩.

తోటకవృత్తము॥ కైరవనాయకఖండవిభూషా । వారణవారణవారితదోషా।
చారుగుణాకరసంయమిపోషా । క్రూరవిమర్దనకుక్కుటవేషా॥ ౧౪౪.

గద్య॥ ఇది శ్రీమదుమాకుక్కుటేశ్వర కరుణాకటాక్ష వీక్షణసంలబ్ధసుసంస్కృతాంధ్రకవితాధోరణీమాధురీధురీణ సకలసుకవిజనదయాపాత్ర గౌతమగోత్రపవిత్ర గంగారాజు కృతిపుత్ర సూర్యప్రకాశసూరిచ్ఛాత్ర రామమూర్త్యాఖ్యప్రణీతంబైన కాళిందీపరిణయం బను మహాప్రబంధంబునం ద్వితీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

# కాళిందీపరిణయము.

## తృతీయాశ్వాసము.

---

క॥ శ్రీరజతాగవిహారా । హారాయితకుండలీంద్రయఖిలాధారా।
ధారాధరగళసారా । సారాంఘ్రిప్రహరణేశసౌమ్యాకారా॥ ౧.

గీ॥ అవధరింపుశౌనకాద్యఖిలమునుల । కనియెనిటురోమహర్షణతనయుఁడటుల।
వనరుహాయతనేత్రుఁడువనజగంధిఁ । గూడియచ్చోటనుండఁగఁగోర్కెమీఱ॥ ౨.

సీ॥ పటుజటాపటలికాబంధముశిరమున సూర్యబింబస్ఫూర్తిసొంపునింప।
నతనుతనుద్యుతులందందుఁబర్వఁజో దిక్కులకొకవింతతేజమీన।
స్వాహాకరగ్రహణాభ్యాసక్తమైనట్టి కరమునజలకుండికరముమెఱయ।
పరహవ్యనాసనావాసితంబైనట్టి ముఖపద్మమొకవింతమురువుఁజూపఁ।
దనదుకృష్ణవర్తనుగృష్ణసన్నిధి । కరుదుభావమందయమరఁజేసి।
వాయుసహచరుండుమాయంపువిప్రుఁడై । యప్పురోత్తమమునకరుగుదెంచె॥ 3.

ఉ॥ చాపలువచ్చియాశమనజాతునకుంబ్రణమిల్లిదేవహ్యా।
హారసతీకళత్రుఁడొకొయండజపత్రుఁడొఫాలనేత్రుఁడో।
సారసమిత్రుఁడోసరసిజభవశత్రుఁడొవీతిహోత్రుఁడో।
పారపశేఖరాకృతకబాడబుఁడైయరుదెంచెనాపుడున్॥ ౪.

ఉ॥ వచ్చినకృత్రిమావనిసుపర్వునినగ్రజునాజ్ఞచేతవి।
వ్వచ్చుఁడుదోడితెచ్చియొకబంగరుగద్దియఁగూరుచుండఁగా।
నిచ్చితదంఘ్రిలంగడిగియెన్నికపువ్వులఁబూజసేయుచు।
న్మెచ్చులువల్కుచున్వినయమేదురవాక్కులఁబల్కెనిట్టులన్॥ ౫.

ఉ॥ ఓవసుధాసుధాశనపయోరుహమిత్రత్వదాగమంబుచేఁ।
బావనమయ్యెమత్కులమువన్నెకువాసికిసత్ప్రతిష్ఠకుం।
గావలమైతిమాధ్యులముగన్యులమైతిమిమిమ్ముబోటిస।
ద్భావులువచ్చుటల్లశుభదాయకమౌఁగనిముస్నముస్నగాన్॥ ౬.

శా॥ ఎత్తావుల్ భవదీయసంశ్రితనివాసై కాంతపూతమ్ములో।
నెత్తావుల్ గను వేడ్క నేగుచును మీరిత్తావుఁ బ్రాపించిమ।
మ్ముత్తానస్థితిఁ జెందఁ జేసితిరి మీ యోగంబునం గల్గుమ।
చ్చిత్తస్వాస్థ్యము త్వద్వచశ్శ్రవణనిస్సీమాదరచ్ఛన్నమా॥ ౭.

కం॥ భవదాజ్ఞ నేసి నేను । ద్భవమును బావనము సేయఁ దలఁచితి నిపుడో।
యవనిక్రతుభుగ్వరవే । గవచింపుము కార్యమెద్ది గావింతు ననఘా॥ ౮.

ఉ॥ వహ్నిని నేను నీ విమలభావముఁ గాంచుటకిట్లు బ్రాహ్మణా।
వహ్నివి నైతిఁ గాక కురువంశమునం దుదయించువారికిం।
జిహ్వలు సద్గుణంబులును జీవయు ధర్మము నీతిమార్గముం।
జాహ్నవిలోని పద్మములు సౌరభహీనములెట్టులయ్యెడిన్॥ ౯.

మ॥ అరయం బాండుపయోధికాతతయశోయామిన్యధీశుండతి।
స్థిరధర్మామృతకుంభము న్విజయలక్ష్మీకాంతయు న్నీరలే।
వురుకల్పక్షితిజాతముల్ పుడమిపైఁ బుట్టంగ నానావనీ
సురలోకంబులతిప్రమోదరసవిస్ఫూర్తి న్విజృంభించెడిన్॥ ౧౦.

గీ॥ తలఁపఁ బాండవులకును మధ్యముఁడవయ్యుఁ । బాండవోత్తముఁడవు నీవు పండితారి।
యెందుకొఱఁతఘటిల్లునె పుండరీక । దళవిమలనేత్రు సద్దయ గలుగుకతన॥ ౧౧.

వ॥ అని మఱియు మాధవాభిముఖుండై యిట్లని స్తుతియించె. ౧౨.

గర్భమత్తేభకందసీసము.

సు-జనసంసేవ్యవిశుద్ధసద్గుణగణా సారంగసంరక్షకా-రమేశ।
స-వినయారాధనశాలిసంయమిమనోవీధీప్రచారోత్సుకా-ధరేశ।
స్వ-వినతస్వర్గపసంసుమాళికసుమస్ఫీతారుణాంఘ్రిద్వయా-తిరుచిర।
అ-తనుశోభావిజితాంబుదప్రకరసద్ధామాకృపావారిధీ-మధుసున్న।
సమవదితిసుతవిమర్దనమదదితిజ । మహిజసకలనరనుతశుంభత్కమంజ।
వినుతసుచరితగరిమసువిశదకీర్తి । సాంద్రశ్రితజనచంద్రాద్విపన్మృగేంద్ర॥ ౧౩.

ఉ॥ ఖండితదుష్టశత్రుజనగాఢభుజాబలగర్వలారయా।
ఖండలపాలితంబు నతిగంధిలపుష్పఫలప్రధానమా।
ఖాండవమన్మహావనముఁ గాల్పఁగ నన్యులు నర్చుకీడురా।
ఉండఁగ నన్నుఁ గాచుటకు నోడక మిస్తుడు గంగ వచ్చితిన్॥ ౧౪.

మ॥ అనయజ్ఞేశునితోడయజ్ఞఫలదుండాశ్చర్యవిభ్రాంతుఁడై।
యనునో పావకసర్వజీవులకునీవాత్మాంతరస్థాయివా।
యని మేషావళి కానసంబవుఁగదాయచ్చోవిశేషించియో।
గ్గొనరించెందివిజేశ్వరుండెటులనీకిక్కంతశంకింపకన్॥ ౧౫.

క॥ ద్విజులకునగ్నికిమునులకు । నజుఁడైనన్వెఱచునప్పురారియువెఱచున్।
భుజబలముండియుమునుగా । ధిజుఁడువసిష్ఠునకునోడెఁదెలియఁడొయనినన్॥ ౧౬.

గీ॥ కృష్ణజిష్ణుఁడునాకొకకీడుసేయఁ । డేనునాతనిపైఁగిన్కఁబూనువాఁడఁ।
గానుజెప్పెదవినుమిప్డుఖాండవంబుఁ । గాల్పనుద్యోగమొనరించుకారణంబు॥ ౧౭.

చ॥ కలఁడొకఁడధ్వరావనినికామనివాసనుపర్వసంఘమా।
ళిలసితపారిజాతపటలీనిరపాయవిమర్దగంధగం।
ధిలితదిశావసానుఁడతిథివ్రజసాత్కృతభూరిరాశియు।
న్విలసితసంతతవ్రతుఁడుశ్వేతకియన్మనుజేశుఁడెన్నఁగన్॥ ౧౮.

ఉ॥ చాతురిమీఱనాతఁడనిశంబునొనర్చెడిసప్తతంతుసం।
జాతమునన్సుధాంధులరసజ్ఞులుబల్విసువంగనేనుఁ।
ద్దూతనుగానభాగములుదొంతులుగాఁగొనివారికిచ్చుచో।
నాతతఖిన్నభావమునకాకరమైతినిజెప్పనేటికిన్॥ ౧౯.

క॥ ఓదర్వీకరభుజులా । రావర్వీకరుఁడగుచునిరంతరదీక్షం।
ద్వాదశవార్షికమగుక్రతు। వాదరమునఁజేసెనాతఁడతినిష్ఠితుఁడై॥ ౨౦.

శా॥ ఆజస్రంబునద్వాదశాబ్దములునాజ్యంబేకధారంగుణ।
భ్రాజిష్ణుండునృపాలశేఖరుఁడువ్రేల్వందాననానాటికిం।
దేజంబంతయుఁదప్పికీలలమహాదీప్తుల్ వడిన్మాసియా।
జేజేల్ జింతిలరోగపీడితుఁడనైనేమంబులేకొక్కెడన్॥ ౨౧.

చ॥ కమలజుపాలికేగియధికంబగుదీనతతోడనీసమ।
స్తమువినిపింపనాతఁడునుస్వాంతమునందలపోసియొండుపా।
యమువచియించెదన్వినుముహవ్యవహసురరాజపాలితం।
బమితసరోరుహాస్పదజలాశయరాజివిరాజమానమై॥ ౨౨.

క॥ కననింపగుఖాండవమను । వననుమ్మృతముగల్గుకతనవదలకక్రద్రూ।
తనయేశరక్షితంబై । తనరెడుపుష్పఫలరుచిరధరణీజంబై॥ ౨౩.

క॥ దానిభుజింపఁగనీకీ । గ్లానిశమించుననిహేమగర్భుఁడువలుకన్।
నేనావనరాజముఁదో । డ్తోనధికజ్వాలజాలదుస్సహరుచినై॥ ౨౪.

సీ॥ తద్దయుఁభుజియింపదరికొనునంతనేపటుతరగర్జితార్భటిసెలఁగ।
మామకోల్కాద్యుతిమరపించిమెఱసెడుమించుదీవలుచాలమించుచుండ।
మత్కీలజాలంబుమడియింపఁజాలినకీలాలవర్షంబుగీల్కొనంగ।
కొరకొరచేసీసగుళికవేసినభంగిఁగరకరాజియుభూమిఁగప్పికొనఁగ।
వింతగనిరంతరధ్వాంతమంతకంత । కంతమింతయులేకరోదోంతరంబుఁ।
బాంతమునఁగ్రమ్మియలశచీకాంతుఁడంపి । నట్టిజలదంబులతివృష్టిముట్టడించె॥ ౨౫.

క॥ ఆవృష్టిశమితతేజుఁడ । నైవెండియుబాష్పపూరితాస్యుఁడనగుచుం।
గావుమనుచునావిధితో । నావిధిఁదెల్పంగనాతఁడబ్బురపడుచున్॥ ౨౬.

మ॥ నరనారాయణులిర్వురుంజగములన్రక్షింపఁగాఁగోరియు।
ధరపైనిద్ధరణాతికోవిదులుసంతప్తావనాదిక్రియా।
పరులుంబుట్టిరియింద్రనందనసుతుల్వారింద్వదీయాధికా।
తురభావంబెఱిఁగించివేఁడుకొనినన్దోడాడురన్నన్వడిన్॥ ౨౭.

వ॥ తద్వాక్యంబులకలరి మిమ్ముంబ్రార్థింపనరుదెంచితినని వారలముఖచిహ్నమ్ములచే సాహా
య్యచికీర్షుత్వంబునెంచిస్మరణమాత్రంబునవరుణునిరావించి యవ్వైశ్వానరుండునరున
కక్షయతూణీరయుగళంబునభేద్యకవచంబునుగాండీవనామకశరాసనంబు నతిధవళో
త్తమసైంధవంబులం బూన్చినదివ్యరథంబును మఱియుఁగృష్ణదేవునకు సుదర్శనంబను
చక్రంబునిప్పించి తత్తత్సామర్థ్యంబులువేర్వేఱవక్కాణించెం దదనంతరంబ. ౨౮.

మ॥ పటునిస్త్రింశనిషంగకంకటధనుర్బాణాదికోపేతులై।
దిటమొప్పన్సురరాజనందనుఁడునద్దేవుండుసోత్సాహులు।
త్కటమోహంబునవైరివారికిమహోద్దామప్రతాపాఢ్యులై।
నిటలాక్షుండెదిరించినందురమునన్నిల్వఁగానిత్తురే॥ ౨౯.

క॥ వెన్నునకునన్నగాఁడో । యన్నరునకుఁజంద్రిగాఁడో యగవైరిభళీ।
సన్నాహించిరిపోరఁగ । నెన్నరుబంధువులనన్యహితకారులిలన్॥ ౩౦.

చ॥ కమలహితాత్మజన్విడిచికంజదళాక్షుఁడువచ్చునంతనే।
కమలకలంబధారియునగాధతమంబగువానిమానసం।
బమితశరంబులంగలఁచెనైననసంతశయానుఁడత్తటిన్।
సముచితభంగిదానడువసాగెనుధైర్యముకల్మినెంతయున్॥ ౩౧.

సీ॥ చిల్కపల్కులకల్కిపల్కులౌననివినిస్మరహయహేషయౌటరసితలఁకు।
నంబుజాతముచెలియాననంబనిచూచికామప్రదరమాటమోముపంచు।

విరులింతి మేనని వేడ్కమట్టఁగఁ బోయి కంతుసింగిణి వాటఁ గరము మలపు।
అళులు గోమలి కన్నులని ముట్టింపఁగఁ బోయి తోఁగ విల్లుగుణమాటదూలుఁ బల్కు।
సుందరీమణి దనముందుఁ జూచినట్ల । యదరిపడి మూర్ఛనిగిడించు నకటయనుచు।
బలభిదాత్మజునకు నిది తెలియకున్నె । వితతరథచక్రరవముండు కతనఁ గాక॥ ౩౨.

చ॥ మలయమరుత్తు సోఁకునకు మాటికి మాటికి జల్లరించుచోఁ।
పులకమిషంబు చేత విరిముల్కుల పోటరిచిచ్చు చిత్తమం।
దలవడుచుండి పయ్యెరసహాయుఁడు గల్గుట చేత ధూమముల్।
వెలికమరంగఁ బోవిడె చెభీకరవృత్తిగఁ బ్రజ్వలించు నో॥ ౩౩.

శా॥ ఇట్లా మాధవుఁ డంతికంతకు మదిన్ స్వైరైచ్ఛ నపంచాస్త్రబ।
ల్కట్లన్ స్వవశచిత్తుఁడౌచు నడలం గాఖాండవారణ్యపుం।
బట్లం దాసిరయంతలో గలమరుత్వాత్సంభవుం డగ్నితోఁ।
నిట్లాడెం డనచేత వానికసనం బెల్లం దగం జూపుచున్॥ ౩౪.

ఉ॥ ఈ వివిధావనీరుహములీ పరిఫుల్లసుమప్రపంచసం।
భావితగుల్మినీ విసరభాసుర దేశములీ నికుంజపుం।
జావిదితార్క్యమాంశుకము దాకరముల్ల ననీరజంబులుం।
బావకనీవమే యరుచిభాసితకీలల చేభుజింపుమా॥ ౩౫

పంచచామరము॥ అనర్ఘనంజయుండు వేగ హర్షితాంతరంగుఁడై।
వనంబనంతకీలజాలవర్ధితాత్ముఁ గైతినం।
జనర్ధనంజయుండు నాస్త్రశస్త్రుఁడౌచు బావకా।
వనంబనంతు తోనొనర్చె వమ్ముగా నిశక్తిచేన్॥ ౩౬.

సీ॥ కడలేని మిణుఁగురుగములు బల్విడి రేగి చమరి వ్రాఁగఁ బులసోరడంపఁ।
బటునై యెగయు ఘూమపటలి గన్నుల గప్పి మ్రాఁగ పక్షికులముల బెగడుపఱుప।
మేఘమండలమును మించి వెగ్గెడు శిఖల్ స్పష్టఫలావళిఁ బోలియుఁ జేయఁ।
బెల్లుగా భుగులు భుగుల్లన బలుసెకల్ వంకజాకరముల నింకఁ జేయఁ।
బటపటధ్వనితోఁ వృక్షపటలి ప్రేల్ల । కావు కావని జంతుసంఘంబు లడల।
మిన్నుమన్ను నుదానయై యున్న యట్టి । గాడ్పనేస్తుండు వనమెల్లఁ గాల్చె తఱిని॥ ౩౭.

క॥ పాండవయాదవవరులా । దండన గాండీవచక్రధరులౌచు మహో।
ద్దండతతో నిరువంకల । నుండిరి సముదీర్ణభండనోత్సాహమునన్॥ ౩౮.

ఉ॥ అంతటఁ గాండసీకి తవియచ్చరులెల్లఁ బులోమనందనా।
కాంతునకివ్విఘంబు నెఱుఁగం బలుక న్విని యక్షకిన్నరా।

క॥ తానహచరుఁడై కృష్ణుఁడు । వాసవనిజయుంపఁజేసి నాసవిచేతన్।
మోసంబుల్సకలజగ । ద్వాసునితోఁ డ్వాటుగల్గువారికిఁ గలవే॥ ౪౬.

చ॥ విజయసమేతుఁడై యనలుఁ బ్రీతునిఁజేయఁగ శౌరితానగా।
ధిజయజమానవాసవనదేశముమున్న వనంబొనర్చెన.
ద్విజయసమేతుఁడై యనలుఁ బ్రీతునిఁజేయఁగ శౌరితానగా।
ధ్విజయజమానవాసవనదేశము నేడువనంబొనర్చఁగా॥ ౪౭.

మ॥ అటమాయుండిదివేళగాఁదలఁచి పత్న్యాలీఢసంస్థాయియై।
పటుసౌందర్యవయోవిలాసమునమత్పత్నిన్ బ్రతింగెల్చెనీ।
చటులాత్మీమణిగర్వమార్పకిఫుడే సైరింతునేయంచును।
త్కృటకోపంబునఁజూతబాణహతిచేఁ గాళిందినేచెంగడున్। ౪౮.

క॥ శంకరుకను సెగ చేమీ । నాంకుండిరురూపులొందినఁ గనటంచుం।
బొంకిరిగాకటకృష్ణుం । బంకజముఖినిచటనెటులబాధయొనర్చున్। ౪౯.

సీ॥ చెలులతోఁబల్కరు చెలఁగియాడెడిబాలమాటకైనను మారుమాటయిడదు।
చిల్కకుఁబద్యముల్జెప్పచుండెడిలేమ వేమఱుశుకమన్న వినుకుచుండదు।
నంచలననయంబు బెంచుచుండెడుబోటిడాసినిల్చినచడిజేసికొట్టు।
నలుజొంపంబులనలరించుకుబ్బితడాపునంచినఁగోపగించు।
బాలనననేలమరుబాణపంచకంబు । హృదయమగలించునొకటొండుమదిహరించు।
నొకటిగ్రొత్తఁగమదనిడునొకటివిహ్వలతయు।నుదుకుఁదొలిగతినొకటేఁచునంగమెల్ల॥

చ॥ మలయమరున్మఖానిలముమాటికిఁ జొన్పుచుభామచిత్తమున్।
గొలిమినిదాపవహ్నియొనగూర్చియురంబనుమూపలోమరుం।
డలికులవేణిగుబ్బలను హైమఘటుల్గరఁగించుచుండెఁగా।
జిలజిలగారెన స్రవలసేదన నారనుగానిల్చెనే। ౫౦.

శా॥ నిట్టూర్పుల్నిగిడించుచు ఘనిమురాన్నిందించుఁగృష్ణాయనుం।
దిట్టంగోకిలకీరషట్పదములన్నీరోయోగాధినిన్।
కట్టీడింగలకంముఁడింతిలనునన్నిందీవరాక్షుండుచే।
పట్టన్సంతసమందియుంటిపదయోగ్యంజాలఁడాహాయనున్॥ ౫౨.

శా॥ నాయుండాసఁడుమున్నెయందుమధుసంహర్త్రఁబుసిద్ధించెనా।
హైగాత్రింపరసంగతింబసెనా హైనోఁకుడుమ్మైంలతోఁ।
జేరంగానమహోగ్రశిక్షకియునండింతింపఁడెంతేరతి।
స్ఫాగానక్షమమోనెఱుంగఁజెప్పఁడేఁగంగొంకునేనాధ్వలన్॥ ౫౩.

సీ॥ వదలకయారాజవరుఁడుపండ్రెండేడులేకరీతిగజన్నమేలచేసెఁ।
జేయఁగాకేమియాశిఖితేజమెల్లనుదూలిమహావ్యాధియేలవచ్చె।
వచ్చెఁగాకేమియావహ్నిఫల్గునగరుడాంకులనేలసాహాయ్యమడిగె।
నడిగినమాత్రాననుడుగకతోడుపాటొనరించుటకువెంటజనిరిదేల।
తానొకటిదల్పదైవంబుదలఁచెనొకటి । యనెడుమాటకుదృష్టాంతమయ్యెనేఁడు।
పూలవిల్తుఁడుక్రూరుఁడైజాలిఁదల్ప । డెందుడాగుదువానికైయేమిసేతు॥ ౫౪.

క॥ తోడిచెలులెంతనగుదురొ । వేడివెలుంగిట్టివార్తవినియేమనునో।
యాడికలుజేసికంతుం । డోడకుమనఁడాయెవానియొడలెటునిలుచున్॥ ౫౫.

ఉ॥ అక్కటచంద్రుఁడెంతమలినాత్ముఁడొదేవతలారకావరే।
మ్రొక్కెదమీకుదోషియనిరోయకవీనిసమస్తదేహముల్।
ముక్కలుజేసివాచవిగభూరిబుభుక్షశమించునట్లుగా।
మెక్కుడియుత్పలప్రియునిమీఱఁగనిత్తురెలోకరక్షకుల్॥ ౫౬.

క॥ ఈపవనముమలయంబునఁ । బాపగములుమెసవకేలవదలెనొయకటా।
పాపీచిరాయువనుపలు । కీపట్లసిద్ధమయ్యెనేమనవచ్చున్॥ ౫౭.

వ॥ అనిచింతించునెడ. ౫౮.

క॥ అచ్చెలినెచ్చెలిహెచ్చగు । వెచ్చనిపచ్చవిలుచిచ్చువేడిమినెలికిం।
బుచ్చుటకుమచ్చెకంటికి । మచ్చికదరిఁజొచ్చిగూఢమతివాక్రుచ్చెన్॥ ౫౯.

సీ॥ వినతాత్మజనతాప్తిగనకుంటివేమాటికదరుచునూర్పునించెదవిదేల।
గోపరత్నస్ఫూర్తికొంచెమైయుండెనేపల్లవాధరితల్లడిల్లనేల।
కనుమానసుత్యఘనకాయమానముల్గనకుంటివేవిన్నదనమిదేల।
కనకాంబరాధిక్యమునుజెందకుంటివేతోడిచేడెలతోడనాడవేల।
తనువెలనుతాపమునగాచెడుగనెచాల । చిన్నికన్నెకుబలుమరుచింతమేల।
పొలతులనయంబుబనలింపవలదుబాల । పొగులనీకేలయంగింబుపొలుపమూల। ౬౦.

వ॥ అని మఱియు. ౬౧.

సీ॥ నగధారితనుకుసుమగిడయ్యెననుగర్వమునమనతోఁజల్కదనియెనొకతె।
నల్లనిమైగవినాతిభీతిలెనేమొయరసికట్టరరక్షయనియెనొకతె।
తనకైతపంబొనర్చినబాలనిటడించిచనదగునేవానికనియెనొకతె।
చెలులతోమనసిచ్చిపలుకదేగతిసల్పుహారితోడసరసోక్తులనియెనొకతె।
కాంతనాతోడఁజెప్పమేకాంతముగను । వగచుకారణమనెనొక్కవగలచేడె।
యేలసయ్యాటమాడెదరింతులార । యనియొకతెనవ్వెనంతటనినసుతయును। ౬౨.

శ్రీసత్పుండునిశాధినాధముఖవిస్తీర్ణప్రభావార్ధినీ।
డావిర్భూతతురంగముండునను బాణంబుజూడఁడాహాయనన్॥ ౭౦.

ఉ॥ పోటరిసంముగర్వమునఁబొంగెడుకృష్ణునితోడుగల్గినన్।
మీటెదనిట్లుతానకసమిద్ధమధుప్రవణసింజినీగుణం।
జేటికివేగిరంబను మనిత్థుశరాసునిధిక్కరించెనాఁ।
గాటుకకంటిసీగుస్తనఖంబులచేఁబలుమారుఁజిమ్ముచున్॥ ౭౧.

ఉ॥ తొయ్యలిమానికంబపుడుతుంగకుచంబులనుబ్బుస్వేదముం।
బయ్యెదచీరచెంగుదనపాణితలంబునఁబట్టివీచుచుం।
దియ్యనివిల్లుదాల్పుదొరదేటులకూటపులన్యశాంకునిం।
బయ్యెరనోటులేకబహుభంగులదూఱులువల్కెనీగతిన్॥ ౭౨.

క॥ మన్మథనాయమెనీకిటు । మన్మథనముసేయనాకుమారుఁడననుచున్।
మన్మనమునసెంచితిధీ । మన్మనమునసెంచనాకుమారుఁడవైతే॥ ౭౩.

ఉ॥ సింగిణివిల్లుసజ్యముగఁజేసివిశాక్షముల్గనవాడితూ।
పుంగములేయరా దిననుబూములుకుల్విరదేసెఁబూసియో।
యంగజతుంటవింటగురియానికడంకనడంపనేటికిం।
బంగరుసంకెవేసెనుభాతిగనుండెనుప్రోడవెంతకున్। ౭౪.

చ॥ అరయఁగనీవుఁడీవ్రనపమాంబతులాదురగానవేగనీ।
యురుతరబాణలాఘవసమున్గ్రగునిప్పెఁబ్రకటింపకిప్పుడో।
సరసిజబాణనన్నుబలసారెకునేపఁగనీకుఁబాడియే।
పరిణయమున్నివాడవునుభాసిలుఁదుల్యులకంచెఱుంగవే॥ ౭౫

ఉ॥ భావభవనాథనర్జునకుభావమునందులపోసినంతనే।
కేవలగుప్తచిత్తులకుఁగిల్బిషమూఱుఁదృవడప్రగజుండువే।
దావిరతాతిపూర్వవదనాజ్ఞసతుష్టుఁడునారలిగ్వగన్।
స్త్రీవధదోషమూలమనిచెప్పరొచెప్పినసద్దసేయవో॥ ౭౬.

ఉ॥ కాయపులేమికిన్ మదినగంబడితూపులనాదుప్రాణముల్।
మైయడలించినేరుపునమామకదేహముజేరనిట్లుగాఁ।
జేయుచునుంటివేమొకరసీగుహనాయకయెట్టులొప్పనీ।
కీయెలనాగరూపమమహీష్టునుపూరుషులెంచనన్నిటన్॥ ౭౭.

శా॥ తారానాథసుధారసాచ్ఛగుచిమాత్రగాహిమైయుంటచే।
నారాహుగ్రహమింతులంగలఁచునీయంగంబుచేదంచును।

గీ॥ శ్రీధవుఁడువచ్చునంతనచ్చెలియకపుడు । తోరఁగుకన్నీరుసంతోషతోయమయ్యె।
బాధయొనరించుమారుఁడుసాధువయ్యె । నంపగములైనవిరిములుక్కాలింపులయ్యె॥ ౯౫.

ఉ॥ ద్విత్రదినంబులుండియటఁదీఱనిప్రేమముతోడనాప్పృథా।
పుత్రులఁగుంతివీడుకొనిముందటదారకుఁడుంచినట్టిస।
చ్చిత్రరథంబుఁబూవిలుతుచెండనవొప్పెడునట్టియుష్ణరు।
క్ష్వాత్రికతోడనెక్కెఁదనప్రోలికినేగఁగఁగౌతుకంబునన్॥ ౯౬.

క॥ ఎన్నటికిమరలవీనిం । గన్నులఁగనుభాగ్యమందఁగల్గునొమనకుం।
గన్నారఁజూడరేయని । తన్నగరనివాసవతులుదనువీక్షింపన్॥ ౯౭.

ఉ॥ సాత్యకిమున్నుగాఁగసహజాపులువెంబడిఁగొల్చుచుండనా।
సత్యసమానరూపుఁడతిసాంద్రకుతూహలుఁడౌచుఁజెందనా।
దిత్యవరున్సహోదరవితీర్ణవిభాగముఁదానుగోరఁగాఁ।
బ్రత్యయమొప్పనిచ్చినదృభాగమనందగుద్వారకాపురిన్॥ ౯౮.

శా॥ అవ్వేళన్మురవైరిపైనిజవరాంధ్రోందందలాజాక్షతల్।
హెచ్చౌమోదమునన్వసంతుపయిమల్లీచంపకాళుల్నభ।
స్స్వేచ్ఛంచిత్సలతాంతహస్తములఁబుష్పశ్రీబలెంజల్లుచున్।
మెచ్చంబూనిరియవ్వధూవరులనిర్నిద్రప్రభంజొక్కుచున్॥ ౯౯.

క॥ ఈమగనికినామగువయు । నామగువకునీమగండునసుగుణులైయా।
పూపులుకులదొరయునురతి । కామినియుంబోలెఁజూడఁగానొప్పిరహో॥ ౧౦౦.

సీ॥ లలనయిచ్చెలిభుజాలతికరాజిల్లునే మాధవుండదెవట్టిమనుపకున్న।
నెలతయీనెమ్మేనిమెఱుఁగుజిల్లునే కమలోదరునిచెంతఁగ్రాలకున్నఁ।
బడఁతియీసతినితంబంబుశోభిల్లునే భూమీధరాంకంబుబొందకున్న।
నువిదయీగుబ్బజక్కవలుజొప్పడియున్నె హరికరస్పర్శంబునందకున్న।
నిట్టిపురుషోత్తమునివేఱెయింతినిట్టి । మగువతలమానికముఁబేరమగనిఁగూర్చ।
నలువకుచితార్థసంఘటనాప్రసిద్ధి । యన్యదురవాప్యమైయెట్టులమరియుండు॥ ౧౦౧.

వ॥ ఆసమయంబున. ౧౦౨.

ఉ॥ ఆనకదుందుభిప్రముఖులాత్తకుతూహలులౌచునుండఁగా।
నానకదుందుభిధ్వనులునందితనృత్తకళల్మృదంగని।
స్స్వానముమాగధస్తుతులుచయ్యననెక్కుమొగింజెలంగఁగా।
భూనభముల్మహానినదపూర్ణములైప్రతినాదమీయఁగాన్॥ ౧౦౩.

క॥ హలితమ్ముండతికాతురా । హలియైనవరత్నచిత్రహర్మ్యసమూహా।
జ్వలభవనముఁజెందెనుభృ । త్యులుమార్గముఁజూపనూర్యజోపేతుండై॥ ౧౦౪.

వ॥ అనంతరంబ వేల్పుశిల్పికి నెనయగు ననల్పశిల్పికళాకల్పులచేఁ గల్పితంబులై పొల్పొందు కల్పకుసుమతల్పంబులచే నొప్పుమేడలును, బన్నీటం గలయింపులిడి ముత్తియంపు ముగ్గులమరించి కనుపండువుసేయ శృంగారించిన శృంగాటకంబులును, గెందలిరులచే డెందంబుగందళింపంజేయుచు మిన్నందు పందిరులును, సౌధాంతరస్థాపిత మరకతస్తంభ సచ్ఛాయంబులై యభేదబుద్ధి జనకంబులగు పచ్చతోరణంబులును, విమలతర వారిధారా పూరితోరుసీరజాలంకృత కనకభద్ర కుంభరాజి విరాజమాన వితర్దికాపరి శోభితంబులగు రథ్యలును, దన్నగరీమహిళాలలామంబు స్వకీయగోపురాగ్రసంకీలిత కనత్కనక కలశంబులును, గబ్బిగుబ్బలపై నొయ్యన నిడుకొనిన పయ్యెదయన నతివిశద నీరంధ్ర ధ్వజ పరంపరలమరిన రాజమార్గంబులును, మఱియు బహుచిత్రకళా విచిత్రిత సౌవర్ణ కుడ్య భాసమానంబులగు పేరోలగంబులును, గలుగనలంకరించి యొక్క శుభదినంబునఁ గార్తాంతిక వినిశ్చితంబై జామిత్రశుద్ధంబును గ్రూరగ్రహ వీక్షణాది రహితంబును శుభ మిత్రగ్రహ సంసేవితంబునగు నొక్కలగ్నంబున నాయిందువంశమండనుం డాసుంద రాంగిం బెండ్లియాడం దలంచి యుండెనంత. ౧౦౫.

శా॥ నాకూతున్వసుదేవనందనుఁడుమానంబొప్పఁబెండ్లాడు నేఁ।
డీకల్యాణముఁజూడరండనుచువార్ధీశాదులంబిల్వను।
త్సేకప్రక్రియ నేగుదెంచెననఁగాఁజిత్రాంశుకోపేతుఁడై।
యాకంజేశ్వరుఁడస్తశైలశిఖరప్రాంతంబుఁజెందెన్వెసన్॥ ౧౦౬.

సీ॥ వరుణబహిర్ద్వారవాటికఁగట్టినతొగరారుచెంగల్వతోరణమన।
ద్విజకరవిక్షిప్తతీర్థవిఖండితమందేహదేహాస్రమయమనంగఁ।
బశ్చిమాశాసతీవరధరియించినచెలువొప్పునెఱ్ఱనిచీరయనఁగ।
నినువిడఁజాలక వెనువెంట నేతెంచుజలజాతసంతతిచ్ఛాయయనఁగఁ।
గంజసంజనితాండమన్గరిడిలోని । కాలమల్లునినెమ్మేనఁగ్రాలుశోణ।
మృత్తికాకృతివహియించిమెఱయుచున్న । సంజకెంజాయయపుడాకసమునఁబర్వె॥

ఉ॥ నీరజినుల్స్వకాంతుధరణిన్విడకుండుటకెల్లకాలమున్।
నీరజనీకమానటుల నేరఁడుసేయఁగనబ్జసంభవుం।
డీరసహీనుతావుమనమీరసదీరహరింతమందునం।
భోరుహముల్ముడించెదమపొల్పునుదూలు బెఱుంగవక్కటా॥ ౧౦౭.

క॥ సరసిజినిసవతికూఁతురు । పరిణయమంచెటిఁగిమోమువంపఁగఁగనుచుం।
బరిహాసించెంగుముదిని । పరహితములసూర్వలేమిపరిహాస్యమెకా॥ ౧౦౯.

చ॥ ఇనుఁడుజగంబులేచుసుజనేతరులందనబంధనాలయం।
బునమునునిల్పియప్పుడ్తనపుత్రికపెండిలియుత్సవంబుగా।
వునవిడిపించెనాసకలభూమియుఁదామయిపర్వఁగాఁటిరుల్।
జనులుశుభంబుఁదెల్పుటకుజల్లుకురంగమదంబుకైవడిన్॥ ౧౧౦.

క॥ యామవతియింద్రనీలకృ । తామలపాత్రమునసుంచెనప్పుడలఁబ్రాల్।
సోమకులతిలకుపెండ్లికి । నామెఱసెందారకాగణంబులుమింటన్॥ ౧౧౧.

గీ॥ పూవిలుతునన్నరాత్రితమోవికార । మణఁగుటకునైయొనర్చినయౌషధంపు।
ఘుటికవెన్నెలపుల్గులగోర్కెముద్ద । తోవలరాయఁడుతొలిమలఁదోఁచెనపుడు॥ ౧౧౨.

చ॥ సమయసమాఖ్యశిల్పిజలజప్రతియోగిసమాఖ్యహీరమున్।
సమమగుశింశుమారమనుచక్రమునందొనగూర్చిత్రిప్పఁద।
త్సముదితలేశసంఘములుతారకలైతనరారెనందుసూ।
త్రముఘుటీయింపఁజేసినసురంగముగాదెకురంగమండలన్॥ ౧౧౩.

వ॥ అప్పుడు. ౧౧౪.

క॥ కార్తాంతికులాసన్నము । హూర్తముఁదెల్పంగనువిదలురుశుభరవముల్।
నర్తనకళలుంజెలఁగవి । కర్తనుతనుజాతతోడఁగంజదళాక్షున్॥ ౧౧౫.

చ॥ పగడపుఁగంబముల్మెఱుఁగుపచ్చలమెట్టులుకెంపుదిన్నియల్।
జిగిదనరారుముత్తియపుచిక్కనిజాలరుబెంపుమీఱుమే।
ల్తగటుజరీమెఱుంగుపనిదట్టపుహొంబటుమేలుకట్టులున్।
నెగడుచతుష్కమందునొకనిద్దపుమేలిపసిండిగద్దెపై॥ ౧౧౬.

ఉ॥ దీవనమున్నుగానునిచితెల్లముగాయదునాథుఁజూడఁగా।
భావములంతలోఁగలఁతబాయుటనోపటికంపుగోడలన్।
శ్రీవసుఁగాంచితన్నిజశరీరవినిశ్చయమూఢలౌటనో।
తీవియబోండ్లువస్తువులఁదెచ్చునెపంబునజాగుసేయుచున్॥ ౧౧౭.

చ॥ ప్రకటపుతావినల్దెసలఁగ్రమ్మెడుసంపఁగినూనెచేతవృ।
త్తకుచయుగంబుతాండవవిధానముసల్పఁగఁగంకణధ్వనుల్।
తకుతకుతక్కుతక్కుటనితాళగతుల్పరికటింపుచుండఁగా।
ముకురసమాస్యయోర్తుయదుముఖ్యునకుందలయంటెవీకతోన్॥ ౧౧౮.

క॥ సంకుమదాగరుమృగమద । పంకశితాభ్రములఁగలపిఘాలమ్మునస్వే।
దాంకూరములొాలయఁగనొక । పంకజముఖినలుగువెట్టెఁబద్మాక్షునకున్॥ ౧౧౯.

ఉ॥ కమ్మనితావిగ్గ్లుమధుకల్కముచేఁదలజిడ్డువాపిరా।
రమ్మపసిండిగిండియలనచ్చపువెచ్చనితేటనీరుఁదే।
రమ్మయొకింతవెచ్చఁదనమారుపరమ్మయటంచుమేలుకీ।
ల్బొమ్మలచాడ్పునన్ జలకమందనరించిరికంసవైరికిన్॥ ౧౨౦.

సీ॥ తేటికూటువుతేటుమీటుపెన్నెఱిగుంపుమత్తకాశినితడియొత్తెనొకతె।
కౌశికసాంబ్రాణికామిశ్రితంబుగాధూపంబునిడెనొక్కతోయజాస్య।
తనకొనగోళ్లనెల్లనఁజిక్కుసడలించిఘనవేణివేల్మిడియునిచెనొకతె।
శరదిందుభాసురక్షౌమయుగంబునుగట్టనిచ్చెనుగలకంఠియొకతె।
కమ్మకస్తురిథొకముద్దుగుమ్మతెచ్చి । తిలకమునువానినొసటిపైదిద్దెనపుడు।
కటకకేయూరకుండలాంగదకిరీట । హారములనుంచెనొక్కమయూరవేణి॥ ౧౨౧.

గీ॥ భామయొక్కతెవానినెమ్మోమునకును । దారికాధిపునకునెంతతారతమ్య।
మనియరయఁదెచ్చినట్టియుజ్జ్వలయనఁగ । నిగ్గుటద్దంబుముఁదటనిలిపెవేగ॥ ౧౨౨.

క॥ ఆదర్శతిమిరమూర్ధజుఁ । డాదర్శమునందుఁదనదునతులితరూపం।
బాదర్శించియమేయ । స్వాదరసతరంగితాత్మభరితుండయ్యెన్॥ ౧౨౩.

సీ॥ పైఁడలితలమిన్నకైదువుల్ మంగళస్నానంబుసేయించిసరభసముగ।
జలతారుచుట్టుచెంగులరంగుమీఱెడుడంబైనపట్టుపుట్టంబుఁగట్టి।
ఘుమ్మనిధూపగంధమ్ముజిమ్మెడువేణిగేదంగిరేకులుగీలుకొల్పి।
యొదుటుగుబ్బలయుబ్బునొరసినపైఠాణికంచెలముడిబిగియించికట్టి।
చెవులపైఁగల్వలించుకచెదరసోఁగ । కన్నుదోయికిఁగాటుకకలఁయదిద్ది।
యమలహరితాళధాతుభేదములచేత । నుదుటఁగళ్యాణతిలకంబుఁగుదురుపఱిచి॥ ౧౨౪.

శా॥ లాక్షారాగమలందిపాదయుగళిన్ లౌహిత్యమేపారఁగా।
రక్షార్థంబునసవ్యహస్తమునదూర్వామాలికంగట్టిలో।
లాక్షీమమ్ముఁదలంచెదోతలఁచవోయామోహనాకారునిన్।
సాక్షాన్మన్మథమన్మథుంగలయుచోసత్యంబుగాఁదెల్పుమా॥ ౧౨౫.

క॥ నానలిననయనయించుక । నానందలవంచివినయనమ్రముయుఁబోలెం।
జేనున్నపుష్పగుచ్ఛము । లోనున్నరేణువులనులోలతనూఁదెన్॥ ౧౨౬.

క॥ సకలస్త్రీపుంసజనా । ధికసౌందర్యాధికారదీపకములుమే।
ల్పొకటపుపట్టాలనబా । సికములఁగట్టిరొగివారిశిరములయువతుల్॥ ౧౨౭.

చ॥ పటహమృదంగశంఖరవభాసురయౌవనవారకామినీ।
నటనకళాప్రపంచకలనాదలసన్మృదుగీతవిద్యలా।
క్కటఁజెలఁగంగజన్నిదపుగట్టులుస్వస్తులువల్కుచుండఁగాఁ।
గుటిలకచాయదూద్వహులఁగుల్కుచుఁదెచ్చిరిభద్రవేదికిన్॥ ౧౨౮.

చ॥ అరుదుగిమున్నెవిష్ణుపదమాత్మకరావళినెల్లఁజొన్విత।
త్కరపరిముక్తభూరిజలధారలచేఁగడఁగెన్సమస్తభూ।
నపలకుఁదేటఁగానలమ్మణాళవతీప్రియుఁడాత్తరాగుఁడై।
తిరముగశౌరికవ్వరసతీతిలకంబునొసంగుశేర్పడన్॥ ౧౨౯.

ఉ॥ కొమ్మయనుంగుఁజేడియలుక్రొమ్ముడియించుకయోరసేయఁబూ।
టమ్ములఁబూనిజోదుగురియానిశరమ్ములుగుప్పుగుప్పునన్।
రిమ్ముగబోటికంఠమునసిల్పెనుమంగళసూత్రమాత్మలో।
బమ్మెరవొమచుంబికిలిబంతులనించుకయోరసేయుచున్॥ ౧౩౦.

క॥ సతిదోయిటఁబతిశిరమునఁ। బతిదోయిటసతిశిరంబుపైముత్తెపుఁబ్రాల్।
కుతుకంబుననునిచిరియపు। డతివలుపురుషులునుజూచియానందింపన్॥ ౧౩౧.

క॥ పాణిపుటికాశిరోరుహ। వేణీనేత్రగళకుచసువిస్రస్తములై।
యాణీల్శుక్త్యబ్దాబ్జహి। శ్రేణిఝషాబ్జకరిజనితరీతింగ్రాలెన్॥ ౧౩౨.

చ॥ తమపరిశుద్ధభావమునుదారసువృత్తతనెంచిలోనిరం।
ధ్రముదలపోయకెంతయుశిరంబుననెక్కియటుండిభ్రష్టభా।
వముగనియంతకంతకునుబైపయివ్రాలితుదంబదాంబుజా।
గ్రములకుఁజేరముత్తెములుగారయిటుల్భువినల్పులెన్నఁగన్॥ ౧౩౩.

శా॥ నాపాదంబుననున్ననెక్కశిలఁడున్నన్ వేగరామామణీ।
రూపంబందెనునీవునట్లుపలముంద్రొక్కంగనేమానొకో।
యీపట్లంబరికింతమన్నగతినయ్యిందీవరాక్షుండుభా।
మాపాదంబుఁగరంబునంగొనిశిలస్మట్టించెమోదించుచున్॥ ౧౩౪.

క॥ ఆహిమరుఙ్ముఖిచేతఁబు। రోహితకులశేఖరుండురోహితహయుపై।
స్వాహాయనిలాజాంజలి। యాహుతిసేయించిధూమమానంజేసెన్॥ ౧౩౫.

సీ॥ స్వర్భానుపరిముక్తచంద్రమండలమనఘామముక్తంబయితోఁచెమోము।
యమునాధునీప్రవాహమునాఁబరంగుమగస్తూరితిలకంబుగరఁగిపాఱెఁ।
జంద్రకాంతస్రవజ్జలబిందువులమాడ్కిఁజెక్కుటద్దములఁజెమటపర్వె।
శుక్తిపుటాంతరమౌక్తికంబులక్రియనేత్రయుగ్మంబుననిండెజలము।

కర్ణపూరయవాంకూరగరిమకొంత । వేడిఁబ్రుంగెనుజెందొవల్ వాడుసూపె।
ఘ్రాణతర్పణమగుధూమరాజియచటి । జనులకామోదమొనరించెఘనతరముగ॥ ౧౩౬.

శా॥ గుర్వాజ్ఞాపితుఁడైశయాబ్జముననక్కోకస్తనిందార్క్ష్యగం।
ధర్మ్యందూనిప్రదక్షిణంబుసలుపందత్పృష్ఠతోయాతయై।
పర్వేందుప్రతిమాస్యభాసిలెమదేభానువ్రజత్పద్మినీ।
నిర్వాహ్యప్రభఁజూడఁగానమరిమందీభూతయానంబుతోన్॥ ౧౩౭.

సీ॥ అగ్నిప్రదక్షిణంబాచరించెడువేళగరితకుముంజేయిగగురుపొడిచెఁ।
గుండలమణిరుచుల్గండమండలిబర్వితళతళయనికొంతఁదాండవించె।
స్వకరాంగుళీబహుశఃప్రసారితమైనసన్నపయ్యెదకొంగుజారెకొంత।
నీటుగాఁగుచ్చెళ్లనిలిపికట్టినచీరనడలకుఁగొంతబంధములుచేసె।
నలువవిలుకేఁడుప్రకటనఫలకములను । మువ్వలొనగూర్చివేసెడుముద్రికలనఁ।
బ్రతిపదక్షిప్తకింకిణీరవములులియ । నలరెలాక్షాక్తకుట్టిమమంఘ్రియుగము॥ ౧౩౮.

వ॥ ఇట్లువ్వధూవరు లగ్నిదేవునకుంబ్రదక్షిణించి భూదేవాశీర్వాదంబు లార్ద్రాక్షతారోపణ పూర్వకంబుగాఁగొని వారలకుంబ్రణమిల్లి దేవకీవసుదేవులకుమ్రొక్కి వారిదీవనలుఁబడసి యుండిరంతనవ్వసుదేవుండు. ౧౩౯.

శా॥ పాటీరప్రథమానసంకుమదపుష్పప్రసక్తితాంబ్రోల్లస।
ద్వీటీసన్మృగనాభముల్ మరియునుర్వీసద్వధూటీమణీ।
ఘోటీహాటకకోటికుంజరపటీగోరత్నభూషావళీ।
పేటీదాసశతంబులిచ్చెనుధరాబృందారకశ్రేణికిన్॥ ౧౪౦.

ఉ॥ మచ్చికతోడనిడ్డపరమాన్నముఘుమ్మనితావిగ్రమ్ముమే।
ల్పచ్చడులూరగాయఘృతపక్వమరీచఫలార్ద్రికాఢ్యమా।
పచ్చనికూరగుంపుపసిపప్పనుబూరెలుగారెలొబ్బటుల్।
వెచ్చనియోగిరంబునిడివిందొనరించెనుబాంధవాళికిన్॥ ౧౪౧.

సీ॥ సుప్తిజంతనిరూఢసూత్రానువాదాప్తినాగమాదేశాదులరయువారు।
నాగపున్నాగకర్ణాటాదిరాగముల్ మేళగించుచువీణమీటువారు।
శబ్దానుమానాదిసంగతిచేఁబదార్థనిరూపణంబునఁదనుపువారు।
శివశరాసనభంగసీతావివాహాదిసత్కథాబృందంబుజరుపువారు।
సంధివృత్తిరసాదులుచక్కఁబఱచి । రూపకవ్యంజకంబులఁజూపువారు।
వరుసఁబంచదినంబులుసరసగతుల । జరిపిరప్పంచమదినాంతసమయమందు॥ ౧౪౨.

సీ॥ పటికంపుగోడలపైఁజిల్గుఁ(వ్రాతలబంగరుపనిచేతరంగుమీరి।
మరకతంబంతరాంతరమునఁదగురత్నకుట్టిమంబులచేతఁగొమరుమిగిలి।
మగరాలదూలముల్ మాటిపైఁగూర్చినపచ్చలమిద్దెచేఁబరపుమీరి।
యింద్రాయుధమునైననించుకవెఱపించుద్వారబంధములచేఁదరుచుకెక్కి।
పులుగురాపచ్చగమిగూర్చికలువరాచ। రాలగం దెలుపైమగరాలగుబ్బ।
కాయలపరంజిగొళ్లెముల్లలుగువెడఁద। తలుపులహొరంగుబల్గిగిదనరిమఱియు॥ ౧౪౩.

సీ॥ నగిసీపనిపసిండినారసంబులుకెంపుబల్లలుగూర్చినపంజరములు।
పంజరంబులలోనఁబలుమాఱుమారునిగీతములాడెడుకీరములును।
గీరవాక్యములకుఁగేరివచ్చినవేల్పుకొమ్మలునాఁగెలుబొమ్మవరుస।
బొమ్మలనిల్పంగబుత్తడిగొలుసులఁగట్టినసెలరాలపట్టియలును।
తీరుగానిడ్డరతనంపుదీపములును। ద్వారనిక్షిప్తపన్నీరుపూరితోరు।
కువలయోపేతసౌవర్ణకుంభములును। గలిగిభాసిలుకేళికాగారమందు॥ ౧౪౪.

చ॥ పవడపుఁగోళ్లఁ(గొంబసిఁడిపట్టెలుపచ్చనిపట్టుదిండులుం।
దొవచెలివెల్గుమీఱువెలిదుప్పటిమెత్తని(క్రొత్తమెత్తలున్।
నవమదహంసతూలికయునానొపుమేల్మకమాలుపచ్చడాల్।
హవుసగుపట్టెమంచమునసంగనలెల్లఁబ్రమోదమందుచున్॥ ౧౪౫.

గీ॥ ఆకుమడుపులునుపచ్చిపోకలిడ్డ। పళ్లెరంబులునెఱిదావిఁజల్లునట్టి।
గందవొడిఁగిప్పరంపుబొగాలుఁగిమ్మ। కస్తురిజవాదిపువ్వులుఁగంధమునిచి॥ ౧౪౬.

గీ॥ పాయసాహారమిడిపఘూవరులనందుఁ। గూరుచుండంగఁబెట్టియకొమ్మలెల్ల।
మరలిరంతనెసామజమందయాన। చెలులవెంబడనేతేరఁదలఁచిడిగ్గ॥ ౧౪౭.

వ॥ అయ్యవసరంబునయ్యిందుముఖినెయ్యంపుఁదొయ్యలులొయ్యనఁజెయ్యివట్టియిట్లనిరి.

క॥ మాతోరాఁగాదుచెలీ। నీతోనిపుణాస్త్రీశాస్త్రినిపుణతఁజూపం।
జేతోమోదమునందెదు। నీతోయదగాత్రుఁగూడియెనయుముసుఖముల్॥ ౧౪౮.

గీ॥ మరునిరూపునుమఱపించుమగనిఁగూడి। యసమవిషమశరసమరరసములోలి।
ననుభవించెడుభాగ్ధేయంబుగల్గఁ। బెనఁగుకంటెనువేమరుతనముగలదె॥ ౧౫౦.

క॥ ఆకమలశరుఁడుపువ్వుల। బాకులుకుచసీమడుస్సిపాఱఁగనేయున్।
నీకవియోర్వందరమే। రాకేందునిభాస్యఁగూడిరమియింపనిచోన్॥ ౧౫౧.

క॥ పురుషులమోజాడలుతా। మరయుచుమెలఁగంగవలయునబ్జాస్యలకున్।
విరసములువలుకఁగూడదు। మరుకేళిందేలవలయుమతమెఱిఁగిచెలీ॥ ౧౫౨.

గీ॥ చిన్నదానవటేనీవుసన్నుతాంగి । సద్వ్రతంబులువీనికైసల్పితేల।
కంతుబాణానలంబునఁగ్రాఁగునపుడు । డాఁగెనెచ్చోటనీనాననాగయాన॥ ౧౫౩.

సీ॥ సరసుండుమెల్లనశయ్యకుఁదార్చినగదియకపెనఁగులాడెదవుసుమ్ము।
అంగరాగంబిడఁగెంగేలువట్టినవదలించికేల్మోడిచెదవుసుమ్ము।
కప్పురవిడియంబుఁగాంతుఁడీవచ్చినబెదరుచునూరకుండెదవుసుమ్ము।
ముదమునదయితుండుముద్దాడవచ్చినబేలవైమోముఁద్రిప్పెదవుసుమ్ము।
కోరినప్రియుండునీకుఁజేకూరెఁబడఁతి । సేయనేటికిజిల్కునజీరునింక।
దాసుగానేలుకొమ్మమందారగంధి । ధవునిఁగైకొమ్మబంగరుతళుకుబొమ్మ॥ ౧౫౪.

చ॥ ఇటులనినాతిచేయికమలేశునిచేతనమర్చిమాధవా।
దిటముగఁగామశాస్త్రమునఁదీరిచియేలుముచాలనంచున।
కుటిలశిరోజగన్నొఁగిగొబ్బునఁబైఁజనిరొక్కరొక్కరే।
తటుకునఁదల్పమూనితమతావులఁజెందిరిభామినీమణుల్॥ ౧౫౫.

వ॥ అప్పుడు. ౧౫౬.

సీ॥ వరుఁడుదగ్గరిలంగిజరుగునుచెలితమనడుమసిగ్గుండదానడిగెనేమొ।
శౌరినిండుగఁజూడఁగోరియుఁదలవంచుసిబ్బితికనుసైఁగఁజేసెనేమొ।
ధవుఁడిచ్చువిడెమానఁదలఁచియుగేల్ద్రిప్పులజ్జహస్తముఁబట్టిలాగెనేమొ।
పత్రరేఖలుదిద్దవచ్చినఁదలత్రిప్పునొప్పవద్దనిలజ్జఁజెప్పెనేమొ।
యటులఁగాకున్నఁగాయజపటుశరాస । గాఢతరముక్తశరవహ్నిఁగ్రాఁగిక్రాఁగి।
భూరిసంభోగరసములఁబొందుటప్పు । డనెడునబ్బాలకదివశంబౌనెతాళి॥ ౧౫౭.

మ॥ వలమానాంబుజనేత్రపార్శ్వయుగళింబాలిండ్లచెంతంగరం।
బులుచొప్పించిహలాంకితానుజుఁడుపాన్పుంజేరఁగానంతఁజ।
క్కిలిగింతల్గొనిచంచలించునలపంకేజాస్యహస్తంబులం।
బలితంబౌమకరాంకభావిసమరప్రస్థానఘంటారవం।
బులమాడ్కిందనరించెఁగంకణరవంబుల్చిత్తవిభ్రాంతతన్॥ ౧౫౮.

చ॥ కళగలతావులంటిననుగౌఁగిటఁజేర్చినఁబల్కరించినన్।
నెలఁతుకమాఱుమేల్పనులునేరనియట్టులనుండెనెయ్యపుం।
జెలులుహితోక్తులందుగుఱిసేయకసిబ్బితియాజ్ఞలోపలన్।
మెలఁగెనుసిగ్గువారలనుమీరిననచ్చెలియేమొకోటికిన్॥ ౧౫౯.

వ॥ ఇట్లు పాటలగంధి రతిపాటవంబు సిగ్గునమాటుపడుట దేటపడ నాహాటకచేలుండు మంచిమాటలం గూటమియందాసపుట్టింపంగోరి యిట్లనియె. ౧౬౦.

సీ॥ కలికరో చిలుకలకొలికిరో మన్మధములకిరో యేటికేయలికిరోయ।
రాఁగదేసతిముద్దులీఁగదేనాపయిసోగదేరినచూపువేగఁజేర్చి।
చూడవేమాఋమాటాడవేమోమెత్తికూడవేరతులనాతోడవేడ్క।
బాలనేనింకోర్వఁజాలనేయాలస్య మేలనేమరుఁడుపూఁగోలనేసె।
వేలజరుపకుమిఁకమేలమేలమేల । వేలలేనట్టికామాబ్ధివెల్లివిరిసె।
నిక్కముగవేడుకొంటిననీయురోజ । కుంభములొసంగిననన్నేలుకొనులతాంగి॥ ౧౬౧.

శా॥ చెక్కుల్నొక్కుచుగబ్బిగుబ్బలెదపైఁజేరంగనిగాఁగిటం।
జిక్కంబట్టుచువీటిగంధములతోసీత్కారముల్మించఁగా।
గ్రుక్కుల్గానధరామృతంబురుచిమైఁగ్రోలంగభాగ్యంబుపెం।
పెక్కన్నాకెపుడంచునుంటిఁగదవేయిందుప్రసన్నాననా॥ ౧౬౨.

సీ॥ చెలియచెక్కిటఁజేయిఁజేర్చిముద్దాడుచుమచ్చికవిడియమందిచ్చినట్లు।
పుంభావమునఁగొంతభోగించియలివేణివరునిపెన్నురమునవ్రాలినట్లు।
పొలయల్కచేఁదన్నుఁగెలయకుంటఁబియుండుమాననీమణిబ్రతిమాలినట్లు।
సరసుండువస్త్రంబుసడలింపసతిసిగ్గుమించివానినిగాఁగలించినట్లు।
అతులరతులనుబతులకుసతులుసెలఁగ । సతులుధృతిబహుబంధముల్జరుపునట్లు।
శిల్పిశిల్పకశానల్పకల్పితములు । వసనాలేఖ్యములఁజూడుతరుణినేఁడు॥ ౧౬౩.

చ॥ మతిమతిమాధవుండుమరుమంత్రములంబలెమంచిమాటలం।
దెలివకునాత్మసంగనిరతింజనియింపఁగఁజేసినేర్పునం।
బటిఁగనికేల్గ్రహింపఁగనుపట్టుఘనీవియవీడెనంతలోఁ।
జెలికులవింటివాఁడుచెలిచేతికినీవికఁగీలొనర్చెనో॥ ౧౬౪.

ఉ॥ భాసురగాత్రిమేనఁగలపంబునలందుచుమేనుమేనితో।
రాసినయంతనేకళలురంజిలిదేహముపుల్కరించెనా।
మోసపుసిగ్గువచ్చికనుమూసెనరీతిగముట్టడించెఁగా।
కాసమయంబునన్నిపుణరైయెయొనరింపదెకామతంత్రముల్॥ ౧౬౫.

మ॥ నలతేఁడొడ్డినజాలముంకుఁబడితద్బంధంబులన్నేర్పునం।
దొలఁగంజేయఁగలేనిసన్మృగిక్రియుందోషాటవిద్వేషితాఁ।
జెలువంబొప్పఁగఁగాఁగిటన్ముదమునంజేర్పంగవ్రీడాభరా।
కులయైయుండెమృగేంద్రమధ్యపులకాంకూరాళిమైఁగ్రమ్మఁగన్॥ ౧౬౬.

ఉ॥ కోరికమీఱబోటినేటిగుబ్బలనానుటయెప్పుడెప్పుడం।
చూరుచుఁగంచుకంబుముడియూడ్పఁదలంపఁగనడ్డమయ్యెఁబై।

చీరసడల్పఁ జోసుదతి చేతులనొడ్డుటయొక్కకొంతయు।
య్యారపుగుబ్బగుత్తిబిగియానికచేవిడకుంటకొంతయున్॥ ౧౬౭.

సీ॥ మల్లికాసరములమాటికిదుయ్యుచోఁ జక్కనికీల్జడఁ జనిరిచమిరి।
లలితగంధామలమలయజంబలఁదుచోఁ బాలిండ్లుకరములఁబట్టిపట్టి।
చెక్కుటద్దంబులఁజేరిముద్దాడుచోనధరామృతాస్వాదమానియాని।
సడలినకాంచికసవరింపఁబోవుచోఁ బొక్కిలిపేళ్లఁ జేఁబొదివిపొదివి।
మాటికబ్బోటిచెంగులుమాటిపట్టఁ । జేలమల్లనసడలించిసిగ్గుపట్టు।
దెలిసినంతనెనునుసిగ్గునొల్లఁగిపోలె । నెలవుపయులాక్రమించిననిలువవశమె॥ ౧౬౮.

మ॥ హిమయుగ్భాసురసాయగాత్రుఁడటుపైనేమేమిగావించినం।
బ్రమదాలోకవిశేషకంబువివరింపంజాలకక్షిద్వయం।
బుమహానందరసాబ్ధిఁదేలుచరమోద్భుంజేసెఁబంచేషుత।
త్వములోనిల్పుచునాద్యసంగమమునందాదాత్మ్యకాంక్షుంబలెన్॥ ౧౬౯.

క॥ ఇటులిర్వురుబహుకేళీ । చటులత్వముచేతమించశర్వరియునుదా।
నటనుంటబాడిగాదను । నటులేగెనుదనకువారుహ్రస్వతనెంచన్॥ ౧౭౦.

మ॥ సరసోక్తుల్ పలుకంగనేర్చెబహుధానర్చన్ వినోదింపవే।
మఱుఁదానేర్చెనుబంధురాతనుకళామర్మంబులంబ్రొద్దులం।
జయపన్నేర్చెననేకబంధరచనాచాతుర్యముల్ నేర్చెనా।
సరసీజాస్త్రగురుప్రసాదముననబ్జాతాక్షినానాటికిన్॥ ౧౭౧.

చ॥ చకచకలీనునిందుమణిసౌధతలంబులకుట్టిమంబులన్।
వికసితపుష్పగుచ్ఛపరిపీతలతాభవనాంతరంబులన్।
జకితమృగాక్షిఁగూడియనిశంబునుభోగములందుచుంగటా।
క్షకలితభుక్తుఁడౌహరిసుఖంబుగనేలుచునుండెలోకముల్॥ ౧౭౨.

క॥ స్థిరముగనికాళిందీ । పరిణయముఁబఠించునట్టిపావనులకుస।
గ్గుయపుణ్యఫలములిడుహరి । హయుఁడునుపర్ణ్యకృతినాథులైయుండుటచేన్॥ ౧౭౩.

క॥ నానాసూతుఁడునుడివిన । నానాశ్చర్యములువినిమనఃపద్మములో।
నానందసూనునెంచుచు । నానందమునొందుచుండిరఖిలమునీంద్రుల్॥ ౧౭౪.

గీ॥ వెలయరామభక్తవిలసితుండైనట్టి । శొంఠిరామయాఖ్యసుకవిచేత।
రచితమైనయట్టిగ్రంథమియ్యదికవి । హృద్యమగుచుఁబుడమివృద్ధిఁజెందు॥ ౧౭౫.

క॥ తుంగాచలశృంగాలయ । గంగాలసదుత్తమాంగకరతలధృతసా।
రంగాపురభంగాధవ । శౌంగాగుణసంగకుక్కుటాహ్వయలింగా॥ ౧౭౬.

ఉ॥ సాదితకుంజరాసురనిశాతరుణీవరఖండశేఖరా।
వేదరహస్యగోచరవివిక్తమనస్కమనోంబుజార్హ్వణా।
సాదరభూధరేంద్రతనుజాక్షియుగోత్పలయామినీవరా।
పాదగయాతటాంచలవిభాసురగోపురకుక్కుటేశ్వరా॥ ౧౭౭.

కవిరాజవిరాజితము.

మదనమదాంతకదాంతకలిప్రవిమర్దనభూమిశతాంగహరి।
ప్రదరితమోహరమోహరయావృతభావయుతావిదితోరుగుణా।
విదళదిభాసురభాసురవిగ్రహవిశ్వజనీనచరిత్రనభ।
స్వదశనరాజితరాజతశైలనిశాంతనిశాకరకోటిసమా॥ ౧౭౮.

గద్య॥ ఇది శ్రీమదుమాకుక్కుటేశ్వర కరుణాకటాక్షవీక్షణసంలబ్ధ సంస్కృతాంధ్రకవితా ధోరణీమానురీధురీణ సకలసుకవిజనదయాపాత్ర గౌతమగోత్రపవిత్ర గంగరామాకృతి పుత్ర సూర్యప్రకాశసూరిచ్ఛాత్ర రామయాఖ్య ప్రణీతంబైన కాళిందీపరిణయంబను మహాప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

---

చక్రబంధము.

శ్లో॥ యక్షేశప్రియురాజశేఖరప్రజేశామర్త్యదేవస్తుతా।
యత్సార్వప్రవిమత్తకుంజరహరాయోకృత్తిసంశోభితా।
దత్తాదేవఘునాథకంధరలసత్కాంతిప్రజాభద్రదా।
దాక్షిణ్యాయుతతాయుతాసదయసంతాపార్థితాపన్నుదా॥

పుష్పగుచ్ఛబంధము.

శ్లో॥ యతిపతిమతిగమ్యంపత్రిపత్రంపరేశం।
సునయనవనజాతంశక్రశత్రుప్రిశనాశం।
అతిరతిపతిరూపంరమ్యరత్నోరమేశం।
భజతజలజవక్త్రింభగ్నభద్రేభపాశం॥

నాగబంధము.

స్రగ్ధర॥ సుద్దన్ మేలయ్యెఁజూడన్ సుఖములగనిగన్నాకుక్కనీచుట్టుగోనన్।
మద్దుల్ విక్రాంతమానిక్మలవృతితతిగ్రైమాఖ్యాసుక్రేజిగెక్కన్।
స్పైద్దంచుంగోద్రుమోర్విన్వినమరిమరిచున్వినినింజూడమాటిక్కన్।
ముద్దున్ జిల్కించునిద్దంబులు వెలుఁగుమహామోదతంగాంచుకొద్దిన్॥

గోమూత్రికాబంధము.

క॥ శ్రీకరునకుమంగలచరి । తాకరునకుభక్తలోకతాపహరునకున్।
లోకపునకుమంజులహరి । శాకల్పునకుభవలోలతాధిహరునకున్॥

శ్రీరస్తు

# శివానందలహరి.

ఇది,

అద్వైతమతప్రతిష్ఠాపనాచార్యులైన

శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యస్వాములవారిచే

రచితము.

---

కాకినాడకలీజులో నాంధ్రపండితులుగానున్న,

బ్రహ్మశ్రీ, శృంగారకవి సర్వారాయశర్మగారిచే

పద్యాత్మకముగ నాంధ్రీకృతము.

---

శ్రీ వైజయంతియందు ముద్రితము

---

చెన్నపురి:

శ్రీవైజయంతీ ముద్రాశాలను ముద్రితము.

హేవిళంబినామసం॥ ౧౮౯౭ సం॥

శ్రీరస్తు.

# శివానందలహరి.

## ఆంధ్రపద్యయుతము.



శ్లో॥ కలాభ్యాంచూడాలంకృతశశికలాభ్యాంనిజతపః।
ఫలాభ్యాంభక్తేషుప్రకటితఫలాభ్యాంభవతుమే।
శివాభ్యామస్తోకత్రిభువనశివాభ్యాంహృదిపున।
ర్భవాభ్యామానందస్ఫురదనుభవాభ్యాంనతిరియం॥

గీ॥ కలలకుశిరోధృతశశికలలకుభక్త । ప్రకటితఫలులకునిజతపఃఫలులకు।
శివులకంచితత్రిభువనశివులకుముద । నుభవులకుఁబునర్భవులకునుమదివినతి॥ ౧.

గళంతీశంభోత్వచ్చరితసరితఃకిల్బిషరజో।
దళంతీధీకుల్యాసరణిషుపతంతీవిజయతాం।
దిశంతీసంసారభ్రమణపరితాపోపశమనం।
వసంతీమచ్చేతోహ్రదభువిశివానందలహరీ॥

గీ॥ త్వచ్చరితనదినుండివెల్వడియెడంగ । కుల్యఁబడియఘరజముఁబోఁగొట్టితాప।
విహృతిఁజేయుశివానందలహరినాదు । హృదయహ్రదమునఁనొప్పుతనెప్పుడీశ॥ ౨.

త్రయీవేద్యంహృద్యంత్రిపురహరమాద్యంత్రినయనం।
జటాభారోదారంచలదురగహారంమృగధరం।
మహాదేవందేవంమయిసదయభావంపశుపతిం।
చిదానందంసాంబంశివమతివిడంబంహృదిభజే॥

చ॥ త్రినయను,నాద్యునిం,బశుపతిం,ఫణిహారిఁ,గురంగధారి,సాం।
బు,నతివిడంబు,దేవుని,శివున్,శ్రుతివేద్యుని,హృద్యుఁ,జిత్ప్రకా।
శునిఁ,గరుణానివేశు,రవిశోభిజటాధరునిం,బురప్రహా।
రుని,గిరిజామనోహరునిగూఢిగనామదిలోభజించెదన్॥ 3.

సహస్రంవర్తంతేజగతివిబుధాఃక్షుద్రఫలదా।
నమన్యేస్వప్నేవాతదనుసరణంతత్కృతఫలం।
హరిబ్రహ్మాదీనామపినికటభాజామసులభం।
చిరంయాచేశంభోశివతవపదాంభోజభజనం॥

చ॥ కొలఁదిఫలంబులీయభువిఁగోటులుదైవములున్నవారినేఁ।
గలనయినందలంప,క్షణకాలమువారలనాశ్రయింప,నే।
ఫలములుగోర,శర్వ! నినుఁబ్రార్థనఁజేసెదసన్నిధానవ।
స్తులయినయచ్యుతాదులకుదుర్లభమౌభవదంఘ్రిసేవకై॥ ౪.

స్మృతౌశాస్త్రేవైద్యేశకునకవితాగానఫణితౌ।
పురాణేమంత్రేవాస్తుతినటనహాస్యేష్వచతురః।
కథంరాజ్ఞాంప్రీతిర్భవతిమయికోహంపశుపతే।
పశుంమాంసర్వజ్ఞప్రథితకృపయాపాలయవిభో॥

చ॥ శ్రుతులనునాట్యహాస్యములస్తోత్రకవిత్వములందుశాస్త్రసం।
గతులనుమంత్రవైద్యములగానమునన్కుశలుండనంచునేఁ।
జతురుఁడఁగాను,నాపయినిక్ష్మాపతులేగతిఁబ్రీతియుంతురీ।
స్థితిఁబశుతుల్యుఁడంబశుపతీ!నను నీదయఁగావఁగావలెన్॥ ౫.

ఘటోవామృత్పిండోప్యణురపిచఘూమోగ్నిరచలః।
పటోవాతంతుర్వాపరిహరతికింఘోరశమనం।
వృథాకంఠక్షోభంవహసితరసాతర్కవచసా।
పదాంభోజంశంభోర్భజపరమసౌఖ్యంవ్రజసుధీః॥

చ॥ అనలముఘూమమద్రిఘుటమారయమృత్తుపటంబునూలునాఁ।
ఉనుపనుశబ్దముల్యమునిబాధలమాన్పఁజాలునేవృథా।
ఘనతరతర్కవాక్యములఁగంఠమతిశ్రమసేయనేల! గ్ర।
గ్గనసుమతీ!యుమాపతిపదంబుభజించిముదంబునొందుమా॥ ౬.

మనస్తేపాదాబ్జేనివసతువచస్స్తోత్రఫణితౌ।
కరశ్చాభ్యర్చాయాంశ్రుతిరపికథాకర్ణనవిధౌ।

తవధ్యానేబుద్ధిర్నయనయుగళేమూర్తివిభవం।
పరగ్రంథాన్కైర్వాపరమశివజానేపరమతః॥

మ॥ వచనంబుల్ స్తుతిఁ, జిత్తమంఘ్రులను, భావంబుం భవద్ధ్యానమం।
ద, చెవుల్నీకథలాలకింప, భవదీయాభ్యర్చ సేయంగరం।
బు, చమత్కారనిజాకృతింగనఁగనుల్మోదంబుతోనుండఁగా।
కచనన్నెటుగు త్తెఱుంగుదుఁబరగ్రంథంబులంబాధిపా॥ ౭.

యథాబుద్ధిశ్శుక్తౌరజతమితికాచాశ్మనిమణిః।
ర్జలేపైష్టేక్షీరంభవతిమృగతృష్ణాసుసలిలం।
తథాదేవభ్రాంత్యాభజతిభవదన్యంజడజనో।
మహాదేవేశంత్వాంమనసిచనమత్వాపశుపతే॥ ౮

గీ॥ పిండినీరుక్షీరముశుక్తివెండియెండ । మావులెల్లజలముగాజుమణియనియొడి।
భ్రాంతియెట్లట్లదేవతాభ్రాంతిజడుఁడు । నినునెఱుఁగకభవ!భవదన్యునిభజించు॥

గభీరేకాసారేవిశతివిజనేఘోరవిపినే।
విశాలేశైలేచభ్రమతికుసుమార్థంజడమతిః।
సమర్ప్యైకంచేతస్సరసిజముమానాథభవతే।
సుఖేనావస్థాతుంజనఇహనజానాతికిమహో॥

గీ॥ గిరులఁదిరుగు, ఘోరాటవినరయు, హర! గ । భీరకాసారములఁజేరు, విరులకొఱకు।
జడుఁడు, దరినున్నతనచిత్తసరసిజంబు । నీకునర్పించిసుఖమొందనేరఁడవుర॥ ౯.

నరత్వందేవత్వంనగవనమృగత్వంమశకతా।
పశుత్వంకీటత్వంభవతువిహగత్వాదిజననం।
సదాత్వత్పాదాబ్జస్మరణపరమానందలహరీ।
విహారాసక్తంచేద్ధృదయమిహకింతేనవపుషా॥

చ॥ నరమృగదంశకక్రిమివనత్రిదివేశవిహంగమావనీ।
ధరపశుముఖ్యజన్మములుతప్పకనాకిఁకఁగల్గుఁగాకయీ।
శ్వర! భవదీయపాదజలజద్వయసంస్మరణాశచేనిరం।
తరమును నామనంబెసఁగఁదక్కినదేహముచేతనేమగున్॥ ౧౦.

వటుర్వా గేహీ వా యతిరపి జటీ వా తదితరో।
నరో వా యః కశ్చిద్భవతు భవ కిం తేన భవతి।
యదీయం హృత్పద్మం యది భవదధీనం పశుపతే।
తదీయస్త్వం శంభో భవసి భవ భారం చ న వహసి॥

మ॥ వటువుం గేహి యతీశ్వరుండు జటియో వాఁడైనఁగానీ నరుం।
డెటులో యాశ్రమసద్విమార్గముల నేమాలాభమెవ్వానిస్రా।
కటహృత్పద్మము నీవశంబవునో వేడ్కన్వాని సంబంధివై।
స్ఫుటమౌ తద్భవభారమెల్ల నిరతంబుం దాల్తువీశ్వరా॥ ౧౧.

గుహాయాం గేహే వా బహిరపి వనే వాఽద్రిశిఖరే।
జలే వా వహ్నౌ వా వసతు వస తేః కిం వద ఫలం।
సదా యస్యైవాంతః కరణమపి శంభో తవ పదే।
స్థితం చేద్యోగోఽసౌ స చ పరమయోగీ స చ సుఖీ॥

ఉ॥ కొండలఁ గొమ్ములందనలకుండములన్గృహలందు నీటిలో।
నిండులపైటఁగా నవసియించిన నేమిఫలంబు మన్కిచేఁ।
గొంకొక కాలమే నిమదికోరికనీ చరణారవిందమం।
దుండు నొకాలయోగము దెయోగి యుతం డెసుఖాత్ముఁడీశ్వరా॥ ౧౨.

అసారే సంసారే నిజభజనదూరే జడధియా।
భ్రమంతం మామంధం పరమకృపయా పాతుముచితం।
మదన్యః కో దీనస్తవ కృపణరక్షాతినిపుణ।
స్త్వదన్యః కో వా మే త్రిజగతి శరణ్యః పశుపతే॥

ఉ॥ వన్నెగ నీదు పాదయుగభావవలేని యసారసంసృతిం।
గన్నులు గాన కే తిరుగు కష్టుసముంగృపఁ బ్రోవ మేలు నా।
కన్న నుదీనుఁ డెవ్వఁడు? జగంబున నీకు, ననుం భరింపనీ।
కన్న నురక్షకుం డెవఁడు గల్గఁడు నాకు, భుజంగభూషణా॥ ౧౩.

ప్రభుస్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే।
ప్రముఖ్యోఽహం తేషామపి కిము తబంధుత్వమనయోః।

త్వయైవక్షంతవ్యాశ్శివమదపరాధాశ్చసకలాః!
ప్రయత్నాత్కర్తవ్యంమదవనమియంబంధుసరణిః॥

ఉ॥ దీనులకెల్లబంధువగుదేవరవీవుతలంపనందునే।
దీనజనాగ్రగణ్యుఁడనిదేనునచుట్టరికం,బుపేక్షలోఁ।
బూనఁగనేల! నీదుదయపొందికనాయపరాధపంక్తులం।
బోనిడికావవయ్యయిదెపోధరబంధులరీతిధూర్జటీ॥ ౧౪.

ఉపేక్షానోచేత్కింనహరసిభవద్ధ్యానవిముఖాం।
దురాశాభూయిష్ఠాంవిధిలిఖిమశక్తోయదిభవాన్।
శిరస్తద్వైధాత్రంననఖలుసువృత్తంపశుపతే।
కథంవానిర్యత్నంకరనఖముఖేనైవలులితం॥

చ॥ మనుపనుపేక్షలేదనినమాటికినాశలఁగొల్పినీదుభా।
వనమిసుపుంతయుంగననిఫాలములోపలిధాత్రవ్రాతనే।
మనిహరియింపవైతివిమహాత్మ! యశక్తుఁడవన్న నెట్లుగో।
టనుబెకలించితీవదెకడంగివిధాతృశిరంబునీశ్వరా॥ ౧౫.

విరించిర్దీర్ఘాయుర్భవతుభవతాతత్పరశిరః।
శ్చతుష్కంసంరక్ష్యంసఖలుభువిదైన్యంలిఖితవాన్।
విచారఃకోవామేవిశదకృపయాపాతిశివతే।
కటాక్షవ్యాపారస్స్వయమపిచదీనావనపరః॥

చ॥ నలువచిరాయువౌనతనినాల్గుమొగంబులుబొల్చుఁగాతనీ।
వలననిజాస్యమొండుచిదుపంబడిబెగ్గిలితానువ్రాసెమో।
ములనతిదైన్యమీప్రజకుమున్కనినీదుకటాక్షవృత్తిదీ।
నులమనుపన్విచారములనుంగనుటేలనునాకులోనిఁకన్॥ ౧౬.

ఫలాద్వాపుణ్యానాంమయికరుణయావాత్వయివిభో।
ప్రసన్నేపిస్వామిన్భవదమలపాదాబ్జయుగళం।
కథంపశ్యేయంమాంస్థగయతినమస్సంభ్రమజుషాం।
నిలింపానాంశ్రేణిర్నిజకనకమాణిక్యమకుటైః॥

ఉ॥ వావిరినాదుపుణ్యపరిపాకముచేతనొనాపయింగృపా।
భావమునీకుఁగల్గుటనొస్వామిప్రసన్నుఁడవైతివున్నమ।
ద్దేవశిరఃకిరీటమణిదివ్యఘృణుల్లనుఁగప్పిపుచ్చెనిం।
కేవిధినీదుపాదములనేఁగనుఁగొందుశశాంకశేఖరా॥ ౧౭.

త్వమేకోలోకానాంపరమఫలదోదివ్యపదవీం।
వహంతస్త్వన్మూలాంపునరపిభజంతేహరిముఖాః।
కియద్వాదాక్షిణ్యంతవశివమదాశాచకియతీ।
కదావామద్రక్షాంవహసికరుణాపూరితదృశా॥

చ॥ నిజముఫలప్రదాతవవనీవెజగంబులకెల్లనచ్యుతా।
ద్యజరులునీదుమూలముననగ్ర్యపదంబులఁజెందివెండియుశా।
భజనయొనర్చుచుందురుభవద్దయకెద్దిమదాశకెద్దిహా।
గ్రుహ! జమునినన్నునీకరుణతోఁగనుటెప్పుడొమేరకార్ద్రకా॥ ౧౮.

దురాశాభూయిష్ఠేదురధిపగృహద్వారఘటకే।
దురంతేసంసారేదురితనిలయేదుఃఖజనకే।
మదాయాసంకింనవ్యపనయసికస్యోపకృతయే।
వదేయంప్రీతిశ్చేత్తవశివకృతార్థాఃఖలువయం॥

ఉ॥ చింతలఁగొల్పియాశలకుఁజిక్కఁగఁద్రోచిదురంతపాపము।
ల్సంతతఁగూర్చిదుర్నృపనిశాంతముఁజేర్చుభవంబునందుమే।
మెంతయుఁబుట్టిఁచచ్చుశ్రమమెవ్వరిమేలునకైహరింప! వో।
క్కింతయునట్టిప్రీతిఁగలదేనిఁగృతార్థులమాదుమీశ్వరా॥ ౧౯.

నదామోహాటవ్యాంచరతియువతీనాంకుచగిరౌ।
నటత్యాశాశాఖాస్వటతిఝడితిస్వైరమభితః।
కపాలిన్ భిక్షోమేహృదయకపిమత్యంతచపలం।
దృఢంభక్త్యాబధ్వాశివభవదధీనంకురువిభో॥

చ॥ పనిపడియాశలస్తరులఁబ్రాకుసతీకుచపర్వతంబులం।
దునఁజెరలాడుమోహమనుదొడ్డవనిందనయిచ్చనేగునా।

మనమను వానరంబి దెసమంజసభక్తిని నిల్వఁగట్టినీ।
వనయము నాదిభిక్షుకుఁడ వౌటను జేకొనుమీ వృషధ్వజా॥ ౨౦.

ధృతిస్తంభాధారాం దృఢగుణనిబద్ధాం సగమనాం।
విచిత్రాం పద్మాఢ్యాం ప్రతిదివససన్మార్గఘటితాం।
స్మరారే మచ్చేతస్స్ఫుటపటకుటీం ప్రాప్య విశదాం।
జయస్వామిన్ శక్త్యా సహ శివగణైస్సేవిత విభో॥

చ॥ ధృతియను స్తంభమొప్పఁ గదివ్యగుణత్రయబద్ధమైలస।
ద్గతియయి చిత్రమై విలసితస్థిరసత్పథసంయుతంబు సం।
తతకమలాఢ్యమై వెలయు నా హృదయంబు గుడారమందు వి।
శ్రుతగణసేవితుండవయి రూఢి వసింపుమి భర్గ దుర్గతోన్॥ ౨౧.

ప్రలోభాద్యైరర్థాహరణపరతంత్రో ధనిగృహే।
ప్రవేశోద్యుక్తస్సన్ భ్రమతి బహుధా తస్కరపతే।
ఇమం చేతశ్చోరం కథమిహ సహే శంకర విభో।
తవాధీనం కృత్వా మయి నిరపరాధే కురు కృపాం॥

గీ॥ లోభమున ధనికుల యిండ్లలోన దూరి। ధనమపహరింపఁదలఁచు నా మనము దొంగఁ।
బట్టఁజాలను నీవ చేపట్టి తస్క। రపతి కరుణింపుము నిరపరాధు నన్ను॥ ౨౨.

కరోమి త్వత్పూజాం సపది సుఖదో మే భవ విభో।
విధిత్వం విష్ణుత్వం దిశసి ఖలు తస్యాః ఫలమితి।
పునశ్చ త్వాం ద్రష్టుం దివి భువి వహన్ పక్షిమృగతాం।
మదృష్ట్వా తత్ఖేదం కథమివ సహే శంకర విభో॥

చ॥ ననువుగ నీదుపూజన మొనర్చెద సౌఖ్యమొసంగుమిప్పుడే।
ర్చనకు ఫలంబుగన్ విధిని శౌరిని గానొనరింతువే మొయొ।
య్యనదివి నీ భువిం బరమహంసవరాహశరీరముల్ధరిం।
చి నినుఁ గనంగ లేని మదిచింత నెటోర్తు నా చెప్పు శంకరా॥ ౨౩.

కదా వా కైలాసే కనకమణిసౌధే సహగణై।
ర్వసన్ శంభోరగ్రే స్ఫుటఘటితమూర్ధాంజలిపుటః।

విభోసాంబస్వామిన్ పరమశివపాహీతినిగదన్।
విధాతౄణాంకల్పాన్ క్షణమివవినేష్యామిసుఖతః॥

శా॥ కైలాసాద్రిఁజిరత్న రత్నవిలసత్కల్యాణసౌధంబున।
న్లీలన్నాంబునిమోలనిల్చినిజమాళింగేలుగీలించినేఁ।
బోలంగాఁబ్రమథాళితోఁగలిసిశంభోపాహియంచెప్పుడు।
ద్వేలోత్కంఠక్షణంబుగాగడుపుదునేవ్బ్రహ్మకల్పంబులన్॥ ౨౪.

స్తవైర్బ్రహ్మాదీనాంజయజయవచోభిర్నియమినాం।
గణానాంకేళీభిర్మదకలమహోక్షస్యకకుది।
స్థితంనీలగ్రీవంత్రినయనముమాశ్లిష్టవపుషం।
కదాత్వాంపశ్యేయంకరధృతమృగంఖండపరశుం॥

మ॥ చతురాస్య ప్రముఖామరస్తుతులుభాస్వద్యోగిపాళీజయా।
ద్భుతవాక్కుల్ప్రమథాళికేళికలనంబుల్ హెచ్చఁదీశు నె।
క్కొతగన్నీలగళంబుమేయెడమచక్కన్ దుర్గయున్ హస్తసం।
గతసారంగముగల్గునిన్నెపుడుముక్కంటీకనుంగొందునో॥ ౨౫.

కదావాత్వాందృష్ట్వాగిరిశతవభవ్యాంఘ్రియుగళం।
గృహీత్వాహస్తాభ్యాంశిరసినయనేవక్షసివహన్।
సమాశ్లిష్యాఘ్రాయస్ఫుటజలజగంధాన్పరిమళా।
నలభ్యాన్బ్రహ్మాద్యైర్ముదమనుభవిష్యామిహృదయే॥

చ॥ మొదటనినుంగనుంగొనిప్రమోదముతోభవదీయపాదము।
ల్పపడినాదుహస్తములఁబట్టిశిరంబుననేత్రయుగ్మమం।
దెదనుగదించితావులనహీనతమూర్కొనిపద్మజాదులొం:
దఁదరముగానిసౌఖ్యమమనంబుననెప్పుడుగందునోభవా॥ ౨౬.

కరస్థేహేమాద్రౌగిరిశనికటస్థేధనపతౌ।
గృహస్థేస్వర్భూజామరసురభిచింతామణిగణే।
శిరస్థేశీతాంశౌచరణయుగళస్థేఖిలశుభే।
కమర్థందాస్యేహంభవతుభవదర్థంమమమనః॥

చ॥ కరములమేరువుంబదయుగంబునసర్వశుభంబులున్నిరం।
తరముసమీపమందుఘననాథుఁడుమందిరమందుదేవతా।
తరువరసైచికీతతిసుధానిధిమూర్ధమునందునెంతయు।
స్ఫురఁగఁగనేమొసంగఁగలనామనమిచ్చెదనీకుమాపతీ॥ ౨౭.

సామీప్యంతవపూజనేశివమహాదేవేతిసంకీర్తనే।
సామీప్యంభవభక్తిధుర్యజనతాసాంగత్యసంభాషణే।
సాలోక్యంచచరాచరాత్మకతనుధ్యానేభవానీపతే।
సాయుజ్యంమమసిద్ధమత్రభవతిస్వామిన్కృతార్థోస్మ్యహం॥

శా॥ స్వామీ! తావకభక్తసంగతినినీసాలోక్యమింపొందు,నీ।
సామీప్యంబుభవా! భవన్నుతుల,నీశా! నీదుసారూప్యమెం।
తోమీపూజలొనర్పఁగా,గిరిశ! సాయుజ్యంబునీమూర్తిను।
ద్దామధ్యానముసేయుఁ,గావునఁగృతార్థత్వమ్మునేఁజెందితిన్॥ ౨౮.

త్వత్పాదాంబుజమర్చయామిపరమంత్వాంచింతయామ్యన్వహం।
త్వామీశంశరణంవ్రజామివచసాత్వామేవయాచేవిభో।
వీక్షాంమేదిశచాక్షుషీంసకరుణాందివ్యైశ్చిరంప్రార్థితాం।
శంభోలోకగురోమదీయమనసస్సౌఖ్యోపదేశంకురు॥

క॥ నినుఁగొలిచెదఁదలఁచెదశర । ణనుకొందెదవేఁడెదననవరతమునునా।
మనమునకుసుఖమొసఁగుసుర । మునికాంక్షితసత్కటాక్షమునఁగనుముశివా॥ ౨౯.

వస్త్రోద్ధూతవిధౌసహస్రకరతాపుష్పార్చనేవిష్ణుతా।
గంధేగంధవహాత్మతాన్నపచనేబర్హిర్ముఖాధ్యక్షతా।
పాత్రేకాంచనగర్భతాస్తిమయిచేద్బాలేందుచూడామణే।
శుశ్రూషాంకరవాణితేపశుపతేస్వామింస్త్రిలోకీగురో॥

చ॥ అనిలుఁడనైనగంధము,సహస్రకరత్వముగల్గవస్త్రము।
ల్వనజజభావమబ్బిననుబాత్రలఁబంకజనాభభావమ।
బ్బినఁగుసుమంబులింద్రతిలభించినవండినవంటకంబునాఁ।
జనుచుచిరోపచారములసల్పెదస్వామిత్రిలోకబాంధవా॥ ౩౦.

నాలంవాపరమోపకారకమిదం త్వేకంపశూనాంపతే।
పశ్యన్కుక్షిగతాంశ్చరాచరగణాన్బాహ్యస్థితాన్రక్షితుం।
సర్వామర్త్యపలాయనౌషధమతిజ్వాలాకరంభీకరం।
నిక్షిప్తంగరళంగళేనగిళితంనోద్గీర్ణమేవత్వయా॥

ఉ॥ ఈపరమోపకారమొకటే ప్రకటంబుగఁజాలదాఘృతా।
భ్రాపగలో వెలింగలచరాచరజాలముఁబ్రోవనుగ్రకీ।
లాపటలంబునిర్జరపలాయనకౌషధమూనిషంబుసం।
స్థాపనఁజేసికుక్షికసవాశివమింగవుగ్రక్కవెప్పుడున్॥ 3౧.

జ్వాలోగ్రస్సకలామరాతిభయదఃక్ష్వేళఃకథంవాత్వయా।
దృష్టఃకించకరేధృతఃకరతలేకింపక్వజంబూఫలం।
జిహ్వాయాంనిహితశ్చసిద్ధఘుటికావాకంఠదేశేభృతః।
కింతేనీలమణిర్విభూషణమయంశంభోమహాత్మన్వద॥

ఉ॥ జ్వాలలఁగ్రాలిదేవభయవర్ధనమూవిషమెట్లుమాచితో।
కేలధరించితేవుపుడఁకింపఁగనేరేడుబండొలేకనీ।
నాలుకఁజేర్చితేవదికనంబరమౌషధమోగళంబునం।
దాలిచినావునీలమణినాయకహారమొచెప్పుమీశ్వరా॥ 3౨.

నాలంవాసకృదేవదేవభవతస్సేవానతిర్వానుతిః।
పూజావాస్మరణంకథాశ్రవణమప్యాలోకనంమాదృశాం।
స్వామిన్నస్థిరదేవతానుసరణాయాసేనకింలభ్యతే।
కావాముక్తిరితఃకుతోభవతిచేత్కింప్రార్థనీయంతదా॥

ఉ॥ తావకదర్శనంబునుతితత్త్వకథాశ్రవణంబుపూజనం।
సేవయుధ్యానముంబ్రణతిసేయుటలోకించుకమాకుముక్తికిం।
ద్రోవలుజూపఁజాలెడునిరూఢిగనస్థిరదేవతార్చనం।
బావలసేయునేమిఫలమబ్బునుగోరెడిదేమిశంకరా॥ 33.

కింబ్రూమస్తవసాహసంపశుపతేశంభోభవ।
ధైర్యంచేదృశమాత్మనస్థితిరియంచాన్యైఃకథంలభ్యతే।

త్రస్యద్దేవగణంత్రసన్మునిగణంనశ్యత్ప్రపంచంలయం।
పశ్యన్నిర్భయఏకఏవవిహరత్యానందసాంద్రోభవాన్॥

చ॥ ఇలపయినీదుసాహసమునేమనవచ్చునుగల్గునేరికిఁ।
తలఁపునుధైర్యపద్ధతిపదస్థితిఁదప్పిసురల్మునుల్భయా।
కులులయిసన్నగిల్లినరకోటులునుండులయంబుఁగాంచిభీ।
తిలకొకయింతహర్షజలధిన్విహరింతువొకండవీశ్వరా॥ ౩౪.

యోగక్షేమధురంధరస్యసకలశ్రేయఃప్రదోద్యోగినో।
దృష్టాదృష్టమతోపదేశకృతినోబాహ్యాంతరవ్యాపినః।
సర్వజ్ఞస్యదయాకరస్యభవతఃకింవేదితవ్యంమయా।
శంభోత్వంపరమాంతరంగఇతిమేచిత్తేస్మరామ్యన్వహం॥

మ॥ కరుణాళుండవుసౌఖ్యసత్కృతివియోగక్షేమనిర్వాహివ।
త్యురుబాహ్యాంతరవర్తనుండవుమహాయోగ్యేహికాముష్మికాం।
తరుపాయజ్ఞుఁడవైననీకునునివేద్యంబెద్దినాచేతనిన్।
స్మరియింతుంబరమాంతరంగునిగనేసర్వజ్ఞసార్వత్రంబునన్॥ ౩౫.

భక్తోభక్తిగుణావృతేముదమృతాపూర్ణేప్రసన్నేమనః।
కుంభేసాంబతవాంఘ్రిపల్లవయుగంసంస్థాప్యసంవిత్ఫలం।
సత్వంమంత్రముదీరయన్నిజశరీరాగారశుద్ధింవహన్।
పుణ్యాహంప్రకటీకరోమిరుచిరంకల్యాణమాపాదయన్॥

చ॥ ముదమృతపూరితంబమలముంబరిభక్తిగుణావృతంబునై।
పొదలుమనోఘటంబుపయిఁబూనికజ్ఞానఫలంబునీశస।
త్పదకిసలంబునుంచివిధిఁదప్పకసాత్వికమంత్రయుక్తిఁజే।
యుదుశుభవాచనంబునుమహోన్నతినేగృహదేహశుద్ధికై॥ ౩౬.

ఆమ్నాయాంబుధిమాదరేణసుమనస్సంఘాస్సముద్యన్మనో।
మంథానందృఢభక్తిరజ్జుసహితంకృత్వామథిత్వాతతః।
సోమంకల్పతరుంసుపర్వసురభించింతామణింధీమతాం।
నిత్యానందసుధాంనిరంతరరమాసౌభాగ్యమాతన్వతే॥

మ॥ సుమనస్సంఘము భక్తిరజ్జువృతిచేసొంపొందు డెందంబుక।
వ్వముతో వేదసముద్రముం దఱువఁగాఁ బ్రాపించు సోమామరా।
గమచింతామణి కామధేను కమలాకాంతామృతానందభా।
గ్యములం గాంచు ననుగ్రహక్రమంబున నగంగాం చజ్జటామండలా॥ 3౮.

ప్రాప్పుణ్యాచలమార్గదర్శితసుధామూర్తిః ప్రసన్నశ్శివ।
స్సోమస్సద్గణసేవితో మృగధరః పూర్ణస్తమోమోచకః।
చేతఃపుష్కరిణిస్థితో భవతి చేదానందపాథోనిధిః।
ప్రాగల్భ్యేన విజృంభతే సుమనసాం వృత్తిస్తథా జాయతే॥

మ॥ ప్రథితప్రాక్సుకృతాద్రిదర్శితసుధాభాసుండు సంపూర్ణుఁడే।
ణఘనుండాశ్రితసద్గణుండమలుఁడున్రాజత్తమోమోచకుం।
డుదగన్సోముఁడు చిత్తపుష్కరమునం దుండంగఁ జిన్నమ్ముదో।
దధిపొంగన్విబుధేంద్రులందుమునుఁగం బిర్కొంపకే శాశ్వతా॥ 3౯.

ధర్మో మే చతురంఘ్రికస్సుచరితః పాపం వినాశంగతం।
కామక్రోధమదాదయో విగళితాః కాలాస్సుఖావిష్కృతాః।
జ్ఞానానంద్యమహౌషధిస్సుఫలితా కైవల్యనాథే సదా।
మాన్యే మానసపుండరీకనిలయే రాజావతంసే స్థితే॥

ఉ॥ మానసపుండరీకపురిమాటికి రాజకిరీటి మొప్పఁబె।
న్నాణువతో మదాద్యరులు క్రమ్మందిరి ధర్మము నాల్గుపాదము।
ల్గానొనఁగూడెఁ గాలము సుఖప్రదమయ్యెఁ దొలంగెఁ దాపముల్।
జ్ఞానమహౌషధీలతఫలంబులు లొసంగె భుజంగభూషణా॥ 3౯.

ధీయంత్రేణ వచోఘటేన కవితాకుల్యోపకుల్యాక్రమై।
రానీతైశ్చ సదాశివస్య చరితాంభోరాశిదివ్యామృతైః।
హృత్కేదారయుతాశ్చ భక్తికలమాస్సాఫల్యమాతన్వతే।
దుర్భిక్షాన్మమ సేవకస్య భగవన్విశ్వేశ భీతిః కుతః॥

మ॥ భువిధీయంత్రము చేతవాగ్ఘటఘటంబున్ముంచి చేదన్సదా।
శివదివ్యచ్చరితాబ్ధివారికవితాశ్రీకుల్యలం బాఱిహృ।

న్నవకేదారములందుఁబూర్ణమయినంతన్ భక్తిసస్యంబుసం।
భవమైపండభయంబునాకగునెక్షేమంబన్నవిశ్వేశ్వరా॥ ౮౦.

పాపోత్పాతవిమోచనాయరుచిరైశ్వర్యాయమృత్యుంజయ।
స్తోత్రధ్యాననతిప్రదక్షిణసపర్యాలోకనాకర్ణనే।
జిహ్వాచిత్తశిరోంఘ్రిహస్తనయనశ్రోత్రైరహంప్రార్థితో।
మామాజ్ఞాపయతన్నిరూపయపునర్మామేపయాచేవచః॥

మ॥ దురితంబుల్వదలింపసంపదలఁదోడ్తోనింపఁగానీదుసం।
స్మరణస్తోత్రనతిప్రదక్షిణసమర్చాదర్శనాకర్ణన।
స్థిరకర్మంబులనాదుచిత్తరసనాశీర్షాంఘ్రిహస్తాక్షిక।
ర్ణకృతింజేయఁగనేర్పరింపుమిటులేఁప్రార్థింతుమృత్యుంజయా॥ ౮౧.

గాంభీర్యంపరిఖాపదంఘనధృతిఃప్రాకారఉద్యద్గుణ।
స్తోమశ్చాప్తబలంఘనేంద్రియచయోద్వారాణిదేహస్థితః।
విద్యావస్తుసమృద్ధిరిత్యఖిలసామగ్రీసమేతేసదా।
దుర్గాతిప్రియదేవమామకమనోదుర్గేనివాసంకురు॥

మ॥ వరగాంభీర్యమగడ్తధైర్యములసత్ప్రాకారముద్యద్గుణో।
త్కరమత్యాప్తబలంబులింద్రియములేద్వారంబులైయుండిభా।
స్వరవిజ్ఞానపదార్థవృద్ధిగలనాస్వాంతంబుదుర్గంబునం।
గరుణావేశముతోవసింపుమిసదాకల్యాణదుర్గప్రియా॥ ౮౨.

మాగచ్ఛస్త్వమితస్తతోగిరిశభోమయ్యేవవాసంకురు।
స్వామిన్నాదికిరాతమామకమనఃకాంతారసీమాంతరే।
వర్తంతేబహుశోమృగామదజుషోమాత్సర్యమోహాదయ।
స్తాన్హత్వామృగయావినోదరచితాలాభంచసంప్రాప్స్యసి॥

ఉ॥ ఎందులకైననేగుటకదియొందులకిందెవసింపుసామినా।
డెందముకాననంబునఁగడిందిమృగంబులుమోహముఖ్యముల్।
గ్రందుకయుండెనాదిమకిరాతుఁడవానినిడిందఁజేసినీ।
వందుదువిందుమౌళిమృగయారతిచేనిరవొందులాభముల్॥ ౮౩.

కరలగ్నమృగః కరీంద్రభంగో।
ఘనశార్దూలవిఖండనోస్తజంతుః।
గిరిశో విశదాకృతిశ్చ చేతః।
కుహరే పంచముఖోస్తి మే కుతో భీః॥

క॥ కరలగ్నమృగుఁడు కరిసం । హరుఁడల శార్దూలహారి యమలుఁడు గిరిశుం।
డురుపంచముఖుఁడు హృదయకు । హరమున వసియింపఁగా భయము నాకేలా॥ ౪౪.

ఛందశ్శాఖిశిఖాన్వితై ర్ద్విజవరైస్సంసేవితే శాశ్వతే।
సౌఖ్యాపాదిని ఖేదభేదిని సుధాసారైః ఫలై ర్దీపితే।
చేతఃపక్షిశిఖామణే త్యజ వృథాసంచారమన్యైరలం।
నిత్యం శంకరపాదపద్మయుగళీనీడే విహారం కురు॥

ఉ॥ వేదమహీజశాఖలను వ్రేలి ద్విజాశ్రయమై సదాసుఖా।
పాదియు ఖేదభేదియు యిభవ్యఫలాంచితమైన మారజి।
త్పాదసరోజనీడమున బంధురకేళి వసించుమందుమీ।
వాదట వ్యర్థమా విహృతి నందుట మానిమనోవిహంగమా॥ ౪౫.

ఆకర్ణే నఖరాజికాంతివిభవై రుద్యత్సుధావైభవై।
రాధౌతేపి చ పద్మరాగలలితే హంసవ్రజై రాశ్రితే।
నిత్యం భక్తివధూగణైశ్చ రహసి స్వేచ్ఛావిహారం కురు।
స్థిత్వా మానసరాజహంస గిరిజానాథాంఘ్రిసౌధాంతరే॥

చ॥ రుచిరసుధామహావిభవరూఢము, చంద్రనఖవ్రజోల్లస।
ద్రుచికలితంబు, హంసచయరుద్ధము, పంకజరాగదీప్తమా।
నచలసుతాధిపాంఘ్రియుగహర్మ్యమునన్వసియింపుమానస।
ప్రచురమరాళరాజ తనివారకభక్తిసతీయుతంబుగన్॥ ౪౬.

శంభుధ్యానవసంతసంగిని హృదారామేఘజీర్ణచ్ఛదా।
స్రస్తాభక్తిలతాచ్ఛటావిలసితాః పుణ్యప్రవాళశ్రితాః।

దీవ్యంతేగుణకోరకాజపవచఃపుష్పాణిసద్వాసనా।
జ్ఞానానందసుధామరందలహరీసంవిత్ఫలాభ్యున్నతిః॥

చ॥ చనవునశంభుయోగమనుచైత్రుఁడురానఘజీర్ణపర్ణము।
ల్పనివడిరాలభక్తియనువల్లులుపుణ్యకిసాలముల్గనా।
భినవకకోరకంబులతిపేశలవాక్సుమముల్సుకర్మవా।
సనయునుముద్మరందమునుజ్ఞానఫలంబునునొప్పెహృద్వనిన్॥ ౪౭.

నిత్యానందరసాలయంసురమునిస్వాంతాంబుజాతాశ్రయం।
స్వచ్ఛంసద్గణసేవితంకలుషహృత్సద్వాసనావిష్కృతం।
శంభుధ్యానసరోవరంవ్రజమనోహంసావతంసస్థిరం।
కింక్షుద్రాశ్రయపల్వలభ్రమణసంజాతశ్రమంప్రాప్స్యసి॥

చ॥ అలయుద్విజాశ్రయంబమలమంచితహర్షరసాలయంబుదు।
ష్కలుషహరంబువాసితముసన్మునినిర్జరరాజచిత్తప।
ద్మలలితమైనయీశ్వరునిధ్యానసరోవరమొప్పక్షుద్రప।
ల్వలములకేలయేగిశ్రమలన్భ్రమియింతుమనోమరాళమా॥ ౪౮.

ఆనందామృతపూరితాహరపదాంభోజాలవాలోద్యతా।
స్థైర్యోపఘ్నముపేత్యభక్తిలతికాశాఖోపశాఖాన్వితా।
ఉచ్చైర్మానసకాయమానపటలీమాక్రమ్యనిష్కల్మషా।
నిత్యాభీష్టఫలప్రదాభవతుమేసత్కర్మసంవర్ధితా॥

మ॥ అలయీశానపదాలవాలముననిత్యానందదివ్యోదకం।
బులునిండింపఁగధైర్యభావమునుప్రాపుంజెందిశాఖోపశా।
ఖలతోడెందముపందిరింగదిసిసత్కర్మాళిఁబెంపొందికే।
వలముక్తిలతామతల్లియొసఁగువాంఛాఫలాభ్యున్నతుల్॥ ౪౯.

సంధ్యారంభవిజృంభితంశ్రుతిశిరస్థానాంతరాధిష్ఠితం।
సప్రేమభ్రమరాభిరామమసకృత్సద్వాసనాశోభితం।

భోగీంద్రాభరణం సమస్తసుమనః పూజ్యం గుణావిష్కృతం।
సేవే శ్రీగిరిమల్లికార్జునమహాలింగం శివాలింగితం॥

శా॥ సాయంకాలవిజృంభితున్ శ్రుతిశిరస్థానాంతరాధిష్ఠితుం।
గాయాలింగితదుగ్ధభోగివరజాగ్రద్భూషుసద్భాసనా।
శ్రేయస్సన్మనఃప్రపూజ్యు భ్రమరాశ్లిష్టున్ గుణోత్కృష్టు మే।
శ్రేయున్ శ్రీగిరిమల్లికార్జునమహాలింగాత్ము సేవించెదన్॥ ౫౦.

భృంగీచ్ఛానటనోత్కటః కరిమదగ్రాహీస్ఫురన్మాధవా।
హ్లాదో నాదయుతో మహాసితవపుః పంచేషుణాచాదృతః।
సత్పక్షస్సుమనోవనేషు సపునస్సాన్తో న దీయే మనో।
రాజీవే భ్రమరాధిపో విహరతాం శ్రీశైలవాసీ విభుః॥

మ॥ సుమనఃపక్షుఁడు నాదయుక్తుఁడు సుమేషుప్రీతుఁడున్ మాధవా।
భిమతస్నేహుఁడు సన్మహాసితతనూపేతుండు శ్రీశైలగే।
హిమహావంతిమదగ్రహుండు ఘనభృంగీచ్ఛానటుం డెవ్వఁడా।
భ్రమరాధ్యక్షుఁడు మన్మనఃప్రవిమలాబ్జంబందుఁ గ్రీడించుతన్॥ ౫౧.

కారుణ్యామృతవర్షిణం ఘనవిపద్గ్రీష్మచ్ఛిదాకర్మఠం।
విద్యాసస్యఫలోదయాయ సుమనస్సంసేవ్యమిచ్ఛాకృతిం।
నృత్యద్భక్తమయూరమద్రినిలయం చంచజ్జటామండలం।
శంభో వాంఛతి నీలకంధర సదా త్వాం మే మనశ్చాతకః॥

చ॥ దురితవిపన్నిదాఘములఁ ద్రోయఁగలాకలమంబు పండను।
ర్వరసుమనస్తతుల్గొలువ గ్రాపముఁ జెందిజటాళిఁ దాల్చి సు।
స్థిరకరుణారసంబులను జిమ్ముచు భక్తశిఖుల్నటింపఁగా।
స్వరుని నుఁగోరు నాహృదయచాతక మెప్పుడు నీలకంధరా॥ ౫౨.

ఆకాశేన శిఖీ సమస్తఫణినాం నేత్రా కలాపీ నతా।
నుగ్రాహి ప్రణవోపదేశనిరతైః కేకీతి యో గీయతే।
శ్యామాం శైలసముద్భవాం ఘనరుచిం దృష్ట్వా నటంతం ముదా।
వేదాంతోపవనే విహారరసికం తం నీలకంఠం భజే॥

సీ॥ ఆకాశమునశిఖి యఖిలఫణిశిఖామణులచేఁగ్రాలపియుఁగలితనిత।
జనతాత్యనుగ్రాహిశాశ్వతప్రణవోపదేశశబ్దంబుచేదిశలఁగేక।
యువఁబ్రకాశించెనేగుణఖనిశ్రుతిశిఖరోద్యానవనమునసుష్యమమున।
సుఖవిహారరసికముఖుఁడెవ్వాఁడోశిఖరిసంభవశ్యామఘనరుచిఁగని।
యధికసంతోషపారవశ్యంబుచేత । నృత్యముంబూనిచరియించునెవ్వఁడట్టి।
నిన్నునాహ్లాదయుంబుననీలకంఠ । భజనఁజేయుదునిశంబుభక్తితోడ॥ ౫౩.

సంధ్యాఘర్మదినాత్యయోహరికరాఘాతప్రభూతానక।
ధ్వానోవారిదగర్జితందివిషదాందృష్టిచ్ఛటాచంచలా।
భక్తానాంపరితోషబాష్పవితతిర్వృష్టిర్మయూరీశివా।
యస్మిన్నుజ్జ్వలతాండవంవిజయతేతంనీలకంఠంభజే॥

శా॥ సాయంకాలమువర్షవాసరమువిష్వక్సేనహస్తాహతో।
ధ్వాయాతానకఘోషగర్జసురవీక్షాళుల్తటిత్తుల్సభ।
క్త్యశ్రుత్తాశులువృష్టిపార్వతిమయూర్యగ్రీనమైయొప్పనిన్
త్యాయోగంబుచెలంగునోకొలుతునేనానీలకంఠున్మదిన్॥ ౫౪.

ఆద్యాయామితతేజసేశ్రుతిపదైర్వేద్యాయసాధ్యాయతే।
విద్యానందమయాత్మనేత్రిజగతస్సంరక్షణోద్యోగినే।
ధ్యేయాయాఖిలయోగిభిస్సురగణైర్గేయాయమాయావినే।
సమ్యక్తాండవసంభ్రమాయజటినేసేయంనతిశ్శంభవే॥

శా॥ విద్యానందమయాత్మకుండుశ్రుతిసంవేద్యుండుమాయావిని।
శ్యాద్యుండద్భుతతేజుఁడగ్ర్యవిబుధార్యధ్యేయుఁడుల్లోకర।
క్షోద్యోగుండునుభక్తసాధ్యుఁడుమహాయోగీశగేయుండునం।
ధ్యేయవ్యక్తనుఁడైనశంభునకుమ్రొక్కొప్పన్జటాంధారికిన్।। ౫౫.

నిత్యాయత్రిగుణాత్మనేపురజితేకాత్యాయనీశ్రేయసే।
సత్యాయాదికుటుంబినేమునిమనఃప్రత్యక్షచిన్మూర్తయే।
మాయాసృష్టజగత్త్రయాయసకలామ్నాయాంతసంచారిణే।
సాయంతాండవసంభ్రమాయజటినేసేయంనతిశ్శంభవే॥

చ॥ పురహర నిత్యసత్వ ఘన బుద్ధ మునీశ్వరమానసాంతర।
స్ఫురిత చిదాత్మక త్రిగుణ శోభిత యాదికుటుంబివేదసం।
చరణ యుగామతపఃఫల విశాలజటాల ప్రదోషనర్తనా।
కర నిజశక్తి కల్పిత జగత్త్రియ శంభుఁడనీకువందనముల్॥ ౫౬.

నిత్యంస్వోదరపోషణాయసకలానుద్దిశ్యవిత్తాశయా।
వ్యర్థంపర్యటనంకరోమిభవతస్సేవాంనజానేవిభో।
మజ్జన్మాంతరపుణ్యపాకబలతస్త్వంశర్వసర్వాంతర।
స్తిష్ఠస్యేనహిాకేనవాపశుపతేతేరక్షణీయోస్మ్యహం॥

(X)

చ॥ స్థిరమునిజోదరావనముసేయఁగవందఱఁగూర్చి నేనిరం।
తరముధనాశచేతనువృథాప్రచరించెదనీదుసేవనే।
జరుపనుదీనిపూర్వభవసంచితపుణ్యబలంబుచేతశం।
కరసకలాంతరస్థుఁడవుగావుననన్నుభరింపఁగాఁదగుఁ॥ ౫౭

ఏకోవారిజబాంధవఃక్షితినభోవ్యాప్తంతమోమండలం।
భిత్వాలోచనగోచరోపిభవతిత్వంకోటిసూర్యప్రభః।
వేద్యఃకింనభవస్యహోఘనతరంకీదృగ్భవేత్తత్తమ।
స్తత్సర్వంవ్యపనీయమేపశుపతేసాక్షాత్ప్రసన్నోభవ॥

ఉ॥ వారిజబంధుఁడొక్కఁడెనభంబునభూమినివ్యాప్తమైనవి।
స్తారతమంబుఁబోనడఁచితాఁగనుపట్టునుగోటిసూర్యవి।
స్ఫారవిభుండవయ్యుఁగనుపట్టవుమత్తమమార్పవేమిని।
వారమహేశ? తత్తమమువార్చిప్రసన్నతనాకుఁజూపుమీ॥ ౫౮.

హంసఃపద్మవనంసమిచ్ఛతియథానీలాంబుదంచాతకః।
కోకఃకోకనదప్రియంప్రతిదినంచంద్రంచకోరస్తథా।
చేతోవాంఛతిమామకంపశుపతేచిన్మార్గమృగ్యంవిభో।
గౌరీనాథభవత్పదాబ్జయుగళంకైవల్యసౌఖ్యప్రదం॥

చ॥ కుముదహితుంజకోరకముకోకముఁగోకనదప్రయుస్మరా।
ళమునళినీవనంబునువలాహకజాలముఁజాతకంబునే।

క్రమమునఁ గోరు మోయటుల ఖర్వసుఖప్రదమాగమాంతమ్ము।
గ్యమగు భవత్పదాంబుజయుగంబును నామది గోరునీశ్వరా॥ ౫౯.

రోధస్తోయహృతశ్శ్రమేణ పథికశ్ఛాయాంతరోర్వృష్టితః।
భీతస్స్వస్థగృహం గృహస్థమతిథిర్దీనః ప్రభుం ధార్మికం।
దీపం సంతమసాకులశ్చ శిఖినం శీతావృతస్త్వం తథా।
చేతస్సర్వభయాపహం వ్రజ సుఖం శంభోః పదాంభోరుహం॥

చ॥ అతిథి గృహస్థునిం బథికుఁడా తఱి మందరుమూలముం దవమో।
వృతుఁడు రదీపముం జలికి నే దెసవాఁడనలంబు వార్ధఘా।
ధృతుఁడు తటంబు దీనుఁడు వదాన్యుని వర్షభయుండు సద్గృహా।
స్థితిఁ గను మాడ్కిఁ జెందు మొగిచిత్తమ సాంబుపదాంబుజంబులన్॥ ౬౦

అంకోలం నిజబీజసంతతిరయస్కాంతోపలం సూచికా।
సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం సింధుస్సరిద్వల్లభం।
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం।
చేతోవృత్తిరుపేత్య తిష్ఠతి సదా సా భక్తిరిత్యుచ్యతే॥

ఉ॥ చేడెలు భర్తలల్లతలు చెట్టుల సూదులు సూదుటీరాతిన।
యేర్యాడుగు విత్తులత్తరువు నోలిఁ గుల్కడలిన్ దగుల్కొట్టుగాఁ।
గూడు నెయట్టులే నిమది కోరిక నీచరణారవిందము।
లీడక యుండు నోయది యవిశ్రుత భక్తి సుమీ మహేశ్వరా॥ ౬౧.

ఆనందాశ్రుభిరాతనోతి పులకం నైర్మల్యతశ్ఛాదనం।
వాచాశంఖముఖే స్థితైశ్చ జఠరాపూర్తిం చరిత్రామృతైః।
రుద్రాక్షైర్భసితేన దేవ వపుషో రక్షాం భవద్భావనా।
పర్యంకే వినివేశ్య భక్తిజననీ భక్తార్భకం రక్షతి॥

సీ॥ ప్రస్ఫుటసంతోషబాష్పధారాపూరమున నెగగుర్పాటుఁ గలుగఁజేసి।
నిర్మలభావంబనెడి వస్త్రమును గప్పి వాక్శంఖముఖమున వరలుచుండు।
చరితామృతంబుల జఠరపూర్తియొనర్చి యొడల నేదోషము లొందకుండ।
లీల రుద్రాక్షమాలికల విభూతి చేనధికరక్షాబంధ మమరఁగట్టి।

దేవభవదీయభావనాదీప్యమాన । యంత్రపర్యంకమందుఁబరుండఁబెట్టి।
భక్తజననిభక్త్యార్భకుఁబ్రజలఁజేయు । నందికాసనాధప్రమథాధినాథ॥ ౬౨.

మార్గావర్తితపాదుకాపశుపతేరంగస్యకూర్చాయతే।
గండూషాంబునిషేచనంపురరిపోర్దివ్యాభిషేకాయతే।
కించిద్భక్షితమాంసశేషకబళంనవ్యోపహారాయతే।
భక్తిఃకింనకరోత్యహోవనచరోభక్తావతంసాయతే॥

చ॥ శితిగళుస్కిన్నమందునభిషేకముపుక్కిటనీరమయ్యెభ।
క్షితముగుమాంసశేషమువిశేషునివేదితమయ్యెఁబార్వతీ।
పతికినికూర్చయయ్యెనడువందగుపాదుకభక్తుఁడయ్యెసం।
తతముకిరాతుఁడేమఁడియొనర్పదొయీశ్వరభక్తియద్దిరా॥ ౬౩.

వక్షస్తాడనమంతకస్యకఠినాపస్మారసంమర్దనం।
భూభృత్పర్యటనంనమత్సురశిరఃకోటీరసంఘర్షణం।
కర్మేదంమృదులస్యతావకపదద్వంద్వస్యగౌరీపతే।
మచ్చేతోమణిపాదుకావిహరణంశంభోసదాంగీకురు॥

ఉ॥ అంతకుఱొమ్ముఁగ్రుమ్ముటయుశైలమునందుఁజరించుటయున్నమత్సురా।
క్రాంతకిరీటమణికర్షితమోదికమర్దనంబుల
స్వంతతదుష్కృతియంగసఁగఁజాలదునీవ్రుగుపద్యగఁబునా।
స్వాంతమణిప్రపాదుకలదైనిడిసల్పువిహారమున్శివా॥ ౬౪.

వక్షస్తాడనశంకయావిచలితోవైవస్వతోనిర్జరాః।
కోటీరోజ్జ్వలరత్నదీపకళికానీరాజనంకుర్వతే।
దృష్ట్వాముక్తివధూస్తనోతినిభృతాశ్లేషంభవానీపతే।
యచ్చేతస్తవపాదపద్మభజనంతస్యేహకిందుర్లభం॥

ఉ॥ ఎవ్వఁడుచిత్తవృత్తినిమహేశ్వరతావకపాదసేవన।
మ్మివ్వటిలంగఁజేయునతనింగనికాలుఁడుగ్రుమ్మునంములో।
నెవ్వగఁజెందునిర్జరులునేర్మినివాళులొసంగమూళులన్।
జవ్వనఁబొందుముక్తియనుజవ్వనిదుర్లభమెద్ది? వానికిన్॥ ౬౫.

క్రీడార్థంసృజసిప్రపంచమఖిలక్రీడామృగాస్తేజనాః।
యత్కర్మాచరితంమయాచభవతఃప్రీత్యైభవత్యేవతత్।
శంభోస్వస్యకుతూహలస్యకరణంమచ్చేష్టితంనిశ్చితం।
తస్మాన్మామకరక్షణంపశుపతేకర్తవ్యమేవత్వయా॥

శా॥ క్రీడార్థంబుసృజింతువెల్లజగముల్క్రీడామృగంబుల్జనుల్।
జ్జూడన్నీకును నేనొనర్చుపను లెచ్చోటన్నినుంగూర్చియే।
జూడన్నాదగువృత్తినీప్రమదభావస్వర్ధేతులౌఁగానఁగా।
పాడందప్పదునీకునన్నుపుతుమవ్వంబొప్పగంగాధరా॥ ౭౭.

బహువిధపరితోషబాష్పపూరః।
స్ఫుటపులకాంకితచారుభోగభూమిం।
చిరపదఫలకాంక్షిసేవ్యమానాం।
పరమసదాశివభావనాంప్రపద్యే॥

క॥ ఆనందబాష్పపులకా । స్థానంబైచిరఫలార్థిసంసేవ్యంబై।
జానొందునుమాచరణ । ధ్యానంబున్నేనుశరణమందెదనెదలోన్॥ ౭౮.

అమితముదమృతంముహుర్దుహంతీం।
విమలభవత్పదగోష్ఠమావహంతీం।
సదయపశుపతేసుపుణ్యపాకాం।
మమపరిపాలయభక్తిధేనుమేకాం॥

గీ॥ అమితమైనముదమృతపానమునొనర్చి । రమణభవదీయపాదగోష్ఠముననిల్చి।
యమరునత్పుణ్యఫలభక్తివిమలగోవు । నుమహితదయారసమునఁబ్రోవుముపశుపతి॥

జడతాపశుతాకళంకితా । కుటిలచరిత్వంచనాస్తిమయిదేవ।
అస్తియదిరాజమౌళే । భవదాభరణస్యనాస్తికింపాత్రం॥

క॥ దేవా! జడతకుటిలచర । భావంబుకళంకితయునుబశుతయునాకు।
న్లేవివియొయున్ననీభూ । షావిధికినిరాజమౌళిశక్తుఁడఁగానే॥ ౭౯.

అరహసిరహసిస్వతంత్రబుద్ధ్యా।
రివవసితుంసులభః ప్రసన్నమూర్తిః।
అగణితఫలదాయకః ప్రభుర్మే।
జగదధికోహ్యాదిరాజశేఖరోఽస్తి॥

క॥ అగణితఫలదాయకుఁడుం । జగదధికుఁడు ప్రభుఁడు సుప్రసన్నశరీరుం।
డగు రాజశేఖరుఁడెడఁజె । లఁగిలో వెలి సేవలకు సులభుఁడయియుండెన్॥ ౨౦.

ఆరూఢభక్తిఫలకుంచితభావచాప।
యుక్తైశ్శివస్మరణబాణగణైరమోఘైః।
నిర్జిత్యకిల్బిషరిపూన్విజయీసుధీంద్ర।
స్వానందమావహతిసుస్థిరరాజ్యలక్ష్మీం॥

చ॥ గుఱుతరభక్తియన్గుణముఁగూర్చినభావమువింటనీశ్వర।
స్మరణశరంబులందొడిగి సంతతదుర్దమకిల్బిషారుల।
న్సరగజయించియిజ్జగతిసజ్జనుఁడెంతయుఁదేజరిల్లుచు।
స్థిరతరరాజ్యలక్ష్మినిభజించిమహాప్రమదంబునొందుచున్॥ ౨౧.

ధ్యానాంజనేనసమవేక్ష్యతమఃప్రదేశం।భిత్వామహాబలిభిరీశ్వరనామమంత్రైః । దివ్యాశ్రితంభుజగభూషణముద్వహంతి। యేపాదపద్మమిహతేశివతేకృతార్థాః॥

చ॥ అనుదినభావనాంజనమునందికనుంగొనినీదునామమం।
త్రనవమహాబలుల్త్రెవ్వియపితప్పకనంతఁదమఃప్రదేశముం।
జెనకిపెకల్చిదివ్యజనసేవితమాధవదీయపాదప।
ద్మనిధినిగాంచుమనంతనెకదాకృతకృత్యుఁడగుందిగంబరా॥ ౨౨.

భూదారతాముదవహత్యదపేక్షయాశ్రీ।
భూదారపవకిమతస్సుమతేలభస్వ।
కేదారమాకలితముక్తిమహౌషధీనాం।
పాదారవిందభజనంపరమేశ్వరస్య॥

